ఓమ్

# శ్రీ శంకరభగవత్పాద గ్రంథమాల

(మూలము, తెలుగు వ్యాఖ్యానములతో)



తెలుగు వ్యాఖ్యానము :
ప.ప. శ్రీశ్రీ అద్వయానంద భారతీస్వామి

ప్రకాశకులు :
శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు
24/141, ఆనందబాగ్, మల్కాజిగిరి
హైదరాబాదు - 500 047

శ్రీ శంకర భగవత్పాద గ్రంథమాల
(మూలము, తెలుగు వ్యాఖ్యానములతో)

తొలి ముద్రణ : 1990

ప్రతులు : 1000



శ్రీ సీతారామ దివ్య పాదపద్మములకు
అంకితము

మూల్యము : రూ. 40/-



ప్రాప్తిస్థానము - ప్రకాశకులు
శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు
H. No: 24-141, ఆనంద్‌బాగ్, మల్కాజిగిరి
హైదరాబాద్ - 500 047.

ముద్రణ: క్రాంతి ప్రెస్, మద్రాసు - 600 001

ఓమ్

# శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు (రిజిష్టర్డ్)

[ఇం.నెం. 24-141, ఆనందబాగ్, మల్కాజిగిరి, హైదరాబాద్-500 047]

## ఉద్దేశ్యములు - లక్ష్యములు

1. శ్రీ భగవత్పూజ్యపాదులు జగద్గురువులైన ఆదిశంకరాచార్యులవారిచే ప్రణీత గ్రంథములు - ఆధ్యాత్మిక, తాత్త్విక వేదాంతభాష్యములను, భక్తిప్రబోధకములు, ఉపదేశస్తోత్ర, ప్రకరణాది సాహిత్య రచనల నెల్ల సేకరించి భద్రపరచుట.

2. పై పేర్కొన్న శ్రీ శంకరాచార్య కృత సంస్కృత రచనలకు, వాని ప్రసిద్ధ వ్యాఖ్యలకును ఆంధ్రానువాదమును సమర్థులచే చేయించి ప్రచురించుట.

3. ఇంతమాత్రమే గాక, ఇంతకు పూర్వమే శ్రీ భగవత్పాదులవారి రచనలు తెలుగులోని కనువదింపబడి ప్రస్తుతము లభ్యముకాని వానిని సైతము సేకరించి ప్రచురించుట.

4. అద్వైత సిద్ధాంతపరమైన వేదాంతమును ప్రచారము చేయుట:—అనుభవజ్ఞులైన యభిజ్ఞులచే ప్రస్థానత్రయ ప్రసిద్ధ ధర్మాద్వైత సిద్ధాంత ప్రచారమును, అధ్యయన — అధ్యాపకాది రూపమునను, ఉపన్యాసములు, గోష్ఠులు, పండిత సదస్సులు మున్నగునవి ఏర్పాటుచేయుట మూలమునను సల్పి, జ్ఞాన విజ్ఞానాభిరుచి గల వాతావరణమును సమాజములో నెలకొల్పుట.

5. ఈ కార్యసిద్ధికై అవసరమైన యితర విధ కార్యకలాపములను ఆ యా సందర్భముల కనుగుణముగా ఎన్నుకొని ముఖ్యోద్దేశ్యము నెరవేర్చుకొనుటకై పాటుపడుట.

ఈ సీతారామ ఆదిశంకర ట్రస్టు ది. 1-11-86 హైదరాబాద్‌లో శ్రీ శృంగేరీ శారదాపీఠాధిపతులు, ప॥ప॥ జగద్గురు శ్రీ భారతీతీర్థ మహాస్వాములవారిచే ఆశీః పూర్వకముగా ప్రారంభింపబడినది.

# విజ్ఞప్తి

మా ప్రకటిత జ్ఞానసేవా కార్యక్రమమును నిర్విఘ్నముగా కొనసాగించుటకు, శ్రీ జగద్గురువులను, శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యవర్యులను, శ్రీమదద్వైత సిద్ధాంత ప్రచారకాభిమానులను, సహృదయులైన ఆస్తిక మహాజనుల నెల్లరను, తమ తమ సహాయ సహకారములను అందించుచుండవలసినదిగా వినయపూర్వకముగా ప్రార్థించుచున్నాను.

అయిదు వందల రూపాయలు గాని, అంతకుమించి గాని శాశ్వత విరాళము లిచ్చు దాతల పేర్లు ముద్రింపబడి, వారలకు (అట్టి దాతలకు) ఈ ట్రస్టు ప్రచురణ లన్నియు నొక్కొకటి చొప్పున ఉచితముగా నొసంగఁబడును.

శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టుకు శాశ్వత నిధికిగా రూ. 500/- అంతకు మించి విరాళముల నిచ్చిన దాతల పేర్లు.

శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తిగారు, అడ్వకేటు, విజయవాద.
శ్రీ కె. ఎ. వి. శివరామశర్మగారు, వనస్థలిపురము, హైదరాబాద్.
శ్రీ ఐ. బి. రామకృష్ణారావుగారు, వనస్థలిపురము, హైదరాబాద్.
శ్రీ పురంశెట్టి సత్తయ్యగారు, మల్కాజిగిరి, హైదరాబాద్.
శ్రీ వి. లచ్చారావుగారు, అశోక్‌నగర్, హైదరాబాద్.
శ్రీ జి. శ్రీరామమూర్తిగారు, హెడ్‌మాస్టర్, రైల్వే బాలుర ఉన్నత పాఠశాల, ఖాజీపేట.
శ్రీ జె. ఎమ్. రామచంద్రన్‌గారు, మించన్‌స్ట్రీటు, కర్నూలు.
శ్రీ పి. వి. భీమశంకరమ్‌గారు, చెంబూర్, బొంబాయి.
శ్రీ కె. క్రిష్ణయ్యగారు, కొనెదన, ప్రకాశమ్ జిల్లా.
శ్రీ యాబలూరి లోకనాథశర్మగారు, అడ్వకేటు, విజయవాద.
శ్రీ తాడేపల్లి నరసింహదాసుగారు, విజయవాద.
కార్యదర్శి, శ్రీరామకృష్ణాశ్రమము, అశోకనగర్, హైదరాబాద్.
శ్రీ మండలీక శ్రీరామమూర్తిగారు, ఎస్. సి. రైల్వే ఆఫీసు, బెల్లంపల్లి.
శ్రీ పి. లక్ష్మణరావుగారు, బి.ఇ. మల్కాజిగిరి, హైదరాబాద్.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, వనస్థలిపురము, హైదరాబాద్.

శ్రీ సితలమ్ రాముగారు, అసిఫ్ నగర్, హైదరాబాద్.

శ్రీ కందర్ప శివరామకృష్ణగారు, మచిలీపట్నము, కృష్ణా జిల్లా.

శ్రీ కందర్ప వెంకటేశ్వర్లుగారు, బి.ఇ. ఖిలా ఃు.

శ్రీ చదలవాడ సుబ్రహ్మణ్యముగారు, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్.

శ్రీ చుండూరు పార్థసారథిగారు, శ్రీరామకృష్ణాపురమ్ కాలని, హైదరాబాద్.

శ్రీ తంగిరాల శ్రీరామశర్మగారు, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్.

శ్రీ డాక్టర్ కొమరవోలు వెంకట సుబ్బారావుగారు, రామకృష్ణాపురమ్, త్రిమల్‌గిరి పోస్టు, హైదరాబాద్.

శ్రీ కె. రామచంద్రరావుగారు, కొత్తపేట. కర్నూలు.

శ్రీ దేవరకొండ సీతారామయ్యగారు, కె. కె. నగర్, మద్రాసు.

శ్రీ గుంటూరు నాగేశ్వరరావుగారు, మల్కాజిగిరి, హైదరాబాద్.

శ్రీ దామరాజు సత్యనారాయణగారు, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్.

శ్రీమతి టి. వి. లక్ష్మిగారు, ఆనందబాగ్, మల్కాజిగిరి, హైదరాబాద్.

శ్రీ డాక్టర్ ఎమ్. ఎస్. రామానుజాచార్యులుగారు, కర్నూలు.

శ్రీ నారుమంచి రాధాకృష్ణమూర్తిగారు, గుంటూరు.

శ్రీ కె. వి. పి. ఎల్. నరసింహారావుగారు, టీచర్, రైల్వే ఉన్నత పాఠశాల, లాలాగుడ, సికింద్రాబాద్.

శ్రీ నిడుమోలు శ్రీరామమూర్తిగారు, హైదరాబాద్.

శ్రీ రామకృష్ణ పరమహంస శామర్స్ విద్యార్థుల భక్తబృందము, తుని, తూ. గోదావరి జిల్లా.

శ్రీమతి ఎస్. అన్నపూర్ణమ్మగారు, మల్కాజిగిరి, హైదరాబాద్.

శ్రీ మద్దుల రామరావుగారు, తుని, తూ. గోదావరి జిల్లా.

శ్రీ పి. వి. కృష్ణమూర్తిగారు, అశోక్‌నగర్, హైదరాబాద్.

శ్రీ జి. సత్యప్రకాశ శర్మగారు, మల్కాజిగిరి, హైదరాబాద్.



# ప్రస్తావన

శ్రీ శృంగేరీ జగద్గురు శంకరాచార్య శ్రీ సన్నిధానమువారిచే 1 వ తేదీ నవంబరు 1985 (ఆశ్వీయుజ బ॥ చవితి క్రోధననామ సం॥న) ప్రారంభింపబడిన ఈ సంస్థ శ్రీ భగవత్పాద గ్రంథములను మూలముతో తెలుగు వ్యాఖ్యానముతో ప్రకటించుట ఒక ముఖ్య లక్ష్యముగా కలది.

ఇంతకు పూర్వమే వివేకచూడామణి (2, 3, సంపుటములు) ఈశావాస్య కఠోపనిషత్తులు, (భాష్యానువాదము) ప్రబోధ సుధాకరము, శ్రీ గాయత్రి భాష్యములను వెలువరించి యున్నాము. ప్రస్తుత మీ గ్రంథమున శ్రీ భగవత్పాదుల ఆరు ప్రకరణ గ్రంథము లున్నవి.

విద్వాంసులై శ్రీ శంకర సిద్ధాంతమునందు మిక్కిలి ఆదరము కలిగి ప్రసిద్ధులైనవారు వ్రాసినవే మేము ప్రకటించిన వ్యాఖ్యానములు.

ఈ వ్యాఖ్యానములందు గాఢమైన విద్వత్తు సిద్ధాంత అభివ్యక్తీకరణమునందు పాటవము, అనుభవస్ఫూర్తి ద్యోతకము లగుట పాఠకులు గ్రహింతురు.

ఈ ప్రస్తుత ప్రకటనము కూడ యథాపూర్వముగా పాఠకులను అలరింపగలదని, అద్వైత మతాభినివేశము కలిగి, ముముక్షువులైన ఆస్తికలోకమున నిది కరాలంకారముగా విరాజిల్లునని ఆశించుచున్నాము.

24/141, ఆనందబాగ్,
మల్కాజ్‌గిరి,
హైదరాబాద్-47.

ఇట్లు జ్ఞానసేవలో
శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు



పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ అద్వయానంద భారతీస్వామివారు

# ప్రాక్కథనము

ఈ సంపుటము నందున్న శ్రీ శంకర భగవత్పాద ప్రకరణ గ్రంథములు. 1. ఏకశ్లోకి 2. అపరోక్షానుభూతి 3. వేదాంత డిండిమము 4. ఆత్మబోధ 5. శతశ్లోకి 6. దశశ్లోకి అన్నియు మిక్కిలి ప్రసిద్ధములు. ఈ గ్రంథములన్నిటికి వ్యాఖ్యానములు వ్రాసినవారు బ్రహ్మశ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు. వీరు బ్రహ్మవిద్యయందు, శ్రీవిద్యయందు, యోగవిద్యయందు శ్రీ శృంగేరి జగద్గురు చంద్రశేఖరభారతీ మహాస్వామి వారి యదృచ్ఛా అనుగ్రహ విశేషము వలన అధీతి బోధాచరణ ప్రచారములందు కృతకృత్యులైనవారు. వీరు క్రమముగా మువ్వురు శృంగేరీ జగద్గురువులను సేవించి తత్కృపాలాభమును పొందినవారు.

ఈ వ్యాఖ్యానములన్నియు శ్రీ శృంగేరి జగద్గురు మహాస్వాముల వారి 'శ్రీ శంకరకృప' ఆధ్యాత్మిక మాసపత్రికయందు ధారావాహికముగా వచ్చినవి. శ్రీ శృంగేరీ జగద్గురు సంమోద సమలంకృతము.

ఇందు శతశ్లోకి వ్యాఖ్యానము మాత్రము బ్రహ్మశ్రీ రామలింగేశ్వరరావుగారు శ్రీ శృంగేరీ జగద్గురువుల సన్నిధానమున తురీయాశ్రమము అనుగ్రహింపబడి పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ అద్వయానంద భారతీస్వామి యోగపట్టా నామమును స్వీకరించిన తరువాత వ్రాయబడినది.

మా కోరికను మన్నించి, యీ వ్యాఖ్యానములను గ్రంథరూపముగా ప్రకటించుటకు మాకు అనుమతి దయచేసిన శ్రీ ప. ప. అద్వయానందభారతీస్వామి పాదులకున్ను వారి గురుస్థానమును మన కెల్లరకు జగద్గురు స్థానమైన శ్రీ శృంగేరి జగద్గురు మహాస్వామి చరణములకున్ను సాష్టాంగ ప్రణామములు.

ఈ గ్రంథ ముద్రణమునకు యాదృచ్ఛికముగా గుంటూరు పట్టణ వాస్తవ్యులు శ్రీ నారుమంచి రాధాకృష్ణమూర్తిగారు ఉదారముతో ఐదువేల రూపాయల ద్రవ్య సహాయ మొనరించినారు. వారికి మా కృతజ్ఞతల నర్పించుచున్నాము.

దీని వ్రాతప్రతిని తయారుచేయుటలో తోడ్పడిన శ్రీమతి శృంగవరపు సుగుణగారికి, శ్రీమతి కాతినేని అన్నపూర్ణగారికి, శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మి గారికి శ్రీ కల్పటపు నటరాజుగారికి ధన్యవాదములు.

మద్రాసు క్రాంతి ప్రెస్ వారీ గ్రంథము నిట్లు ముచ్చటగా నకాలములో ముద్రించిరి. వారికి మా అభినందనశ్రీలు.

— ప్రకాశకులు

# సూచిక



# వేదాంతపరిభాషా పదవివరణము

## అ

అంతఃకరణము=మనోబుద్ధి చిత్త అహంకారములు

అక్షః=ఇంద్రియము

అక్షరం=నాశరహితం

అజ=పుట్టుక లేనిది, పరమాత్మ

అత్యంతోపరమము=శేషం లేకుండ నశించుట

అధికారి=బ్రహ్మవిద్యార్హుడు

అధిష్ఠానము=ఆధారము

అధ్యాసము=ఒక వస్తువును చూచి మరియొకటి అనుకొనుట

అధ్యాహార్యము=లోపించినది

అనంతము=అవినాశి, ఉత్పత్తి వినాశ షడ్భావ వికారరహితం, సర్వోపాధి వినిర్ముక్తం

అనవచ్ఛిన్నము=ఆవరణరహిత పరిపూర్ణ వస్తువు

అభ్యుదయము=అభివృద్ధి

అభ్యుపగమహాని=అంగీకరించినది విడువకుండుట

అమృతత్వము=ముక్తి-జన్మజరామృత్యు రాహిత్యము

అవచ్ఛిన్నము=అంతఃప్రవిష్టము- ఆవరణ సహిత వస్తువు

అవచ్ఛేదము = అంతఃప్రదేశములోని స్థలము

అవిషయము=ఏ ప్రమాణమునకు గోచరింపనిది

అవిద్య=అజ్ఞానం, జీవబ్రహ్మల అభేదం తెలియకుండుట

అవ్యక్తము=మూలావిద్య, ఇంద్రియ అగోచరము

అవ్యయము=నాశము లేనిది

అసంగము=సంగరహితము, సంబంధం లేనిది

అసత్=సత్యము కానిది, ఆత్మేతరము

అసద్వస్తువు=ఆత్మేతరపదార్థము

అహంకారము=పంచతన్మాత్రజన్యము మోక్షపర్యంతస్థాయి జీవలింగ దేహము, గర్వాత్మకవృత్తి యుక్త అంతఃకరణము, చతుర్ముఖుడధిష్ఠాన దేవతగా కలది

## ఆ

ఆగమ=వేదము (తంత్రములు)

ఆనందము=జలమునకు సముద్రము వలెనూ, చేతస్సులకు అధిష్ఠానమిత్య శుద్ధ అఖండ అద్వైత చిదానందైక రసము

ఆప్తుడు=త్రోసిపేయరాని విశ్వసనీయుడు

ఆప్తప్రణీతము = యథార్థమును పలుకువానిచేరచితము

ఆభాసః=లేనిది ఉన్నట్లుగా తోచుట

ఇ

ఇదంత=ఆత్మేతరమైన జడదృశ్యము

ఈ

ఈశ్వర=మాయయందు ప్రతిబింబించిన చైతన్యము (బ్రహ్మము) స్వశక్తి ప్రకృత్యాభిధేయమున లోసృష్టింపగా నుండు అంతర్యామిగానుండి బ్రహ్మాదులకు బుద్ధీంద్రియమునకు నియంత. సగుణబ్రహ్మము మాయావిశిష్ట చైతన్యము

ఈశ్వరసాక్షి=మాయోపహితచైతన్యము.

ఉ

ఉపచయ=అపచయ

ఉపహిత=కూడుకొన్న

ఉపస్థేంద్రియము=ఆనందహేతువగు ఇంద్రియము. రజోగుణయుక్త పృథ్వీ తన్మాత్రజన్యము. ప్రజాపతి అధిష్ఠాన దేవతగా కలది

ఉపాదానం=ముఖ్యకారణము. ఆధారము

ఉపాదేయము=గ్రహించతగినది

ఉపాయము=సాధనము లేక కారణము

ఉపేయము=సాధ్యము లేక కార్యము

ఏ

ఏకరసః=మారులేని తన్మాత్ర

ఏకవాక్యత=ఏకార్థమును చెప్పుట

క

కరణం=ఇంద్రియము సాధనము

కర్మసముచ్చయము=కర్మతో కూడినది

కుసూలధాన్యవృష్టిగాధె

కూటస్థ=జననాదిరహిత బ్రహ్మము ప్రత్యగాత్మ సాక్షి దాగలివలె వికారములు లేకుండునది. నిర్వికారము

క్షతి=హాని

క్షరం=నశించునది

కారణశరీరం=అనాది అనిర్వచనీయ అవిద్య. లింగస్థూల దేహకారణము

క్షేత్రం=శరీరము

గ

గుహా=కోశపంచకము

గ్రంథి=జ్ఞానావరోధకమగు అడ్డంకి, ముడి

గ్రాహః=మొసలి

ఘ

ఘ్రాణేంద్రియము=గంధమును గ్రహించునది. సత్త్వగుణయుక్త పృథ్వీ తన్మాత్రజన్యము. అధిష్ఠానదేవతలుగా అశ్వనీ దేవతలు కలది.

చ

చక్షురింద్రియం=రూపమును గ్రహించునది. సత్వగుణయుక్త తేజస్తన్మాత్ర జన్యము. అధిష్ఠానదేవత సూర్యుడు.

చిదాత్మ=ప్రత్యగాత్మ

చిత్తము=స్మరణాత్మక వృత్తిగత అంతఃకరణము. పంచతన్మాత్రజన్యము. శంకరు డధిష్ఠాన దేవత.

చిదాభాసః=జీవుడు ప్రతిబింబము

జ

జిజ్ఞాసు=ఆత్మను తెలియగోరువాడు: ముముక్షువు

జీవుడు=చిదాభాసుడు. అంతఃకరణ ప్రతిబింబిత. ప్రత్యగాత్మబింబము. అంతఃకరణ విశిష్టచైతన్యము.

జీవసాక్షి=అంతఃకరణోపహితచైతన్యం

జ్ఞానం=బోధ, తెలివి. పరమాత్మను తెలిసికొనుట. స్వప్రకాశ సర్వ ప్రకాశ నిరావరణచిన్మాత్రం

## త

తమః=అజ్ఞానము చీకటి రాహువు

తాదాత్మ్యం=ఐక్యము, ఏకత్వము

త్రిపుటి=జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు

తైజసుడు=స్వప్నావస్థాభిమాని

త్వగింద్రియము=స్పర్శను గ్రహించునది. సత్త్వగుణయుక్త వాయుతన్మాత్ర జన్యము. వాయువే దీని అధిష్ఠాన దేవత.

## ద

దృక్=ఆత్మ

దృశిః=ఆత్మ

దృశ్యం=చూడబడునది

దేశిక=గురువు తత్త్వోపదేశకుడు

ద్రష్ట=చూచువాడు

## ధ

ధీః=బుద్ధిజ్ఞానము, ఆత్మజ్ఞానము

## న

నశ్వరం=నశించునది

నిగమః=వేదము శ్రుతి

నిరతిశయ సుఖము=నిశ్శ్రేయసము. మోక్షం

నిర్వ్యయనీ=పాము కుబుసము

నిర్వృత్తి=నిత్యసుఖము మోక్షము భవ బంధవిముక్తి

నివృత్తి=అప్రవృత్తి, ప్రాపంచిక విషయముల నుండి మరలబాటు

నిష్ఠ=నిశ్చయేన సంస్థితి

నిష్ఠాద్వయము=కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ

## ప

పంచకర్మేంద్రియములు=వాక్ పాణి పాద పాయు ఉపస్థలు

పంచకోశములు=అన్నమయ (స్థూల శరీరము, పంచభూత కలితం) ప్రాణమయ (పంచప్రాణ పంచకర్మేంద్రియ సంకలితము) మనోమయ చిత్త, మన, పంచజ్ఞానేంద్రియ సంకలితము) విజ్ఞానమయ (బుద్ధి అహంకారములు) ఆనందమయ (ప్రియ, మోద, ప్రమోద వృత్తికలితము)

పంచజ్ఞానేంద్రియములు = త్వక్ చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణములు పంచతన్మాత్రలు అపంచీకృతమగు పృథివ్యప్తేజోవాయ్వాకాశములు

పంచప్రాణములు=ప్రాణ, అపాన వ్యాన ఉదాన సమానములు

పండిత=తత్త్వజ్ఞుడు. విద్వాంసుడు

పరమాత్మ=తత్ పదార్థము మాయోపాధికం సత్యజ్ఞాన మనంతం సర్వజ్ఞం

పరతత్త్వం=ఆత్మతత్త్వం

పరమపదం=ప్రాణేంద్రియాది అంతఃకరణ గుణాదులకు పరతరం, సచ్చి

దానందమయ సర్వసాక్షికం నిత్య ముక్త బ్రహ్మస్థానం

ప్రకృతి = నానావిచిత్ర జగన్నిర్మాణ సామర్థ్యకరూప బ్రహ్మశక్తి.

ప్రతిపాదకము=చెప్పునది

ప్రతిపత్తి=జ్ఞానము లేక ప్రాప్తి

ప్రతిపాద్యము=చెప్పబడునది

ప్రతియోగి = విరోధి (చీకటికివెలుతురు వలె)

ప్రవృత్తి=ప్రపంచ వాసన

పాణీంద్రియము=ఆదానమునకుహేతువు. రజోగుణయుక్త వాయుతన్మాత్ర జన్యము ఇంద్రుడు అధిష్ఠాన దేవత

పాదేంద్రియము=గమనసాధనము రజోగుణయుక్త తేజస్తన్మాత్రజన్యము ఉపేంద్రుడు అధిష్ఠాన దేవత

పాయ్వింద్రియము = విసర్జన హేతువు రజోగుణయుక్త జలతన్మాత్రజన్యము మృత్యువు అధిష్ఠాన దేవత

పౌరుషేయము=జీవునిచే రచింపబడినది

ప్రాజ్ఞుడు = సుషుప్తి అభిమాని ప్రత్యగాత్మ కూటస్థుడు

ప్రత్యయము=జ్ఞానము ప్రసిద్ధి

ప్రమితి=యథార్థ జ్ఞానము ప్రమాత

ప్రమ=యథార్థము

ప్రాగభావము=పూర్వము లేనిది

ప్రేక్షావత్ప్రవృత్తి=చూచువాని ప్రవృత్తి

బ

బంధ = సంసార బంధము కర్తృత్వాది అభిమానముల వలన బంధము

బహిర్ముఖ = బాహ్యవ్యాపారమం దాస్థ గలవాడు అజ్ఞాని అంతఃకరణమును ఆత్మజ్ఞానమున నిలుపనివాడు

బ్రహ్మ (1)రజోగుణ ప్రధానమాయా విశిష్ట చైతన్యము (త్రిమూర్తులలం దొకడు)

(2) సర్వోపాధి వినిర్ముక్తరి, అనిర్వాచ్యం, అద్వితీయం, నిత్యశుద్ధ బుద్ధముక్తం చైతన్యము

బాహ్యకరణములు=బాహ్యేంద్రియములు

బుద్ధి=నిశ్చయాత్మక వృత్తి సహిత అంతఃకరణము, పంచతన్మాత్ర జన్యము అచ్యుతు డధిష్ఠాన దేవత

బుద్ధునిధర్మద్వయము=సత్యము,అహింస

భ

భవము=జనన మరణ రూప సంసారము

భాగత్యాగము=విరుద్ధాంశ పరిత్యాగము

భానం=ప్రకాశము

భాసకం=ప్రకాశింపజేయునది ఆత్మ

భాస్యం=ప్రకాశింపజేయబడునది

భ్రాంతి=ఉన్నదానిని మరొకటిగా గ్రహించుట

మ

మనస్సు సంశయాత్మక వృత్తి యుక్త అంతఃకరణము పంచతన్మాత్ర జన్యము చంద్రు డధిష్ఠాన దేవత

మనోరాజ్యము=సంతత విషయ ధ్యానము

మహత్తత్త్వము=పంచతన్మాత్రజన్య మోక్షపర్యంతస్థాయి యగు హిరణ్యగర్భ లింగ దేహము

మహాంతః=ఉదారాత్ములు
మాయా=మూలప్రకృతి అవిద్య
అవ్యక్తము ప్రధానము అనాది
అనృతసతీ. అనిర్వాచ్య అధిష్ఠానమున
అవిద్యా (యామాసా. సామాయా)
ముముక్షుః=ఆత్మజ్ఞానాసక్తుడు
మూర్తిత్రయము=బ్రహ్మ విష్ణు రుద్రులు

ర

రుద్రుడు=తమోగుణ ప్రధాన మాయా
విశిష్ట చైతన్యము
రసనేంద్రియము=రసమును (రుచులను)
గ్రహించునది సత్వగుణయుక్త
జలతన్మాత్రజన్యము వరుణుడు
అధిష్టాన దేవత

ల

లింగదేహము=పంచకర్మేంద్రియ
పంచజ్ఞానేంద్రియ పంచ ప్రాణ
మనోబుద్ధులు కలసినది సూక్ష్మ
శరీరము హేతువు

వ

వస్తువు=ఆత్మబ్రహ్మము
వాగింద్రియము=శబ్దోచ్చారణ హేతువు
రజోగుణయుక్త ఆకాశ తన్మాత్రా
జన్యము అగ్ని అధిష్టాన దేవత
వాసనా=పూర్వ సంస్కారము
వ్యాఘాతము=లోక విరుద్ధం
వ్యావృత్తి=నిషేధపూర్వకం
వ్యాహతము=స్వవచో విరుద్ధము
కొట్టబడినది

విక్షేపః=బహిర్దృష్టి
వికృతి=ప్రకృతి కార్యమను ప్రపంచము
విజ్ఞానము=జ్ఞానముయొక్క అర్థాను
భవము (దృశ్యశూన్యత)
విద్వాంస=(విపశ్చిత్) ఆత్మతత్త్వము
నెరిగినవారు
విద్యా=ఆత్మజ్ఞానము
విపర్యయ=విపరీత గ్రహణము
విపర్యాస=అది కానిదానిని అది అను
కొనుట
విరాట్టు=పంచీకృతపంచ మహాభూతములు
విలక్షణం=విరుద్ధస్వభావము కలది
వివర్తం=స్వరూప హాని లేకుండ
మరియొక పదార్థముగా తోచుట
వివిదిష=ఆత్మను తెలిసికొను కోరిక
విశ్వుడు=జాగ్రదవస్థాభిమాని
విషయా=దృశ్యములగు జడములు
విషయీ=ఆత్మ
విష్ణువు=సత్త్వగుణ ప్రధాన మాయా
విశిష్ట చైతన్యం
విస్మృతి=మఱపు విస్మరణము
వేదనం=జ్ఞానము

శ

శబలబ్రహ్మము=సృష్టికి తొలుత
(ప్రారంభమున) బ్రహ్మమును
అవిద్యాశబల బ్రహ్మమందురు
శాస్త్ర ప్రతిపాద్యత్వము=శాస్త్రముచే
చెప్పబడుట
శ్రోత్రేంద్రియము=శబ్దమును
గ్రహించునది సత్త్వగుణయుక్త

ఆకాశ తన్మాత్రజన్యము దిక్కు అధిష్ఠాన దేవత

శైలూషః=నటకుడు

శైవాలం=నాచు

## ష

షడూర్మలు=క్షుత్, తృష్ణా, శోక, మోహ, జరా, మరణములు

షడ్భావ వికారములు=అస్తి (ఉనికి) జాయతే (జన్మ) వర్ధతే (వృద్ధి) విపరిణమతే (పరిణామము) అపక్షీయతే (క్షీణించు) వినశ్యతే (నాశము)

## స

సంసృతి=సంసారము జన్మమరణ ప్రవాహము

సంవిద్=జ్ఞానము

సంతః=ప్రాతిభాసిక విక్షేప రహితులగు శాంతచిత్తులు, సంపాతము: బహు వస్తుమిశితము (సంయుతము)

సత్యము=త్రికాలాబాధ్యము, అద్వితీయము, సజాతీయ విజాతీయ భేదరహితం, సర్వకల్పనాధిష్ఠానం

సప్తధాతువులు=వస అసృక్ మాంస మేదో అస్థిమజ్జ శుక్లములు పక్షాంతర మున రోమత్వక్ మాంస అస్థిస్నాయు మజ్జాప్రాణములు

స్థూల శరీరము=పంచీకృత పంచమహా భూతకలితము

సమాహితా=విక్షేపశక్తిరహితా

స్వస్వరూపం=ఆత్మ

## హ

హిరణ్యగర్భుడు=ప్రథమ జీవుడు

హేయం=విడువదగినది

హిరణ్యగర్భతత్త్వము=అపంచీకృత పంచమహాభూతము (పంచతన్మాత్రలు)



శ్రీః

# "ఏకశ్లోకి"

శ్రీ శంకర భగవత్పాదాచార్యుల వారు మహాగ్రంథాలు రచించారు. వారు ప్రస్థానత్రయ భాష్యాలను రచించటమే కాకుండా, ఎన్నో ప్రకరణ గ్రంథాలను రచించారు. ప్రపంచసార, సౌందర్యలహరివంటి మంత్ర శాస్త్రగ్రంథాలను, అనేక భక్తి ప్రధాన స్తోత్రాలను రచించారు.

మందాధికారులకు సులభంగా అద్వైతసిద్ధాంతం బోధపడటానికై వేయి శ్లోకాలలో, అయిదువందల శ్లోకాలలో, నూరు శ్లోకాలలో అద్వైత సిద్ధాంతాన్ని వివరించారు. ఒకే ఒక శ్లోకంలో కూడా అతిసులభంగా ప్రతివారికీ అవగాహన అయ్యేటట్లుగా పొందుపరిచారు.

ఆ ఒక శ్లోకం - వేదాంతసారమై — అది ఒక్కటే ఒక మహాగ్రంథంగా సమకూర్చుకున్నది. ఆ ఏకశ్లోక మహాగ్రంథానికి కొంత పూర్వగాథ ఉన్నది.

ఒక గ్రామంలో ఒక విద్వాంసు డుండెడివాడు. ఆయన ప్రారబ్ధ కర్మవల్ల అనివార్యమైన చర్మరోగంతో బాధపడుతూ ఉండేవాడు. తన శరీరం అసహ్యంగా ఉండటంవలన ఆయన ప్రజల ముఖములు చూడటానికి సిగ్గుపడుతూ ఉండేవాడు. ఇంట్లో నుంచి బయటకు వచ్చేవాడే కాదు. ఈ జాడ్యం వలన అతనికి వైరాగ్యబుద్ధి యేర్పడినది.

ఒకనాడు శ్రీ శంకర భగవత్పాదుల వా రా గ్రామానికి రావటం తటస్థించినది. ఆయన కంటె ముందుగా ఆయన ప్రతిభా విశేషాలు, మహాత్మ్యమూ ఆ ఊరు చేరుకున్నాయి. ఆ గ్రామంలోని జనమంతా శ్రీ శంకరులకు ఎదురుపోయి స్వాగతం నివేదించారు. ఆ జనంలో చర్మరోగం వల్ల బాధపడుచున్న విద్వాంసుడూ ఉన్నాడు. అతనికి ఏదో మహాతేజస్సు కన్పించినట్లయింది. అతడు శంకరుల పాదాలమీద వ్రాలిపోయాడు.

శ్రీ శంకరులకు అతనిని చూడగానే దయకలిగింది. అతనిని సముద్ధరింపవలె నని వాత్సల్యం కలిగింది. అతని మనస్సు వైరాగ్యసిద్ధమైనదని అతడు శాస్త్రరహస్యము లెరిగిన విద్వాంసుడని శ్రీ శంకరులు గ్రహించారు. అతనికి శ్రీ శంకరులు బృహదారణ్యక ఉపనిషత్తులో 4-వ అధ్యాయము నందున్న ''జ్యోతిర్బ్రాహ్మణ మహా విద్యను'' ఉపదేశించినారు. ఈ మహావిద్యను పూర్వము యాజ్ఞవల్క్య మహర్షి జనక మహారాజునకు ఉపదేశించినాడు. శ్రీ శంకరులు ఆ విద్వాంసునకు 'తత్ త్వం అసి' అని చెప్పారు. శ్రీ శంకరుల అనుగ్రహ కటాక్షము వలన ఆ విద్వాంసునకు ఆత్మజ్ఞానం కలిగింది. ఆ విద్వాంసునకు శ్రీ శంకరులు చేసిన ఉపదేశం ప్రశ్నోత్తర రూపంగా ఉన్నది. చివరకు విద్వాంసుడు ఆత్మజ్ఞానమును పొందినట్లు నిరూపణ. వారి ప్రశ్నోత్తరములను స్వల్పంగా మార్పులుచేస్తే ఒక చక్కని శ్లోకరూపాన్ని పొందినాయి. శ్రీ శంకరులే ఆ శ్లోకమునకు రూపుకట్టించారు.

ఈ శ్లోకం సర్వవేదాంతసారమై రూపుకట్టినది. ఇది ఉత్తమ ప్రకరణ గ్రంథమైనది. ఆ శ్లోక మిది.

కిం జ్యోతి స్తవ భానుమా నహని మే రాత్రౌ ప్రదీపాదికమ్,
స్యాదేవం రవి దీప దర్శన విధౌ కింజ్యోతి రాఖ్యా హిమే
చక్షుస్తస్య నిమీలనాది సమయే కిం ధీర్ధియో దర్శనే
కిం తత్రాహమతో భవా౯ పరమహం జ్యోతి స్తదస్మి ప్రభో.

ఈ శ్లోకంలోని ప్రశ్నోత్తరాలు వివరముగా చూపవచ్చును.

శ్రీ శంకరుల ప్రశ్న: నీవు దేని సహాయంతో పదార్థములను చూస్తున్నావు.

అతని సమాధానం: పగటిపూట సూర్యుని వెలుతురు వలన.

ప్రశ్న: రాత్రివేళ?

సమాధానం: దీపం, చంద్రకాంతి, నక్షత్రకాంతి వలన.

ప్రశ్న: కన్నులు మూయబడినపుడు లేక మూసికొన్నపుడు దేనివలన నీవు గ్రహిస్తున్నావు.

సమాధానం: నా మనస్సు.

ప్రశ్న: మనస్సు వస్తుస్వరూపాన్ని గ్రహించడానికి తోడ్పడుతున్న దేమిటి?

సమాధానం: అది నేను.

ప్రశ్న: అయితే నీవు అత్యధికంగా కాంతి ప్రసారం చేస్తున్న వస్తువు అన్నమాట.
సమాధానం: అవును ప్రభో నేను జ్యోతిస్వరూపాన్ని నేను గ్రహించాను.

ఈ పై శ్లోకంలోని ప్రశ్నోత్తరాలను బాగా అవగాహన చేసికోవాలంటే బృహదారణ్యకంలోని జ్యోతిర్బ్రాహ్మణమును పరిశీలించడం మంచిది.

యజ్ఞవల్క్యుని జనక మహారాజు పెక్కుసార్లు మహాగౌరవములతో పూజించాడు. జనక మహారాజు అనేక క్రతువులను చేసిన మహనీయుడు. దైవబ్రాహ్మణ భక్తిప్రియుడు. అతని సత్ప్రవర్తనను మెచ్చి యాజ్ఞవల్క్య మహర్షి అతనికి ఒక వరం అనుగ్రహించాడు. ఆ వరం ఏమిటంటే అతడడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పటం. ఈ వరాన్ని ఉపయోగించుకొని జనక మహారాజు యాజ్ఞవల్క్య మహర్షి నుండి ఆత్మజ్ఞానాన్ని సంపాదించాలని నిశ్చయించుకొన్నాడు.

పూర్వం నచికేతుడు కూడా ఇలా వరాన్ని పొంది యమధర్మరాజు నుండి తపస్సుచేసి బ్రహ్మజ్ఞానాన్ని పొందాడు. ఇంద్రుడు కూడా బ్రహ్మదేవుని గురించి 101 సం॥ లు తపస్సుచేసి బ్రహ్మజ్ఞానాన్ని వరంగా పొందాడు. రాజర్షియైన జనక మహారాజు బ్రహ్మర్షియైన యాజ్ఞవల్క్య మహర్షి వలన వరంగా ఆత్మజ్ఞానాన్ని పొందాడు.

జనకుని ప్రశ్న: ప్రపంచములోని వస్తువులను ఏ ప్రకాశము వలన తెలుసుకొంటున్నాము.

యాజ్ఞవల్క్యుని సమాధానము: సూర్యుని వెలుతురు వలన.

జనక: సూర్యుడస్తమించిన వెలుతు రెవరిది.

యాజ్ఞ: చంద్రునిది.

జనక: చంద్రుడు లేనివేళ.

యాజ్ఞ: అగ్ని, దీపము మొ॥

జనక: అగ్ని దీపము లేనప్పుడు వెలుతురు ప్రసాదించేది ఏది!

యాజ్ఞ: చప్పుడును, వాసనను బట్టి వస్తుజ్ఞానము కలుగుచున్నది.

జనక: ఇంద్రియములు, మనస్సు పనిచేయని నిద్రావస్థలో దేనివలన జ్ఞానము కలుగుచున్నది.

యాజ్ఞ: ఆత్మజ్యోతి వలన. ఆత్మ ఇంద్రియముల కంటె మనస్సుకంటె భిన్నమైనది. అది స్వయంప్రకాశమైనది. మరియొక వస్తుసహాయము వలన దానిని తెలిసికొనలేము. ఈ ఆత్మ పదార్థము ప్రపంచగత వస్తుజాలమును ప్రకాశింప

చేయుచున్నది. మనము జ్ఞానహీనులమై సూర్యుని వలన, చంద్రుని వలన, ఇంద్రియముల వలన మనస్సు వలన బుద్ధి వలన వస్తుజాలమును తెలుసుకొను చున్నామని భ్రమించుచున్నాము. చూచు శక్తి కన్నులలో నున్నదని విను శక్తి చెవులలో ఉన్నదని అట్లే జ్ఞానేంద్రియములు శక్తిసంపన్నములని భావించుచున్నాము. ఈ భావన లోపభూయిష్ఠము. సత్యముగా ఆత్మవలననే పదార్థజ్ఞానము కలుగుచున్నది. ఆత్మవలన యీ వస్తువులు వెలుగునిచ్చునట్లు తోచుచున్నది. ఇవి ఆత్మజ్యోతి వంటివి కావు. ఆత్మజ్యోతి దేహము కంటె ఇంద్రియముల కంటె భిన్నమైనది.

జ్యోతిర్బ్రాహ్మణమున ఆత్మజ్యోతిని గురించి విపులముగా వివరంగా చెప్ప బడినది. ఉపనిషత్తులందుకంటె. దీనియందు సుబోధకముగా ప్రశ్నోత్తర రూప ముగా నున్నది.

ఈ బృహదారణ్యక ఉపనిషద్భావములనే శ్రీ శంకరులు ఏకశ్లోక నిబద్ధము కావించిరి. బృహదారణ్యకమున శిష్యుడైన జనకమహారాజు గురువైన యాజ్ఞ వల్క్యుని ప్రశ్నించెను. సమాధానాలను చెప్పినది గురువైన యాజ్ఞవల్క్యుడు. ఐతే ఈ శ్లోక ప్రకరణమున ప్రశ్నించినది, గురువైన శ్రీ శంకరులు. సమాధానములను చెప్పినది శిష్యుడైన రోగగ్రస్తుడు. కాని గురువులవారి ప్రశ్నలు శిష్యుని సమాధాన ములను రూపుకట్టించు విధముగా నున్నవి. ఈ ప్రశ్నలకు సమాధానములను శిష్యు డట్లే చెప్పితీరవలయును. మరియొక విధమైన సమాధానములు లేని ప్రశ్నలివి. ఆ ప్రశ్నలకు సమాధానములను రాబట్టుట మూలమున గురువు శిష్యుని ఆత్మజ్ఞానము కడకు గైకొనిపోయి ఆత్మజ్ఞానిగా చేసెను. ఈ ప్రశ్నలలో మౌలికమైన ప్రశ్న ఒకటి ఉన్నది. మనస్సులో రాగద్వేషములు, సంశయములు, భయము, సిగ్గు కలుగు చున్నవి. ఇవి ఆలోచనాతరంగజనితములు. రాగసంబంధి ఆలోచనాతరంగమును బుద్ధిచేత గ్రహింపజాలము. 'ధియఃదర్శనే' — అనుదానిని 'ధియః అదర్శనే' అని తిరుగుడుగా ప్రశ్నింపవచ్చును. అనగా 'బుద్ధి పనిచేయనప్పుడు కూడ మనకు వస్తు జ్ఞానమెట్లు కలుగుచున్నది?' నిద్రావస్థలో బుద్ధి పనిచేయుట లేదు. ఇంద్రియముల వ్యాపారము జరుగుటలేదు. ఐతే సుషుప్త్యవస్థలో కొంత జ్ఞానావకాశ మున్నదని అంద రకూ అనుభవములో నున్న విషయమే.

నిద్రలో నున్నపుడు జ్ఞానము పటిష్ఠము కాకపోవచ్చును. నిద్రనుండి మేలు కొనిన తర్వాత మన కా జ్ఞానము నిశ్చితమైన భావముగా మారుచున్నది. లోకములో

'నేను బాగుగా నిద్రించితిని. అప్పుడు 'నాకేమి తెలియలేదు' అని చెప్పుట విను చున్నాము. అనుభవ మున్నపుడు కదా దానిని తరువాత జ్ఞాపకమునకు తెచ్చుకొనుట. మరునాడు నిద్రనుండి మేలుకొన్న తరువాత మనము జ్ఞాపకము తెచ్చుకొనుచుంటిమి కదా! కనుక నిద్రావస్థలో సుఖాది అనుభవము కలిగిన దన్నమాట. ఈ అనుభవా ధార మేమిటన్నది ప్రశ్న.

ధియః అదర్శనే — బుద్ధి పనిచేయని స్థితి. స్వప్నావస్థను పరిశీలింపవచ్చును. స్వప్నావస్థలో మనస్సు జాగ్రదవస్థయందున్నంత బలముగా లేదు. స్వప్నజగత్తు వాస్తవికము గాదు. ఇక్కడ మనస్సే తెలిసికొనబడుచున్న వస్తువు అగుచున్నది. కాబట్టి అది తెలిసికొనుటకు హేతువు కాదు. కాబట్టి ఆ హేతువు మనస్సుకంటె భిన్నమై యుండవలెను. అది ఏమిటని ప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానం "నేను" (అహం) సూర్యచంద్రాదులు లేనప్పుడు, ఇంద్రియములు మనస్సు పనిచేయనప్పుడు ఆత్మ వస్తుజ్ఞానమును, అనుభవమును కలిగించుచున్నదని నిరూపింపబడగా ఆత్మ దేహముకంటె, ఇంద్రియములకంటె మనస్సుకంటె భిన్నమైనవని విశదమగు చున్నది.

శిష్యునికి ఆత్మయనగా దేహేంద్రియాతీతమని తెలిసినది. ఆత్మయన నేమిటో "త్వం" అనగా జీవాత్మ యన నేమిటో తెలిసినది. అప్పుడు గురువు "తత్త్వం అసి" (ఆ పరతత్వమే నీవు) "అతో భవాన్ పరమహంజ్యోతిః" (కావున నీవు స్వయం ప్రకాశాత్మ సత్పదార్థమవు) అని చెప్పెను. ఈ సందర్భమున వెలుగు అనగా జ్ఞానమని యర్థము.

దక్షిణామూర్తి అష్టకములో "నానాచ్ఛిద్రఘటోదరస్థిత మహాదీప ప్రభాభా స్వరమ్. జ్ఞానం యస్యతుచక్షురాదికరణద్వారాబహిః స్పందతే" అని కలదు. రంధ్రములున్న కుండలోని దీపము రంధ్రముల ద్వారా వెలుగును చిమ్మునట్లు దేహములోని ఆత్మ మనస్సు ద్వారా ఇంద్రియముల ద్వారా వెలుగును వస్తుజ్ఞానమును సంపాదించుచున్నది. కుండలో దీపమున్నదని తెలియని బాలుడు రంధ్రమే ప్రకా శించుచున్నదని భావించునట్లు ఆత్మజ్ఞానము లేనివాడు మనస్సు, ఇంద్రియములు స్వయంశక్తివంతములని భ్రమించుచున్నాడు. ఉపనిషత్తులందు ఆత్మజ్ఞాన స్వరూప మని నిరూపింపబడినది. గురువు శిష్యునకు "తత్ త్వం అసి" అని ఉపదేశించెను. అప్పుడు శిష్యుడు తానే బ్రహ్మపదార్థమని తెలిసికొన్న జ్ఞాని అయ్యెను. అందు

చేతనే అతడు (ఏకశ్లోకములో చెప్పినట్లు) ''తదాస్మి ప్రభో'' అని సమాధానము (ప్రభూః నేను ఆ బ్రహ్మవస్తువునే) చెప్పెను. ఈ సమాధానము చతుర్మహా వాక్యములలోని ''అహం బ్రహ్మాస్మి'' అను మహావాక్య భావమే. (నేను బ్రహ్మ పదార్థము నే.)

ఈ విధముగా ఏకశ్లోకమునందే శ్రీ శంకరులు వేదాంతసారమును విశదీక రించి శిష్యునకు ఆత్మజ్ఞానోదయము కలిగించిరి.

''ఏకశ్లోక వ్యాఖ్యానము సంపూర్ణము''



# అపరోక్షానుభూతి

భూమిక :

శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు రచించిన బహు ప్రకరణ గ్రంథము లలో "అపరోక్షానుభూతి" యొకటి. ఇది చాలా ముఖ్యమైన గ్రంథము. వేదాంతా భ్యాసమునకు - శ్రవణ మనన నిదిధ్యాసలకు ఫలము అపరోక్షానుభూతి. అపరోక్షాను భూతి అనగా జ్ఞానసిద్ధి. సచ్చిదానంద అనుభవము. జీవన్ముక్తస్థితి.

ఈ గ్రంథము శ్రవణముచేసి తాత్పర్యము మననము చేసి తత్త్వమును నిదిధ్యాస చేసినయెడల బ్రహ్మసాక్షాత్కార లబ్ధి - అనగా అపరోక్షానుభూతి కలుగును. అందుచేత యీ గ్రంథమున కా పేరుంచిరి. "ఉపనిషత్" శబ్దము యొక్క అర్థము కూడా నిక్షేపయున్నది. కనుక గ్రంథనామము సార్థకమైనదే. ఆక్షేపణకు అవకాశములేదు.

బ్రహ్మ విచారమునందు సంభవించు విషయములన్నిటిని శ్రీ భగవత్పాదులీ ప్రకరణ గ్రంథమున నిర్వచించి విశదీకరించిరి. దీనియందు పెక్కు వాక్యములు ఉపనిషత్తుల నుండి తీసికొనబడినవి. తేజోబిందూపనిషత్తునుండి నిదిధ్యాసన పంచ దశాంగ వచనము లన్నియు యథాక్రమముగ గ్రహింపబడినవి. ఉపనిషద్వాక్యములు యథాతథముగా గ్రహించి శ్లోకములందు చెప్పబడుటచేత క్లిష్టాన్వయముగా నుండుట ఛాందసప్రయోగభరితముగా నుండుట జరిగినది.

దీనికి శ్రీ విద్యారణ్యకృతమైనదను వ్యాఖ్యాన మొకటి ప్రచారమునందున్నది. పండితులు కొందరది సమీచీనము కాదనుచున్నారు.

ఏది ఎట్లున్నను — యీ గ్రంథమున శ్రీ భగవత్పాదులు బ్రహ్మవిద్యను సులలితసుందరముగా, మృదుమధురసరళ పదములతో చక్కగా బోధించిరి.

## మంగళాచరణము

అవతారిక :

'అపరోక్షానుభూతి' అను బ్రహ్మవిచార రూపమైన యీ గ్రంథమును అధ్యయ నము చేయువారికి (చదువువారికి - వినువారికి) నిర్విఘ్నముగా బ్రహ్మవిచారము

సాగుటకై శ్రీ శంకర భగవత్పాదులు శ్రీహరి నమస్కార రూపమైన మంగళా చరణమును కావించిరి.

శ్రీహరిం పరమానంద ముపదేష్టార మీశ్వరమ్।
వ్యాపకం సర్వలోకానాం కారణం తం నమామ్యహమ్॥ 1

తాత్పర్యము :

పరమానందస్వరూపుడును, జ్ఞానోపదేశము చేయువాడును, ఈశ్వరుడును వ్యాపకుడును, సర్వలోకములకు కారణుడును అగు శ్రీహరికి నమస్కరించు చున్నాను.

విశేషములు :

1. శ్రీహరి అనగా శ్రీరూపమైన హరి యని మరల శ్రీ అనగా మోక్ష స్వరూపమని పరమాత్మ యని భావము.

2. లౌకికానందాదు లన్నిటికి మించి పరమమైన (తైత్తిరీయ ఆనందవల్లి - ఆనందమీమాంస) ఆనందస్వరూపుడు కాబట్టి పరమానందం.

3. గురుస్వరూపుడై జిజ్ఞాస కలిగినవారికి తత్త్వోపదేశము చేయువాడు కనుక ఉపదేష్టారం. దక్షిణామూర్తి యని - గీతా పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడనిసూచన. ఇతర గురువులందరకు వారి వారి గురువు లున్నారు. ఈయన మాత్రమే గురువు లేని స్వయంజ్ఞాని.

4. చైతన్య రూపుడై ఉపదేశించు టెట్లు? సమాధానముగా మాయాఉపాధి కలిగి - సర్వశక్తియుక్తుడైన ఈశ్వరుడని చెప్పుట.

5. పరిమితి గల స్వరూపమని శంక రాకుండుటకై ''వ్యాపకం'' అనుట - అనంతత్వము.

6. ప్రపంచమునకు - నిమిత్తోపాదాన కారణమని ''సర్వలోకానాం కారణం'' అని చెప్పుట.

7. మాయోపాధికుడైన ఈశ్వరునికి అంతఃకరణోపాధికుడైన జీవుడు బ్రహ్మైక్యానుసంధానము చేయుట యను నమస్కారము చేయుచున్నాడని - అనగా బ్రహ్మ విచారణ చేయుచున్నాడని భావము. (అభేద గర్భనమస్కారము)

8. ఈ మంగళాచరణ శ్లోకమున శ్రీశబ్దప్రయోగముతో "శ్రీహరి" స్మరణ ముతో నిర్విఘ్నత్వము అనుసంధింపబడినది.

9. జీవ బ్రహ్మైక్యానుసంధానము, అధికారి, సాధనల యొక్క స్వరూపము సాధనా మార్గము తెలుపబడినది. (అనుబంధ చతుష్టయం)

10. "తం" అను శబ్దప్రయోగము శ్రీహరికి ప్రసిద్ధత్వము సూచించుటయు, ఉపనిషత్తులందు చెప్పబడిన 'తత్' — (అవాఙ్మానసగోచరమైన) పదార్థమని చెప్పుట జరిగినది.

11. హరి 'హృ' అనుధాతువు నుండి వ్యుత్పత్తి. హరించువాడని అర్థము. ఆయనను శరణు పొందినవారి అజ్ఞానమును హరించువాడని యర్థము.

12. భగవంతునికి గురువునకు తొలుత ప్రణమిల్లుట ఆచారము. ఇరువుర నొక్కటే చేసి శ్రీ భగవత్పాదులు నమస్కరించిరి.

ఈ శ్లోకము, దీని తరువాత ఎనిమిది శ్లోకములు బ్రహ్మవిచారమునకు పూను కొనెడు వానికుండవలసిన లక్షణములు చెప్పుచున్నవి.

అవతారిక :

అనుబంధ చతుష్టయమును సూచించువారై శ్రీ భగవత్పాదులు రెండవ శ్లోకము రచించిరి. అనుబంధ చతుష్టయ మనగా గ్రంథవిషయం. దాని ప్రయోజ నము, అధికారి - సంబంధము అనునవి.

ఈ గ్రంథమున జీవబ్రహ్మైక్యమే విషయము. ఇది ఉపనిషదర్థాను సంధానమే. మోక్షమును సాధించుటే పరమప్రయోజనము. సాధనచతుష్టయ సంపన్నుడైనవాడే ముఖ్యాధికారి. జీవబ్రహ్మైక్యమునకు, గ్రంథమునకు నున్న ప్రతిపాద్య ప్రతిపాదక సంబంధమే సంబంధము.

అపరోక్షానుభూతిర్వై
ప్రోచ్యతే మోక్షసిద్ధయే ।
సద్భిరేవ ప్రయత్నేన
వీక్షణీయా ముహుర్ముహుః ॥ 2

తాత్పర్యము :

మోక్షసిద్ధియే ప్రయోజనముగా గల "అపరోక్షానుభూతి" అను గ్రంథము చెప్పబడుచున్నది. సాధనచతుష్టయ సంపన్నులగు అధికారులచేతనే మాటి మాటికి విచారించతగినది.

విశేషములు :

1. "అపరోక్షానుభూతి" అనగా మహావాక్యముల శ్రవణ మనన నిదిధ్యాసాదుల వలన కలుగు బ్రహ్మసాక్షాత్కారము.

2. మోక్షసిద్ధి యనగా పునరావృత్తి రహితమైన స్థితి ద్వైత భావాదుల నుండి విముక్తి.

3. సంసార విషయ సుఖములందు వైరాగ్యము కలిగి సాధన చతుష్టయము కలిగిన సాధకులే అధికారమున్నవారు. వారికి మోక్షము సిద్ధించుట కొరకే గ్రంథము.

4. మోక్షసిద్ధి కొరకు అపరోక్షానుభూతిని చెప్పుచున్నామనుటచేత అపరోక్షమైన జ్ఞానానుభూతియే మోక్షమును సాధించు సాధనమనియు, జ్ఞానము మోక్షసాధనమని స్పష్టపరచుటచేత జ్ఞానము లేకుండుట అనగా అజ్ఞానము జీవత్వలక్షమని తెలుపబడినది.

మరియొక విషయ మేమనగా అజ్ఞానము నశించుటచేత ఆవరణ భంగమయి జ్ఞానము ప్రకాశించుచున్నది. క్రొత్తగా వచ్చినదేమియు లేదు. అనగా జీవునికి పరబ్రహ్మత్వము సిద్ధమై యున్నదే. అజ్ఞానావరణ చేత జీవభ్రాంతి. అజ్ఞానము నశింపగా బ్రహ్మత్వ సిద్ధి. మోక్షము కొరకు లోకాంతర గమనములేదు.

5. "వీక్షణీయా ముహుర్ముహుః" — ఈ గ్రంథమును మాటిమాటికి విచారింపవలయునని చెప్పుటచేత - బ్రహ్మవిచారము, శ్రవణ మనన నిదిధ్యాసాది విచారము, అపరోక్షానుభూతి కలుగునంతవరకు చేయుచునే యుండవలెను. అజ్ఞానము నశించువరకు, జీవత్వభ్రాంతి. ప్రపంచభ్రాంతి విచ్ఛిత్తి పొందువరకు విచారము జరుగుచుండవలెను. ఇట్లే బ్రహ్మసూత్రములందు శ్రీ వేదవ్యాసులవారును సూత్ర భాష్యమునందు శ్రీ భగవత్పాదుల వారును చెప్పియుండిరి. ధాన్యము (వడ్లు) నకు పొట్టు పోవునంతవరకు దంచవలయునే కాని, ఇన్ని పర్యాయములని నియమము లేదుకదా! అట్లే బ్రహ్మవిచారము కూడ యిన్ని పర్యాయములని నియమములేదు. అజ్ఞానము నశించిపోవునంతవరకు, జ్ఞానము ప్రకాశించుట మొదలగువరకు ఆవశ్యకమే.

ఈ సకల విశేషములను శ్రీ భగవత్పాదుల వారీ శ్లోకమునందు పొందు పరచిరి.

అవతారిక :

సాధన చతుష్టయము కలవాడే అధికారియని పూర్వశ్లోకమున చెప్పబడినది. కాబట్టి సాధన చతుష్టయ మెట్లు లభించునో తెలుపుటకీ శ్లోకమును రచించుచున్నారు.

స్వవర్ణాశ్రమ ధర్మేణ తపసాహరి తోషణాత్ ।
సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్ ॥ 3

తాత్పర్యము :

ఎవరికివారు తమయొక్క, వర్ణము యొక్కయు, ఆశ్రమము (బ్రహ్మచర్య గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస) యొక్కయు ధర్మముచేత (విహితమైన కర్మానుష్ఠానము వలన కలుగు పుణ్యముచేత)ను కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సు చేతను. భగవంతుని ప్రీతి కలిగించు భగవదారాధన, భక్తులతో మైత్రి, అపారభూతదయ చేతను పురుషులకు వైరాగ్యాది సాధనములు నాలుగు కలుగుచున్నవి.

విశేషములు :

1. నాల్గు సాధనములు : నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థఫల భోగ విరాగము, శమాదిసంపత్తి (శమ, దమ, తితిక్ష, ఉపరతి, శ్రద్ధా, సమాధానములను నవి) ముముక్షుత్వము.

పై చెప్పినట్లు ప్రవర్తించిన వారికీ నాలుగు సాధనములు లభించును. ఈ సాధన చతుష్టయము వలన అపరోక్షానుభూతి.

2. హరితోషణం, భగవత్ప్రీతి: భగవత్ప్రీతి కలిగించుటకు "నీ పాదకముల సేవయు, నీ పాదార్చకుల తోడి నెయ్యము, నితాంతాపార భూతదయయు" అని శ్రీమద్భాగవతము చెప్పుచున్నది. భగవంతుని అనుగ్రహము లేనిదే అద్వైత వాసన కలుగదని అభియుక్తోక్తి (ఈశ్వరానుగ్రహా దేవపుంసామద్వైత వాసనా).

3. పుంసాం, పురుషులు: అనగా తమకు లభించిన ఉత్తమమైన నరజన్మము సార్థకపరచుకొనుటకు యత్నించువారు. ఇతరులు కారు.

4. వర్ణాశ్రమ ధర్మము: వర్ణమునకు, బ్రహ్మచర్యాది ఆశ్రమమునకు విహితమైన కర్మానుష్ఠానము.

5. తపసా, తపస్సుచేత: వేదమునందు ఋతంతపమ్ ఇత్యాదిగా తపస్సును గురించి వివరింపబడినది.

6. భగవద్గీతయందు 'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః' (18 వ అధ్యాయము 46 వ శ్లోకము) అని భగవంతుడు చెప్పినదాని నిచట అనుసంధించుకొనవలెను.

స్వవర్ణాశ్రమ కర్మానుష్ఠానము నిష్కామముగా చేయుట కూడా తపస్సు అని చెప్పవలెను. ఈ శ్లోకమందు వర్ణాశ్రమ ధర్మము, తపస్సు — ఏకార్థ నిరూపణములుగా ఉపయోగింపబడినవని ఆ రెండిటి (వర్ణాశ్రమ ధర్మరూప తపస్సు) ఆచరణముచేత భగవత్ప్రీతి కలుగునట్లు చెప్పబడినదని వ్యాఖ్యానింపవచ్చును.

అవతారిక : (4 వ శ్లోకమునకు)

వైరాగ్య మనగా యెట్టిదని నిరూపించుచున్నా రీ నాలుగవ శ్లోకమునందు.

బ్రహ్మాది స్థావరాంతేషు వైరాగ్యం విషయేష్వను
యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్ ॥ 4

తాత్పర్యము :

కాకిరెట్టపై నెట్టి అసహ్యబుద్ధి, వైరాగ్యము కలుగునో, అట్లే బ్రహ్మలోకము మొదలు మనుష్యలోకము వరకు గల భోగసాధనములయిన విషయములందు కోరిక లేకుండా వైరాగ్యము కలిగియుండుటే నిర్మలమైన (మంచి) వైరాగ్యము.

విశేషములు :

1. బ్రహ్మలోకమున హిరణ్యగర్భునితో కలిసి అనుభవించునది గొప్ప సుఖము, మనుష్యలోకమున అనుభవింప దగిన సుఖము లౌకిక సుఖము. ఈ అన్నిటియందు వైరాగ్యముండవలెను. అనగా ఇంద్రియాది సుఖము, అశాశ్వతమైన స్వర్గాది సుఖము అపేక్షణీయము కాదు.

2. కాకిరెట్ట — (మలము) ఉదాహరణముగా చెప్పబడిన దేలననగా గోమలాదులు ప్రయోజనము కలవి. గజ మలము ఓషధియట. ఎందుకు పనికిరాని కాకిరెట్టను ఉదాహరించిరి.

3. వైరాగ్య మనగా రాగము లేకుండుట. ద్వేషము కాదు. అసహ్యమును కాదు. ద్వేషము, అసహ్యమును కూడ రాగముయొక్క స్వరూపభేదములే. వీటితో కూడిన వైరాగ్యము నిర్మలము కాదు.

అవతారిక : (5 వ శ్లోకము)

వైరాగ్యమునకు అవశ్యకమైన నిత్యానిత్య వస్తువివేకము గురించి చెప్పుచున్నారు.

నిత్యమాత్మ స్వరూపం హి దృశ్యం తద్విపరీతగమ్।
ఏవం యోనిశ్చయః సమ్యగ్వివేకో వస్తునః సవై॥ 5

తాత్పర్యము :

ఆత్మయొక్క స్వరూపమే కదా మార్పులేమియు లేకుండ నిత్యమైనది. దృశ్యమైన (చూడబడిన — ఇంద్రియగోచరమైన) ప్రపంచమంతయు మార్పు చెందుచు నశించుచు అనిత్యమై ఆత్మకు విపరీతముగా నున్నది. ఇట్టి నిస్సందేహమైన నిశ్చయమే నిత్యానిత్య వస్తువివేకము.

విశేషములు :

పరిమితమైనది, అవయవి అయినది — (ఆద్యంతములు కలిగియుండి) — పరిణామశీలమై — నశింపక తప్పదని అంద రెరిగినది. ఆత్మ అఖండమైనది, అపరిమితమైనది. అందుచేత పరిణామము లేనిది. కాబట్టి నిత్యమైనది. దానికి ఆద్యంతములు లేవు. దిక్కాలాబాధ్యమైనది. ఇట్లుగాక ఇంద్రియములచేత తెలిసికొనబడుచున్న ప్రపంచమంతయు ఆత్మకు భిన్నమై విపరీతముగా నున్నది. ఆత్మకు అనాత్మకు గల భేదమును నిస్సందేహముగా తెలిసికొనుటయే నిత్యానిత్యవస్తువివేకము.

2. నిత్యానిత్య వస్తువివేకము దృఢముగా కలవాడు ప్రపంచమునం దేవస్తువు గాని అనిత్యము కాబట్టి — దానిని కోరడు. అదెంత సుందరమైనప్పటికీ, ఆకర్షణీయమైనప్పటికీ దానిని వాంఛింపడు - అది శాశ్వతము కాదని దృఢముగా తెలిసికొని. అట్టివానికే నిజమైన వైరాగ్య మున్నదని చెప్పవలెను.

అవతారిక : (6, 7, 8 శ్లోకములకు)

సాధన చతుష్టయమునందు, వైరాగ్యము, నిత్యానిత్య వస్తువివేకము వివరింపబడినవి. ఇప్పుడు శమాదిషట్క - సంపత్తిని గురించి చెప్పుచున్నారు.

సదైవ వాసనాత్యాగః శమోయ మితి శబ్దితః
నిగ్రహో బాహ్యవృత్తీ నాం దమ ఇత్యభి ధీయతే॥ 6

విషయేభ్యః పరావృత్తిః పరమోపర తిర్హిసా।
సహనం సర్వదుఃఖానాం తితిక్షా సాశు భామతా ॥ 7

నిగమాచార్య వాక్యేషు భక్తిః శ్రద్ధే తివిశ్రుతా।
చిత్తైకాగ్ర్యం తు సల్లక్ష్యే సమాధానం ఇతి స్మృతమ్ ॥ 8

తాత్పర్యము :

ఎల్లప్పుడును వాసనలను విడిచిపెట్టుట "శమము" అని చెప్పబడినది. బహిరింద్రియముల నిగ్రహమునే దమము అని చెప్పబడినది. భోగ్యములైన శబ్దాది విషయములనుండి నివృత్తి అనగా ఇచ్ఛలేకుండుటయే ఉపరతి యనబడును. సర్వ దుఃఖ సాధనములయిన శీతోష్ణాది ద్వంద్వములను నివారణ చేసికొనకుండ సహించి (ఓర్చుకొని) యుండుటే తితీక్ష. వేదవాక్యములందు, పెద్దలైన గురువుల వాక్యము లందు దృఢమైన నమ్మకము కలిగియుండుట శ్రద్ధ. వేదాంత వాక్యములకు (శ్రుతికి) లక్ష్యమైన ప్రత్యగభిన్న బ్రహ్మమునందు (జిజ్ఞాస కలిగియుండుట) మనస్సును (చిత్తమును) ఏకాగ్రతగా నుంచుట సమాధానము.

విశేషములు :

1. వాసన అనగా అంతఃకరణమునందు నిలచియున్న పూర్వసంస్కారము. దానిని విడిచిపెట్టుట యనగా దాని ఉద్బోధమును నిర్లక్ష్యముచేసి దాని చొప్పున ప్రవర్తింపక ఉపేక్షించుట. ఇది అంతఃకరణ నిగ్రహము. ఇది శమము.

2. మనస్సునకు జ్ఞానేంద్రియముల ద్వారా ప్రపంచ సంబంధము కలుగు చున్నది. తన ప్రభావమును మనస్సు కర్మేంద్రియములద్వారా వెల్లడించుచున్నది. మనస్సు జ్ఞానేంద్రియముల ద్వారా విషయగ్రహణము చేయకుండునట్లు చేయుటయే ఇంద్రియ నిగ్రహమగు దమము. ఇది తాత్కాలికము కాకుండా ఎల్లప్పుడు నుండ వలెను.

3. శమము, దమము (అంతర బహిరింద్రియమని గ్రహము) అలవడి నప్పుడు ప్రపంచముతో సంబంధమే ఉండదు. అప్పుడు ఇంద్రియ విషయములైన (శబ్ద స్పర్శాది విషయములు) వాటిని అనుభవింపవలయునను ఇచ్ఛకూడ లేకుండ చేయవలెను. అది సర్వకర్మ సన్న్యాసమే. దానిని ఉపరతి అనుచున్నారు.

4. ఇంద్రియ సుఖములందు ఇచ్ఛలేనప్పుడు - ఇంద్రియ సుఖేతరములైన కష్టములందు - వాటిని నివారించుకొనవలెనను ఆందోళనాది భావములు లేకుండా -

తూష్ణీం భావము కలిగియుండుట అలవడును. దానిని 'తితీక్ష' అందురు. తితీక్ష - దుఃఖములందు సహనము కాదు. ఔదాసీన్యము. అనగా దుఃఖానుభవమునందు సాక్షిత్వము మాత్రమే కలిగియుండుట.

5. వేదవాక్యములందు, గురూపదేశమందు పరిపూర్ణమైన విశ్వాసములేకున్న ఫలితమేలేదు. తితీక్ష అలవడిన వారికి యీ విశ్వాసము - శ్రద్ధ - లభించును. సద్గురూపదేశమునకు వేదవిహిత ధర్మమునకు విరోధము లేనేలేదు.

6. నిత్య సత్య పరమానందమై, వేద ప్రబోధితమై, గురూపదేశ లక్ష్యమైన పరబ్రహ్మమునందు ఏకాగ్రతను అనుసంధానించి ఉండుటను సమాధానమందురు. దీనినే చిత్తసమాధాన మందురు.

శమాది షట్కము - శమ, దమ, ఉపరతి, తితీక్ష, శ్రద్ధా, సమాధానములు వివరింపబడినవి.

అవతారిక (9 వ శ్లోకమునకు) :

సాధన చతుష్టయమునందు మూడు సాధనలను గురించి వివరించి నాలుగవ సాధనమైన ముముక్షుత్వమును గురించి చెప్పుచున్నారు.

సంసారబంధ నిర్ముక్తిః కథం మేస్యాత్కదా విధే।
ఇతి యా సుదృఢాబుద్ధి ర్వక్తవ్యాసాముముక్షుతా ॥ 9

(దీనిలో మొదటి పాదము రెండవభాగమునకు "విధే" అనుటకు 'విభో' అనియు 'కదావిధే' అనుటకు 'దయానిధే' అని పాఠాంతరములు ఉన్నవి.

తాత్పర్యము :

"అజ్ఞానమువలన కలిగిన ఈ జననమరణ సుఖదుఃఖ రూపమైన సంసార బంధమునుండి విముక్తి నా కెట్లు లభించును దైవమా!" అను దృఢమైన ఇచ్ఛయే ముముక్షుత్వము.

విశేషములు :

1. పాఠాంతరమువలన అర్థభేదము లేదు.

2. సాధకుడు సంసార బంధముయొక్క దుఃఖభావమును సంపూర్తిగా తెలిసికొన్నవాడై దానినుండి విముక్తి కొరకు తీవ్రేచ్ఛ కలిగినవాడు కావలెను. ఏదో ఒక సందర్భమున తాత్కాలికముగా కలిగిన వైరాగ్యమువలన లాభము లేదు. అది

నిశ్చలమై, తీవ్రమై, సర్వదా, సకల సందర్భములందును సకల విషయములందును నిలిచి యుండవలెను. తన ఇంట ధాన్యమును నిలువ చేసికొన్నాడనగా వానికి ఆకలి మందుకుపోవుచున్నదని అర్థమా? కాదు. వానికి అప్పుడప్పుడు ఆకలి వేయును. అంతే. ఆదేవిధముగా అప్పుడప్పుడు వైరాగ్యము కలిగి విముక్తి కావలెనన్న కోరిక కలుగుటవలన లాభము లేదు. అట్టిది ముముక్షుత్వము కాదు. తీవ్రమైన ఇచ్ఛ కలిగినచో ఆలస్యమోర్వదు.

అవతారిక : (10-వ శ్లోకమునకు)

సాధన చతుష్టయసంపన్నత కలిగిన తరువాత సాధకునికి పరిశుద్ధమైన ఆత్మజ్ఞానమువలననే విముక్తి సాధ్యమనియు ఆత్మజ్ఞానము బ్రహ్మ విచారముననే సాధ్యమనియు తెలుపుటకీ శ్లోకము రచించుచున్నారు.

ఉక్తసాధన యుక్తేన విచారః పురుషేణ హి।
కర్తవ్యో జ్ఞాన సిద్ధ్యర్థమాత్మన శ్శుభమిచ్ఛ తా॥ 10

తాత్పర్యము:

ఇంతకు ముందు ఉదహరించిన సాధనచతుష్టయముతో కూడినవాడై తనకు శుభమును వాంఛించు పురుషుడు ఆత్మజ్ఞానలాభము కొరకు బ్రహ్మవిచారము అనగా వేదాంత విచారము చేయవలెను.

విశేషములు :

శుభము అనగా సంసారబంధ విముక్తి. మిగిలిన ప్రాపంచిక శుభము లన్నియు బంధమును దృఢతరము చేయునవే కాని బంధవిముక్తికి తోడ్పడవు. అట్టివాటిని శుభములని చెప్పుట అర్థజ్ఞాన హీనత్వమే.

అవతారిక (11-వ శ్లోకమునకు) :

ఆత్మజ్ఞాన లాభమునకు వేదాంతవిచారావశ్యకత ఎట్టిదో చెప్పబడుచున్నది.

నోత్పద్యతె వినాజ్ఞానం విచారేణాన్య సాధనైః।
యథా పదార్థ భానం హి ప్రకాశేన వినాక్వచిత్॥ 11

తాత్పర్యము :

వెలుతురు (సూర్యునికాంతి లేక ఇతర కాంతి) లేక ఏ వస్తువులును కన్పించకుండ నెట్లున్నవో అట్లే వేదాంత విచారము లేకుండా ఇతర సాధనములచేత జ్ఞానము కలుగనే కలుగదు.

విశేషములు :

అజ్ఞానము పోగొట్టుటకు జ్ఞానమే కావలెను. చీకటిలో త్రాడును పామనుకొన్న భ్రాంతి పోవుటకు దాని యథార్థ స్వరూపజ్ఞానము కావలసియున్నది. అట్లే ఆత్మ స్వరూప మెరుగుటకు ఆత్మజ్ఞానము కావలెను.

అవతారిక (12 వ శ్లోకమునకు) :

వేదాంతవిచారమెట్టిదను ప్రశ్నకు సమాధానముగా నీ క్రింది శ్లోకములను చెప్పుచున్నారు.

కోఽహం కథమిదంజాతం కోవైకర్తాఽస్యవిద్యతే।
ఉపాదానంకి మస్తీహ విచారస్సోయమీదృశః॥ 12

తాత్పర్యము :

నే నెవ్వడను? దృశ్యమైన యీ ప్రపంచమెట్లు పుట్టినది? దీనికి కర్త యెవ డైనా ఉన్నాడా? ఈ దృశ్య ప్రపంచమునకు ఉపాదాన కారణమేది కలదు. ఇట్టిది ఆ వేదాంతవిచారము.

విశేషములు :

ఈ ప్రపంచమున రెండు వస్తువులు కన్పించుచున్నవి.

ఈ సకల విశ్వమునకు ఇంద్రియములచేత అనుభవమునకు తెచ్చుకొన్నవాడైన 'నేను' అను అహం శబ్దవాచ్యుడు.

2. అహం శబ్ద వాచ్యునిచే అనుభవమునకు తెచ్చుకొనబడుచున్న 'ఇది' అన బడు ప్రపంచము. కేవలమైన బ్రహ్మపదార్థమును గురించి విచారము చేయవలసినచో యీ రెండింటిని విస్మరింపరాదు. బ్రహ్మవిచారము నిజమునకు 'నేను' (అహం) ఎవరు అన్న ప్రశ్నతో ప్రారంభము కావలెను.

నిజమునకు యీ ప్రశ్న వెంటనే సమాధానము కోరుచున్నది. మనము ప్రపంచములో ఇంద్రియములచేత అనుభవమునకు తెచ్చుకొన్నవాటిలో మన శరీర ములు, ఇంద్రియములు మనస్సు కూడ నున్నవి. ఇవి 'అహం' అనుదాని వాస స్థానములే కదా! కాని ఇవి కూడా అనుభవమునకు తెచ్చుకొనబడుచున్న 'ఇది' అన బడు ప్రపంచములో భాగముగా ఉన్నవి.

అనుభవింపబడుచున్న ప్రపంచ వస్తువులకు సంబంధము లేకుండా మనకు విస్పష్టంగా అనుభవించువాని సహజ స్వరూపం తెలిస్తే ఒక విషయం విశద

మౌతుంది. అనుభవింపవలసింది ఉంటేగా అనుభవించేవాడు ఉండటం? అంటే అనుభవం అనగానే అనుభవింపవలసిన వస్తువుయొక్క అస్తిత్వం ఉనికి వెల్లడి అవుతున్నది. అట్టి వస్తువుయొక్క ఉనికివలెనే అనుభవం సాధ్యమవుతున్నది. అనుభవించువానికి అవకాశం ఉంటున్నది. అది లేకపోతే అనుభవమూ లేదు. అనుభవించేవాడు లేడు — కాబట్టి 'ఇది'—యీ ప్రపంచం ఉనికి లోనికి ఎట్లా వచ్చిందో తెలుసుకోవలసి వస్తున్నది. ఈ అనుభవింపబడుచున్న వస్తువులు జడముగా చైతన్యరహితంగా ఉంటున్నవి కాబట్టి ఇవి వాటంతట అవి స్వయంభువులైనాయని చెప్పడానికి వీలులేకుండా ఉన్నవి. అట్లా ఉనికి వచ్చినందువలన వాటికి ప్రయోజనం కన్పించదు. అవి ఉనికికి రావడానికి ముందు అవి లేవు కదా! అందుచేత వాటంతట అవే స్వయంనిర్మితాలని చెప్పడానికి గాని — ఏదో ప్రయోజనాన్ని లక్షించి అవి వచ్చాయని చెప్పడానికి గాని వీలులేదు. అందుచేత వాటికి అతీతంగా ఉన్న వస్తువేదో వాటిని ఉనికిలోనికి తీసుకురాగలిగిన సామర్థ్యం కలిగివుండి అట్లా చేసిందని అంగీకరింపవలసి వస్తున్నది.

మన నిత్యానుభవాన్నిబట్టి ఒక వస్తువు ఉనికి (అస్తిత్వము)లోనికి రావాలంటే (1) తయారుచేసేవాడు (2) తయారుచేయడానికి పదార్థము కావలసి ఉన్నాయి. ఈ బృహత్తరమైన వస్తువు — విశ్వము — తయారుకావడానికి కూడా ఈ రెండూ ఉన్నట్లు అవగాహన అవుతున్నది. కాబట్టి మన విచారము ఈ తయారుచేసినవానిని గురించి — తయారుచేయడానికి ఉపయోగింపబడిన పదార్థాన్ని గురించి కూడా జరుగవలసి ఉన్నది.

అవతారిక : (13 వ శ్లోకమునకు)

పై శ్లోకములో చెప్పిన నాలుగు ప్రశ్నలకు వరుసగా సమాధానం చెప్పడానికి పూనుకొంటూ యీ క్రింది మూడు శ్లోకాలలో సంగ్రహంగా సమాధానం చెప్తున్నారు. తరువాత మళ్ళీ విపులమైన సమాధానాలు చెపుతారు.

'ఇది' అనే వస్తుసముదాయ ప్రపంచం కంటే 'అహం' (నేను) అనే శబ్దవాచ్య వస్తువుయొక్క స్వభావం చాలా భిన్నంగా ఉంటుంది. అందువలన — 'నేను ఎవరు?' అనే ప్రశ్నకు 'నేను ఫలానా ఇది' లేక ''నేను ఫలానా వస్తువులాగా ఉంటుంది'' అని సమాధానాలు చెప్పడానికి వీలులేదు. అట్లా చెప్పడానికి వీలుంటే అప్పుడు 'నేను' (అహం) 'ఇది' అనబడే ప్రపంచంలో భాగమైపోతుంది కదా! అందుచేత ఆ పద్ధతిని విసర్జించుచూ, 'అహం'కు 'ఇది'కి ఉన్న విభేదాన్ని స్పష్ట

వరుస్తూ ఒక నిర్వచనం సమకూర్చాలంటే 'అహం' (నేను) 'ఇట్లా లేదు' అని వ్యతిరేక పదాలతో చెప్పవలసి వచ్చుచున్నది. ఈ ప్రయత్నమే యీ క్రింది శ్లోకంలో జరుగుచున్నది.

నాహం భూతగణో దేహో నాహంచాక్ష గణ స్తథా।
ఏతద్విలక్షణః కశ్చిత్ విచారఃసోఽయం ఈ దృశః॥ 13

నేను పృథివ్యాది భూతగణ సమూహమై దేహమును కాను. అదే విధముగా నేను ఇంద్రియ సమూహము కూడా కాను. వీటికి విలక్షణమైన యొకానొకడుగా నేనున్నాను. ఈ శరీరేంద్రియాది సమూహముకంటే అతీతమైనదానిని తెలిసికొనుటకై చేసిన దీ విచారము.

విశేషములు :

శరీరము పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అన్న పంచభూతముల సమాహారమే. అయితే చార్వాకులు ఆకాశమొక భూతమని అంగీకరించడం లేదు. ఏమైనా శరీరము భూతములచేత తయారైనదన్న విషయమున అభిప్రాయభేదము లేదు. 'అహం' (నేను) అట్టి భూత సంఘాతమైన వస్తువుకాదు కాబట్టి దేహతుల్యమని చెప్పుటకు వీలులేదు.

ఇంద్రియములు కూడా యీ పంచభూత కల్పితములే. అయితే సూక్ష్మాంశ జన్యములు. అదే కారణముచేత 'అహం' ఇంద్రియములు కాజాలదు.

భౌతికశరీరం కంటె భిన్నముగా — సూక్ష్మరూపములైన ఇంద్రియముల కంటే భిన్నముగా 'అహం' (నేను) ఉన్నదనుట అతి స్పష్టము.

శరీరమును ఇంద్రియములను వదిలిపెట్టితే — ఇక దేహంలో అహం (నేను) అని చెప్పదగినది మరేమీ లేదు. అందుకని ఆచార్యులవారు వాటికి 'విలక్షణ' మైనది ఒకానొకటి అని చెప్పినారు. అయితే ఆ విలక్షణత్వ మేమిటో చెప్ప లేదు. అది విచారణ చేయవలసి యున్నది.

అవతారిక : (14 వ శ్లోకము)

'ఈ జగత్తు దేనివలన పుట్టుచున్నది?' ఎవరు దీనికి కర్త? అను ప్రశ్నకు సంగ్రహముగా సమాధానము చెప్పుటకై యీ శ్లోకము రచించుచున్నారు.

అజ్ఞాన ప్రభవం సర్వం జ్ఞానేన ప్రవిలీయతే।
సంకల్పోవివిధః కర్తావిచారః సోఽయం ఈ దృశః॥ 14

తాత్పర్యము :

సర్వమును అజ్ఞానమువలనే ప్రభవించినది. జ్ఞానముచే లయించుచున్నది. అనేక విధమైన మనస్సంకల్పమే (అంతఃకరణ పరిణామమే) దీనికి కర్త. ఇట్లు ఆలోచన చేయుటయే విచారము.

విశేషములు :

(అజ్ఞానముయొక్క స్వభావమును ముందు ముందు వివరింప నున్నారు.)

ఈ ప్రపంచమునకు కర్త ఎవరు? అన్నది మూడవ ప్రశ్న. అనగా ఈ ప్రపంచమిట్లు దృశ్యమాన మగుట కెవ్వరు కారణమని. దీనికి సమాధానము అతి స్వల్పమైనది — మనఃపరిణామమని. దృశ్యమును చూచువారి అంతఃకరణ పరిణామమునుబట్టి దృశ్యము కన్పించుచున్నది. చీకటిలో త్రాడును చూచి పాముని భ్రాంతి పొందు నొకడు — అతడు భయపడును. మరొకని కది నేలపై ఏర్పడిన గొగ్గిగా తోచును. వాడు దానిపై నుండి దాటిపోవును. మరియొకని కది నీటి జాలుగా తోచ వచ్చును. అట్లే పదిమందికి పలువిధములు. కాని అసలైన త్రాడుయొక్క స్వభావము మారదు. చూచుచున్నవాని మానసిక పరిణామమునుబట్టి వాని కది భిన్న భిన్నముగా తోచుచున్నది. దీనియంతకు కారణమేమనగా త్రాడును త్రాడుగా చూడకపోవుట యన్న యాథార్థ్యము. త్రాడును గురించిన అజ్ఞానము యీ విభిన్న విధముల భావములకు కారణము. త్రాడును గురించి ఒకే విధమైన సామాన్య అజ్ఞానము కాదు. విభిన్న వ్యక్తులయొక్క మానసిక పరిణామముయొక్క విభిన్నస్థితి.

2. ఒక వ్యక్తి అతని తండ్రికి కుమారుడుగా తోచును. ఆ వ్యక్తియొక్క భార్యకతడు భర్తగా తోచును. కుమారునికి తండ్రిగా తోచును. సేవకునికి యజమానిగా తోచును. ఇట్లే భిన్న భిన్న వ్యక్తుల భిన్న భిన్న మానసిక స్థితులనుబట్టి ఒకే వ్యక్తి భిన్న భిన్నముగా తోచుచున్నట్లుగా, ఒకే వస్తువు భిన్న భిన్న వ్యక్తులకు భిన్న భిన్నముగా తోచవచ్చును. వారిపైన దాని ప్రభావము భిన్న భిన్నముగా నుండవచ్చును.

అవతారిక (15-వ శ్లోకము) :

ప్రపంచము ఏ వస్తువు నుండి నిర్మింపబడినదన్న ప్రశ్న మిగిలియున్నది. ఈ ప్రశ్నకు కూడ రెండు మూడు ప్రశ్నల కిచ్చిన సమాధానములందే సమాధానమున్నది.

అజ్ఞానము లేకుండినచో తెలిసికొనుట భ్రమకు తావులేదు. తప్పక తెలిసికొనవలసిన దేదో ఉండకపోయినచో అజ్ఞానమన్నది లేదు. ఆ తప్పక తెలిసికొన వలసినదేదో దాని పైననే అజ్ఞానముగాని - భ్రమగాని చోటుచేసుకున్నవి.

ఒక త్రాడు చీకటిలో నుండగా సర్పమని భ్రమ. త్రాడు లేకపోయినచో భ్రమ లేదు - తెలిసికొనవలసినది లేదు - తప్పుగా తెలిసికొనుట అవిద్య (అజ్ఞానము) లేదు. లేనిదానిని (సర్పమును) ఉన్నట్లు భ్రమ కలిగించినదా త్రాడే. కాబట్టి త్రాడే యీ అన్నిటికి ఆధారమైన వస్తువగుచున్నది. ఇట్లే నామరూపజన్యమైన జగన్నిర్మాణము నకు ఆధారమైన సత్తు కలదు. అది ఏకము. అద్వితీయము. నిత్యము. త్రికాలా బాధ్యము. అపరిణామి. అది లేకపోయినచో భ్రమలేదు. అవిద్యలేదు. ఈ 'సత్తు'ను గురించి చెప్పుచున్నారు. ఇది నాలుగవ ప్రశ్నకు సమాధానమగుచున్నది.

ఏతయో ర్యదుపాదానం ఏకం సూక్ష్మం సత్ అవ్యయం ।
యథై వమృత్ ఘటాదీనాం విచారః సోఽయం ఈదృశః॥ 15

తాత్పర్యము :

అజ్ఞాన సంకల్పములకు ఏది ఉపాదానమో అది ఏకము సూక్ష్మము, అవ్యయము అగునత్తే. మృత్తిక (మట్టి) ఏ విధముగా ఘటాదులకు (కుండలు మొ॥) ఉపాదాన మగుచున్నచో అదే విధముగా. ఇట్టి విమర్శయే విచారము.

విశేషములు :

1. ఉపాదానమనగా అధిష్ఠానము - అధిష్ఠానమైన పరబ్రహ్మము త్రికాలా బాధ్యమైనది. జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి (పుట్టు చున్నది - ఉన్నది - అభివృద్ధిని పొందుచున్నది - తగ్గుటకు మార్పును చెందు చున్నది. తగ్గిపోవుచున్నది - నశించుచున్నది) అను ఆరు భావ వికారములకు లోను కానిది. ఇంద్రియాతీతము, అవాఙ్మానసగోచరము. జాతి క్రియాగుణ రహితము.

2. ఈ శ్లోకమునందు ఆచార్యులవారు ఉపాదాన కారణమునకే నామకరణమును చేయలేదు. దానికి 'ఏకం' 'సత్' 'అవ్యయం' అనిరి. బహుత్వము మిథ్యా ప్రాపంచి కము. అది 'ఏకం' అని చెప్పుట దానికి బహుత్వము లేదనుటకే - అది 'సత్' అని చెప్పుట - నిజముగా నున్నదని —— ఉన్నదివలె కన్పించుట మాత్రము కాదని —— అవ్యయమనగా - షడ్భావ వికారములు లేనిదని ఈ పదార్థమునకు —— మనము దానిని

గురించి చెప్పుకొనుటకు వీలుగా — ఉపనిషత్తులు బ్రహ్మమని చెప్పినవి — కాని నిజమున కది నామరూప రహితమైనది. మానసికముగా ఊహింపరానిది.

అవతారిక (16-వ శ్లోకమునకు) :

ఇంతకు ముందు 12 వ శ్లోకమున లేవదీసిన నాలుగు ప్రశ్నలకు సంగ్రహ రూపమైన సమాధానములను చెప్పి ఆచార్యులవారు ఉపనిషత్తుల సారాంశమైన జీవ బ్రహ్మైక్య విషయమును గురించి చెప్పుటకు ఉద్యమించినారు. జీవునకున్న లక్షణము లన్నియు బ్రహ్మ పదార్థమున కుండిన వగుటచేతనే ఈ జీవబ్రహ్మలకు అభిన్నతను ప్రతిపాదించుచున్నారు.

అహం ఏకోఽపి సూక్ష్మశ్చ జ్ఞాతాసాక్షీ సదవ్యయః ।
తదహంనాఽత్ర సందేహో, విచారస్సోఽయ మీదృశః॥ 16

తాత్పర్యము :

అహం శబ్దవాచ్య జీవుడనైన 'నేను' ను ఒక్కడను (ఏకం) సూక్ష్ముడను (సూక్ష్మం) జ్ఞాతను (ఇంద్రియములకు అగోచరుడను) సాక్షిని (అహంకారాది ప్రకాశకుడనగుటచే చేతనుడను) సన్మాత్రుడను (ఇంద్రియ విషయ సంబంధము లేకయే సాక్షాత్తుగా ఎఱుగువాడను ప్రకాశకుడను నిర్వికారుడను) అవ్యయుడను (ఆరు భావవికారములు లేనివాడను) కాబట్టి అదియే (జగదుపాదానమైన బ్రహ్మమే) నేను. ఇందులకు సందేహము లేదు. ఇట్టిదే ఆ విచారము.

విశేషములు :

'అహం' నేను జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడు అవస్థలందుండునని మన కెల్లర కనుభవమే. బాల్య, యౌవన, వార్ధక్యాది దశలందు కూడ నుండుట అనుభవమే. సంతోష, దుఃఖ, కష్ట, బాధ, ఐశ్వర్య, దారిద్ర్యాది దశలందు కూడ నుండుట అను భవమే. ఈ అహంస్థితి మరుపునకు రాదు. నశించుటలేదు. అందుచేత నిది 'ఏకం' అని 'నిత్యం' అని అపరిణామి అని స్పష్టమగుచున్నది. కాని పై చెప్పిన మార్పులకు దశలకు యీ 'అహం' సాక్షిగా నున్నది. అనుభవించు చున్నది. కాని ఆ దశలు - అనుభవములు - 'అహం' యొక్క లక్షణమును మార్పుచేయలేనివి. అది కర్తయే గాని కర్మ ఎప్పుడును కాదు. అందుచేత ఇంద్రియగోచరము కాదు.

ఈ విధముగా బ్రహ్మముతో పాటు 'అహం' కూడ - యీ చెప్పబడిన 'ఏకం' — 'నిత్యం' (ఇంద్రియ అగోచరత్వాది) మొదలైన లక్షణములు కలిగి

యున్నది. కాబట్టి యీ రెండును భిన్నములని చెప్పుట కెట్లు సామంజస్యమున్నది? బంగారు నగలన్నిటి యందు బంగారు గుణముండగా — ఆ విభిన్నమైన నగలందు గల బంగారు విభిన్నమైనదని చెప్పవచ్చునా? విభిన్నమైన నగలందు బంగారమున్నప్పటికి అది బంగారమే నని - ఏకవస్తువేనని ఋజువు కలదు కదా!

ఇదే విధముగా 'అహం' (జీవుడు) బ్రహ్మముతో భిన్నము కాదు. ప్రగాఢముగా విచారించి నప్పుడు జీవ బ్రహ్మైక్యస్థితి అవగాహన కాగలదు.

అవతారిక (17-వ శ్లోకము):

ఆత్మయు బ్రహ్మమును ఒకే పదార్థమైనప్పుడు కూడ — అమితమైన అజ్ఞాన వశమున ఆత్మను ఆత్మభిన్న పదార్థముతో ఐక్యము భావించుట పరిపాటి అయినది. ఈ ఆత్మభిన్న పదార్థము యొక్క లక్షణములు ఆత్మయొక్క లక్షణములతో విరుద్ధముగ నున్నవి. ఇట్లు ఆత్మను ఆత్మకు వ్యతిరేక లక్షణము లున్నదానితో ఐక్యముగా భావించుట కన్న అజ్ఞాన మేమున్నదని శ్రీ భగవత్పాదులు ప్రశ్నించుచున్నారు. ఇటువంటి అజ్ఞానము కన్న అసందర్భమైనది మరేమి యుండునని ప్రశ్నించుచున్నారు.

రక్తమాంస భూయిష్టమైన శరీరమును ఆత్మ యని భ్రాంతి పొందుటను చూపించి ఆ భావనలో నున్న అసందర్భమును నిరూపించుచున్నా రీ క్రింది శ్లోకమున.

ఆత్మా వినిష్కలో హ్యేకో దేహో బహుభిః ఆవృతః ।
తయోః ఐక్యం ప్రపశ్యన్తి కిం అజ్ఞానమతః పరమ్॥ 17

(ఈ శ్లోకముతో ప్రారంభమైన అ ?దు శ్లోకములలో అజ్ఞాన స్వరూపమును తెలుపుచు జీవ బ్రహ్మైక్యమును దృఢపరచుచున్నారు)

తాత్పర్యము :

ఆత్మ నిరవయవుడు ఒక్కడు గదా! దేహమో పెక్కు అవయవముల చేత ఆవృతమైనది. ఆ రెంటికిని ఐక్యము తలంచెదరు. ఇంతకన్నను వేఱు అజ్ఞానమేమి కలదు?

విశేషములు :

1: ఒక వస్తువునకు పొడవు వెడల్పు ఎత్తు లావు మొదలగు కొలతలు ఉన్నప్పుడే దానికి భాగములు - అవయవములుండును. కొలతలు కొలుచుటకు అవకాశము మున్నదనినచో ఆకాశమున్నదన్నమాట. ఒక వస్తువునకు కొలతలు కొలువతగిన పరిమాణముండి ఆకాశము (space) లో స్థానము కలిగియుండినచో - అట్టి వస్తువులు ఇతరము లనేకము ఉండవచ్చునని విస్పష్టమగుచున్నది. ఒక వస్తువుకంటే ఎక్కువ

వస్తువులున్నప్పుడు (ఆధునిక విజ్ఞానశాస్త్రజ్ఞుల మతములో కూడ) ఆ వస్తువుల మధ్య అన్యోన్య ప్రభావ ముండక తప్పదు. ఈ ప్రభావం అనుకూలముగా లేక ప్రతికూల ముగా నుండవచ్చును. అనుకూల ప్రభావము సమైక్యతకు, ప్రతికూల ప్రభావము నిర్మూలనము కొరకు. మొత్తముమీద ఫలితమొక్కటే. ఒకే వస్తువు చివరకు మిగులు టకు చేయుచున్న ప్రయత్నము. కాబట్టి పరిమాణముండి అంగములున్న ప్రతి వస్తు వును పరిణామమునకు లోనుగాక తప్పదు. అట్టి వస్తువు శాశ్వతముగా నిత్యముగా నుండునది కాదు.

2. భౌతిక శరీరమునకు పరిమాణమున్నది. దానికి చాల అంగము లున్నవి. ఈ శరీరము చుట్టును లోకమున మరెన్నియో శరీరములు కలవు. ఆ ఇతరశరీరముల ప్రభావమునకు లోనుకాకుండ యీ శరీరము నిలువలేదు.

3. ఆత్మమాత్రము పరిమాణము లేనిది. దానికి అవయవములు లేవు. ఇతర వస్తువుల ప్రభావమున కిది లోనుగాదు. పరిమాణము లేనిది కాబట్టి దానికి కొలతలు లేవు. అందుచేత నది అద్వితీయమైన ఏక వస్తువు. ఆత్మ మన శరీరములందు పరి మాణముగా నున్నట్లు తోచుచుండినచో అది పరిమాణము గలిగిన శరీరముతో ఐక్య మని భావించుట వలన జరుగుచున్నది. ఈ తప్పు భావనకు ముఖ్యహేతువేమనగా ఆత్మపరిమాణము లేనిదని తెలిసికొనక పోవుటయే.

అవతారిక (18 వ శ్లోకమునకు) :

ఆత్మకు అనాత్మయొక్క శరీరమునకు గల భేదము పరొక్కటేమనగా ఆత్మ శరీరముయొక్క కార్యకలాపము నంతయు శాసింపగలదు. శరీరము అచేతనము జడము. ఆత్మచేత శాసించబడును. కాబట్టి శాసించుచున్నదానిని శాసింపబడుచున్న దానిని రెండిటిని ఐక్యముగా భావించుట అజ్ఞానము. ఈ భావము నీ క్రింది శ్లోకమున చెప్పుచున్నారు.

ఆత్మా నియామ కశ్చాన్త ర్దేహోబాహ్యో నియమ్యకః ।
తయోః ఐక్యం ప్రపశ్యన్తి కి మజ్ఞానమతః పరమ్॥ 18

తాత్పర్యము :

ఆత్మ నియమించునది. జ్ఞాన స్వరూపుడు పంచకోశముల మధ్యనున్నది. దేహము బాహ్యముగానున్నది ఆత్మచేత నియమింపబడినది. ఇంత భేదములున్న

రెంటిని భిన్నములని తెలిసికొనక ఐక్యము తలంచుచున్నారు. ఇదంతయు భ్రమవలన ఇంతకంటె అజ్ఞానమేమున్నది.

విశేషములు :

మనము కన్నులు మూసికొనగలము తెరువగలము. చేతులు చాపగలము. ముడుచుకొనగలము. ఇది అంతయు చేయుచున్నది లోపలనున్న ఆత్మ జడమైన శరీరమునకు కదలిక క్రియాపరత్వము కల్గించుచున్నది. ఆత్మ, ఈ రెండింటికిని ఐక్యముగా భావించుట అజ్ఞానము —

అవతారిక (శ్లోకము 19) :

ఆత్మ సంపూర్ణముగా జ్ఞానమయము. చైతన్యము. దానివలె మరియొక పెద్దియును లేదు. జడపదార్థము దానియందులేదు. శరీరము జడము. మాంస రక్త అస్థి సంకలితము. ఈ ఆత్మను శరీరమును ఐక్యముగా భావించుటెట్లు? ఈ విషయము నీ క్రింది శ్లోకమున చెప్పుచున్నారు.

ఆత్మాజ్ఞానమయః పుణ్యోదేహూమాంసమయోఽశుచిః ।
తయోరైక్యం ప్రపశ్యన్తి కి మజ్ఞానమతః పరమ్॥ 19

తాత్పర్యము :

ఆత్మయో జ్ఞానమయము. పరిశుద్ధము. శరీరము మాంసమయము, అపరిశుద్ధము. కాని జనులీరెంటికిని ఐక్యమును భావించుచున్నారు. ఇంతకన్న అజ్ఞానమేముండును.

విశేషములు:

ప్రజ్ఞానం బ్రహ్మ - అహం బ్రహ్మాస్మి మొదలగు మహావాక్యముల సారమే ఆత్మజ్ఞానమయమనుట. శరీరము మాంస మూత్ర పురీషాది మయమగుట ప్రత్యక్షము. అందుచేత శుద్ధము కాదు.

అవతారిక (శ్లోకము 20) :

ఆత్మ స్వప్రకాశుడు. తన చైతన్యముచేత ఇతర జడవస్తువులను ప్రకాశింపచేయుచున్నాడు. దేహమునకు స్వప్రకాశములేదు. చైతన్యములేదు. అది జడముకాబట్టి ఈ రెంటికి ఐక్యమును భావించుట అజ్ఞానమని ఈ క్రింది శ్లోకమున చెప్పుచున్నారు.

ఆత్మాప్రకాశకః స్వచ్ఛోదేహస్తామస ఉచ్యతే।
తయోరైక్యం ప్రపశ్యన్తికిమజ్ఞానమతః పరమ్॥ 20

తాత్పర్యము :

ఆత్మ స్వప్రకాశమైనది. స్వచ్ఛమైనది. దేహము తామసమైనది. అనగా వెలుతురులేనిది. ప్రకాశగుణములేనిది. అయినప్పటికి ఆత్మకు దేహమునకు ఐక్యమును జనులు భావించెదరు. ఇంతకంటె అజ్ఞాన మేమున్నది?

విశేషములు :

తామస — అంధకార — సంబంధమేమియు ఆత్మకులేదు కాబట్టి అది ప్రకాశాత్మకమని చెప్పబడుచున్నది. దానిని ప్రకాశింపజేయుటకు మరే ఇతరవస్తువును అవశ్యకములేదు కాబట్టి - ఇతర వస్తువులకు అది వెలుతురు ఇవ్వగలదు కాబట్టి ఆత్మను స్వప్రకాశమని చెప్పుట. అది ఇంకొక వస్తువుయొక్క సహాయముచేత నెప్పుడును చైతన్యమగుటలేదు. కాబట్టి - ఆత్మవస్తు సహాయము లేకుండ - సూర్యుడాదిగా గలవి - మనము స్వప్రకాశమైనవిగా భావించుచున్నవి - ప్రకాశింప లేవు. ఇతర వస్తువులకు వెలుతురు నివ్వలేవు. దేహమునకీ గుణములులేవు. దేహము అంధకారావృతమైనది. ఇతర ప్రకాశవస్తు సహాయములేనిదే ఇది ప్రకాశింపలేదు. కాబట్టి ఈ రెండింటికి ఐక్యమును భావించుట అజ్ఞానముకాక మరేమిటి?

అవతారిక (శ్లోకము 21) :

ఈ ముందు చెప్పబడిన విషయములకంటే ఆత్మను గురించి మరొక అతి ముఖ్య విషయమున్నది. ఆత్మ నిత్యమైనది. సత్యమైనది. దేహమట్లుకాదు. పరిణామ శీలముగలది. నశ్వరమైనది. క్షణికమైనది. ఈ విషయమును ఈ క్రింది శ్లోకమున చెప్పుచున్నారు.

ఆత్మనిత్యోహి సద్రూపోదేహోఽనిత్యోహ్యసన్మయః।
తయోరైక్యం ప్రపశ్యన్తికిమజ్ఞానమతః పరమ్॥ 21

తాత్పర్యము :

ఆత్మ నిత్యమైనదికదా! సద్రూపమైనదికూడ; అనగా సత్యమైన ఉనికి కలది. దేహమో మిథ్యయైనది. సద్రూపములేనిది. నిత్యమైనదికాదు. ఈ రెంటికిని ఐక్యమును తలంచెదరు. ఇంతకన్న వేరే అజ్ఞానమేమున్నది?

విశేషములు :

ఒక వస్తువు సత్యమైనదని ఎట్లు చెప్పవలెననగా దానియొక్క మిథ్యాత్వము ఋజువుకానప్పుడు. ఆ వస్తువులేని కాలముగాని దేశముగాని ఉండినచో ఆ వస్తువు యొక్క ఉనికి సత్యముకాదనియు అది మిథ్యయైనదనియు చెప్పవలెను. అట్టిది సత్యమైనదని చెప్పుటకు అవకాశము లేనేలేదు. ఆత్మ సత్యమైన ఉనికి గలది. దానికి భూతభవిష్యద్వర్తమాన కాలములందు ఉనికిగలదు. ఇది ఇక్కడే నేకాదు. ఎల్లచోటు లందు ఉనికి గలిగియున్నది. ఒక వస్తువునందు ఆత్మలేదని చెప్పినచో ఆ వస్తువు యొక్క ఉనికినే లేదని చెప్పుచున్నామన్నమాట. కాబట్టి ఆత్మదేశకాల వస్తుపరిచ్ఛిన్నముకాదు. దేహమునకు ఆద్యంతములు కలవు. అవి లేనికాలముండినది. భవిష్యత్తున నిది ఉండదుకూడ. పరిమితమైన దేహము చిన్నది — దాని కొలతలను మించి ఆకాశమున వ్యాపించలేదు. ఇంకొకవస్తువును ఆవేశించలేదు - కాబట్టి దేశకాలములకు పరిమాణమునకు లోనైనది దేహము. శ్లోకములు 17 నుండి 21 వరకు వ్యతిరేక లక్షణములున్న ఆత్మకు దేహమునకు ఐక్యమును చెప్పుట అజ్ఞానమని నిరూపింపబడినది.

అవతారిక (22 వ శ్లోకమునకు) :

ముందు 20 వ శ్లోకమున ఆత్మప్రకాశము (స్వయంప్రకాశరూపుడై సమస్తమును ఇతరమును ప్రకాశింపజేయువాడు) అని చెప్పిరి. సూర్యుడు మొదలగు దీప్తి - స్థానములు ప్రకాశించుచు భౌతికమైన అంధకారమును పోగొట్టుచున్నవి. ఆత్మకూడ ఇట్లే ప్రకాశించునదియని భ్రమింపరాదు. ఆత్మదీప్తి వేరు - సూర్యుని వెల్తురు రాత్రులందుండదు. అగ్నివెల్తురు దీపమువెల్తురు - రాత్రులందున్నప్పటికి వాటి వెల్తురునకు పరిమితికలదు. అనగా కొంతమేరకు మాత్రమే వాటి వెలుగుండును. మిగిలినదెల్ల చీకటి. ఆత్మ దీప్తి అట్టిది కాదు. ఆత్మ దీప్తి వలన చీకటి ఉన్నచోట చీకటి ఉన్నదని తెలియుచున్నది. వెల్తురు ఉన్నచోట వెల్తురు ఉన్నదని తెలియుచున్నది. ఆత్మ దీప్తివలననే సూర్యాదులగు వస్తువులను మనము తెలుసుకొనుచున్నాము. సూర్యుడు మొదలగు ప్రకాశ వస్తువులకు దేశకాల నిబంధన లున్నవి. సూర్యుని వెలుతురు పగటియందే. రాత్రివేళలేదు. ఇది కాలనిబంధన. కొన్ని వస్తువులమీదనే సూర్యుని వెలుతురుపడును. ఆ వెల్తురు పడిన వస్తువులే కన్పించును. ఇది దేశ నిబంధన. దేశకాలవస్తు పరిచ్ఛిన్నమైనది - సూర్యాది ప్రకాశవస్తువుల వెల్తురు. ఆత్మప్రకాశమున కేనిబంధనలు లేవు. సూర్యాదు,

అగ్ని మొదలగునవి భౌతికమైన చీకటిని మాత్రమే పోగొట్టును. ఆకలి, దప్పిక రాగము, ద్వేషము, ఆశ, కోపము మొదలగు అంతర విషయములను తెలుసు కొనుటకు సూర్యుడు - అగ్ని మొదలగువాని వెల్తురువలన ప్రయోజనములేదు. అంతేకాక స్వప్నావస్థలో ఎన్నో సంగతులున్నవి. వాటిని తెలుసుకొనుటకు సూర్యాది ప్రకాశవస్తువులు శక్తిహీనములు. అవి అక్కడ పనిచేయవు. బయట సూర్యుడు ప్రజ్వలించుచుండగా స్వప్నమున మనము అంధకారమును చూడవచ్చును. అట్లే రాత్రివేళ స్వప్నమున మనము తేజస్సు చూడవచ్చును. సుషుప్తి అవస్థలో గాఢనిద్ర పట్టినప్పుడు మనమేదో సుఖమనుభవింతుము. సుఖానుభూతికి సూర్యాది తేజోనిధుల సహాయము పనికిరాదు, స్వప్న సుషుప్తులయందు ఆత్మదీప్తి మాత్రమే కలదు. ఇతర సాధనాపేక్షలేని ఆత్మదీప్తిని సూర్యాది ప్రకాశముల వంటిదిగా భావింప రాదు.

ఈ భావములను చెప్పుటకే క్రింది శ్లోకమును శ్రీ భగవత్పాదుల వారు చెప్పిరి. (ఆత్మ దీప్తిని గురించి బృహదారణ్యక ఉపనిషత్తు జ్యోతిర్బ్రాహ్మణ విద్యయందు విపులముగానున్నది. శ్రీ భగవత్పాదుల వారీ వివరణమును ప్రశ్నోత్తరరూపమైన శ్లోకమొకదానియందు తెలిపిరి (కింజ్యోతిస్తవ) (ఏకశ్లోకి - ముందుగా వ్యాఖ్యాతము)

అత్మానః తత్ ప్రకాశత్వం యత్పదార్థావ భాసనం ।
నా గ్న్యాది దీప్తివద్దీప్తిర్భవ త్యాన్ధ్యం యతోనిశి॥ 22

తాత్పర్యము :

ఏది సకల పదార్థముల (సూర్యాది అంధకారము మొ॥) ప్రకాశకమో అది ఆత్మయొక్క ప్రకాశత్వము - దీప్తి. ఘటపటాది విషయము దేనిచేత తెలియబడు చున్నదో అది ఆత్మప్రకాశము. ఆత్మదీప్తి అగ్ని మొదలగువాని దీప్తి వంటిదికాదు. ఎందుచేతననగా రాత్రియందు సూర్యుని వెలుగు లేదు. అగ్ని మొదలగువాని దీప్తి సర్వత్ర లేదు. ఆత్మదీప్తి అగ్ని అంధకారము మొదలగువానికి కూడ ప్రకాశక మైనది.

విశేషములు :

రాత్రివేళ సూర్యుని వెల్తురు, అగ్నివెలుతురు, నక్షత్రముల వెలుతురు, చంద్రుని కాంతి మొదలగునవి లేనప్పుడు కూడ ఆత్మ దీప్తివలన మనము లోకము నందున్న వస్తువుల యొక్క రూపగ్రహణము చేయుచున్నాము. భౌతికమైన చీకటి

ఆత్మదీప్తిని ఆవరించలేదు. ఆత్మదీప్తివలననే చీకటిని కూడ గుర్తించుచున్నాము. అగ్ని సూర్యుడు మొదలగు ప్రకాశ వస్తువులు భౌతికమైన చీకటికి విరోధవస్తువులు కావున అవి చీకటిని పోగొట్టును. ఆత్మదీప్తి చీకటికి విరోధ వస్తువు కాదు. అందు చేత దానిని తొలగించదు. దానిని తెలుసుకొనునట్లు చేయును. మరియొక చిత్ర మేమనగా యీ ఆత్మదీప్తి అజ్ఞానమునకు కూడ శత్రువు కాదు. అజ్ఞానమున్నదని కూడ మనము ఆత్మదీప్తి వలననే తెలిసికొనుచున్నాము.

అవతారిక: (23-వ శ్లోకమునకు)

లోకమునందు ఎంత మూఢుడైనను తన ఇంద్రియ గోచరమైన విషయము లను తాను తెలిసికొనుచున్నానన్న సంగతి నెరుగును. అంతేకాని అన్నిటిని తెలిసి కొనుచున్న తాను తెలియబడునది కాదని కూడ నెరుగును. తెలియబడుచున్న వస్తు వులలో అతి సన్నిహితమైనది అతి ప్రస్ఫుటమైనది అతని దేహమే. సామాన్య భాషలో కూడ దానిని అతడు 'నా దేహము' అనుచున్నాడు. అతి సాధారణ ప్రతీతిని బట్టి కూడ తాను కలిగియున్న వస్తువు తానే కాజాలదని స్పష్టము. తన ఇల్లును తానే అని చెప్పువాడెవ్వడును లేడుకదా? ఇట్టి పరిస్థితిలో తన దేహమును తానుగా భావించుచున్న సామాన్య మానవుల భావనలు అత్యాశ్చర్యముగా నున్నవి. దేహము ఆత్మకు తాత్కాలిక ఉపాధి మాత్రమే. అట్టిదానిని తానే అనుకొనుట ఎట్లు? ఈ భావములను శ్రీభగవత్పాదులవారు యీ శ్లోకమున చెప్పుచున్నారు.

దేహోఽహం ఇత్యయం మూఢః ధృత్వాతిష్ఠ త్యహోజనః ।
మమాయం ఇత్యపిజ్ఞాత్వా ఘటద్రష్టేవ సర్వదా॥ 23

తాత్పర్యము:

దేహము నేనని నిశ్చయముగా భావించుకొని యీ జనము మూఢమై నిలచు చున్నది. ఇది ఆశ్చర్యము. ఎల్లప్పుడు ఘటమును చూచువాని పగిది— ఈ దేహము నాది. నేను దాని కతీతముగా నున్నానని — తెలిసికొని కూడ.

విశేషములు:

కుండను (ఘటమును) చూచువాడు ఆ ఘటము తనదని భావించునే కాని ఎప్పుడుగాని తానా ఘటమేనని భావింపడు. అట్లే యీ దేహము నాది. అని తన కంటె దేహము భిన్నముగా నున్నదని తెలిసియు దేహము తానని నిశ్చయించుకొనుట మూఢత్వము. తాను తన నుండి వేరుగా చూచుచున్నది తా నెట్లగును? ఒక వస్తువును

కల్గి యున్నవాడా వస్తువే కాజాలదు కదా! కాని దేహము విషయమువందీ సామాన్య విషయమును విస్మరించుచున్నారు. ఇది ఆశ్చర్యము.

అవతారిక : (24-వ శ్లోకము)

పదునాలుగవ శ్లోకమునందిట్టి అజ్ఞానమును తొలగించుకొనుటకు సరియైన జ్ఞానము కావలెనని చెప్పబడినది. ఇప్పుడా సరియైన జ్ఞానమనగా నెట్టిది? దాని గుణ లక్షణము లెట్టివి? అను విషయములను వరుసగా అయిదు శ్లోకములందు వివరించు చున్నారు.

> బ్రహ్మైవాహం సమశ్శాన్తః సచ్చిదానందలక్షణః ।
> నాహం దేహోహ్యసద్రూపో జ్ఞాన మిత్యుచ్యతే బుధైః॥ 24

తాత్పర్యము :

బ్రహ్మమే నేను, సముడను, శాంతుడను, సచ్చిదానందరూపుడను. నేను దేహము కాదు. ఎందువలన ననగా అది అసద్రూపము. ఇది పండితులచేత జ్ఞానమని చెప్పబడుచున్నది.

విశేషములు :

అహమన్నది విశ్వమున వ్యాప్తమై యున్న సత్పదార్థమునకు భిన్నమైనది కాదు. అది భేదము లెరుగనిది. కాబట్టి సమమైనది - సత్తచేతను ప్రకాశముచేతను సర్వము కంటె అభిన్నము. అది అవిభాజ్యము. శాంతము. దానియందు అశాంతి కలిగించు విజాతీయ పదార్థము మరియొకటి లేదు. కాల దేశ వస్తువులచేత భేదము కానిది. సత్తు చిత్తు ఆనందము. ఈ ఆనందము ఇంద్రియానుభవమైనది కాదు. దేహమును ఆత్మకు భిన్నముగా చెప్పిరి. అయితే ఆత్మకానిదెల్లను ఆత్మభిన్నముగానే భావించ వలెను. దేహము నిత్యము కాదని చెప్పబడినది. అట్లే అసమమైనదని అసత్తు అని అచిత్తు అని, ఆనందరహితమైనదని గుర్తించవలెను.

అవతారిక: (25-వ శ్లోకము)

ఆత్మయొక్క ఇతర లక్షణములు పరిణామము లేకుండుట నిరాకారత దోష రహితత్వము (నిర్వికారత) నాశము లేకుండుట (నిరవద్యత) చెప్పబడుచున్నవి.

> నిర్వికారో నిరాకారో నిరవద్యోఽహం అవ్యయః ।
> నాహం దేహోహ్యసద్రూపో జ్ఞానం ఇత్యుచ్యతే బుధైః॥ 25

తాత్పర్యము :

'అహం' — నిర్వికారము, నిరాకారము, నిరవద్యము, అవ్యయము, అసద్రూపమైన దేహమది కాదు. ఇట్లెరుగుట జ్ఞానమని జ్ఞానులు చెప్పుచున్నారు.

విశేషములు :

పరిణామమునకు (తెలిసినవారు) ఆరు లక్షణములు చెప్పుచున్నారు. 1) ఉనికి లోనికి వచ్చుట. 2) ప్రత్యేకమైన ఉనికి కలిగి యుండుట. 3) పెరుగుట. 4) మార్పు చెందుట. 5) క్షయము. 6) నశించుట. ఈ ఆరు లక్షణములును నశ్వరమైన జన్మ కలిగిన ప్రతి వస్తువునకు కలవు. ప్రభవించి నశించు లోపల అది పరిణామములను పొందును. వికారములను పొందును. ఆత్మ నిత్య సత్యము. పుట్టుక లేనిది. మరణము లేనిది. కనుక దానికి ఇతర పరిణామములు కూడ లేవు. నిర్వికారము. వస్తువునకు ప్రత్యేకత్వము దాని ఆకారముపై ఆధారపడి యున్నది. ఆత్మ కన్న వేరొక వస్తువే లేదు. కాబట్టి దానికి ఆకారము లేదు.

పరిధులు కలిగి నియమమున్నదానికి దోషము లుండును. పరిధులు లేక నియమరహితమై అనంతమైన ఆత్మకు దోషములు లేవు. తాపములు లేవు. నిరవద్యము. ఈ లక్షణములున్న ఆత్మ అవ్యయము. నాశనము లేనిది. రెండవ పాదము దీనికొక పల్లవిగా నున్నది. దాని భావమును మొదటిపాదమునుబట్టి గ్రహించవలెను. ఈ శ్లోకము నందు దేహము — అనాత్మ ఆకారము కలిగి, వికారములు కలిగి దోషము లుండి వ్యయ స్వభావము కలిగి యుండుటవలన ఆత్మ కాజాలదని తెలియవలెను.

అవతారికము : (26-వ శ్లోకము)

దేహమునకు ఆత్మకు గల భేదములను మరికొన్నిటిని ఉదహరించుచున్నారు.

నిరామయో నిరాభాసో నిర్వికల్పోఽహం అతతః ।
నాహం దేహోహ్య సద్రూపో జ్ఞానం ఇత్యుచ్యతేబుధైః॥ 26

తాత్పర్యము :

నేను (ఆత్మ) రోగములు లేనివాడను. ఏ ఆభాసము లేనివాడను. (వృత్తి వ్యాపృతడనైనను ఫలవ్యాప్తి లేనివాడను) వికల్పము లేనివాడను, వ్యాపకుడను నేను. అసద్రూపమైన దేహమును కాను. ఇది జ్ఞానమని పండితులచే చెప్పబడుచున్నది.

విశేషములు :

1. మరియొక వస్తువు కూడ ఆత్మతోపాటు ఉండి ఆత్మపై వికారములు కల్పింపగలిగినచో దోషములకు ఆస్కార మున్నది. ఆత్మసాపేక్షముగా మరియొక వస్తువులేదు. కనుక ఆత్మయొక్క ఆరోగ్యము అనగా దానియొక్క పరిభంగము శుద్ధత్వము పొందదు.

2. ఆత్మ సత్యముగా నున్నది కాబట్టి ఉండినట్లుగా ఆ భాసఅక్కర లేదు. జడపదార్థమైన అద్దము సూర్యుని వెలుతురున్నగాని చీకటి గదిలోనికి ప్రసరింపలేదు. ఆత్మయొక్క ఉనికి దానియొక్క ప్రకాశత్వము సత్యమైనవి. ఆ భాస లేదు.

3. చీకటిలో స్తంభమును చూచి స్తంభము కాదు మనిషి యని - శత్రువని ఒకడు సంశయింపవచ్చును. ఈ సంశయములతో స్తంభమునకు సంబంధము లేదు. అది అట్లే స్తంభముగానే ఉన్నది. అది అట్లే ఆత్మ ఎవరేమనుకొన్నను, సంవాద వివాదములు పడినను — ఆత్మగానే వికల్పరహితముగా నున్నది.

4. ఆత్మ యొక్కటే సత్యమైన పదార్థము — సత్యముగా నున్న పదార్థము. అందుచేత నది వ్యాపకమైనది.

5. దేహము — అనగా అనాత్మ రోగములకు ఆలవాలమైనది. ఉన్నట్లుగా ఆభాస కలది. వికల్పములు కలది. నియమితమైన పరిధులలో మాత్రమే ఉండినట్లు తోచుచున్నది.

అవతారిక (27-వ శ్లోకమునకు) :

నిర్గుణత్వము, నిష్క్రియత్వము, నిత్యత్వము, ముక్తత్వము, చ్యుతము కాకుండుట ఆత్మయొక్క లక్షణములని చెప్పుచున్నారు.

నిర్గుణో నిష్క్రియో నిత్యో నిత్యముక్తోఽహం అచ్యుతః ।
నాహం దేహోహ్య సద్రూపో జ్ఞానం ఇత్యుచ్యతే బుధైః॥ 27

తాత్పర్యము :

నేను (ఆత్మ) గుణములు లేనివాడను. క్రియలు లేనివాడను. నాశము లేని వాడను - ఎల్లప్పుడు ముక్తుడైనవాడను. (బంధములు లేనివాడను) చ్యుతిలేని సచ్చిదానంద స్వభావము గలవాడను. అసద్రూపమైన దేహము నేను కాను. ఇది జ్ఞానమని పండితులచే చెప్పబడుచున్నది.

విశేషములు :

1. గుణములు మంచి, చెడు, మిశ్రమము మొదలైనవి. ఇవి యన్నియు సాపేక్షితములు అనగా మరొక వస్తువుతో పోల్చినప్పుడు మంచి లేక చెడు మరి యొక వస్తువు లేనప్పుడు గుణ తారతమ్యమునకు అసలు గుణమునకు అవకాశమే లేదు.

2. అట్లే ఒక వస్తువు కదలుట - పరుగుతీయుట మొదలగు క్రియాపరమై యుండుటకు దానికి పరిమితమైన పరిధు లుండవలెను. అప్పుడది దేశమున క్రియా పరమగును. కాని అవధులు లేక సర్వవ్యాప్తమై అంతయు తానై యున్న వస్తువునకు క్రియాపరత్వమెట్లు పొసగును?

3. భూతభవిష్యద్వర్తమాన కాలాతీతముగా ఆత్మ యుండుటచేత నది నిత్యము. దానికి అనిత్యత్వము - నాశము లేదు.

4. అన్ని విధములుగ దానికి పరిధులు లేకపోవుటవలన దానికి బంధనమే ఉండజాలదు. అందుచేత నది నిత్యముక్తము.

5. దాని ఉనికి, సత్తు, చిత్తు, ఆనందము అనంతములై యుండుటవలన నది అచ్యుతము.

6. దేహము - అనాత్మ అవిద్యాజనితము, మాయాకల్పితము, సత్వరజ స్తమో గుణ సంకలితము. అందుచేత అది త్రిగుణరహితముగా నుండజాలదు. అందుచేత ఆ త్రిగుణజనితమైనది బహుగుణ లక్షణభరితము. నిర్గుణము కాదు. రజోగుణ సంపన్నమై క్రియాశీలమువలన నిత్యత్వము లేదు. నాశనము కలుగుచున్నది. అందు చేత బంధయుక్తము. పరిణామబద్ధమగుటచేత నది పరిపూర్ణము కాదు. స్వతంత్రము కాదు. విభిన్నమైన ఆత్మ అనాత్మలను గురించిన వివేకము గలిగి యుండుటే జ్ఞానము.

అవతారిక: (28 వ శ్లోకమునకు)

ఆత్మ అనాత్మల భేదములను తెలిసికొనుటన్న జ్ఞానమును గురించి విశదీక రించుచు ఆత్మయొక్క నిర్మలత్వము, నిశ్చలత్వము, అనంతత్వము, శుద్ధత్వము అజరామరత్వము చెప్పి ఈ జ్ఞానవివరణము ముగించుచున్నారు.

నిర్మలోనిశ్చలోఽనంతః శుద్ధోహం అజరోఽమరః ।
నాహం దేహోహ్యసద్రూపో జ్ఞానం ఇత్యుచ్యతేబుధైః॥ 28

తాత్పర్యము :

నేను (ఆత్మ) అవిద్యా - తత్కార్యరూపమైన మాలిన్యము లేనివాడను కావున నిశ్చలుడను. దేశకాల వస్తుపరిచ్ఛేదము లేనివాడను. శుద్ధుడను, ముసలితనము లేనివాడను, చావు లేనివాడను, అసద్రూపమైన దేహము నేను కాను, ఇది జ్ఞానమని పండితులచే చెప్పబడుచున్నది.

విశేషములు :

1. ఏవిధమైన మాలిన్యముగాని లేకుండుట పారిశుద్ధ్యముగా చెప్పబడినది. మాలిన్యమునకు ఉదాహరణముగా చలనము కలిగి ఉండుట దేశకాల వస్తుపరిచ్ఛేదము కలిగియుండుట చెప్పబడినవి. ఈ మాలిన్యములు ఆత్మకు లేవు. ఇట్టి మాలిన్యములు అనాత్మకు కలవు. అది నిర్మలము కాజాలదు. అందుచే ఆత్మ అనాత్మ అభిన్నము కాదు. ఇది తెలిసికొనుట జ్ఞానము.

అవతారిక: (29 వ శ్లోకమునకు)

ఇంతకు ముందు జ్ఞానముయొక్క నిర్వచనములను - నాస్తికు డంగీకరింపక పోవచ్చును. అతడు దేహాతీతమైన చైతన్య మున్నదని అంగీకరింపడు. అతని భావములు నిర్హేతుకములని, అవిద్యా దూషితములని అతడు అంగీకరింపడు. పైగా అతడు సుందరమైన శరీరమును లోకమంతయు ఆత్మగా భావించుచుండగా దానిని వదలి వేరేదో ఆత్మ యున్నదనువాడు మూర్ఖుడనియు, అట్టి వేరొకటి శూన్యమనియు - (ఎలననగా ఇంద్రియగోచరమైన శరీరము నశించినప్పుడు శూన్యమే నిలచుచున్నదనియు) శూన్యమును ఒక పదార్థముగా చెప్పరాదనియు - అతడు వాదించును. ఈ వాదమునకు సమాధానముగా చెప్పిన శ్లోక మిది.

స్వదేహేశోభనం సంతం పురుషాఖ్యం చ సమ్మతమ్ ।
కిం మూర్ఖశూన్యం ఆత్మానం దేహాతీతం కరోషిభోః॥ 29

తాత్పర్యము :

స్వదేహమునందు మంగళరూపుడై పురుషుడను పేరుతో శ్రుతిస్మృతులకు సమ్మతుడై దేహాతీతుడై యున్న ఆత్మను - ఓయీ మూర్ఖుడా! ఏల శూన్యునిగా చేయుచున్నావు.

విశేషములు :

1. శోభనం = మంగళరూపుడు = సర్వవ్యవహారములకు అధిష్ఠానమైనవాడు.

2. పురి—శరీరమునందు 'ఉషతి' — అహమ్ అను రూపమున వసించు చున్నాడు కావున పురుషుడు.

3. శూన్యం — గగనకుసుమాదులవలె లేనివానిగా.

4. 'నా దేహము' అని చెప్పుట చేతనే దేహముకంటె నేను (అహం) భిన్న మని వ్యక్తమగుచున్నది. అందుచేతనే దేహాతీతమైనదై ఆత్మ దేహమునందున్న దనుట స్పష్టము. ఆత్మ శరీర మందుండకపోయినచో శరీరము కళేబరమై అసహ్యా కరమై వెంటనే పంచభూతముల లోనికి కలసిపోవును. శరీరము సుందరముగా ప్రేమాస్పదముగా నుండుట ఆత్మనివాస మగుటవలన. ఆత్మయొక్క ఉనికి ఎవ్వరును కాదనజాలరు. అందుచేత దేహాతీతముగా ఆత్మలేదనియు, శూన్యమనియు చెప్పుట మూర్ఖత్వమే.

అవతారిక (30-వ శ్లోకమునకు) :

ఆత్మవలన దేహముయొక్క అస్తిత్వము విద్యమానమగుచు నుండగా దేహమే ఆత్మయని వాదించువారి వాదములో సత్యమెక్కడ నున్నది? ఏది తెలియబడుచున్నదో అదే తెలిసికొనువాడు కాజాలడు కదా? శ్రుతి, యుక్తులు దేహాత్మవాదమును పరాస్తము చేయుచున్నవి. తమయొక్క స్వానుభవమును గుర్తింపలేని వారికి, శ్రుతి యొక్క ప్రామాణ్యమునందు విశ్వాసము లేనివారికి, ఆత్మపదార్థము అగోచరమే. ఇక ముందు చెప్పబోవు నాలుగు శ్లోకములలో యీ విషయమును విశదీకరించుచున్నారు.

స్వాత్మానం శృణుమూర్ఖత్వం శ్రుత్యాయుక్త్యా చ పూరుషమ్।
దేహాతీతం సదాకారం సుదుర్దర్శం భవాదృశైః॥ 30

తాత్పర్యము :

ఓయీ మూర్ఖుడా! పురుషుడని చెప్పబడుచు దేహాతీతుడై సద్రూపుడై నీవంటి వారిచే తెలియ నలవికాని వాడవగు నీ ఆత్మను (నీ స్వరూపమును) శ్రుతిచేతను యుక్తిచేతను వినుము (తెలిసికొనుము)

అవతారిక (31-వ శ్లోకమునకు) :

ఈ అసహ్యకరమైన దేహము ఆత్మ యెట్లగును? అను పల్లవి చరణముగా ఏడు శ్లోకములు చెప్పబడుచున్నవి. ముందు మూడు శ్లోకములలో అట్టిది యుక్తులచేత నిరూపింపబడగా తరువాత నాలుగు శ్లోకములలో శ్రుతిప్రమాణము చూపబడుచున్నది.

అహం శబ్దేన విఖ్యాత ఏకఏవ స్థితః పరః ।
స్థూలస్త్వనేకతాం ప్రాప్తః కథం స్యాత్ దేహకః పుమాన్॥ 31

తాత్పర్యము :

అహం శబ్ద వాచ్యుడైన పురుషుడు (ఆత్మ) పరుడై యొకడే యున్నవాడే యగుచున్నాడు. స్థూలమైన దేహమో అనేక భావములను పొందుచున్నది. అట్టి దేహము పురుషుడు (ఆత్మ) యెట్లగును?).

విశేషము :

అహం (ఆత్మ) ఎల్లప్పుడు నొకడే. అతీతము. దేహము పరిణామశీలమైనది. భిన్నత్వము కలది. ఆత్మచేత పొందబడినది. ఇట్టివి రెండును ఏకవస్తువగు టెట్లు?

అహం ద్రష్టృతయాసిద్ధోదేహోదృశ్యతయాస్థితః ।
మమాఽయమితి నిర్దేశాత్కథం స్యాద్దేహకః పుమాన్॥ 32

అహం వికారహీనస్తు దేహోనిత్యం వికారవాన్ ।
ఇతిప్రతీయతే సాక్షాత్కథం స్యాద్దేహకః పుమాన్॥ 33

తాత్పర్యము :

అహం (నేను) అనువాడు ద్రష్ట (చూచువాడు) అని సిద్ధించుచున్నది. దేహము దృశ్యము (చూడదగినది) అగుచున్నది. నాది యీ దేహమన్న వ్యవహారము వలన. కావున అట్టి దేహము పురుషుడెట్లగును? అహం (నేను - ఆత్మ) వికారము లేనిది. దేహమునకు నిత్యమును వికారములున్నవి. ఇది ప్రత్యక్షముగా తెలియబడు చున్నదే? కాబట్టి అట్టి దేహము పురుషుడెట్లగును? (ఇంతకు ముందు 17 నుండి శ్లోకములలో చెప్పిన భావములనే యీ శ్లోకములలో మరియొక దృక్కోణము నుండి వివరించిరి. భావసార మొక్కటే!)

అవతారిక (34-వ శ్లోకమునకు) :

ఆత్మ (పురుష) లక్షణములను తెలుపుటకుగాను శ్రీ భగవత్పాదులు శ్రుతి ప్రమాణ కృష్ణయజుర్వేదము నుండి రెండు మంత్రములను సూచించుచున్నారు.

యస్మాత్ పరం ఇతిశ్రుత్యాతయా పురుషలక్షణమ్ ।
వినిర్ణీతం విమూఢేన కథం స్యాద్దేహకః పుమాన్॥ 34

తాత్పర్యము :

'యస్మాత్పరం' అను ప్రసిద్ధమైన శ్రుతి (కృష్ణయజుర్వేద తైత్తిరీయము) చేత పురుషుని లక్షణము చక్కగా నిశ్చయింపబడినది. ఓయీ మూఢశ్రేష్ఠుడా! దేహము పురుషు డెట్లగును?

విశేషములు :

ఈ శ్లోకమునందు సూచింపబడిన కృష్ణ యజుర్వేద తైత్తిరీయ ఉపనిషత్పాఠము (IV-10 [20]) పూర్తిగా ఇట్లున్నది.

యస్మాత్ పరం నా పరం అస్తికశ్చిత్
యస్మాత్ నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్
వృక్ష ఇవస్తబ్ధో దివితిష్ఠత్యేకః
తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్॥

(ఎవ్వనికంటె అధికమైనదియు తక్కువైనదియు ఏదియు లేదో ఎవ్వడు వృక్షమువలె నిశ్చలుడై స్వప్రకాశ స్వరూపమున నొక్కడే యున్నాడో ఆ పురుషునిచే నిది యంతయు పూర్ణమై యున్నది.

అవతారిక (35-వ శ్లోకమునకు) :

కృష్ణ యజుర్వేదము నుండి మరియొక పాఠమునకు సూచన యీ శ్లోకమున చేయుచున్నారు.

సర్వం పురుష ఏవేతి సూక్తే పురుష సంజ్ఞితే
అప్యుచ్యతే యతః శ్రుత్యాకథం స్యాత్ దేహకఃపుమాన్॥ 35

తాత్పర్యము :

పురుషసూక్తమని పేరుగల వేదసూక్త పాఠమునందు కూడ "సర్వము పురుష స్వరూపమే" అని చెప్పబడియుండగా దేహము పురుషు డెట్లగును?

విశేషము :

సూచింపబడిన పురుషసూక్త (శ్రుతి)ములోని మంత్రభాగ మిట్లున్నది.

"పురుషఏవేదగ్ం సర్వంయత్ భూతం యచ్చభవ్యం"

(ఇది యంతయు, భూత భవిష్య ద్వర్తమాన కాలముల యందున్న సర్వ ప్రపంచమును పురుష స్వరూపమే).

అవతారిక 36-వ శ్లోకమునకు) :

పురుష లక్షణములను తెలుపు శుక్ల యజుర్వేదాంతర్గత బృహదారణ్యక ఉపనిషత్తు మంత్రమును సూచించుచున్నారు.

అసంగః పురుషః ప్రోక్తో బృహదారణ్యకేఽపిచ ।
అనంతమల సంశ్లిష్టః కథం స్యాత్‌దేహకః పుమాన్॥ 36

తాత్పర్యము :

బృహదారణ్యక ఉపనిషత్తునందు కూడ పురుషుడు అసంగుడని (సంగము లేనివాడని) చెప్పబడినది (అనగా ఏమియు అంటనివాడని) కాని దేహమో అనంత మలములతో గూడినది. దేహము పురుష డెట్లగును?

విశేషములు :

శుక్ల యజుర్వేదములోని (వాజసనేయ సంహిత) బృహదారణ్యక ఉపనిషత్తునుండి సూచించబడిన శ్రుతిపాఠము. "అసఙ్గోహ్యయం పురుషః" (15, 16) (అసంగుడు కదా యీ పురుషుడు)

అవతారిక 37-వ శ్లోకమునకు) :

బృహదారణ్యకమునందు మరొక మంత్రమును సూచించుచున్నారు.

తత్రైవచ సమాఖ్యాతః స్వయంజ్యోతిర్హి పూరుషః ।
జడః పరప్రకాశోఽయంకథం స్యాద్దేహకఃపుమాన్॥ 37

తాత్పర్యము :

ఆ బృహదారణ్యక ఉపనిషత్తునందే పురుషుడు స్వయంజ్యోతి యని కదా చెప్పబడినాడు. ఈ దేహమో అన్యముచే ప్రకాశింపజేయదగినది. కావున జడము. అట్టి దేహము పురుష డెట్లగును?

విశేషములు :

ఈ శ్లోకమునందు సూచింపబడిన బృహదారణ్యక శ్రుతిపాఠము - అయం పురుష స్స్వయం జ్యోతిర్భవతి" — ఈ పురుషుడు స్వయంజ్యోతియై స్వప్రకాశుడై యున్నాడు.

అవతారిక (38 వ శ్లోకమునకు) :

కర్మసిద్ధాంతమునుబట్టి కూడ ఆత్మ దేహముకంటె భిన్నమని నిరూపించు చున్నారు. వేదములయొక్క సర్వప్రామాణ్యత నంగీకరింపనివారు కూడ చేయ బడిన కర్మయొక్క ఫలము తప్పదనియు దేహపతనానంతరము కర్మఫలము అనుభవ మునకు వచ్చుననియు చెప్పుచున్నారు. అనగా దేహపతనానంతరము అనుభవించునది వేరొకటియున్నదని అంగీకరింపబడుచున్నది. ఈ విధముగ ఆలోచనచేయువారు వేదములందు కొన్ని భాగములను మాత్రమే ప్రమాణముగా స్వీకరించి ఉపనిషత్తు లందున్న ప్రమాణములను స్వీకరించుటలేదు. ఉపనిషత్తులు ఆత్మయొక్క సత్యస్థితిని నిశ్శంకగా తెలుపుచున్నవి. ప్రస్తుత సందర్భమున స్వీకరింపబడుచున్న దెంతవర కనగా - వారందరు దేహము "ప్రభవించుచున్నది - నశించుచున్నది. అది మల సంశ్లిష్టమైనది పరిమితి కలది. జడమైనది. ఇది ఆత్మకంటె భిన్నమైనది" అని అంగీకరించుచున్నారు. అనునంతవరకు. వారు చెప్పునట్లు ఆత్మప్రత్యేక వ్యక్తిత్వము కలిగి అనంతకాల మట్లే యుండునదని చెప్పు లక్షణములు ప్రస్తుత శ్లోకమునకు సందర్భము లేనివి.

> ప్రోక్తోఽపి కర్మకాండేన హ్యాత్మాదేహాద్విలక్షణః ।
> నిత్యశ్చ తత్ఫలం భుఙ్క్తే దేహ పాతాదనంతరమ్॥ 38

తాత్పర్యము :

కర్మకాండముచేత గూడ ఆత్మ దేహముకన్న విలక్షణుడనియు నిత్యు డనియు దేహముపడిన తరువాత కర్మఫలమును అనుభవించుననియు చెప్పబడినాడు కదా?

అవతారిక (39 వ శ్లోకమునకు)

పూర్వ శ్లోకమున (38) చెప్పబడిన కర్మకాండాభిప్రాయము వేదాంత సమ్మతముకాదు. ఈ సంగతి తెలుపుటకై స్థూలదేహము నశించిన పిదప కూడ సంభవించునట్టి లింగశరీరము కూడ ఆత్మకాదని యీ శ్లోకమున నిరూపించు చున్నారు.

> లింగంచానేక సంయుక్తంచలం దృశ్యం వికారి చ
> అవ్యాపకమసద్రూపం తత్కథం స్యాత్పుమానయమ్॥ 39

తాత్పర్యము :

లింగశరీరము కూడ అనేకములగు ఇంద్రియాదులతో కూడినది. చంచలమైనది. నాది యిది యని దృశ్యమైనది - వికారము కలదియు. అది పరిచ్ఛిన్నము కావున అసద్రూపము. అది ఈ పురుషుడు (ఆత్మ) ఎట్లగును?

విశేషములు :

1. లింగశరీరమునకు గూడ జ్ఞాన కర్మేంద్రియములు (10), ప్రాణములు (5), మనోబుద్ధులు (2). ఈ పదునేడు కళలు కలవు.

2. లింగశరీరము పరోక్షముగా తోచునది. ఆత్మ నిత్యాపరోక్షమైనది.

3. లింగశరీరము ముక్తి సమయమున నశించునది - (కర్మఫలము భుజింపబడి లుప్తమైనప్పుడు).

అవతారిక: (40 వ శ్లోకమునకు)

పై శ్లోకములందు వివరించిన కారణముల వలన స్థూలశరీరము, లింగశరీరము కూడ ఆత్మకంటె భిన్నమైనవని నిరూపింపబడుటచేత మరి ఆత్మయొక్క నిజ స్వరూపమేమి? ఈ ప్రశ్నకు యీ శ్లోకమున సమాధానము చెప్పుచున్నారు.

ఏవం దేహ ద్వయాదన్యః ఆత్మాపురుష్య ఈశ్వరః
సర్వాత్మా సర్వరూపశ్చ సర్వాతీతోఽహం అవ్యయః॥ **40**

తాత్పర్యము :

స్థూల సూక్ష్మదేహములు రెండింటికంటెను, భిన్నుడను, ఆత్మను. శరీరాధిష్ఠాతను. ఈశ్వరుడును, (జీవుడను కాదు) సర్వమునకు, ఆత్మయైనవాడను, సర్వరూపుడను- సర్వాతీతుడను, అవ్యయుడను, నేను.

విశేషములు:

ఆత్మయొక్క సర్వవ్యాపకత్వము పరిపూర్ణమైనది. అద్వితీయమైనది. ఒక పాత్రయందు నిండుగా జలము పోసినప్పుడు ఆ పాత్రకు లోపల అంతయు జలము వ్యాపించి యున్నది. బయట లేదు. కాని ఆ జలపాత్రను పెద్ద నీటికుండలో మునిచి పట్టుకొన్నప్పుడు ఆ పాత్రకు బయట కూడ జల మావరించియున్నది - కాని ఆ పాత్ర దేనితో చేయబడినదో ఆ లోహపదార్థమునందు జలము వ్యాపించలేదు. ఈ ఉదాహరణమును గ్రహించి ఆత్మ లోపలను బయటను—ఆ పాత్ర తయారుచేయబడిన పదార్థమునందు కూడను వ్యాపించియున్నదని అవగాహన చేసికొనవలెను.

అయితే ఆత్మ ఆ పాత్ర కంటె - దాని బహిరంతరముల కంటే భిన్నముగా నున్నది - ఆత్మయొక్క వ్యాప్తి సర్వసంపూర్ణమైనది. ఆ పదార్థములందు వ్యాపించి యుండుట మాత్రమే కాదు, ఆ పదార్థములే.

పంచదార మిఠాయి యంతయు వ్యాపించి దానికి తీపిదనము కూర్చినది. పంచదార పంచదార గుండలో వ్యాపించియుండుట మాత్రమే కాదు. అది పంచదారగుండ కూడ - అంతయు వ్యాపించినది ఆత్మ. ఆత్మయంతయు కూడ. ఈ అంతయు ఆత్మ లేకుండ లేదు. ఈ అంతయు ఆత్మపై ఆధారపడి ఉనికి గలిగిన దగుటచేత ఆత్మను ఈశ్వరు డనుచున్నాము. ఈ అంతయొక్క గుణగణములు ఆత్మకు సంక్రమింపవు కాబట్టి ఆత్మను సర్వాతీత మనుచున్నాము.

ఈ అంతకు ఆధారభూతమగుట మాత్రమే కాదు - ఆత్మ ఈ అంతయు లేని యప్పుడు కూడ నున్నది - ఈ అంతయు అదృశ్యమైన తరువాత కూడ నుండును. దేశకాలాదులచేత ఆత్మయొక్క ఉనికి పరిమితము కాదు - పరిచ్ఛిన్నము కాదు. అది శాశ్వతము నిశ్చలము. పరిణామహీనము. ఈ గుణములు వస్తుతతికి లేవు. ఆ కేవల నిత్యసత్యముతో జీవునకు అభిన్నత్వము. ఈ జీవుని గురించి ఇంతకుముందు 24 నుండి 28 శ్లోకములలో చెప్పబడినది.

అవతారిక: (41 వ శ్లోకమునకు)

ఇంతవరకు ఆత్మ దేహము కంటె వేరని, ఆత్మ ప్రపంచము కంటె భిన్నమని చెప్పుట జరిగినది. ఇట్లు రెండూ వేరయినప్పుడు ఆత్మవలె అనాత్మయగు ప్రపంచము కూడా సత్యమని చెప్పినట్లయినది. అయితే యీ వేదాంత శాస్త్రము తర్కశాస్త్రము కంటె భిన్నముగా చెప్పినదేమున్నది? ఈ శంకలకు సమాధానంగా శ్రీ ఆచార్యులవారు క్రింది శ్లోకములను చెప్పుచున్నారు.

ఇత్యాత్మ దేహభాగేన ప్రపంచస్యైవ సత్యతా ।
యథోక్తా తర్కశాస్త్రేణ తతః కిం పురుషార్థతా॥ 41

తాత్పర్యము:

ఇట్లు ఆత్మను దేహమును విభాగించుటచేత తర్కశాస్త్రమునందు చెప్పబడి నట్లు ప్రపంచమునకే సత్యత్వము చెప్పబడు నేని ఇందువలన నేమి పురుషార్థము గలదు?

విశేషములు:

1. "ద్వితీయాద్వై భయం భవతి" అను శ్రుతివలన ఆత్మకన్న మఱియొకటి సత్య పదార్థము ఉండునప్పుడు భయ నివృత్తి లేదని భావము.

2. ఒకదాని నుండి మరొకదానికి భిన్నత్వమున్నప్పుడు భిన్నమైన లక్షణము లుండవలెను. భిన్న లక్షణము లున్నప్పటికి సమాన సత్యత్వముండవలెను. అట్లయినచో ఆత్మయొక్క అద్వితీయ స్థితికి భంగము కలుగుచున్నది. ఇట్లు ఆత్మ అద్వితీయమైనప్పుడు అనాత్మ అను పేరొక వస్తువు ఉండుట ఎట్లు?

అవతారిక : (42 వ శ్లోకమునకు)

పైన వచ్చిన ప్రశ్నకు సామాన్యమైన సమాధానమేమనగా ఆత్మయొక్క అద్వితీయ స్థితిని భంగించుటకు మరొక ఏదియును లేనేలేదు. ఇంతవరకు చెప్పిన దేమనగా ఆత్మను అనాత్మను ఏకముగా చూడరాదని, అంతేగాని అనాత్మయన్నది వేరొకటి యున్నదని కాదు.

ఇత్యాత్మ దేహభేదేన దేహాత్మత్వం నివారితమ్ ।
ఇదానీం దేహభేదస్య హ్యసత్త్వం స్ఫుటముచ్యతే॥ 42

తాత్పర్యము :

ఇట్లు ఆత్మకు దేహమునుండి భేదము చెప్పుటచేత దేహమే ఆత్మయనుట నివారింపబడినది. ఇప్పుడు దేహభేదము అసత్యమనుట స్పష్టముగా చెప్పబడుచున్నది.

విశేషములు :

ఆత్మ దేహాదులకంటె వేరని చెప్పుట దేనికనగా అనాత్మవస్తువుకంటె ఆత్మ వేరుగా నున్నదనుటకు. అట్లు పరిశోధించి పిమ్మట ఆత్మనుండి వేరుగా మరొకటి లేదని విచారించవలెను. ఇట్లు చేయుటయే బ్రహ్మవిచారము.

అవతారిక : (43 వ శ్లోకమునకు)

ఇంతకు ముందు చెప్పిన ఉపోద్ఘాతముమీద శ్రీ భగవత్పాదుల వారు అనాత్మ అన్నది ఆత్మపైన అధ్యారోపితమైనదే యగుటచేత దానికి ప్రత్యేక అస్తిత్వము లేదని నిరూపింప పూనుకున్నారు. త్రాడు పామువలె భ్రమవలన తోచినప్పుడు భ్రమలో భావింపబడిన పాము త్రాడుకంటె భిన్నము కాదుగదా! దానికి వేరొక అస్తిత్వము లేదాయెను. దానిని మరొక భిన్నవస్తువుగా పరిణమింప వీలులేదాయెను. అట్లే అనాత్మ విషయమున - ఇది శ్రీ భగవత్పాదులవారు నిరూపించుచున్నారు.

చైతన్యస్యైక రూపత్వా ద్భేదోయుక్తోన కర్హిచిత్ ।
జీవత్వం చ మృషాజ్ఞేయం రజ్జౌ సర్పగ్రహోయథా॥ 43

తాత్పర్యము :

చైతన్యము ఏకరూపమే యగుటవలన ఎప్పుడును భేదము యుక్తము కానే కాదు. రజ్జువునందు సర్పజ్ఞానమువలె భేదత్వముకూడా మిథ్యయని గ్రహింప వలయును.

విశేషములు :

చైతన్యము ఏకరూప మెట్లగుచున్నది? ఘటము ప్రకాశించుచున్నది. అనగా తెలియుచున్నది. పటము ప్రకాశించుచున్నది. అనగా తెలియుచున్నది. ఇత్యాదిగా సర్వప్రపంచమునకు అధిష్ఠానమైన చైతన్యము ఏకాకారమగుట వలన ఈ భిన్న భిన్న వస్తువులు తెలియుచున్నవన్న అనుగతమైన అనుభవమును బట్టి చైతన్యరూపమైన ఆత్మ ఏకరూపమే.

నానా భిన్న రూపకముకాదు. ఈ అన్ని వస్తువులయందు ప్రకాశించుటయన్న దొక్కటే. అది నానా రూపములుగా నానా నామములు వహించినప్పటికి, అట్లే సర్వ ప్రపంచమునకు అధిష్ఠానమైన ఆత్మచైతన్యము.

ప్రపంచమునందున్న భిన్న భిన్న వస్తువులు నిజముగా భిన్నములు కావు. అన్నిటి యందున్న ఆత్మ యొక్కటే. విభిన్నరూపములుగా తోచునప్పటికి ఆత్మ యొక్కటే. భ్రామికమైన రూపము నశించినప్పుడు — విభిన్న నామరూపములు నశించును. అధిష్ఠానమైన ఆత్మ చైతన్య మొక్కటే మిగులును. అసలు ఇది ఆత్మయే యని భిన్నరూపములుగా తోచుట మిథ్యయని ఎఱుక కలుగును. నిజముగా త్రాడు అయిన దానిని పాముగా నొకడు భ్రమించి చూచినందువలన త్రాడు పాము కాజాలదు. అట్లే అనాత్మ విషయమున.

అవతారిక : (44 వ శ్లోకమునకు)

త్రాడును గురించిన యథార్థ జ్ఞానము లేనంతకాల మది పాముగానే తోచును. త్రాడని గుర్తింపబడినప్పుడు పాము అదృశ్యమగును. అట్లే అధిష్ఠానమైన ఆత్మ చైతన్యమును గుర్తింపనంతకాలము ప్రపంచము తోచును. ఆత్మజ్ఞానము లభించి నప్పు డది అదృశ్యమగును. త్రాడు పాముమునట్లు ఆత్మ ప్రపంచమువలె తోచును. ఈ భావమును శ్రీ భగవత్పాదులవారు చెప్పుచున్నారు.

రజ్జ్వజ్ఞానాత్ క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ
భాతి తద్వచ్చితిః సాక్షా ద్విశ్వాకారేణ కేవలా॥ 44

తాత్పర్యము :

త్రాడును గురించిన యథార్థజ్ఞానము లేని క్షణమున త్రాడు ఏ విధముగా పాము వలె తోచునో అట్లే చైతన్యరూపమగు బ్రహ్మమును తెలియకపోవుటవలన, ఆ చైతన్యము కేవలము ప్రపంచాకారమున తోచుచున్నది.

అవతారిక : (45 వ శ్లోకమునకు)

చీకటిలో పాముగా కనిపించుచున్న (త్రాడు) దే పదార్థముచేత ఏర్పడినది? త్రాడు కల్పించిన భ్రాంతి తప్ప ఆ సర్పమునకు మరే ఆధారము లేదు. ఆ సర్పమునకు ఆధారవస్తువును వెదకవలసినచో త్రాడు మాత్రమే ఆధార వస్తువని చెప్పక తప్పదు. అట్లే ప్రపంచమున కంతటికి (నామరూపాత్మకము) ఆత్మ తప్ప వేరొక ఆధారము లేదు. ప్రపంచమంతయు ఆత్మతప్ప వేరొకటి కాదు — ఈ భావములు తెలుపుచున్నారు.

ఉపాదానం ప్రపఞ్చస్య బ్రహ్మణోఽన్యన్న విద్యతే
తస్మాత్సర్వ ప్రపఞ్చోఽయం బ్రహ్మైవాఽస్తి న చేతరత్॥ 45

తాత్పర్యము :

ప్రపంచమునకు కారణము బ్రహ్మకంటె మరేదియు లేదు. అందువలన ఈ సమస్త ప్రపంచమును బ్రహ్మమే అగును. ఇతరము కాదు.

విశేషములు :

ఉపాదాన కారణము రెండు విధములు. పరిణామ్యుపాదానము, వివర్తోపాదానము. మార్పును (పరిణామమును) చెంది కార్యాకారమును తాల్చినది పరిణామ్యుపాదానము. పాలు పెరుగు వలె పరిణమించును కాబట్టి పెరుగునకు పాలు పరిణామ్యుపాదాన కారణము. మార్పును పొందకయే కార్యరూపమును తాల్చునది వివర్తోపాదానము. త్రాడు మార్పును చెందకుండా పామువలె కన్పించినది చీకటిలో. కాబట్టి పాముకి త్రాడు వివర్తోపాదాన కారణం.

అట్లే ఆత్మ మార్పులేకుండా ప్రపంచమువలె భాసించుచున్నది. కావున ఆత్మ ప్రపంచమునకు వివర్తోపాదానము. అనగా అధిష్ఠానము.

అవతారిక (46 వ శ్లోకమునకు) :

సర్వము బ్రహ్మమే అయి ఉండగా బ్రహ్మము సకలమునందు వ్యాపించి యున్నదని చెప్పుట దోషమేకదా। ఏలననగా వ్యాపించునది వ్యాపింపబడినది (వ్యాప్య మైనది) అను రెండు భిన్నపదార్థములు లేవుకదా। ఈ భావమును చెప్పుచున్నారు.

వ్యాప్తవ్యాపకతా మిథ్యా సర్వమాత్మేతి శాసనాత్ ।
ఇతి జ్ఞాతే పరే తత్త్వే భేదస్యావసరఃకుతః॥ 46

తాత్పర్యము :

వ్యాప్యత్వమును వ్యాపకత్వమును మిథ్య, సర్వమును ఆత్మయని, శ్రుతిశాసన ముండుటవలన. ఇట్టి పరతత్త్వము తెలిసినయెడల భేదమున కవకాశ మెక్కడిది?

విశేషములు :

1) బృహదారణ్యక శ్రుతి ఈ విషయమును స్పష్టముగా చెప్పినది.

ఇమేలోకాః ఇమేదేవాః ఇమాని భూతాని
ఇదం సర్వం య దయమాత్మా॥ 11-4(6)

(ఈ లోకములు ఈ దేవతలు, ఈ ప్రాణికోటి, ఇది యంతయు — ఈ ఆత్మయే) 2) మాండూక్య ఉపనిషత్తుకూడా నిది స్పష్టముగా చెప్పినది.

సర్వం హ్యేతత్ బ్రహ్మ అయం ఆత్మాబ్రహ్మ (ఇది అంతయు బ్రహ్మమే. ఈ ఆత్మ బ్రహ్మమే)

అవతారిక : (47 వ శ్లోకమునకు)

విపర్తోపాదాన కారణము ఆత్మ యని చెప్పుటతో ఉపనిషత్తులు నిలువలేదు. అసలు ఆత్మయొక్కటే వుండుటవలన రెండు వస్తువులు వాటికి మధ్యభేదము అనుటకు ఆస్కారము లేదని నొక్కి వక్కాణించుచున్నవి.

శ్రుత్యా ని వారితం నూనం నానాత్వం స్వముఖేన హి ।
కథం భాసో భవేదన్యః స్థితే చాద్వయ కారణే॥ 47

తాత్పర్యము :

శ్రుతి పరమాత్మయందు నానాత్వము లేదని తన నోటనే స్పష్టముగా చెప్పుచున్నది. అందుచేత అద్వితీయ కారణమై బ్రహ్మము ఉండగా కారణ వ్యతిరిక్తమైన

మఱియొకటి యెట్లుండును? అధిష్ఠానమైన ఆత్మయే సత్యమైనదనియు ప్రపంచము మిథ్యామయ మనియు భావము.

విశేషములు :

బృహదారణ్యక ఉపనిషత్తు నానాత్వము లేదని చెప్పిన పాఠము.

"మనసైవాను ద్రష్టవ్యం నేహనానాఽస్తి కించన (IV - 4. 19)

కఠోపనిషత్తుకూడా నిట్లే చెప్పినది.

"మనసైవేదమాప్తవ్యం నేహనానాఽస్తి కించన (IV - 11)

అవతారిక : (48 వ శ్లోకమునకు)

సంసార దుఃఖమంతయు ఆత్మను భిన్నభిన్నముగా చూచుటవలన యని శ్రుతులు చెప్పుచున్నవి. ఇంతకుముందు సూచించిన కఠోపనిషత్తు ఆత్మపదార్థము నందు భిన్నభిన్నత్వములు చూచువాడు మరణమునుండి మరణమునకు అనగా జన్మ మృత్యుదుఃఖమున పడి దుఃఖభాగుడగునని చెప్పినది. ఆచార్యుల వారీ క్రింది శ్లోక మున నది సూచించిరి.

దోషోఽపి విహితః శ్రుత్యామృత్యో ర్మృత్యుం సగచ్ఛతి।
ఇహపశ్యతి నానాత్వం మాయయా వంచితో నరః॥ 48

తాత్పర్యము :

ఇచటనే మనుష్యుడు మాయచే వంచితుడై నానాత్వమును జూచుచున్నాడో అతడు మృత్యువునుండి మృత్యువును బొందుచున్నాడని శ్రుతిచే దోషముకూడా చెప్ప బడినది.

విశేషములు :

ఉదహరింపబడిన శ్రుతి బృహదారణ్యక ఉపనిషత్తు దాని పాఠములు.

'మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నా నేవ పశ్యతి.' మృత్యోః = సంసారము నుండి, మృత్యుమ్ = సంసారమును) (కా IV 10) బృ IV 4 (19)

"మృత్యోః సమృత్యుం గచ్ఛతి య ఇహనానేవ పశ్యతి" కా IV 11.

అవతారిక : (49 వ శ్లోకమునకు)

అంతయు బ్రహ్మమే కాబట్టి ప్రాణికోటి యంతయు బ్రహ్మమేనని చెప్పు చున్నారు.

బ్రహ్మణః సర్వభూతాని జాయంతే పరమాత్మనః।
తస్మాత్ ఏతాని బ్రహ్మైవ భవంతీత్యేవ ధారయేత్॥ 49

తాత్పర్యము :

పరమాత్మయగు బ్రహ్మము వలన సమస్త భూతములును పుట్టుచున్నవి. అందువలన నివి బ్రహ్మమే యగునని నిశ్చయింపవలయును.

విశేషములు :

1) పుట్టుచున్నవి యనుట స్థితి లయములకు ఉపలక్షణము.

బ్రహ్మము నందే యున్నవి. బ్రహ్మమునందే లయించుచున్నవి.

2) ఈ విషయము తైత్తిరీయోపనిషత్తు కూడా చెప్పుచున్నది.

యతోవా ఇమాని భూతాని జాయంతే. యేన జాతాని జీవంతి, యత్ప్రయంతి అభివిశంతి. తత్ విజిజ్ఞాసస్వ, తత్ బ్రహ్మ ఇతి॥

అవతారిక : (50-వ శ్లోకమునకు)

సర్వనామ రూపాత్మకములన్నియు బ్రహ్మమే యగుట తెలుపుచున్నారు.

బ్రహ్మైవ సర్వనామాని రూపాణి వివిధానిచ ।
కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి శ్రుతిర్జగౌ॥ 50

తాత్పర్యము :

బ్రహ్మమే సమస్త నామములను నానావిధ రూపములను సమస్త కర్మలను వహించుచున్నదని శ్రుతి చెప్పెను.

విశేషములు :

ఇందు సూచించిన శ్రుతిపాఠము బృహదారణ్యక ఉపనిషత్తులోనిది.

"త్రయం వా ఇదం నామరూపకర్మ....బ్రహ్మైతద్ధి సర్వాణి నామాని బిభర్తి
బ్రహ్మై సర్వాణి రూపాణి బ్రహ్మైతద్ధి కర్మాణి బిభర్తి (16)

అధిష్ఠాన జ్ఞానములేని వారి కెట్లు రజ్జువు సర్పాది నానావిధ నామరూప కర్మములను చూపుచున్నదో అట్లు అజ్ఞానులకు బ్రహ్మము సమస్తనామ రూపకర్మములను జూపుచున్నది.

అవతారిక: (51-వ శ్లోకమునకు)

ఇంతకు మునుపు చూపిన శ్రుతి ప్రమాణాదులు విశ్వము బ్రహ్మజన్యమని, బ్రహ్మాధారముగానున్నదని చూపుచున్నవేగాని బ్రహ్మముకంటె వేరు కాదని చెప్పుట లేదుకదా! అని శంక కలుగవచ్చును. ఒక తల్లికి కలిగిన బిడ్డ — ఆమెచేత పెంచ బడినది. తల్లికంటె భిన్నమే. తల్లితో అభిన్నమని చెప్పుటకు వీలులేదు. అయితే బ్రహ్మము విశ్వమునకు తల్లివంటిది కాదు, తండ్రి వంటిది కాదు. విశ్వమంతయు బ్రహ్మపదార్థమయమే. దీనికి ఆచార్యులవా రొక ఉదాహరణ మిచ్చుచున్నారు.

సువర్ణాత్ జాయమానస్య సువర్ణత్త్వంచ శాశ్వతమ్ ।
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథాభవేత్॥ 51

తాత్పర్యము :

ఎట్లు బంగారము నుండి పుట్టిన ఆభరణాది (నగలు) సొమ్ములన్నియు శాశ్వతంగా బంగారమే అగునో, అట్లే బ్రహ్మవలన పుట్టినది శాశ్వతముగా బ్రహ్మమే అగును.

విశేషములు :

బంగారము నుండి నగ తయారు చేయబడుటకు ముందది బంగారమే. నగగా నున్నప్పుడూ బంగారమే. మరల కరిగించి నగను చెడగొట్టినప్పుడు కూడా నది బంగారమే. నగగా నున్నప్పుడు దానికి ప్రత్యేక నామరూపము లున్నంతమాత్రమున దానియొక్క బంగారత్వమునకు లోటులేదు.

అట్లే విశ్వమునకు ఉపాదానకారణమైన బ్రహ్మము. అది భ్రమవలన మరి యొకటిగా తోచుచున్నది. (త్రాడు-పాము, స్తంభము-దొంగ) లేక మట్టి కుండలుగా నైనట్లు - బంగారము ఆభరణములుగా నైనట్లు వేరు వేరు నామ రూపములతో కన్పించినను బ్రహ్మపదార్థము బ్రహ్మపదార్థమే. దానియొక్క స్వభావమునందు మార్పు లేనేలేదు.

అవతారిక : (52-వ శ్లోకమునకు)

బ్రహ్మము విశ్వమునకు ఉపాదాన కారణమైనప్పటికి బ్రహ్మము బ్రహ్మమే. (బంగారము బంగారమే ఆయినట్లు) అని చెప్పి అందుకు శ్రుతి ప్రమాణములను చెప్పుచున్నారు.

తైత్తిరీయ ఉపనిషత్తు బ్రహ్మముకంటె భిన్న మనుకొనువానికి భయము తప్పదని చెప్పినది.

"యదాహ్యే వైష ఏతస్మిన్ ఉత్ అదం అంతరం కురుతే అథతస్య భయం భవతి" (II-7) (ఎప్పుడు ఈ బ్రహ్మమునందు స్వల్పభేదమునైనను చేయునో అంత నతనికి భయము కలుగుచున్నది) అట్టివానిని ఆచార్యులవారు మూఢుడనుచున్నారు.

స్వల్ప మప్యన్తరం కృత్వా జీవాత్మ పరమాత్మనోః।
యస్సం తిష్టతి మూఢాత్మా భయం తస్యాఽభి భాషితమ్॥ 52

తాత్పర్యము :

ఎవడు జీవాత్మకును పరమాత్మకును స్వల్పభేదమునైనను కల్పించుకొని మూఢాత్ముడై యుండునో వానికి భయము కలుగునని కూడా చెప్పబడినది.

విశేషములు :

ఆచార్యులవారు పైన ఉదహరించిన తైత్తిరీయ ఉపనిషత్తు పాఠమును సూచించినారు.

తానుగాక మరొకటి వేరే యున్నాడన్నప్పుడు ఆ వేరైనదాని వలన తనకేమైన ఆపద రావచ్చునన్న భయము కలుగవచ్చును. ఆత్మ యొక్కటే ఉన్నపదార్థమని మరియొక్కటి లేదని తెలియని అజ్ఞానమువలన వేరొకదాని అస్తిత్వభ్రమ తదంగభూత భయము. ఈ అజ్ఞానము తొలగింపబడి - సకలమునందున్న ఆత్మయొక్కటే కలదన్న స్థిరభావము కలిగినప్పుడు - మరొక వస్తు వేదో ఉన్నదను భావమునకు ఆస్కారము లేదు. అందుచేత భయమునకు తావు లేదు. ఇది బృహదారణ్యక ఉపనిష ద్విదితము.

ఇట్టి భయమును గురించి చెప్పిన బృహదారణ్యక శ్రుతి పాఠములు

(1) "యదాహ్యేవైష ఏతస్మిన్నుదర మన్తరం
కురుతే అథతస్య భయం భవతి"

అవతారిక : (53-వ శ్లోకమునకు)

ద్వైతభావము కలిగినవాడు చూచునది ఇతరమునేగాని కేవల పరబ్రహ్మ మును గాదు. ద్వైతభావము లయింపగా పరమాత్మనే చూచును. శ్రుతి సమ్మతమైన యీ భావమును చెప్పుచున్నారు.

యత్రాఽజ్ఞానార్భవే ద్వైతమిత రస్తత్ర పశ్యతి।
ఆత్మత్వేన యదా సర్వం నేతరస్తత్ర చాణ్వపి॥ 53

తాత్పర్యము :

ఎప్పుడు అజ్ఞానమువలన ద్వైతము కలుగునో అప్పుడు ఇతరుడు ఇతరమును జూచుచున్నాడు. ఇక నెప్పుడు జ్ఞానముచే సర్వమును ఆత్మయే యగునో అప్పుడు ఇతరుడు ఇతరమును కొంచెమైనను చూడడు.

విశేషములు :

అజ్ఞాన దశయందు అద్వితీయమైన పరమాత్మ నానారూపముగా భాసించును. ఆ అజ్ఞాన దశయందు ఇతరుడు వేరుగా నుండి భిన్నమైన విషయములను చూచినట్లు, వినినట్లు, ఆస్వాదించినట్లు వ్యవహరించును. జ్ఞానదశయందు ఆత్మ సాక్షాత్కార మగును. అప్పుడు ఆత్మ తప్ప వేరేమియూ లేదు. జీవత్వ భ్రాంతికూడా నశించును. ఈ భావమును బృహదారణ్యక శ్రుతి తెలుపుచున్నది.

యత్రహి ద్వైతమివ భత్ ఇతరం పశ్యతి....యత్రను
అన్య సర్వం ఆత్మైవాభూత్ తత్ కేన పశ్యేత్ .... IV 6 (15)

(ఇది యాజ్ఞవల్క్య మహర్షి తన భార్య మైత్రేయికి చేసిన ఉపదేశమునం దున్నది. ఇదే పాఠము మరియొకచోట II 4 (14) కూడా నున్నది.) యాజ్ఞవల్క్య మహర్షి జనకమహారాజుతో చేసిన సంవాదమునందు కూడా నీ భావము కొన్ని పద ముల భేదముతో కన్పించుచున్నది.

యత్ర వా అన్య దివస్యాత్ తత్రాన్యోఽన్యత్ పశ్యత్. III V 3 (31)

అవతారిక : (54-వ శ్లోకమునకు)

సకలమును ఆత్మగా తెలుసుకొని అనుభవమునకు తెచ్చుకొనినపుడు — భ్రమకు ఆస్పదమైన మరొకటి లేదు. భయము లేదు. శోకము లేదు. ఇది శ్రుతి సమ్మతము; దీనిని చెప్పుచున్నారు.

యస్మిన్ సర్వాణి భూతాని హ్యాత్మత్వేన విజానతః।
న వై త స్యభవేత్ మోహోన చ శోకోఽద్వితీయతః॥ 54

తాత్పర్యము :

ఎప్పుడు సర్వభూతములను తానే యని ఎఱుగునో ఆ జ్ఞానికి మోహము కలుగదు, శోకమును కలుగదు. ఏల ననగా మోహ శోక కారణమైన రెండవ వస్తువు లేకుండుటవలన.

విశేషములు :

ఇది ఈశావాస్య ఉపనిషత్తు పాఠానుసారముగా చెప్పబడినది. ఉపనిషత్తు.

"యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవా భూత్ విజానతః
తత్ర కో మోహః కః శోకః ఏకత్వం అనుపశ్యతః (7)

ఉపనిషత్తు పాఠమును శ్రీ భగవత్పాదులు చక్కని శ్లోకరూపమున సంగ్రహించినారు.

అవతారిక: (55-వ శ్లోకమునకు)

తెలిసికొన్నవాడు — జ్ఞాని — బ్రహ్మముకంటె భిన్నముగా లేడు. ఈ విషయమును మాండూక్య ఉపనిషత్తు బృహదారణ్యక ఉపనిషత్తు విస్తరించి చెప్పినది. దానిని శ్రీ భగవత్పాదు లీ శ్లోకమున చెప్పుచున్నారు.

అయం ఆత్మా హి బ్రహ్మైవ సర్వాత్మకత యా స్థితః।
ఇది నిర్ధారితం శ్రుత్యా బృహదారణ్య సంస్థయా॥ 55

తాత్పర్యము :

ఈ యాత్మగదా సర్వాత్ముడై యున్నవాడు. ఇతడే బ్రహ్మము అని బృహదారణ్యక ఉపనిషత్తు చెప్పుచున్నది.

విశేషములు :

1) మాండూక్య ఉపనిషత్తు పాఠము
సర్వం హ్యేతత్ బ్రహ్మ. అయం ఆత్మా బ్రహ్మ."

2) బృహదారణ్యక ఉపనిషత్తు పాఠము

సవా అయా ఆత్మా బ్రహ్మ విజ్ఞానమయః మనోమయః ప్రాణమయః చక్షుర్మయః శ్రోత్రమయః వాయుమయః ఆకాశమయః తేజోమయః అతేజోమయః కామమయః అకామమయః క్రోధమయః అక్రోధమయః ధర్మమయః అధర్మమయః సర్వమయః తత్ యత్ ఏతత్ — ఇదంమయః అధోమయః॥ IV 4 (5)

అవతారిక : (56-వ శ్లోకమునకు)

అనాత్మ, మిథ్యయని చెప్పుటలోగల సారభావమేమి? (24 నుండి 28 శ్లో) శశవిషాణ (కుందేటి కొమ్ము)ము వలెనవి ఉనికి లేనివని భావమా? కాదు. వాటిని సత్యమని చెప్పుటకు మాత్రము వీలులేదు. ఒకదానిని సత్యమయినదని చెప్పుట కది అన్ని పరిస్థితులలో సత్యమైనదై యుండవలెను. భూతకాలమునందు లేనిది భవిష్యత్తున ఉండలేనిది వర్తమానమున ఉన్నదని చెప్పుటకు తగిన లక్షణములు లేనిది. నిత్య సత్యమని చెప్పుటకు వీలుకాదు. అది యిప్పుడుండి దాని ప్రభావ మితరముపై మిక్కిలిగా నున్నప్పటికి దానిని నిత్యమైన సత్యముగా చెప్ప వలనుపడదు. మన అనుభవములో కొన్ని వస్తువులు అసలు లేకపోయినను బాధా కష్ట దుఃఖముల నీయ జాలినవని మనకు తెలియును. స్వప్నాంతమై మేలుకొనినప్పుడు స్వప్నగత వస్తువు లన్నియు లేనివే. మిథ్యయే. ఈ ప్రపంచమంతయు నట్లే మిథ్య. దానిమధ్య మనము విహరించుచున్న ట్లనుకొందము. స్వప్నము నందెంత సత్యము కలదో దానియందు కూడా నంతే. ఈ భావములు చెప్పుటకు ఆచార్యులవారు ప్రారంభించుచున్నారు.

అనుభూతోఽప్యయం లోకో వ్యవహారక్షమోఽపిసన్।
అసద్రూపో యథా స్వప్నః ఉత్తరక్షణ బాధితః॥ 56

తాత్పర్యము :

ఈ ప్రపంచము వ్యవహారమునకు సమర్థముగానే యున్నది. కాని ఉత్తర క్షణమందు బాధితమగుచున్నది. అందుచే స్వప్నమువలె అసద్రూపము. మిథ్యయని అనుభవింపబడుచున్నది కూడా.

విశేషములు :

స్వప్నావస్థయందు ఎన్నో వస్తువులు కన్పించును. ఎంతో వ్యవహారము నడిపించినట్లు అనుభవము కలుగును. కాని ఉత్తరక్షణమున మెలకువ రాగానే స్వప్నమున కనిపించిందంతయు నశించుచున్నది. అందుచేత స్వప్నమునందున్న వ్యవహారము సత్యము కాదు. అదే విధముగా ప్రపంచమునం దెన్నో వ్యవహారములు జరుగుచున్నవి. ఎంతో అనుభవము కలుగుచున్నది. కాని ఆత్మసాక్షాత్కారము కలిగినంతనే ఈ ప్రపంచమంతయు మిథ్యయై నశించును. సత్యము కాదు.

లోకము వ్యవహారక్షమమని చెప్పుటయందది స్వతంత్రముగా వ్యవహారదక్షమని చెప్పుటకాదు. వ్యవహారికముగా నది యున్నంతకాలముండునని చెప్పుట మాత్రమే.

ఉత్తర క్షణ మనగా స్వప్న విషయమున స్వప్నాంత కాలమున మెలకువ వచ్చిన క్షణము ప్రపంచ విషయమున సాధకునికి అవిద్యాక్షయమై (అవిద్యా హేతువుగా భ్రమ జనిత ప్రపంచము మిథ్యయన్న) జ్ఞానము కలిగినప్పుడు.

స్వప్నమునుండి మెలకువ పొందగానే స్వప్న విషయమంతయు మిథ్యయని-ఆ స్వప్నకాలమందు కూడా నది మిథ్యయని తెలియును. అట్లే ఆత్మజ్ఞాని ప్రపంచము నిత్యమైనది కాదని - అసలు భ్రమ కల్పితమని మిథ్యయని అజ్ఞాతమని గ్రహించును.

అవతారిక : (57 వ శ్లోకమునకు)

స్వప్న జగత్తును మన మేల అసత్యమని మిథ్యయని చెప్పుచున్నాము? మెలకువ వచ్చినప్పు డది లేదనియా? అట్లయినచో స్వప్నావస్థయందు జాగ్రదవస్థ లోకములేదు కాబట్టి దీనిని మిథ్య యనవచ్చునా? అదేవిధముగా ఆ రెండింటిని అన్యోన్య ఖండనముచేత మిథ్య యనవచ్చునా? సుషుప్తి అవస్థ సత్యమా? అది కూడా స్వప్న జాగ్రదవస్థలందు లేదు కాబట్టి సత్యము కాదా? ఈ భావములు శ్రీ ఆచార్యులవారు చెప్పుచున్నారు.

స్వప్నో జాగరణేఽలీకః స్వప్నేఽపి నహి జాగరః।
ద్వయమేవ లయే నాస్తి లయోఽపి హ్యుభయోర్నచ॥ 57

తా : స్వప్నము జాగ్రదవస్థయందు లేదు. జాగ్రదవస్థ స్వప్నమునందు లేదు. ఈ రెండును నిద్రయందును లేవు. నిద్ర కూడా ఈ రెంటియందును లేదు.

విశేషములు :

ఆ కారణములచేత యీ మూడు అవస్థలును మిథ్యయగు చున్నవే గాని సత్యము మాత్రము గావు.

అవతారిక : (58 వ శ్లోకమునకు)

మనకు అనుభవమునందున్న జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలు మూడును మిథ్యయే యగునట్లు తోచగా మిగిలినది శూన్యస్థితి కాదా? కాదు. ఏలననగా యీ మూడు అవస్థలందున్న అనుభవము మాత్రమే మిథ్య యగుచున్నది కాని అనుభవించు వానిని మిథ్య యనుటలేదు. అనుభవింపబడినదియు మిథ్య. అనుభవించు వానిని కూడా మిథ్య యన్నచో అనుభవమును గూర్చి జ్ఞాపకము చేసికొనుట కలదుగదా! గాఢ సుషుప్తి కాని స్వప్నముకాని పూర్వస్మృతి పోగొట్టవలసి యుండెను. ఇట్లు జరుగుట

లేదు. కాబట్టి మూడు అవస్థలం దొక్కడు మిగిలియున్నాడని అంగీకరింపవలసి వచ్చుచున్నది. ఈ అవస్థల కతడు సాక్షిగా నున్నాడు. ఈ సాక్షి ఆత్మ - జీవుడు. ఈ విషయమునే చెప్పుచున్నారు.

త్రయమేవం భవేత్ మిథ్యా గుణత్రయ వినిర్మితమ్।
అస్యద్రష్టా గుణాతీతో నిత్యో హ్యేకః చిదాత్మకః॥ 58

తా : జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలు మూడును త్రిగుణాత్మక మాయా కల్పితములు. మిథ్యయే యగును. సత్యములు కావు. ఈ అవస్థాత్రయము నెఱుంగు నట్టి వాడు - గుణాతీతుడును నిత్యుడును ఒక్కడును చిదాత్మకుడును గదా.

విశేషములు :

(1) గుణత్రయావస్థల నెఱుగువాడు వాటికంటె భిన్నుడగుటచే గుణాతీతు డనియు, ఎల్లప్పుడును ఎఱుంగుటచే నిత్యుడనియు, భిన్నములైనవాని నన్నిటిని ఎఱుగుటచే నొక్కడనియు, ఎఱుంగువాడగుటచే చిదాత్మకు డనియు చెప్పబడును.

(2) జాగ్రదవస్థ బహిఃప్రపంచము నంతటిని తెలిసికొనుటకు అవకాశమిచ్చు చున్నది కావున నది సత్వగుణ సంబంధమైనదని చెప్పుదురు.

స్వప్నావస్థయందు మనస్సు తన లోకమును తాను నిర్మించుకొనును. అది రజోగుణ సంబంధమైనది.

గాఢ సుషుప్తి తమోగుణ సంబంధమైనది. ఈ మూడు అవస్థలను ఎఱుగు ఆత్మ ఆ అవస్థలకంటె భిన్నము. అందుచేత గుణాతీతుడు. అట్లే త్రయ్యవస్థలం దుండుటచే నిత్యుడని. సహజముగా చిదాత్మకుడు.

అవతారిక : 59 వ (శ్లోకమునకు)

పై శ్లోకమునందు చెప్పినట్లుగా ఆత్మ నిత్యుడు. ఒక్కడు, చిదాత్మకుడు అయినప్పుడు ప్రతిపై యక్తిక జీవుడును నిత్యుడు, ఒక్కడు, చిదాత్మకుడు అగునా? అతని కెన్నో పరిమితు లుండగా నిత్యుడనుట యెట్లు? అసంఖ్యాకములైన జీవులుండగా ఒక్కడని చెప్పుట ఎట్లు? ఈ ప్రశ్నలకు సమాధానముగా లౌకికముగా కన్పించుచున్న పరిమితులు, అసంఖ్యాకత్వము తెలియబడుట అనునవి సహజముగా ఆత్మకు సంబంధించినవి కావని (ఆత్మకు చెందినవిగా ఆరోపింపబడుచున్నవేగాని) తెలియవలెను. సహజముగా ఆత్మలక్షణములన్నియు బ్రహ్మము లక్షణములే. నిత్యుడు, ఒక్కడు

చిత్కళామూర్తి, ఈ సహజత్వము అనుభవమునకు వచ్చిననాడు వైయక్తిక జీవత్వ ముండదు.

ఈ పై విషయములను కొన్ని ఉదాహరణములతో శ్రీ భగవత్పాదులవారు విశదీకరించుచున్నారు.

యద్వన్మృది ఘటభ్రాంతిం శుక్తౌ వా రజతస్థితిం।
తద్వ ద్బ్రహ్మణి జీవత్వం వీక్ష్యమాణే న పశ్యతి॥ 59

తా : ఎట్లు మృత్తికయందు ఘటము కన్పించుచున్నదో ముత్యపుచిప్పయందు రజతస్థితి కల్పించుచున్నదో అట్లే బ్రహ్మమునందు జీవత్వము కన్పించుచున్నది. విచారింపబడినయెడల కన్పించదు.

విశేషములు :

ఈ ఉదాహరణములు నిచ్చుటవలన బ్రహ్మ పదార్థము ప్రపంచమునకు నిమిత్త కారణము కాదని, అట్లే ఉపాదాన కారణము కూడా కాదని చెప్పుట. ఈ ఉదాహరణముల వలన సత్యాన్వేషణ చేయువాడు బ్రహ్మము - సత్యమైనదనియు దాని వలననే భ్రమ జనితమైన ప్రపంచము ఆధారపడియున్నదనియు గ్రహించగలిగిన చాలునని శ్రీ భగవత్పాదులవారి అభిప్రాయము.

అవతారిక : (60 వ శ్లోకమునకు)

నామరూపములు నిత్యమైన పదార్థముపైన ఆరోపింపబడినవనియు — ఆ పదార్థము నామరూపాతీతమైనదనియు చెప్పుచున్నారు.

యథామృది ఘటోనామ కనకే కుండలాభిధా।
శుక్తౌహి రజత ఖ్యాతిః జీవశబ్దః తథాపరే॥ 60

తా : ఏ విధముగా మృత్తికయందు ఘటమను పేరును, బంగారమునందు కుండలమను పేరును, ముత్తెపుచిప్పయందు వెండియను పేరును భ్రాంతిచే వ్యవహరింపబడుచున్నదో అదేవిధముగానే బ్రహ్మమునందు జీవశబ్దము వ్యవహరింపబడు చున్నది.

విశేషములు :

మట్టితో కుండచేసి దానిని కుండ యనుచున్నాము. మట్టికంటె వేరుగా కుండ లేదు. కుండయను పేరేగాని కుండయను పేరుతో చెప్పదగిన మట్టికంటె వేరైన

వస్తువు లేదు. అట్లే బంగారముతో చేయబడిన కుండలముల విషయము కూడా, ముత్యపుచిప్పయందు తోచు వెండి విషయము కూడా నిట్లే. అట్లే బ్రహ్మమునందు భ్రమతో జీవుడన్న పేరేగాని బ్రహ్మకంటె వేరుగా జీవుడు లేనేలేడు.

అవతారిక : (61 వ శ్లోకమునకు)

సర్వమును బ్రహ్మమే యగును. భిన్న భిన్ననామ రూపములు ఆరోపితములు. అని చెప్పుటకు మరియొక ఉదాహరణము చెప్పుచున్నారు.

యథైవ వ్యోమ్ని నీలత్వం యథా నీరం మరుస్థలే।
పురుషత్వం తథా స్థాణౌ తద్వత్ విశ్వం చిదాత్మని॥ 61

తాత్పర్యము :

బ్రహ్మమునందు జీవత్వము మాత్రమేకాదు కల్పితము. మరేమనగా — ఆకాశమునందు రూపము లేక శూన్యమైనదానికి నీలవర్ణమున్నట్లు భ్రమించుట యెట్లో ఎండమావులయందు నీరున్నదని భ్రమించుట యెట్లో, చీకటిలో స్తంభమును చూచి పురుషుడని భ్రమించుట యెట్లో అట్లే బ్రహ్మమునందు ప్రపంచము గోచరమగు చున్నది. అనగా అజ్ఞానమువలన బ్రహ్మము ప్రపంచమువలె కన్పించుచున్నది. ప్రపంచము భ్రమ కల్పిత నామమాత్రమే. మరేదియూ కాదు.

విశేషములు :

కుండను చూచునప్పుడు మట్టిని కూడా చూచుచున్నాము. బంగారు నగను చూచినప్పుడు బంగారమును కూడా చూచుచున్నాము. అట్లే మనము వెండి చూచు చున్నామని భ్రాంతిపొందినపుడు ముత్యపుచిప్పనే అసలు చూచుచున్నది. ప్రపంచ మును చూచునప్పుడు మనము ఆత్మను—అగోచరమైనదని చూచుచున్నామనరాదు కదా। భ్రమ విషయమున అజ్ఞానము విషయమున — ఒక వస్తువు వుండవలసిన ఆవశ్యకత లేదని శూన్యమైన ఆకాశమునకు నీలత్వ మాపాదించునప్పు డొక వస్తు వేమియు లేదని శ్రీ ఆచార్యులవారు నిరూపించుచున్నారు.

భ్రమచేత త్రాడును పామనుకొనుటయందు, ముత్తెపుచిప్పను వెండి యను కొనుట యందు భ్రమకు ఆధారమైన వస్తు వొకటి కలదు. కొంత సామ్యము కూడా కలదు. త్రాడుకు పాముకి ఆకారసామ్యము. ముత్తెపుచిప్ప వెండి విషయమున ప్రకాశసామ్యము. అయితే పరబ్రహ్మ పదార్థమునకు ప్రపంచమునకు సామ్యమే మున్నది? ఏమియూ లేదు. ఒక గాజుపలక దూరమునకు నీళ్లుగా తోచినచో దానికి

హేతువున్నది. సామ్యమున్నది. కాని ఎడారిలో జలనిలయముగా తోచు ఎండమావులకు దేనితో సామ్యము? కాబట్టి భ్రమకు ఆధార మొక సామ్యమక్కర లేదని ఋజువగు చున్నది. వ్యతిరేకత వున్నప్పు డసలే భ్రమకు ఆస్కారముండదు. జడమైన ప్రపంచ మునకు చైతన్యమైన ఆత్మకు సామ్యమేమి? జడమును ఆత్మపై అధ్యారోపించు కొనుటెట్లు?

దీనికి సమాధానము పై శ్లోకమున మూడవ ఉదాహరణయం దున్నది. జడమైన కొయ్యదుంగను చూచి రాత్రివేళ దొంగ యనుకొనుచున్నాము కదా। జడమైన దానియందు భ్రమచేత చైతన్యవంతమైన దానిని భావించుకొనుట జరిగినప్పుడు చైతన్యవంతమైన దానియందు జడమునేల ఊహించుకొనరాదు? ఇంతకును శ్రీ ఆచార్యులవారు నిరాఘాటముగా చెప్పదలచుకొన్నదేమనగా భ్రమ భ్రమయే. దానికొక హేతువెందుకు? దానికొక సమాధానము — వివరణము — అన్నియు అక్కరలేదు. అది అనిర్వచనీయము. తార్కిక హేతుబద్ధమైన సంజాయిషీ దానికి లేదు.

అవతారిక : (62 వ శ్లోకమునకు)

ఆకాశము శూన్యమై యుండగా దానికి నీలత్వ మాపాదించుటకు కొంత ఆధార మున్నదన్న వాదము చేయవచ్చును. ఆకాశము శూన్యమైనప్పటికి అదియొక భూతము. పంచభూతములం దొకటి. శబ్దము దాని గుణము. ఈ వాదమును త్రోసివేయుటకు శ్రీ ఆచార్యులవారు మరి మూడు ఉదాహరణ లిచ్చుచున్నారు.

యథైవ శూన్యే వేతాళో గంధర్వాణాం పురం యథా।
యథాऽऽకాశే ద్వి చంద్రత్వం తద్వత్ సత్యే జగత్స్థితిః॥ 62

తాత్పర్యము :

ఏమియు లేని శూన్యమునందు భేతాళ భూతమున్నట్లుగా ఎట్లు కల్పింపబడు చున్నదో శూన్యమైన ఆకాశమునందు గంధర్వ నగర మెట్లు కల్పింపబడుచున్నదో (గంధర్వ నగర మనగా ఆకాశమునందు నలుపుగా, పచ్చగానున్న మేఘములు ఒక పట్టణము ఆకారముగా పరిణమించి యుండుట) ఒకప్పుడు ఆకాశమునందు రెండు చంద్రు లున్నట్లు భ్రమ ఎట్లు కలుగునో అదేవిధముగా సత్యమైన బ్రహ్మమందు జగత్తు కల్పింపబడుచున్నది.

విశేషములు :

భేతాళ డనగా నొక భూత విశేషము. భయంకరాకారము గలది. వికృతచేష్టలు గలది. గుండె దిటవులేని పిటికివాడు గాఢాంధకారమున బయటకు పోయినప్పుడు శూన్యమునందు భేతాళభూత మున్నదని భ్రమించి తల్లడిల్లుట జరుగుచుండును. ఈ భ్రమకు ఆస్కారమేమియు లేదు. కాని ఆ భూత భ్రమ కలిగి భయోత్పాతమగును. కాని పిరికితనము కారణమని చెప్పవచ్చును. అందుచేత మరియొక ఉదాహరణము. ఆకాశమున గంధర్వ పట్టణ మట్టిది. దానికికూడా మేఘము లాధారమని చెప్పవచ్చును. ఆకాశములో రెండు చంద్రుల సంగతి? ఇది దృష్టియొక్క దోషము వలన కన్పడు దృశ్యము. దీని కాధారము లేదు. ఇదేవిధముగా హేతువాదముతో జగత్తు స్థితి నిరూపింపలేము. కాని వ్యావహారికముగా నున్నది. అందుచేత నది పారమార్థికముగా మిథ్య యనవలెను.

అవతారిక : (63 వ శ్లోకమునకు)

ఇంతకు ముందున్న శ్లోకములందు చెప్పిన ఉదాహరణములలో ఒక సందర్భ మున్నది. నామరూపములతో నున్న దానిని చూచువానికి దాని వెనుకనున్న ఆధారము స్ఫురించదు. కొన్నిచోట్ల ఆధారమే లేదు. కాని జగత్తునకు ఒక ఆధారమున్నదని అది బ్రహ్మమని వేదాంతము చెప్పుచున్నది. కాబట్టి ఆధారమును విస్మరింపవలసు పడదు. అట్లయిన ప్రపంచమును చూచునప్పుడు మన మేల బ్రహ్మమును చూడలేక పోతున్నాము? బ్రహ్మమును - ఆత్మను చూచుచుండ లేదనుకొనుట సరికాదని శ్రీ భగవత్పాదుల భావము. నిజమునకు మనము ఆత్మపదార్థమునే చూచుచున్నాము. కాని దాన్ని చూచుచున్నట్లు మన మనుకొనుటలేదు. కారణ మేమనగా మనము చూచుచున్న సమయమునందు దానికి ఆవరణముగా భ్రమవలన కలిగిన నామరూపములే మన దృష్టిని ఆకర్షించుచున్నవి. — కాబట్టి మనము సముద్ర తరంగములను చూచుచున్నప్పుడు జలమును చూచుట లేదా? రాగితో తయారైన కాగు చెంబు మొదలగు వాటిని చూచునప్పుడు రాగిని చూచుట లేదా? అట్లే ప్రపంచమును చూచునప్పుడు ఆత్మను చూచుచున్నామని శ్రీ భగవత్పాదుల సూచన. అది యీ శ్లోకమున చెప్పుచున్నారు.

యథా తరంగ కల్లోలైః జలమేవ స్ఫురత్యలమ్।
పాత్ర రూపేణ తామ్రం హి బ్రహ్మాండౌఘై స్తథాఽత్మతా॥ 63

తాత్పర్యము :

ఎట్లు తరంగములతో (అలలలో) కల్లోలములలో (పెద్ద అలలలో) జలమే ప్రకాశించుచున్నదో, కాగు మొదలగు పాత్రలు రూపమున రాగియే యెట్లు ప్రకాశించు చున్నదో అదేవిధముగా బ్రహ్మాండ సమూహములచేత బ్రహ్మపదార్థమే ప్రకాశించు చున్నది.

విశేషము :

జలముకంటె తరంగము, కల్లోలము వేరుగా లేవు. రాగికంటె రాగితో తయారుచేయబడిన రాగిపాత్రలు వేరుగా లేవు. అదేవిధముగా బ్రహ్మపదార్థముకంటె వేరుగా బ్రహ్మాండములు లేవు.

అవతారిక : (64 వ శ్లోకమునకు)

పైన చెప్పిన ఉదాహరణకు తోడుగా శ్రీ భగవత్పాదులు మరిరెండు ఉదాహరణ ములు చెప్పుచున్నారు. మనము రూపములను విస్మరింప గలిగినచో అసలు పదార్థ మును గుర్తింపవచ్చుననియు నామరూపములకు పదార్థముకంటె వేరుగా అస్తిత్వము లేదనియు సూచించుచున్నారు.

ఘటనామ్నా యథా పృథ్వీ పటనామ్నా హి తంతవః ।
జగన్నామ్నాచిత్ అభాతిజ్ఞేయంతత్ తదభావతః॥ 64

తాత్పర్యము :

ఏ విధముగా మట్టి కుండయను పేరుతో తోచుచున్నదో, ఎట్లు నూలుపోగులు వస్త్రమువలె తోచుచున్నదో అట్లు బ్రహ్మము జగత్తు అను పేరుతో తోచుచున్నది. ఆ నామమును తొలగించి బ్రహ్మపదార్థమును తెలిసికొనవలెను.

విశేషములు :

నామములను తొలగించినచో ఆ వస్తుపదార్థము ఏమగునని విచారింపవలెను. ఎట్లు కుండయన్న పేరు తొలగించినచో మట్టియని చెప్పవలసి వచ్చునో - వస్త్రము అను పేరు తొలగించినచో నూలుపోగులని ఏ విధముగా చెప్పవలసి వచ్చునో అదే విధముగా నానారూపమగు జగత్తు అను పేరు బుద్ధి నుండి తొలగించిన యెడల బ్రహ్మము తెలియవచ్చును.

అవతారిక : (65 వ శ్లోకమునకు)

మనము కుండను చూచుచున్నప్పుడు నిజముగా మనము మట్టినే చూచుచున్నాము. కాని అది కుండ అన్న భావమే మనకు బలవత్తరముగా నుండి సత్యమైన దానిని విస్మరించుచున్నామని శ్రీ భగవత్పాదులు తెలుపుచున్నారు.

సర్వోపి వ్యవహారస్తు బ్రహ్మణాక్రియ తేజనైః ।
అజ్ఞానాత్ న విజానంతి మృదేవహి ఘటాదికమ్॥ 65

తాత్పర్యము:

సమస్త వ్యవహారములు జనులచే బ్రహ్మము లోనే చేయబడుచున్నవి. అయినప్పటికి అజ్ఞానము వలన తెలియకున్నారు. కుండ మొదలగువన్నియు మట్టియే కదా।

విశేషము :

నీరు మొదలగునవి తెచ్చునది మట్టితోనే (కుండతోగాదు) జరుగుచున్నను ఘటభ్రాంతిచే జనులు మృత్తికయని తెలియుటలేదు. అట్లే జగద్భ్రాంతిచే బ్రహ్మమును తెలియలేకున్నారు. విచారింపగా ఘటమే మృత్తిక - జగత్తు బ్రహ్మము.

అవతారిక : (66 వ శ్లోకమునకు)

కార్యకారణముల సంబంధము గురించి చెప్పుచున్నారు. (దృష్టాంతము)

కార్య కారణతయా నిత్యం ఆస్తే ఘట మృదోః యథా।
తథైవ శ్రుతి యుక్తిభ్యాం ప్రపంచ బ్రహ్మణోః ఇహ॥ 66

తాత్పర్యము :

ఎట్లు ఘటమునకును మృత్తికకును కార్యకారణ భావము ఎల్లప్పుడును కలదో అట్లు శ్రుతిచేతను యుక్తిచేతను ప్రపంచమునకు బ్రహ్మమునకును కార్యకారణ భావము కలదు.

విశేషములు :

ఘటమునకు మత్తిక కారణమగుటచే ఘటము మృత్తికయే అగుచున్నది. అట్లు ప్రపంచమునకు బ్రహ్మము కారణమగుటచే ప్రపంచము బ్రహ్మమే యగునని భావము. అందుకు శ్రుతి "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని. యుక్తి - ప్రపంచము బ్రహ్మము కంటె భిన్నమైనయెడల కార్యకారణ భావము సిద్ధింపదు. ఏక విజ్ఞానముచే

సర్వవిజ్ఞానము ఘటిల్లదు. అట్లు ఆత్మను తెలిసినయెడల సర్వంబును దెలియబడిన దగునని శ్రుతి చెప్పుచున్నది, (ఛాందోగ్యము)

అవతారిక : (67 వ శ్లోకమునకు)

శ్రుతి ప్రమాణ యుక్తి సందర్భము మాత్రమే గాక-వైయుక్తిక అనుభవము కూడా నిట్లే యున్నదని వివరించుచున్నారు.

గృహ్యమాణే ఘటేయద్వత్ మృత్తికాఽఽయాతి వైబలాత్।
వీక్ష్యమాణే ప్రపంచేఽపి బ్రహ్మైవాఽఽభాతి భాసురమ్॥ 67

తాత్పర్యము :

ఎట్లు ఘటమును గ్రహించినపుడు బలాత్కారమున మృత్తిక వచ్చుచున్నదో అట్లే ప్రపంచమును చూచునప్పుడు స్వయంప్రకాశమగు బ్రహ్మమే కన్పించుచున్నది. (ప్రత్యక్షాది ప్రమాణాపేక్షలేని)

విశేషములు :

అనగా కార్యము కారణముకంటె వేరుగా లేదు గనుక బ్రహ్మముకంటే ప్రపంచము వేరులేదనిన్నీ, అసలు కారణమైన వస్తువును అన్యథా గ్రహించుటయే అగుచున్నదిగాని మార్పు మాత్రము ఏమిన్నీ లేదు.

అవతారిక : (68-వ శ్లోకమునకు)

ప్రపంచము చూచుచుండగా బ్రహ్మమే యేల ప్రత్యక్షముగా తోచుట లేదు? చూడబడుచున్న వస్తువు అట్లే యున్నది. మార్పు లేదు. చూచువారి అంతస్థును బట్టి యోగ్యతనుబట్టి అది వేరు వేరుగా తోచుచున్నది. చూచువాని జ్ఞానము లేక అజ్ఞానము కారణముగా వస్తువుయొక్క దర్శనములో భేదము కలుగుచున్నదని చెప్పుచున్నారు.

సదైవాత్మా విశుద్ధోస్తి హ్యశుద్ధో భాతివై సదా।
యథైవ ద్వివిధా రజ్జుః జ్ఞానినోఽజ్ఞానినోఽనిశమ్॥ 68

తాత్పర్యము :

ఎట్లు రజ్జువు (త్రాడు) ఎల్లప్పుడును జ్ఞానికిని అజ్ఞానికిని రెండు విధములుగా నున్నదో అట్లే ఆత్మ ఎల్లప్పుడును జ్ఞానికి శుద్ధముగనే యున్నది. అజ్ఞానికి మాత్రము అశుద్ధముగానే కనబడుచున్నది.

విశేషములు :

తెలిసినవానికి చీకటిలో నున్న త్రాడు త్రాడుగానే తోచును. అక్కడ త్రాడున్న దని నిత్య అనుభవ మున్నవానికి అది చీకటిలో గూడా త్రాడుగానే తోచును. అట్లు గాక తొలిసారి చూచి త్రాడును పాముగా భ్రాంతి పొందిన వానికది పాముగానే తోచును. భ్రాంతి అట్లే వుండును. అదేవిధంగా ఆత్మ జ్ఞానికి — ఆత్మ యొక్కటే వున్నది. వేరేమియు లేదు. అట్టివానికి ప్రపంచము ఆత్మగా — బ్రహ్మముగానే తోచును. అయితే అజ్ఞానికి — ఆత్మసిద్ధి లేనివానికి కన్పించునది ప్రపంచమే. దృశ్యమునందున్న యీ మార్పునకు వస్తువు యొక్క బాధ్యత యేమియున్నీ లేదు.

అవతారిక : (69-వ శ్లోకమునకు)

ప్రపంచము బ్రహ్మముకంటె వేరుగా ఉనికిలేనిదైనచో, ఆత్మ పదార్థముకన్న అనాత్మ (దేహము) భిన్నము కాదని సూచన కలుగుచున్నది కదా! భిన్నతకు రెండు ఆధారములు. ఆచార్యులవారు 42-వ శ్లోకములో సూచించినదానిని విస్పష్టము చేయు చున్నారు.

యథైవ మృణ్మయః కుంభస్తద్వద్దేహోఽపి చిన్మయః।
ఆత్మానాత్మ విభాగోఽయం ముధైవ క్రియతే బుధైః॥ 69

తాత్పర్యము :

ఎట్లు ఘటము మృత్తికామయమో అదేవిధముగా దేహము ఆత్మ మయము. ఈ ఆత్మానాత్మలను విభాగము చేయుట బుధులు కొందరు అనవసరముగానే చేయు చున్నారు.

విశేషములు :

దేహాత్మ విభాగము చేయుట అజ్ఞులకే కాని విజ్ఞుల కొరకు కాదు. ఇచ్చట బుధ శబ్దము శాబ్దిక తర్కకర్కశుల నుద్దేశించినదేగాని బ్రహ్మవేత్తల నుద్దేశించినది కాదు.

అవతారిక : (70-వ శ్లోకమునకు)

ఐదు శ్లోకములలో మరికొన్ని ఉదాహరణలను చూపుచు దేహమును ఆత్మగా భావించుట అజ్ఞానమని నిరూపించుచున్నారు.

సర్పత్వేన యథా రజ్జుః రజతత్వేన శుక్తికా।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥ 70

తాత్పర్యము :

ఎట్లు రజ్జువు సర్పముగాను, ముత్తెపుచిప్ప వెండిగాను మూఢునిచే తెలియబడునో అట్లు మూఢునిచే ఆత్మ దేహముగా నిశ్చయింపబడినది.

ఘటత్వేన యథా పృథ్వీపటత్వే నైవతంతవః।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥ 71

తాత్పర్యము :

ఎట్లు మూఢునిచే మృత్తిక కుండగాను తంతువులు వస్త్రముగాను తెలియబడుచున్నవో అట్లే మూఢునిచే ఆత్మ దేహంగా నిశ్చయింపబడినది.

కనకం కుండలత్వేన తరంగత్వేన వై జలమ్।
వినిర్ణీతం విమూఢేన దేహత్వేన తథాత్మతా॥ 72

తాత్పర్యము :

ఎట్లు మూఢునిచే బంగారము కుండలముగాను జలము తరంగముగాను తెలియబడుచున్నదో అట్లే మూఢునిచే ఆత్మ దేహముగా నిశ్చయింపబడినది.

పురుషత్వేన వైస్థాణు ర్జలత్వేన మరీచికా।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥ 73

తాత్పర్యము :

ఎట్లు (రాత్రిపూట) కొమ్మలు లేని చెట్టు (కొయ్యదుంగ) పురుషుడుగాను, ఎండమావులు జలముగాను మూఢునిచే గ్రహింపబడునో అట్లే మూఢునిచే ఆత్మ దేహముగా నిశ్చయింపబడినది.

గృహత్వేన కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥ 74

తాత్పర్యము :

ఎట్లు కలప (కట్టెలు) గృహముగాను, లోహము ఖడ్గముగాను గ్రహింపబడునో అట్లే మూఢునిచేత ఆత్మ దేహముగా నిశ్చయింపబడినది.

అవతారిక : (75.వ శ్లోకమునకు)

ఆత్మ అనాత్మ భిన్నమైనప్పుడు. భిన్నగుణ లక్షణములను కలిగియున్నప్పుడు ఆ రెంటికి సామాన్యత ఎట్లు పొసగును? దీనికి అజ్ఞానము మూఢత్వము కారణమని వాటికి హద్దు లేదని శ్రీ ఆచార్యులవారు 12 శ్లోకములలో దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నారు.

యథా వృక్ష విపర్యాసో జలాత్ భవతి కస్యచిత్।
తద్వత్ ఆత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥ 75

తాత్పర్యము :

చెఱువులో నున్న నీటిలో గల ప్రతిబింబమును చూచి వృక్షము తలక్రిందులుగా నున్నదని అనుకొనువా డేవిధముగా భావించునో అట్లే అజ్ఞానము కలుగుటవలన ఆత్మను దేహ మనుకొనుచున్నాడు.

పోతేన గచ్ఛతః పుంసః సర్వం భాతీతి చంచలం।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞాన యోగతః॥ 76

తాత్పర్యము :

నదిలో పడవపై ప్రయాణము చేయువానికి గట్టుపైనున్న వృక్షాదులు ఎట్లు నడచుచున్నట్లు కన్పడునో అట్లే అజ్ఞానయోగమువలన ఆత్మను దేహ మనుకొను చున్నాడు.

పీతత్వంహి యథాశుభ్రే దోషాద్భవతి కస్యచిత్।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥ 77

తాత్పర్యము :

పిత్తదోషము — కామెర్లరోగము కలవానికి తెల్లని వస్తువులు కూడా పసుపుపచ్చగానే తోచును. అదేవిధముగా అజ్ఞానయోగమువలన ఆత్మను దేహమను కొనుచున్నాడు.

చక్షుర్భ్యాం భ్రమశీలాభ్యాం సర్వంభాతి భ్రమాత్మకం।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥ 78

తాత్పర్యము :

కళ్ళు తిరుగుచున్నవానికి సర్వమును తిరుగుచున్నట్లే కనిపించును. అట్లే అజ్ఞానయోగమువలన ఆత్మను దేహము అనుకొనుచున్నాడు.

అలాతం భ్రమణేనైవ వర్తులం భాతి సూర్యవత్।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞాన యోగతః॥ 79

తాత్పర్యము :

ఎట్లు కొరివి త్రిప్పినప్పుడు గుండ్రముగా సూర్యునివలె తోచునో అట్లే అజ్ఞాన యోగమువలన ఆత్మను దేహముగా తలచుచున్నారు—

మహత్వే సర్వవస్తూనామణుత్వం హ్యతి దూరతః।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥ 80

తా : పెద్దవియైన చెట్లు మొదలగునవి దూరముగా నున్నప్పుడు చిన్న చిన్న మొక్కలుగా కన్పించుచున్నవి. అట్లే అజ్ఞానయోగము వలన ఆత్మను దేహమను కొనుచున్నాము.

సూక్ష్మత్వే సర్వవస్తూనాం స్థూలత్వం చోపనేత్రతః।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞాన యోగతః॥ 81

తా : ఎట్లు చిన్నవైనను సమస్త వస్తువులను కళ్ళకు భూతద్దమును పెట్టుకొని చూచినప్పుడు పెద్దవిగా కన్పించునో అట్లే అజ్ఞానయోగము వలన ఆత్మయందు దేహత్వము చూచుచున్నారు.

విశేషము :

వస్తువులు పెద్దవిగా కన్పించుటయేగాని అసలు పెద్దవి అగుటలేదు. అట్లే ఆత్మ దేహము అగుటలేదు.

కాచభూమౌ జలత్వంవా జల భూమౌహి కాచతా।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞాయోగతః॥ 82

తా : గాజు నేలయందు జలమున్నదని భ్రమ కలుగుటయు జలమున్న చోట భూమియనియు భ్రమ కలుగుటయు సూర్యకిరణముల వలన జరుగు

చున్నది. అదే విధముగా అజ్ఞానయోగము వలన ఆత్మయందు దేహత్వము చూచు చున్నారు.

యద్వదగ్నౌ మణిత్వంహి మణౌవా వహ్నితాపుమాన్।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥ 83

తా : ఎట్లు మణియందు అగ్ని ఉన్నట్లుగాను అగ్నియందు మణి యున్నట్లు గాను భ్రమ వలన తోచుచున్నదో అదేవిధముగా అజ్ఞానయోగముచేత ఆత్మయందు దేహత్వము చూచుచున్నారు.

అభ్రేమ సత్సుధావత్సు సోమోధావతి భాతివై।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥ 84

తా : ఆకసమున మేఘములు నడచుచుండగా చంద్రుడు నడచుచున్నట్లు కన్పించుచున్నది కదా! అదేవిధముగా అజ్ఞానయోగము వలన ఆత్మయందు దేహత్వము చూచుచున్నారు.

యథైవ దిగ్విపర్యాసోమోహాద్భవతి కస్యచిత్।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగః॥ 85

తా : ఎట్లు ఒకానొకనికి మోహమువలన—పరదేశమునందు దిక్కులు సరిగా తెలియవు. తూర్పును పడమర యనుకొనును. పడమరను మరియొక దిక్కుగా తలచును. అట్లే అజ్ఞానయోగమువలన ఆత్మయందు దేహత్వమును చూచుచున్నారు.

యస్య శశీజలే భాతి చంచలత్వేన కస్యచిత్।
తద్వదాత్మ దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥ 86

తా : చెఱువులు, నీటి మడుగులు మొదలగు జలాశయములందు నీరు గాలి వలన కదలుచుండగా దానియందు ప్రతిఫలించిన చంద్రుని బింబము కూడా కదలు చున్నట్లే తోచును. అదేవిధముగా అజ్ఞానయోగము వలన ఆత్మయందు దేహత్వము చూచుచున్నారు.

అవతారిక : (87 వ శ్లోకమునకు)

ఇంతకుముందు 12 శ్లోకములలో చెప్పిన ఉదాహరణములలో—భ్రమ— లేక—తప్పు దర్శనమునకు కారణము చూచువాని మనస్సులోని లోపము, లేక అతని

గ్రహణశక్తిలోని దోషము, లేక యిట్టిదే మరియొకటి. ఇట్లే దేహమును ఆత్మగా తలపోయుటకు కారణముగా ఆత్మయొక్క నిజస్వరూప మెరుగకుండుటయే, ఈ ఎరుక లేకుంచుట—అనగా—అవిద్య—తొలగింపబడినప్పుడు దానివలన కలిగిన భ్రమ కూడా తొలగింపబడునని వివరించుచున్నారు.

ఏవం ఆత్మన్య విద్యాతోదేహా ధ్యాసో హి జాయతే।
స ఏవాత్మ పరిజ్ఞానాత్ లీయతేచ పరాత్మని॥ 87

తా : ఈ విధంగా ఆత్మయందు అవిద్యామూలముగా దేహాధ్యాసము కలుగుచున్నది. ఇది అనుభవ సిద్ధము. ఆ దేహాధ్యాసయే ఆత్మజ్ఞానము వలన పరమమైన ఆత్మయందు లీనమగుచున్నది.

విశేషములు :

(1) ఆత్మను ఆవరించిన అజ్ఞానమువలన దేహాధ్యాస—ఆత్మ దేహమేయన్న భ్రమ—కలుగుచున్నది.

(2) ఒక వస్తువునందున్న చీకటి — వెల్తురు ప్రసరించినప్పుడు పోవును. అదేవిధముగా ఆత్మను ఆవరించిన అజ్ఞానము తొలగుటకు ఆత్మ సాక్షాత్కారము వలన దేహాధ్యాస ఆత్మయందే లయించును.

(3) అధ్యాస, ఆరోపము, భ్రమ, భ్రాంతి — సమానార్థకములని చెప్పవచ్చును. ఆత్మ సాక్షాత్కారము, బ్రహ్మ సాక్షాత్కారము—ఇవి సమానార్థములు.

అవతారిక : (88 వ శ్లోకమునకు)

ఆత్మకంటె వేరేమియులేదు. కాబట్టి అధ్యాస తప్పక నశించుననని చెప్పుచున్నారు.

సర్వమాత్మతయా జ్ఞాతం జగత్ స్థావర జంగమమ్।
అభావాత్సర్వ భావానాం దేహస్యకుత ఆత్మతా॥ 88

తా : స్థావర జంగమరూపమైన జగత్తంతయు ఆత్మయందు ఆరోపితమే. సర్వ భావములు, సర్వదేహములు లేమివలన దేహసద్భావమును దేహమున కాత్మత్వమును ఎక్కడిది?

విశేషములు :

ఆత్మసాక్షాత్కారము కలిగినప్పుడు ఆరోపమంతయు నశించును. ఆత్మకంటే వేరొకటి యేమియు లేనప్పుడు దేహము ఆత్మ అగుట ఎట్లు? కాజాలదని భావము.

అవతారిక : (89 వ శ్లోకమునకు)

ఆత్మస్వరూపమును గురించి వివరించి సాధకునికి శ్రీ ఆచార్యులవారు చేయు ఉద్బోధ — జ్ఞానమును సంపాదించి — జ్ఞానముతో నుండుమని — శరీరమునకేమి ఉపద్రవము కలుగునో యన్న భీతి అక్కరలేదని. దేహమును ఆత్మగా భావించరాదు. కావున — దానికి సంబంధించినది కూడా కాదు కావున —

ఆత్మానం సతతం జానన్ కాలం నయ మహాద్యుతే।
ప్రారబ్దం అఖిలంభుంజన్ నోద్వేగం కర్తుమర్హసి॥ 89

తాత్పర్యము :

ఓయీ మహాద్యుతీ! నీ వెల్లప్పుడు ఆత్మను విచారించుచు కాలమును గడుపుము.

ప్రారబ్ధమును పూర్తిగా అనుభవించుచు ఉద్వేగమును పొందకుము.

విశేషములు :

1. "మహాద్యుతి" అనునది కామాదులను జయించి (మోక్ష) హితసాధనమందు ఉన్ముఖుడైనవాడు.

2. ఉద్వేగము — అనగా ఇట్టి దుఃఖము నాకు కలిగెనే యన్న సంతాపము.

3. జ్ఞాని కొక్కనికే వేదాంతముగాని నా కేల నని భావించకూడదు. ఏ దశలో నున్న సాధకుడైనను ఆచార్యులవారి హిత వచనములను పట్టించుకొనవలెను. అందువలన జీవన్ముక్తి లభించును. ప్రారబ్ధము మాత్రము అనుభవింపక తప్పదు. ప్రారబ్ధము అనుభవింపక తప్పదా అని ఆందోళన పడనక్కరలేదు.

ఇది పరమ దయాళువైన ఆచార్యులవారి హిత వచనము.

అవతారిక : (90 వ శ్లోకమునకు)

కర్మ మూడు విధములు. సంచిత ప్రారబ్ధ ఆగామిలు.

సంచిత మనగా బహు పూర్వజన్మలనుండి సంభవించిన కర్మఫలము ప్రస్తుత జన్మమున అనుభవమునకు రాదు.

ప్రారబ్ధ మనగా ప్రస్తుత జన్మకారణమైనది. ఈ శరీర మున్నంతవరకు అనుభవింపవలసినది.

ఆగామి యిక ముందు చేయబడునది.

ప్రతి కర్మము శరీరముతో ఇంద్రియ—మనస్సహకారముతో చేయబడును. శాస్త్రములు చెప్పునదేమనగా ఆత్మ జ్ఞానోదయమైనప్పుడు సంచితము నశించునని. ఆత్మజ్ఞాని దేహేంద్రియ మనస్సులకు అతీతుడుగా నుండుటచేత జ్ఞానిని ఆగామి స్పృశింపనేరదని కూడ శాస్త్రములు చెప్పుచున్నవి. ప్రారబ్ధము యీ జన్మకు హేతువై యీ జన్మ వున్నంత కాలము తన ప్రభావము చూపుచునే యుండును. అది నశింపదు. ఈ సంగతి సామాన్యముగా సరియైనది. అయితే శ్రీ భగవత్పాదులు కొంత మార్పు సూచించిరి. ఆత్మజ్ఞానులై యుండి కూడ లౌకిక ప్రాపంచిక వ్యవహారికతను గమనించియు దానియందు యథార్థతను గుర్తింపక మెలగువారియందు మాత్రమే ప్రారబ్ధకర్మ ప్రభావ ముండునని శ్రీ భగవత్పాదులు చెప్పుచున్నారు.

సదాత్మనిరతుడై బాహ్యప్రపంచము లేనివానికి - బ్రహ్మవిద్వరిష్ఠునకు - ఇంద్రియానుభవమే వుండదు. అతనికి దేహము, ఇంద్రియములు మనస్సు అన్నవి లేనట్లే. ఆయనకు ఏ వస్తువును, ఇంద్రియానుభూత విషయము కాదు. అట్టివానికి ప్రారబ్ధకర్మ కూడ నిష్ప్రభావమే. అతని శరీరముపై ప్రభావము చూపినను ఇంద్రియములపై మనస్సుపై ప్రభావము చూపినను—దేహ ఇంద్రియ మనస్సులకు అతీతుడైన అతనిని ఏమియు చేయజాలదు.

ఇక ముందు చెప్పబోవు పది శ్లోకములలో శ్రీ భగవత్పాదులీ వివరణము చెప్పబోవుచున్నారు.

ఉత్పన్నే ప్యాత్మ విజ్ఞానే ప్రారబ్ధం నైవ ముంచతి ।
ఇతియత్ శ్రూయతే శాస్త్రాత్ తత్ నిరాక్రియతేఽధునా॥ 90

తాత్పర్యము :

ఆధ్యాత్మ విజ్ఞానము కలిగినను ప్రారబ్ధము విడువదని యేవాదము శాస్త్రము అందు వినబడుచున్నదో అది యిప్పుడు నిరాకరింపబడుచున్నది.

విశేషములు :

'నిరాకరింపబడుట' అనగా శాస్త్రసిద్ధాంతమును సంపూర్తిగా త్రోసివేయుట కాదు. ప్రారబ్ధము ఆత్మజ్ఞానులలో శ్రేష్ఠులైన వారియందు పనిచేయదని చెప్పుటయే. అయితే మాయావరణమును తొలగించుకొన్న ఆత్మజ్ఞాను లింకను దేహధారులై దేహోచిత కృత్యములు చేయుచున్నను వారు కూడ ప్రపంచము మిథ్య యని తెలిసి దానివలన ప్రభావితు లగుటలేదు. అందుచేత వారికి ప్రాపంచిక అనుభవము సుఖము

దుఃఖము లేవు. సుఖ దుఃఖములు ప్రారబ్ధ కర్మఫలము లైనచో వారికి కూడ నివి లేవు. ప్రారబ్ధము దేహ ఇంద్రియ మనస్సులపైననే ప్రభావము చూపును. అవి ఆత్మ కాదు.

సామాన్య జనుల దృష్టికి ఆత్మజ్ఞాని కూడ శరీరధారి అయి దేహోచిత క్రియలు చేయుచున్నట్లు తోచును. కావున చూచువారి దృష్టిని బట్టి ఆత్మజ్ఞానికి ప్రారబ్ధ మున్నదని చెప్పుట — జ్ఞాని దృష్టిని బట్టి కాదు, జ్ఞానికి ఇంద్రియానుభవమే లేదు.

అవతారిక : (91 వ శ్లోకమునకు)

శ్రీ భగవత్పాదులు ప్రారబ్ధకర్మను గూర్చి తమ అభిప్రాయమును చెప్పు చున్నారు.

తత్త్వ జ్ఞానోదయా దూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే।
దేహాదీనా మస త్త్వాత్తు యథా స్వప్నో విబోధతః॥ 91

తాత్పర్యము :

తత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట దేహాదు లుండవు. మేలుకొన్న పిమ్మట స్వప్నము నిశ్శేషముగా నశించినట్లే. దేహాదుల లేమివలన ప్రారబ్ధము వుండనే వుండదు.

విశేషములు :

శ్రీ భగవత్పాదులు తాము చెప్పదలచుకున్న విషయమును ప్రతిజ్ఞ, హేతు దృష్టాంతములతో చెప్పుచున్నారు. కల గనుచున్నవారు మేలుకొని స్వప్నము అసత్య మని తెలుసుకొన్నప్పుడు స్వప్నమే లేదు. అదేవిధముగా సత్య మెరిగినవాడు ద్వైతము యొక్క మిథ్యత్వమును తెలిసికొనును. దేహము, ఇంద్రియములు, మనస్సు, ప్రపంచము మిథ్యయే యని తెలిసికొన్నప్పుడు — ప్రారబ్ధము ద్వైతము లోని లవాంశమే కాబట్టి అది వుండనే వుండదు. నిద్రలో స్వప్నము కలిగి మేలు కొన్నవాడు స్వప్నంలో తన శరీరము, అనుభవము, స్వప్న ప్రపంచము మిథ్యయని తెలిసికొన్న తరువాత వాటిని గురించి పట్టించుకొనునా? స్వప్నములో వచ్చిన మంచి చెడ్డల గురించి ఆలోచన చేయునా?

అవతారిక : (92-వ శ్లోకమునకు)

పూర్వజన్మలందు చేసిన కర్మల యొక్క నిధిలో ప్రారబ్ధము కొంత మాత్రమే. ఆత్మసత్యమని దానికి జనన మరణములు లేవని తెలుసుకొన్నప్పుడు ఒక

పూర్వజన్మ మున్నదని దానివలన వచ్చిన ప్రారబ్ధకర్మ పున్నదని అంగీకరింప వచ్చునా? అప్పుడు చేసిన కర్మఫలము అనుభవించుట ఎట్లు?

కర్మ జన్మాంతరకృతం ప్రారబ్ధం ఇతి కీర్తితం।
తత్తు జన్మాంతరా భావాత్ పుంసోనైవాస్తి కర్హిచిత్॥ 92

తాత్పర్యము :

జన్మాంతరమున అనగా పూర్వజన్మమున కలిగిన కర్మమేమి కలదో దానిని ప్రారబ్ధమని చెప్పుదురు. కాని జ్ఞానికి పూర్వజన్మము లేమివలన ప్రారబ్ధము ఏ విధమునను సంభవింపదు.

అవతారిక : (93-వ శ్లోకమునకు)

ఈ దేహము ఆత్మపై అధ్యస్తింపబడినదే—స్వప్నమునందు దేహమువలెనే అని ఆచార్యులవారు ప్రబోధించుచున్నారు. స్వప్నదేహమునకు జన్మ కలదా? జన్మ లేని స్వప్నదేహమునకు ఉనికి యుండు టెట్లు? జాగ్రదవస్థలోని దేహము విషయము కూడ నట్లే. అవిద్యయన్న నిద్ర నుండి మేల్కొన్నప్పుడే దేహ ముండదు. అవిద్య యనగా ఆత్మను గురించిన జ్ఞానము లేకుండుట.

స్వప్న దేహో యథా ధ్యస్తఃత థైవాయం హి దేహకః।
అధ్యస్తస్యకుతో జన్మ జన్మాభావే స్థితిఃకుతః॥ 93

తాత్పర్యము :

స్వప్నమందలి దేహ మెట్లు అధ్యస్తమో అట్లేగదా యీ దేహము గూడ అధ్యస్తము. అధ్యస్తమైనట్టిదానికి జన్మ మెక్కడిది? జన్మము లేనప్పుడు స్థితి యెక్కడిది?

విశేషములు :

క్రమగతిగా జన్మ లేనప్పుడు ప్రారబ్ధ మెక్కడిదని భావము.

అవతారిక : (94-వ శ్లోకమునకు)

ఉపనిషత్తు - ప్రపంచము బ్రహ్మమునుండి పుట్టినదని, దానవలన ఉనికి కలిగి యున్నదని, దానియందు లయించునని చెప్పుచున్నప్పుడు ప్రపంచము జన్మింపలేదని చెప్పుట యెట్లు? (యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతియత్ ప్రయంత్య భిసం విశన్తితత్ బ్రహ్మ) ప్రపంచము జన్మించినదని యనుకొన్నచో

జన్మించిన ప్రతిదాని కొక జన్మహేతు వుండవలెను గాన - ఉపనిషత్తు హేతువు బ్రహ్మ మనుచున్నది. బ్రహ్మము నిర్గుణము. అపరిణామి, దానికి క్రియాప్రవృత్తి - (సృష్టించుట వంటి) లేదు. రాత్రివేళ రజ్జువును పామని భ్రాంతి కలిగినప్పుడు - పామునకు కారణము త్రాడు. కాని త్రాడు సర్పమును సృష్టింపదు. అదే మార్పులేక అట్లే వున్నది. కార్యకారణ సందర్భముగా మనము ఆలోచించుదుము కావున - మనకు అవగత మగు పదజాలముతో ఉపనిషత్తు చెప్పినది. అంతకన్న మనకు తెలియచెప్పుటకు మరొక మార్గము లేదు. ప్రపంచమునకు బ్రహ్మము కారణమని ఉపనిషత్తు తెలుపుటలో భావ మిది. కారణమనగా ఒక రకము కాదు. కుండ తయారగుటకు కుమ్మరి, కుమ్మరి చక్రము, మట్టి - యివి యన్నియు కారణస్థానమున కలవు. అయితే సృష్టికి ముందు బ్రహ్మము దక్క మరేదియూ లేదు. కాన యీ మూడు విధములుగ బ్రహ్మమును గమనింపవలయును. అయితే ఆయన సర్వవ్యాపి సర్వ శక్తివంతుడు. అందు చేత ఉపకరణ స్థితి లేదు. సాలెపురుగు అల్లుట సముచిత ఉదాహరణము. అదియే నిమిత్తము. ఉపాదానము. బ్రహ్మము విషయమున కూడ నిట్లే. ఈశ్వరుడు, మాయయు - యీ స్థానమున నున్నవి. మాయ బ్రహ్మము కంటె వేరు కాదు. అయితే అభిన్నము కూడ కాదు. ఈశ్వరుడు మాయాసహితుడై సృష్టికి ఉపక్రమించుచున్నాడు. మాయ లేనప్పుడు సృష్టిలేదు.

ఈ అంతయు ఈ క్రింది శ్లోకమున చెప్పుచున్నారు.

ఉపాదానం ప్రపంచస్య మృద్భాండ స్యేవ కథ్యతే ।
అజ్ఞానంచైవ వేదాంతైః తస్మిన్ నష్టే క్వ విశ్వతా॥ 94

తాత్పర్యము :

ఘటమునకు మృత్తికవలె ప్రపంచమునకు అజ్ఞానము ఉపాదాన కారణమని వేదాంతము చేత చెప్పబడుచున్నది. ఆ అజ్ఞానము నశించినప్పుడు ప్రపంచము ఎక్కడిది?

అవతారిక : (95-వ శ్లోకమునకు)

మాయ - నిజముగా అవిద్యకంటె భిన్నము కాదు. రజ్జువును చీకటిలో చూసి సర్ప మనుకొను వాని అజ్ఞానము వలన రజ్జువును వాడు గుర్తింపలేకుండెను. ఆ అజ్ఞానము సర్పముగా భ్రమింప చేయగల రజ్జువుయొక్క శక్తికంటె భిన్నము కాదు. ఆ అజ్ఞానము తొలగింపబడగా - అనగా రజ్జువు గుర్తింపబడగా సర్ప

ముండదు. అదేవిధముగా బ్రహ్మస్వరూప జ్ఞానము కలుగగా - మిథ్య యగు జగత్తు కనబడదు.

ఈ విషయమును శ్రీ భగవత్పాదులు రెండు శ్లోకములలో వివరించుచున్నారు.

యథా రజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతి వైభ్రమాత్।
తద్వత్ సత్యం అవిజ్ఞాయ జగత్ పశ్యతి మూఢధీః॥ 95

తాత్పర్యము :

ఏ విధముగ రజ్జువును విడచి భ్రమ వలన సర్పమును చూచుచున్నాడో అదేవిధముగా మూఢబుద్ధి యగువాడు సత్యము నెఱుంగక జగత్తును చూచు చున్నాడు.

విశేషములు :

అజ్ఞానము సిద్ధమగు రూపమును తోచకుండా చేసి - తెలియకుండునట్లు చేసి భ్రాంతిని కలిగించినదని భావము.

రజ్జురూపే పరిజ్ఞాతే సర్పఖండం నతిష్ఠతి।
అధిష్ఠానే తథాజ్ఞాతే ప్రపంచ శ్శూన్యతాం గతః॥ 96

తాత్పర్యము :

రజ్జుస్వరూపము తెలియబడిన పిమ్మట సర్పఖండము ఏవిధముగా నిలువదో అదేవిధముగ అధిష్ఠాన మెఱుంగబడిన పిమ్మట ప్రపంచము శూన్యమైపోవును.

అవతారిక : (97 వ శ్లోకమునకు)

దేహముకూడ ప్రపంచమగుట వలన ప్రారబ్ధమునకు స్థితి యెక్కడిది? ఈ విషయమును శ్రీ భగవత్పాదులవారు చెప్పుచు అజ్ఞానము తరువాత ప్రారబ్ధమునకు స్థితిలేదని స్పష్టము చేయుచున్నారు.

దేహస్యాపి ప్రపంచత్వాత్ ప్రారబ్ధావస్థితిః కుతః।
అజ్ఞాన సంబోధార్థం ప్రారబ్ధం వక్తి వైశ్రుతిః॥ 97

తాత్పర్యము :

దేహము కూడ ప్రపంచమగుటవలన అది శూన్యము కాగా ప్రారబ్ధమునకు స్థితి యెక్కడిది? అజ్ఞాని జనులకు బోధించుటకై శ్రుతి ప్రారబ్ధమును చెప్పుచున్నది.

విశేషములు :

జ్ఞానముచే వ్యవహార కారణమైన అజ్ఞానము నశించిన పిదప జ్ఞానికి వ్యవహార మెట్లు? అని అజ్ఞానులు శంకింతురు కాబట్టి వారికి సమాధానమునకై ప్రారబ్ధముచే వ్యవహారము సిద్ధించునని శ్రుతి చెప్పుచున్నది.

అవతారిక : (98 వ శ్లోకమునకు)

బ్రహ్మజ్ఞానికి ప్రారబ్ధము లేదన్న తమ సిద్ధాంతమునకు బలముగా శ్రీ భగవత్పాదులు ముండకోపనిషత్తులోని పాఠమును చూపుచున్నారు. ఆ పాఠమున క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరాపరే' కర్మాణి అన్న బహువచన ప్రయోగమున్నది. సంస్కృతమున ఏకవచనము, ద్వివచనము, బహువచనము అని వచనములు మూడు. బహువచన పదమునకు కనీసము అర్థములు మూడుండవలెను. అనగా కర్మములు (కర్మాణి) మూడు. ఆగామి సంచిత ప్రారబ్ధములు. ఇందు ప్రారబ్ధము లేకపోయినచో బహువచన ప్రయోగము చెల్లదు. అందుచేత శ్రుతిభావము ప్రారబ్ధము కూడ బ్రహ్మజ్ఞానికి వర్తించదని ఆచార్యులవారు నిరూపించుచున్నారు.

క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరాపరే।
బహుత్వం తన్నిషేధార్థం శ్రుత్యాగీతంచవై స్ఫుటమ్॥ 98

తాత్పర్యము :

ఆ పరమాత్మ నెరింగిన మీదట జ్ఞాని యొక్క కర్మములు నశించుచున్నవి. అన్న ముండకోపనిషత్తు పాఠముచే అజ్ఞాని బోధార్థము చెప్పిన ప్రారబ్ధము నిషేధించుటకై స్పష్టముగా - కర్మాణి'' అని బహువచనము చెప్పబడినది.

విశేషములు :

కర్మాణి—బహువచనము. మూడు కర్మలు.

కర్మణీ—ద్వివచనము. రెండు కర్మములు.

''కర్మణీ'' అన్నను ఛందస్సు సరిపోవుచున్నది శ్రుతి పాఠమున. కర్మాణి అనుటచేత మూడు కర్మలను ఉద్దేశించినట్లు స్పష్టము.

అవతారిక (99-వ శ్లోకమునకు)

పై చెప్పిన విధముగా కాక, మరి యే యితర విధముగా అర్థము చెప్పినను అసందర్భముగా నుండునని అనర్థము వాటిల్లునని శ్రీ భగవత్పాదులు వారు సూచించుచున్నారు.

ఉచ్యతేఽజ్ఞైర్బలాచ్చైతత్ తదానర్థ ద్వయాగమః।
వేదాన్త మతహానంచ యతో జ్ఞానం ఇతి శ్రుతిః॥ 99

తాత్పర్యము :

అజ్ఞానులచే బలాత్కారముగా యీ ప్రారబ్ధము బ్రహ్మజ్ఞానికి కూడ కలదని చెప్పబడునేని అప్పుడు రెం డనర్థములు - జన్మాంతరము - మోక్ష అభావము సంభవించును. అంతేగాక వేదాంత సిద్ధాంతహాని - ద్వైతాపత్తికూడ కలుగును. ఎట్లనగా- జ్ఞానమే - జ్ఞానస్వరూపమైన బ్రహ్మ యొక్కటియే పరమార్థమని కదా శ్రుతి చెప్పుచున్నది.

విశేషములు :

జ్ఞానము కలిగిన తరువాత ప్రారబ్ధముండునేని — అప్పుడు అది అజ్ఞాన సంబంధమైనది కాదని ఆత్మజ్ఞాన హీనత్వముతో సంబంధములేని యునికి కలదని భావ మేర్పడును. దానికి ఆత్మభిన్నమైన అస్తిత్వ మంగీకరించినట్లగును. ఆత్మ అద్వితీయ మన్న సిద్ధాంతమునకు భంగము వాటిల్లును. అప్పుడు ఆత్మజ్ఞాన మొక్కటే మోక్షము నీయజాలని దగును. ఇట్టి సూచనలన్నియు ఉపనిషత్తులు ప్రతిపాదించిన సిద్ధాంతములకు విరుద్ధములు.

ఆత్మ అద్వితీయమని, ఆత్మజ్ఞానమువలన జన్మ జరామరణ సంసార చక్ర భ్రమణము నుండి విముక్తి కలుగునని ప్రతిపాదించు ఉపనిషన్మతమున కీ భావములు విరుద్ధములు. ద్వైత ప్రాబల్య మంగీకరించినట్లగును.

అవతారిక (100-వ శ్లోకము)

ఇంతవరకు యీ ప్రకరణ గ్రంథమున బ్రహ్మసత్యము, నామరూపాత్మకమైన జగత్తు మిథ్యయని, ముక్తిపొందిన జీవుని స్థితియొక్క లక్షణ మిట్టిదని వివరించి శ్రీ భగవత్పాదుల వారు ముక్తిస్థితిని పొందుటకు మార్గమైన సాధనను గురించి యిక మిగిలిన శ్లోకములందు చెప్పుచున్నారు. ముఖ్యాధికారికి సాధన చతుష్టయ సంపత్తి యుండును కాబట్టి వేదాంత శ్రవణ మనన నిధిధ్యాసల యం దధికారము కలదు. తద్వారా మోక్షలాభమని వివరించడమైనది. మందాధికారులకు శ్రవణాదులు చేయలేని వారికి కూడ నిర్గుణోపాసనయే మార్గము. దానివలన జ్ఞానము మోక్షమునకు ముఖ్య సాధనము.

పతంజలియోగ దర్శనమున అనాత్మ ఆత్మభేదములను అంగీకరించి ముక్తి సాధనకు కొన్ని సోపానములను చెప్పెను. పతంజలి యోగదర్శనమున నున్న

బ్రహ్మాత్మ సిద్ధాంతమును వేదాంత సిద్ధాంతము అంగీకరింపదు. కాని పతంజలి చెప్పిన సోపానములు వేదాంతులకు కూడ శిక్షణా మార్గమున ఉపయోగకరములే. శ్రీ భగవత్పాదులు పతంజలి చెప్పిన యమ, నియమ, ఆసన, ప్రాణాయామ ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులన్న అష్టవిధ సాధనక్రమమును అంగీకరించినారు కాని ప్రాముఖ్యత విషయమున కొంత మార్పు సూచించిరి. ఈ ఎనిమిదికి మరి ఏడింటిని కలిపి శ్రీ భగవత్పాదులు సాధన సోపాన మేర్పరచిరి. ఇది రాజయోగ మార్గము. పతంజలిది యోగము. ఇది రాజయోగము.

శ్రీ భగవత్పాదులు ముందుగా శ్రద్ధాబద్ధమైన మానసిక ఏకాగ్రత ఆవశ్యకమని చెప్పుచున్నారు.

త్రిపంచాగాన్యథో వక్ష్యే పూర్వోక్త స్యహిలబ్ధయే।
తైశ్చ సర్వైసదా కార్యం నిది ధ్యాసనమేవతు॥ 100

తాత్పర్యము :

ఇంతకు మున్ను చెప్పిన బ్రహ్మ రూపావస్థానము సిద్ధించుటకై పదునైదు అంగములను చెప్పెదను. ఆ పదునైదంగములచే నెల్లప్పుడును నిది ధ్యానమునే చేయవలయును.

నిత్యాభ్యాసాధృతే ప్రాప్తిః నభవేత్స చ్చిదాత్మనః।
తస్మా ద్బ్రహ్మ నిదిధ్యాసేత్ జిజ్ఞాసు శ్శ్రేయసే చిరమ్॥ 101

తాత్పర్యము :

ఎల్లప్పుడును అభ్యాసము చేయని యెడల సచ్చిదానంద ప్రాప్తి సిద్ధింపదు. అందువలన జిజ్ఞాసువు శ్రేయస్సు కొరకు చిరకాలము బ్రహ్మమును నిది ధ్యాసనము చేయవలెను.

అవతారిక:

శ్రీ భగవత్పాదులు పదునైదు అంగములను శ్లోకములలో చెప్పుచున్నారు.

యమోహి నియమస్త్యాగో మౌనం దేశశ్చ కాలతా।
ఆసనం మూల బంధశ్చ దేహసామ్యం చ దృక్ స్థితిః॥ 102

ప్రాణ సంయమనం చైవ ప్రత్యాహారశ్చ ధారణా।
ఆత్మ ధ్యానం సమాధిశ్చ ప్రోక్తాన్య జ్గాని వైక్రమాత్॥ 103

తాత్పర్యము :

యమము, నియమము, త్యాగము, మౌనము, దేశము, కాలము, ఆసనము, మూలబంధము, దేహసామ్యము, దృష్టినిలకడ, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ఆత్మధ్యానము, సమాధి - ఇవి పదునైదును అంగములు. క్రమముగా చెప్ప బడినవి.

అవతారిక :

పతంజలి యోగదర్శనమున యమ నియమాది పదములకే అర్థమున్నదో యీ సందర్భమున మన కనవసరము. రాజయోగమున శ్రీ శంకర భగవత్పాదు లీ పద ములకే అర్థమును సంభావించిరో మనము గ్రహింపవలెను.

ముందు శ్లోకములలో యీ పదముల వివరణము చేయుచున్నారు.

సర్వం బ్రహ్మేతి విజ్ఞానా దింద్రియగ్రామ సం యమః।
యమోఽయమతి సంప్రోక్తోభ్యసనీయో ముహుర్ముహుః॥ 104

తాత్పర్యము :

సర్వమును బ్రహ్మమే యను జ్ఞానమువలన ఇంద్రియముల సమూహమును విషయముల నుండి మరలించుట యేది కలదో—అది యమ మని చెప్పబడినది. మాటి మాటికి దీని అభ్యాసము చేయవలెను.

అవతారిక : (105 వ శ్లోకము)

యమమును గురించి చెప్పి మిగిలిన రాజయోగాంగములను గురించి వివ రించుచున్నారు.

సజాతీయ ప్రవాహశ్చ విజాతీయ తిరస్కృతిః।
నియమోహి పరానందో నియమాత్ క్రియతే బుధైః॥ 105

తాత్పర్యము :

బ్రహ్మైకాకార వృత్తి ప్రవాహమును తద్భిన్నవృత్తి తిరస్కారమును యీ రెండును నియమము. అదిగదా పరమానందరూపము. నియమమున విద్వాంసులచే చేయబడుచున్నది.

విశేషములు :

బ్రహ్మాకారవృత్తినే ధరించి తద్భిన్నమయిన జగదాకార వృత్తిని విడచుటయే తద్భిన్న వృత్తి తిరస్కారము.

బ్రహ్మాకార వృత్తిని ధరించుట యనగా ఆత్మచింతనము. దీనికి ఆనందమే ప్రయోజనము. కాబట్టి దీనిని విద్వాంసులు నియమముతో అభ్యసించుచున్నారు.

త్యాగః ప్రపంచ రూపస్య చిదాత్మత్వావ లోకనాత్।
త్యాగో హి మహతాం పూజ్యః సద్యోమోక్షమయో యతః॥ 106

తాత్పర్యము :

సర్వమును చిదాత్మకమని చూచుటవలన ప్రపంచ గతనామ రూపముల త్యాగము—విడచుట ఏది గలదో—దేని జూచినను అధిష్ఠాన భూతబ్రహ్మజ్ఞానము వలన నౌదాసీన్యమేది గలదో—అదిత్యాగ మని చెప్పబడినది. అది జ్ఞానులకు పూజ నీయము. ఏలననగా అది తక్షణమే మోక్షరూపము.

విశేషములు :

ఆత్మచింతన చేయుచు, నామరూప ప్రపంచమును విడుచుటయే త్యాగము. ఇట్టి త్యాగమును మహాత్ములు మోక్షసాధనకు ముఖ్యముగా భావించిరి.

అవతారిక (107) మౌనమును గురించి 3 శ్లోకములలో చెప్పుచున్నారు.

యస్మాత్ వాచోనివర్తంతే అప్రాప్య మనసా సహ।
యన్మౌనం యోగిభిర్గమ్యంతత్ భవేత్ సర్వదా బుధః॥ 107

తాత్పర్యము :

దేనినుండి వాక్కులు మనస్సుతో గూడ పొందనేరక నివర్తిల్లునో ఏది వాక్కులచే చెప్పను మనస్సుచే దలంపను అలవిగాదో బ్రహ్మజ్ఞానులచే తెలియదగినదో— అది మౌన మనబడును.

ఎల్లప్పుడును బుధుడు అదియే కావలయును, అదియే నేనని, అనుకరింప వలయును.

విశేషములు :

జాతి క్రియాగుణ శూన్యమైనది పరమాత్మ కాబట్టి—జాతిక్రింద గుణములు గల లోకపదార్థములను బోధించు శక్తిగల శబ్దములు - పరమాత్మను గురించి వివారణ

జరుగు సమయమున - వీటి ప్రయోజనము లేదు. లోకము స్వతః ఏమియు కలది కాదు. దానిని గురించి వాక్కు వ్యర్థము చేయనక్కరలేదు.

వాచో యస్మాత్ నివర్తంతే తత్ వక్తుంకేనశక్యతే।
ప్రపంచో యది వక్తవ్యః సోఽపి శబ్ద వివర్జితః॥ 108

ఇతివా తత్ భవేత్ మౌనం సతాం సహజ సంజ్ఞితమ్।
గిరా మౌనంతు బాలానాం ప్రయుక్తం బ్రహ్మవాదిభిః॥ 109

తాత్పర్యము :

వాక్కులు దేనినుండి నివర్తిల్లుచున్నవో దాని జెప్పుటకు ఎవ్వనికి శక్యమగును? ప్రపంచమును చెప్పవలయునేని అదియు బ్రహ్మరూపమే యగుటవలన శబ్దవర్జితము - అని జ్ఞానులకు సహజమైన స్థితి యేది గలదో అదియు మౌనమగును. వాఙ్మనమో మూఢులకని బ్రహ్మవాదులచే చెప్పబడినది.

అవతారిక : (110-వ శ్లోకము)

దేశరక్షణమును చెప్పుచున్నారు-

ఆదౌ అంతేచ మధ్యేచ జనోయస్మిన్ నవిద్యతే।
యేనేదం సతతం వ్యాప్తం స దేశో విజనః స్మృతః॥ 110

తాత్పర్యము :

ఆదిని అంతమునకు మధ్యమునను జనము దేనియందు లేదో దీనిచే నిది యెల్లప్పుడు వ్యాపింపబడినదో అది—అట్టి బ్రహ్మము నిజమైన దేశమని చెప్పబడినది.

విశేషములు :

జనంలేని చోటు లోకంలోని నిర్జనప్రదేశమయితే పరమాత్మయందు ఆద్యంత మధ్యకాలములందు జనం లేదు. అది విజనమైన దేశము.

నిర్గుణ ధ్యానమును గురించి చెప్పుచున్నారు. కాబట్టి అందుకు సముచితముగా సాధనలను నిర్గుణమునకు అనుకూలముగా చెప్పుచున్నారు.

అవతారిక:

కాల లక్షణము చెప్పుచున్నారు.

కలనాత్సర్వ భూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః।
కాల శబ్దేనా నిర్దిష్టోహః ఖణ్డానన్దకోఽద్వయః॥ 111

తాత్పర్యము:

బ్రహ్మాది సర్వభూతముల యొక్కయు సృష్టి స్థితి ప్రళయముల కాధారము నిమిష మాత్రమునే అగుచున్నది. కావున అఖండము అద్వితీయము ఆనందరూప మగు బ్రహ్మమే కాల మని చెప్పబడును.

అవతారిక:

ఆసన లక్షణము చెప్పుచున్నారు.

సుఖేనైవ భవేద్య స్మిన్నజస్రం బ్రహ్మ చింతనమ్।
ఆసనం తద్విజానీయాన్నేతరత్సుఖ నాశనమ్॥ 112

తాత్పర్యము:

ఏ సుఖరూపమైన బ్రహ్మమునందు దీనిని చేయవలయును, దీనిని చేయ కూడదు అను చింత లేకుండునో అట్టి బ్రహ్మతత్త్వమే ఆసనమని గ్రహింప వలెను. సుఖనాశనమైన యితర ఆసనములు బ్రహ్మభేద సృష్టిహేతువులు — ఆసన ములు కావు.

విశేషములు:

ద్వైతదృష్టి యున్నవానికి ఏది చేసిన సుఖము ఏది చేసిన దుఃఖము — అన్న చింతన - ఆలోచన వుండును. అద్వితీయ పరబ్రహ్మనిష్ఠ కలిగినవానికి ఏ చింత యుండదు. అట్టివాడు పరమాత్మైక్య ధ్యానమం దుండును. అప్పుడంతయు బ్రహ్మమే.

అవతారిక:

సిద్ధాసన లక్షణము చెప్పుచున్నారు.

సిద్ధం యత్సర్వ భూతాని విశ్వాధిష్ఠాన మవ్యయమ్।
యస్మిన్ సిద్ధాసమా విష్టాస్తద్వై సిద్ధాసనం విదుః॥ 113

తాత్పర్యము :

సర్వభూతములకును ఆదియై ప్రపంచమునకు అధిష్ఠానమై నాశరహితమై నిత్యసిద్ధమైన ఏ బ్రహ్మతత్వమునందు సిద్ధులు - జ్ఞానులు - ఐక్యము నొందిరో అట్టి బ్రహ్మము సిద్ధాసనమని యెరింగిరి.

అవతారిక:

మూలబంధమునకు లక్షణము చెప్పుచున్నారు.

యన్మూలం సర్వభూతానాం యన్మూలం చిత్త బంధనం।
మూల బంధః సదాసేవ్యో యోగ్యోఽసౌరాజ యోగినామ్॥ 114

తాత్పర్యము:

ఏ బ్రహ్మతత్త్వము ఆకాశాది సర్వభూతములకును మూలమో — మనస్సునకు కారణమైన అజ్ఞానమునకున్నూ ఏ బ్రహ్మతత్త్వము అధిష్ఠానముగా నున్నదో అట్టి బ్రహ్మమే మూలబంధము. దానిని ఎల్లప్పుడు సేవింపవలయును. అది రాజ యోగులకు యోగ్యము.

విశేషములు:

సహజమయిన విక్షేపశూన్యత బ్రహ్మావస్థితిచేతనే కలుగునని భావము.

అవతారిక: (115-వ శ్లో.)

దేహసామ్యమునకు లక్షణము.

అంగానాం సమతాం విద్యాత్సమే బ్రహ్మణిలీయతే।
నోచేన్నైవ సమానత్వం ఋజుత్వం శుష్కవృక్షవత్॥ 115

తాత్పర్యము:

శరీరముయొక్క అంగములైన పాదములు హస్తములు మొదలగు అవయవములను అధిష్ఠానమగు, సర్వసమమగు బ్రహ్మరూపముగా చింతించి — ఆ యా అవయవము లందు చంచలత్వము — అనగా విషయము లందు ప్రవర్తించుట లేకుండా చేయుటయే దేహసామ్యము. శరీరాంగములందు బ్రహ్మభావన చేయనిదే యింద్రియ చాంచల్యము పోదు. అది పోకున్నయెడల యెండిన చెట్టునకువలె ఋజుభావము కలుగనే కలుగదు.

అవతారిక : (116 వ శ్లోకమునకు)

దృక్స్థితి లక్షణము.

దృష్టిం జ్ఞానమయీం కృత్వాపశ్యేద్బ్రహ్మమయంజగత్।
సాదృష్టిః పరమోదారా న నాసాగ్రావలోకినీ॥ 116

తాత్పర్యము :

అంతఃకరణ వృత్తిని జ్ఞానమయముగా - అఖండ బ్రహ్మాకారమునుగా జేసి జగత్తును బ్రహ్మమయమునుగా జూడవలయును. అది మిక్కిలి ఉత్తమమైనది. నాసాగ్రమును జూచు దృష్టి ఉత్తమము కాదు.

ద్రష్టృదర్శన దృశ్యానాం విరామోయత్త్రవాభవత్।
దృష్టిస్తత్రైవ కర్తవ్యా ననాసాగ్రావలోకినీ॥ 117

తాత్పర్యము :

ద్రష్ట, దర్శనము, దృశ్యము అను త్రిపుటికి విలయము దేనియందు — ఏ బ్రహ్మమునందగునో — ఆ బ్రహ్మమునందు వృత్తి యేది కలదో అది చేయవలసిన దృష్టి. నాసాగ్రము చూచునది కాదు.

విశేషములు :

ప్రపంచమంతయు బ్రహ్మమే అయినను ఇంద్రియగోచరము కానప్పుడు ఇంద్రియముల దృష్టి బ్రహ్మమునందుంచుట ఎట్లనగా — చూచేవాడు చూచు చూపు చూడబడేది అను త్రిపుటి ఏ బ్రహ్మయందు లయించునో అట్టి బ్రహ్మయందు అంతఃకరణ వృత్తిని నిలుపుటయే దృష్టి. అంతేకాని నాసాగ్రమునందు కంటి చూపును నిలుపుట కాదు. అన్ని వ్యాపారములను వదలి బ్రహ్మయందే మనస్సును ఏకాగ్రతగా నిలుపుట యన్న మాట.

చిత్తాది సర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్।
నిరోధ స్సర్వవృత్తీనాం ప్రాణాయామస్స ఉచ్యతే॥ 118

తాత్పర్యము :

చిత్తము మొదలగు సర్వభావములందును (మనోవృత్తులందు) బ్రహ్మస్వరూప భావనము చేయవలయును. అట్టి భావన వలన కలుగు సహజమైన సర్వవృత్తి నిరోధ మేది కలదో అది ప్రాణాయామ మని చెప్పబడును.

విశేషములు :

పాతంజల యోగసూత్రములందు చెప్పబడిన ప్రాణనిరోధమును ఇచట గ్రహించరాదు.

అవతారిక :

రేచకపూరకముల లక్షణము.

నిషేధనం ప్రపంచస్యరేచకాఖ్యస్సమీరణః।
బ్రహ్మైవాస్మీతి యావృత్తిః పూరకోవాయురీరితః॥ 119

తాత్పర్యము :

పాతంజలమున మనోనిగ్రహమునకు సాధనముగా ప్రాణాయామము కలదు. అందు రేచక, పూరక, కుంభకము అను ప్రాణాయామ విధానము యోగసూత్రము లందు వివరింపబడినది. శ్రీ భగవత్పాదులవారు అద్వైతసిద్ధికి అనుకూలముగా రేచక పూరకములను మరొక విధముగా చెప్పుచున్నారు.

బ్రహ్మకంటె మరొకటి లేదని ప్రపంచమును నిషేధించుట అనగా త్యజించుట, విడచుట, రేచకము (ప్రాణాయామము) నేను బ్రహ్మమేనను వృత్తి యేది కలదో అది పూరక ప్రాణాయామము.

అవతారిక :

కుంభకలక్షణము.

తతస్త ద్వృత్తి నైశ్చల్యం కుంభకః ప్రాణసంయమః।
అయం చాపి ప్రబుద్ధానామ జ్ఞానాం ఘ్రాణపీడనమ్॥ 120

తాత్పర్యము :

నేను బ్రహ్మ నైతినన్న బ్రహ్మాకార వృత్తిని నిశ్చలముగా నుంచుకొనుటయే కుంభకము. ఈ త్రివిధ ప్రాణాయామము (రేచక, పూరక, కుంభక) ఉత్తమ జ్ఞానులకు, ముక్కుతో చేయు ప్రాణాయామము అజ్ఞానులకు.

అవతారిక : (121-వ శ్లోకమునకు)

ప్రత్యాహార లక్షణము.

విషయే ష్వాత్మ తాందృష్ట్వా మనసశ్చితి మజ్జనం।
ప్రత్యాహారస్స విజ్ఞేయోఽభ్యసనీయో ముముక్షుభిః॥ 121

తాత్పర్యము :

ఇంద్రియములకు విషయములగు వాని యందన్నిటియందు ఆత్మభావమున సచ్చిదానంద రూపత్వమున దృష్టి నిలిపి మనస్సును పరమాత్మ స్వరూపముగా నుంచుటయే ప్రత్యాహారము అందురు. అనగా నామరూపాది భేదవృత్తి శూన్యతమైన మనస్సును పరమాత్మయందు లయింపజేయుట. ఇట్టి ప్రత్యాహారమునే మోక్షమును కోరువారు - ముముక్షువులు అభ్యాసము చేయవలెను.

అవతారిక : (122-వ శ్లోకమునకు)

ధారణాలక్షణము.

యత్ర యత్ర మనోయాతి బ్రహ్మ స్తత్ర దర్శనాత్।
మనసోధారణం చైవ ధారణా నాపరామతా॥ 122

తాత్పర్యము :

ఏఏ పదార్థములందు మనస్సు ప్రసరించునో అచ్చటచ్చట - ఆయా పదార్థములందు బ్రహ్మమునే చూచుటవలన మనస్సును నిలుపుటయే ధారణ. ఇది ఉత్తమమైన ధారణ.

విశేషములు :

పాతంజల యోగములందు చెప్పబడిన ధారణయు, మూలాధారాది షట్చక్రములందు చేయు ధారణయు జ్ఞానులకు కావనియు మందాధికారుల కనియు తెలియవలెను.

అవతారిక : (123-వ శ్లోకమునకు)

ఆత్మధ్యాన లక్షణము.

బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యానిరాలంబతయా స్థితిః।
ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానందదాయినీ॥ 123

తాత్పర్యము :

బ్రహ్మమే నేను అను అబాధితమయిన వృత్తిచే నిరాలంబముగా దేహాద్యనుసంధానము లేకయుండుటయే ధ్యానము. అది పరమానందము నిచ్చును.

అవతారిక : (124 శ్లోకమునకు) సమాధి లక్షణము.

నిర్వికారతయావృత్త్యా బ్రహ్మాకారతయా పునః।
వృత్తి విస్మరణం సమ్యక్ సమాధిర్జ్ఞాన సంజ్ఞకః॥ 124

తాత్పర్యము :

చిత్తమును వృత్తిరహితము అనగా ప్రాపంచిక విషయ గోచరత్వము లేకుండా చేసి - ఆత్మధ్యానము చేయుచు, అట్లు ధ్యానము చేయుచున్నానన్న వృత్తినికూడ మరచుట - ధ్యాత, ధ్యానం, ధ్యేయం అను త్రిపుటిని కూడ విస్మరించుట - సమాధి. త్రిపుటిని మరచినప్పుడు మనస్సు బ్రహ్మాకారముగనే యుండును. కావున సమాధి జ్ఞానరూపమే.

విశేషములు :

ఇట్లు విస్మరించి యుండుటను - నిద్రను - భిన్నములని గ్రహించవలెను. నిద్రయందు అజ్ఞానతిమిర మున్నది. సమాధియందు ఆత్మ యున్నది. ఆనందమైన ఆత్మతేజస్సున్నది. నిద్రకు సమాధికి పొంతనము లేనేలేదు.

అవతారిక : (125 వ శ్లోకమునకు)

సమాధియందు అనుభవమైన ఆనందము - బాహ్యవస్తువుల జాగ్రత్స్వప్న అవస్థలందు కలుగు సుఖానుభవము వంటిది కాదు. గాఢనిద్ర యందు సుఖానుభూతియు కాదు. ఆనందమైన ఆత్మయొక్క స్వస్వరూప వికసనమే.

ఇమం చాకృత్రిమానందం తావత్ సాధు సమభ్యసేత్।
వశ్యో యావత్క్షణాత్ పుంసః ప్రయుక్తః సన్ భవేత్ స్వయమ్॥ 125

తాత్పర్యము :

ఈ స్వరూపానందమును - స్వరూపానంద హేతువైన యీ పంచ దశాంగ విశిష్టమగు నిధి ధ్యానమును, అధికారియగు వాడు, ఆ యానందము తనకు వశ్యమైన క్షణంబున తనకు తానే మిక్కిలి రూఢమై స్ఫురించువరకు చక్కగా నభ్యసింప వలయును.

అవతారిక : (126 వ శ్లోకమునకు)

ఆనందానుభూతి కలిగిన తరువాత సాధన ఆవశ్యకత లేదని చెప్పుచున్నారు.

తతస్సాధన నిర్ముక్తి స్సిద్ధో భవతి యోగిరాట్।
తత్స్వరూపం నచైతన్య విషయోమనసోగిరామ్॥ 126

తాత్పర్యము :

ఆ తరువాత సాధనాభ్యాసము అక్కఱలేనివాడై సిద్ధుడు యోగిరాజు అగుచున్నాడు. ఆ బ్రహ్మము వీనికి స్వరూపమే అగుచున్నది. అందుచేత మనస్సునకు మాటకును విషయముకాదు. అవాఙ్మానస గోచరమగుటవలన మనస్సుచే మననము చేయుట మాటలతో పురశ్చరణాదులు చేయుట వలసినది లేదు.

అవతారిక : (127 వ శ్లోకమునకు)

సాధనామార్గమున సమాధి చేరుటకు యెన్నో అవాంతరములు అడ్డు తగులు చుండును. వాటిని పట్టుదలతో అధిగమించవలెను గాని నిరుత్సాహపడరాదని ఆచార్యులవారు హెచ్చరించుచున్నారు.

సమాధౌక్రియ మాణేతు విఘ్నా న్యాయాన్తివై బలాత్।
అనుసంధాన రాహిత్యం ఆలస్యం భోగలాలసమ్॥ 127

లయస్తమశ్చ విక్షేపో రసాస్వాదశ్చ శూన్యతా।
ఏవం యద్విఘ్న బాహుల్యం త్యాజ్యం బ్రహ్మవిదా శనైః॥ 128

తాత్పర్యము :

సమాధి లభింపబోవునపుడు అనగా అభ్యసించునపుడు బలాత్కారమున విఘ్నములు వచ్చును. అనుసంధానము తప్పుట, అలసత (అలస్యమగుట) భోగేచ్ఛ కలుగుట, నిద్రవచ్చుట, ఏమి చేయవలెనో ఏమి చేయకూడదో తెలియకుండా పోవుట ప్రపంచ విషయములందు రసాస్వాదన లోలుపత, ధన్యుడనైనానని తృప్తికలుగుట మొదలగునవి విఘ్నములు. ఇట్టి అనేక విఘ్నములను బ్రహ్మవిదుడు క్రమతో తొలగించుకొనవలెను.

అవతారిక: (129 వ శ్లోకమునకు)

మానవుని సమున్నత స్థానమునకు తీసికొని పోవుటకుగాని - కూలద్రోయుటకు గాని - అతని మనస్సులోని ఆలోచనలే - మనోవృత్తియే కారణము. అవి శ్రీ భగవత్పాదులు ఆరు శ్లోకములలో వివరించుచున్నారు.

భావవృత్త్యాహి భావత్వం శూన్యవృత్త్యాహి శూన్యతా।
బ్రహ్మ వృత్త్యాహి పూర్ణత్వం తథా పూర్ణత్వ మభ్యసేత్॥ 129

తాత్పర్యము :

ఘటాది భావాకారవృత్తి చేతనేకదా భావమయత్వము కలుగును. శూన్య వృత్తి చేతనేకదా శూన్యత - జడత్వము కలుగును. బ్రహ్మాకార వృత్తి చేతనే పూర్ణత్వము సిద్ధించును. అందుచేత భావవృత్తిని శూన్యవృత్తిని విడచి పూర్ణత్వమునే అభ్యసింపవలెను.

విశేషములు :

మనోవృత్తియే బంధమోక్ష కారణమని విశదీకరింపబడినది.

యేహి వృత్తిం జహత్యేనాం బ్రహ్మాఖ్యాం పావనీంపరాం।
వృథైవతేతు జీవన్తి పశుభిశ్చ సమానరాః॥ 130

తాత్పర్యము :

పావనము, పరమము అగు యీ బ్రహ్మాకార వృత్తిని విడచి ఎవ్వరు జీవించి యున్నారో అట్టివారు వ్యర్థజీవులు. పశువులతో సమానులు.

యేహివృత్తిం విజానంతి జ్ఞాత్వాపివర్ధయంతి యే।
తేవై సత్పురుషాధన్యా వంద్యాస్తే భువనత్రయే॥ 131

తాత్పర్యము :

ఈ వృత్తిని ఎవ్వరు యెఱుంగుచున్నారో, దీని నెఱింగి ఎవ్వరు వృద్ధిపొందు చున్నారో వారే సత్పురుషులు- ధన్యులు. వారు మూడు లోకములందును నమస్కరింపదగినవారు.

యేషాం వృత్తిస్సమావృద్ధా పరిపక్వాచ సాపునః।
తేవై సద్బ్రహ్మతాం ప్రాప్తానేతరే బ్రహ్మవాదినః॥ 132

తాత్పర్యము :

ఎవరి యందీ బ్రహ్మాకార వృత్తి సమముగా వృద్ధినిపొంది పరిపక్వమగునో ఆ మహానుభావులు బ్రహ్మరూపు లగుదురు. అనగా ముక్తులు. కాని వ్యర్థముగా మాటలు చెప్పువారిట్టి స్థితిని పొందరు.

కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనా స్సురాగిణః।
తేప్యజ్ఞాన తయానూనం పునరాయాంతి యాంతిచ॥ 133

తాత్పర్యము :

బ్రహ్మతత్వ మిది యని ఉపన్యాస ప్రవచనములు చేయుటయందు నేర్పరులై, బ్రహ్మాభ్యాస వృత్తి లేనివారై విషయ వాంఛలు కలవారై - యెవ రున్నారో - అట్టి వారుకూడ అజ్ఞానులే. వాస్తవము. వారును మరల మరల జనన మరణములను పొందుచుందురు.

నిమేషార్థం నతిష్ఠన్తి వృత్తిం బ్రహ్మమయీం వినా।
యథాతిష్ఠంతి బ్రహ్మాద్యా సనకాద్యాశ్శుకాదయః॥ 134

తాత్పర్యము :

బ్రహ్మాది దేవతలును సనక, సనందన, సనాతన సనత్కుమారులు, శుక మహర్షి మొదలగు వారివలె జ్ఞాననిష్ఠులైనవారు అర్ధనిమిషము కూడ వ్యర్థము చేయ కుండా బ్రహ్మాకార వృత్తిలోనే వుందురు.

అవతారిక : (135 వ శ్లోకమునకు)

రాజయోగమును వివరించిన శ్రీ భగవత్పాదులు మరల బ్రహ్మవిచారము యొక్క ప్రాముఖ్యతను తెలుపుచు అది కైవల్యమయిన మోక్షమునకు అనుల్లంఘ నీయమైన ప్రథమ సోపానమని చెప్పుచున్నారు. ఇదే విషయమును గ్రంథాదియందు ముఖ్యముగా 10, 16 శ్లోకములందు వివరించి యున్నారు. ప్రపంచమున బ్రహ్మము కంటె వేరుగా అవగాహన చేసుకొనుటకై అది బ్రహ్మము ఉపాదాన కారణముగా వెలువడినదని చెప్పినప్పటికి - నిజముగా సృష్టికి కారణమగుట బ్రహ్మము యొక్క లక్షణము కాదని - లోక వ్యవహారికముగా అట్లు చెప్పబడుచున్నదే కాని - పారమార్థిక ముగా కారణము కాదని చెప్పుచున్నారు.

కార్యేకారణతాయాత కారణేనహి కార్యతే।
కారణత్వం తతోగచ్ఛేత్కార్యా భావేవిచారతః॥ 135

తాత్పర్యము :

కార్యమునందు కారణత్వము తెలియవచ్చినది. కారణమునందో కార్యత్వము కనబడదు కదా. అందువలన విచారమువలన కార్యము లేనియపుడు కారణత్వము నశించును.

అనగా కుండలు మొదలగు వస్తువులను—కార్యమును—చూచునపుడు— కుండలు మొదలగునవి కార్యమనియు వాటియందు మన్ను అవగతమై యుండుటచేత

మృత్తిక (మన్ను) కారణమనియు బుద్ధి కలుగుచున్నది. అయితే కుండలు మొదలగు వాటియందు మన్ను తప్ప వేరొక వస్తువు లేకుండుట నెఱిగి అది మృత్తికామాత్ర మని కేవల కారణమునే గ్రహించినపుడు వస్తువు లేకుండుట నెఱిగి అది మృత్తికా మాత్రమని కేవల కారణమునే గ్రహించినపుడు ఘటాదికార్యము తోచదు. ఇట్లు విచారింపగా ఘటాది కార్యమే లేకపోవుటవలన మృత్తికకు కారణత్వము కూడ నశించును.

ఇదేవిధముగా ఆకాశాది కార్యదృష్టిచే తదనుగతమైన సచ్చిదానంద బ్రహ్మము నకు కారణత్వము వచ్చుచున్నది. కారణమైన బ్రహ్మమును చూచునపుడు కారణ సత్త తప్ప కార్యమునకు వేరు సత్త లేకపోవుటచేత ఆకాశాది కార్యము తోచదు. ఇట్లు కార్యమే లేకపోవుటవలన కార్యబుద్ధి సాపేక్షమైన కారణత్వము బ్రహ్మమున కుండదు.

అవతారిక : (136 వ శ్లోకమునకు)

కారణమైన మన్ను కార్యమైన కుండలో నున్నదిగాని కార్యమగు ఘటి యందు లేదు. విచారింపగా కార్యము కారణముకంటె అన్యముగా లేదు. అయితే దానికున్న ప్రత్యేకత నామరూపాత్మకమే గాని సత్యమునందు స్వతంత్ర స్థితి కాదు. అందుచేత అసలు ఘటికి ఏదో కార్యము సాధించినట్లు కారణత్వమును అంటగట్టుట కూడ అనవసరము. కాని కారణత్వము సాపేక్షమైనది. సహజమైనది కాదు. అదే విధముగా బ్రహ్మము సహజముగా కారణత్వము లేని శుద్ధము. గుణరహితము. ఈ భావమును చెప్పుచున్నారు.

> అథశుద్ధం భవేత్ వస్తుయత్ వైవాచామ గోచరమ్।
> ద్రష్టవ్యం మృత్ ఘటేనైవ దృష్టాంతేవ పునః పునః॥ 136

తాత్పర్యము :

(పై శ్లోకమునందు చెప్పిన విధముగా) కారణత్వము నివర్తిల్లగా — ఏది వాక్కుల కగోచరమై శుద్ధమై — కార్యకారణతా రహితమైన ప్రసిద్ధమైన వస్తువు గలదో ఆ బ్రహ్మమే అతడగును. అట్లు మరల మరల దృఢమగుటకై మృద్ఘట దృష్టాంతముచేతనే చూడవలయును.

> అనేనైవ ప్రకారేణ వృత్తి ర్బ్రహ్మాత్మికా భవేత్।
> ఉదేతి శుద్ధ చిత్తానాం వృత్తిజ్ఞానం తతః పరమ్॥ 137

తాత్పర్యము :

ఈ విధముగా బ్రహ్మాకారమైన వృత్తి కలుగును. ఇట్లు విచారము చేయుచుండగా పిమ్మట శుద్ధచిత్తులైనవారికి వృత్తిజ్ఞాన ముదయించును.

విశేషములు :

ఈ విచారము జ్ఞానమునకు సాధనమైన విధముగానే ధ్యానమునకు కూడ సాధనమగునని సూచింపబడినది. వృత్తిజ్ఞానము కలిగి బ్రహ్మరూప మగునని భావము. ముందు ధ్యానరూపము బ్రహ్మవిషయకవృత్తి—పిమ్మట తదభ్యాసపరీపాక వేళ అఖండాకారవృత్తి కలుగునని భావము.

కారణం వ్యతిరేకేణ పుమానాదౌ విలోకయేత్।
అన్వయేన పునః తద్ధికార్యే నిత్యం ప్రపశ్యతి॥ 138

తాత్పర్యము :

తత్వవిచారణము చేయునపుడు తొలుత కార్యము కారణము వేరులేదని విచారణ చేయవలెను. పిదప అన్వయముచే కార్యమునందా కారణమును ఎల్లప్పుడు చూడవలయును — కార్యమునందంతటను కారణమే అనుగతమై యున్నదని గ్రహించి ఆ కారణమునే చూడవలయును.

కార్యేహి కారణం పశ్యేత్పశ్చాత్కార్యం విసర్జయేత్।
కారణత్వం తతో గచ్ఛే దవశిష్టం భవేన్మునిః॥ 139

తాత్పర్యము :

కార్యమునందు—(ప్రపంచమునందు) కారణమునే (బ్రహ్మము) చూడవలయును. అనగా ప్రపంచమ బ్రహ్మమేనని విచారింపవలెను. పిమ్మట కార్యమును విసర్జింపగా బ్రహ్మయొక్క కారణత్వము పోవుచున్నది. అప్పుడు అవశిష్టమైన శుద్ధ బ్రహ్మమే అగుచున్నాడు జ్ఞాని.

విశేషములు :

కార్యకారణాతీత బ్రహ్మమును మననము చేసిన జ్ఞాని బ్రహ్మరూపుడే అగునని భావము.

శ్లోకములు 138, 139, ముందు 135 శ్లోకమున చెప్పిన భావమునే వివరించుచున్నవి. బ్రహ్మమును తెలియుటకు ముందుగా నామరూపాత్మక ప్రపంచమున కది

కారణమని భావించి—ప్రపంచమును విశ్లేషించి పరిశీలింపగా దానికి స్వతంత్ర స్థితి లేదని—అసలు ఉనికి లేదని స్పష్టమగును. ప్రపంచ మిథ్యాత్వము బోధపడగా బ్రహ్మ నిత్యత్వము తెలియును.

అవతారిక : 140 వ శ్లోకమునకు)

అపరోక్ష జ్ఞానమువలన కలుగు స్థితిని చెప్పుచున్నారు.

భావితం తీవ్రవేగేన వస్తుయత్ నిశ్చయాత్మనా।
పుమాన్ తద్భిభవేత్శీఘ్రం జ్ఞేయం భ్రమర కీటవత్॥ 140

తాత్పర్యము :

తీవ్రమైన వేగముతో నిశ్చయబుద్ధి కలిగి పురుషుడు ఏ వస్తువును భావన చేయునో—జ్ఞేయంబగు ఆ వస్తువుగానే శీఘ్రముగా నగును. అదెట్లనగా భ్రమరము ఒక విధమైన పురుగును తెచ్చి తన స్థానమందుంచి ఆ పురుగుచుట్టును తిరుగుచు రొద చేయుచుండగా ఆ కీటకము (పురుగు) భయముతో ఆ భ్రమరమునే ధ్యానించు చుండుటవలన తానును భ్రమరమే అగును—అదేవిధముగా పరోక్షజ్ఞానము గలవాడు తీవ్రముగా నిశ్చయ బుద్ధితో బ్రహ్మజ్ఞానము సంభావించినప్పుడు అపరోక్షవృత్తి కలిగి తద్వారా బ్రహ్మరూపు డగునని భావము.

అవతారిక : (141-వ శ్లోకమునకు)

తీవ్రవేగముగా చేయవలసిన భావనను గురించి చెప్పుచున్నారు.

అదృశ్యం భావరూపంచ సర్వమేవ చిదాత్మకమ్।
సావధానతయా నిత్యం స్వాత్మానం చైవ భావయేత్॥ 141

తాత్పర్యము :

ద్రష్టను, దృశ్యమును, దర్శనమును—(ప్రత్యక్ష పరోక్షములుగా) అగు త్రిపుటి రూపమున నున్న జగత్తు అంతయు ఆత్మారోపితమే కావున—ఆరోపితము అధిష్ఠానము కంటె భిన్నముగా లేదు గనుక—సమస్తమును తన్నును చిదాత్మక ముగా—చిదాత్మకునిగా నిత్యము సావధానముగా భావింపవలయును.

విశేషములు :

చకారమువలన (భావరూపంచ) త్రిపుటిలో —ద్రష్ట—దృశ్యముతోపాటు దర్శనము కూడ గ్రహింపవలెను.

అవతారిక : (142 వ శ్లోకమునకు)

బ్రహ్మకార్యమును గూర్చి చెప్పుచున్నారు.

దృశ్యం హ్య దృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చింతయేత్।
విద్వాన్నిత్య సుఖేతిష్ఠేత్ ధియాచిద్రసపూర్ణయా॥ 142

తాత్పర్యము :

దృశ్యమైన ప్రపంచమును—దానియొక్క నామరూపత్వమును విస్మరించి అది అదృశ్యమైన బ్రహ్మయేనని నిశ్చయించి సర్వమును బ్రహ్మాకారముగా చింతింప వలయును. విద్వాంసుడు తాను చిదానంద పరిపూర్ణవృత్తితో నిత్యసుఖంబునం దుండ వలెను.

అవతారిక : (143 వ శ్లోకమునకు)

రాజయోగ సాధనము చెప్పుచున్నారు.

ఏభిరంగై స్సమాయుక్తో రాజయోగ ఉదాహృతః।
కించిత్పక్వ కషాయాణాం హఠయోగేన సంయుతః॥ 143

తాత్పర్యము :

ఈ పదునైదు అంగములతో గూడిన రాజయోగము అపరోక్షానుభూతికి సాధనముగా చెప్పబడినది. కొంచెము పక్వమైన చిత్తము కలవారికి—సరిగా పక్వము కాని చిత్తము గలవారికి హఠయోగముతో (పతంజలి ప్రోక్తమైన అష్టాంగ యోగము) కూడిన యీ తత్వనిష్ఠయే పరమార్థ సాధనకు ఉపాయము.

అవతారిక : (144 వ శ్లోకమునకు)

రాజయోగము సులభతరమైన దని చెప్పుచున్నారు.

పరిపక్వం మనోయేషాం కేవలోయంచ సిద్ధిదః।
గురుదైవత భక్తానాం సర్వేషాం సులభోజవాత్॥ 144

తాత్పర్యము :

మనస్సు చక్కగా పరిపక్వమైనవానికి పాతంజలమగు హఠయోగమూయొక్క అపేక్ష లేకుండానే యీ రాజయోగము సిద్ధిని లభింపజేయుచున్నది. గురుభక్తి, దైవ

భక్తి కలవారందరకు వారు వీరను భేదము లేకుండా—శీఘ్రముగా యీ రాజ యోగము ఫలప్రదము—సులభము.

విశేషములు :

పరిపక్వమయిన మనస్సు కలవారనగా రాగద్వేషములచే మాలిన్యమైన మన స్థితి పోగొట్టుకున్నవారికి.

అందరకు అనగా—అన్నివర్ణములవారికి అన్ని ఆశ్రమములవారికి—స్త్రీలకు; పురుషులకు. ఈ సాధనకు ఆవశ్యకమైనది గురుభక్తి; దైవభక్తి—లేక గురురూపు డైన దైవమునందు భక్తి—

అవతారిక : (145 వ శ్లోకమునకు)

ఈప్రకరణ గ్రంథమును ఉపసంహరింపబోవుచు జ్ఞాని మహిమను సంగ్రహ ముగా చెప్పుచున్నారు.

తీర్థేఽథవా శ్వపచ గృహేవా నష్ట స్మృతిర్వాపరిత్యజన్ దేహమ్।
జ్ఞాన సమకాలముక్తః కైవల్యం యాతి విగతశోకః॥ 145

తాత్పర్యము :

జ్ఞాని పుణ్యక్షేత్రమునందుగాని—చండాల గృహమునందుగాని స్మృతి నశిం చినవాడై గాని దేహము విడిచినను—జ్ఞాన మున్నవా డగుటచేత—ఆ జ్ఞానము ఉదయించినప్పుడే ముక్తుడై సంసార శోకము వీడినవా డగుటవలన మోక్షమును పొందుచున్నాడు.

అవతారిక (146-వ శ్లోకమునకు)

దేహపతన కాలమున జ్ఞాని స్థితిని గూర్చి చెప్పుచున్నారు.

రథ్యాంతరే మూత్రపురీష మధ్యే చండాల వేశ్మన్యథవాశ్మశానే।
కృత ప్రయత్నోఽప్యకృత ప్రయత్నో దేహావ సానేచ మోక్షమ్॥ 146

తాత్పర్యము :

మార్గ మధ్యముననో మలమూత్రములలోనో, చండాల గృహముననో, శ్మశా నములనో—జ్ఞాని పడియుండిన — ప్రయత్నము చేసినను, చేయకున్నను — దేహావసాన కాలమున మోక్షము పొందుచున్నాడు.

విశేషములు :

'చ' కారము ప్రయోగింపబడుటచే అతడు దేహ మున్నప్పుడే ముక్తుడని తాత్పర్యము. జీవన్ముక్తుడు కాబట్టి దేహావసాన కాలమున నెచ్చట నున్నాడన్న పరిశీలన అవసరము కాదు.

అవతారిక : (147-వ శ్లోకమునకు)

జ్ఞానియొక్క ప్రవర్తనను గూర్చి చెప్పుచున్నారు.

అతివాదాం స్తితిక్షేతనాఽవ మన్యేత కించన।
నచైవ దేహమాశ్రిత్య వైరం కుర్యాచ్చ కేనచిత్॥ 147

తాత్పర్యము :

జ్ఞాని—అతివాదములను—తన్ను గురించి లోకమునం దితరు లాడుకొను వాక్యములను షట్టించుకొనడు. ఏ వస్తువు నైనను—శుభమును గాని అశుభమును గాని అభిమానింపడు. సమముగా నెంచును. మరియు దేహము నాశ్రయించి దానికి బాధక మని దేనితోను—శీతోష్ణాధికముతో—వైరము చేయడు.

నకుర్యాన్నవ దేత్కించి న్నధ్యాయేత్యాద్వసాధుము।
ఆత్మారామోఽనయావృత్త్యా విచరేజ్జడ వన్మునిః॥ 148

తాత్పర్యము :

మంచినిగాని చెడ్డనిగాని ఏమి ప్రాప్తించినను జ్ఞాని పూరకుండును. ఏమియు చేయడు. ఏమియు పలకడు. ఏమియు ఆలోచింపడు. అతడు ఆత్మారాముడై యీ వృత్తిచేత జడవస్తువువలె చరించుచుండును.

విశేషములు :

జడపదార్థము—ఆలోచనాది మనోవృత్తులు లేక పరుద్దేశముగా ఎట్లుండునో అట్లు వర్తించును.

అవతారిక: (149-వ శ్లోకమునకు)

జ్ఞానికి కలుగు లాభములను చెప్పుచున్నారు.

అకించనస్య దాంతస్య శాంతస్య సమచేతసః।
మయా సంతుష్ట మనసస్సర్వ సుఖమయాదిశః॥ 149

తాత్పర్యము :

జ్ఞాని నిర్ధనుడు—ఏమియు లేనివాడు. అంతరింద్రియ నిగ్రహము కలవాడు. బహిరింద్రియ నిగ్రహము కలవాడు. సర్వత్ర సమమైన మనస్సు కలవాడు. గురూప దేశముచేత సంతుష్టమైన మనస్సు కలవాడు, అట్లున్న అతనికి సర్వదిక్కులందు సుఖమయముగానే వుండును.

నిర్వాసనో నిరాలంబ స్స్వచ్ఛందో ముక్త బంధనః।
క్షితౌ సంస్కారవాతేన చేష్టతే శుష్కపర్ణవత్॥ 150

తాత్పర్యము :

జ్ఞాని వాసనారహితుడై—ఆశ్రయ హీనుడై తన్ను తాను స్వాధీనము నందుంచుకొన్నవాడై వదలిపెట్టబడిన బంధములు కలవాడై—పూర్వజన్మ సంస్కార మున్న వాయువుచేత భూమియందు ఎండుటాకువలె చరించుచుండును.

విశేషములు :

ఎండుటాకు—ఎండి చెట్టునుండి రాలిపోయిన ఆకు—గాలివలన ఎట్లు కొట్టు కొని పోవుచుండునో (అప్పు డా ఎండుటాకునకు సుఖదుఃఖము లేమియు లేవు) అదే విధముగా జ్ఞాని దేహము లోకమున చరించుచుండినను అతనికి సుఖము దుఃఖము మొదలగు ప్రపంచ సంబంధము లేమాత్రము లేవు.

అవతారిక : (151 వ శ్లోకమునకు)

మోక్షమును గురించి చెప్పుచున్నారు.

మోక్షస్యనహివాసోఽప్తి నగ్రామాంతరమేవవా।
అజ్ఞాన హృదయగ్రంథి నాశోమోక్షస్సద్భిరుచ్యతే॥ 151

తాత్పర్యము :

మోక్షమునకు గృహము లేదు కదా! గ్రామాంతరమును లేదు. గృహాంతరము నకుగాని గ్రామాంతరమునకుగాని పోవుట మోక్షము కాదు. అజ్ఞాన రూపమైన హృదయగ్రంథియొక్క నాశమే—అజ్ఞాన నాశమే మోక్షమని సత్పురుషులచే చెప్ప బడుచున్నది. (అజ్ఞానము నశించినప్పుడే జ్ఞాని ముక్తుడయ్యెనని అందుచేత దేహావ సాన సమయమున (శ్లోకము 146) నెచ్చట నున్నను నొక్కటే యని స్పష్టము.

అహిమివ జనయోగం సర్వదా వర్జయేద్యః।
కుణపమివ సునారీం త్యక్తకామో విరాగే
విషమివ విషయాప్తిం మన్యమానో దురంతాః
జయతి పరమ హంసోముక్తిం భావం సమేతి॥ 152

తాత్పర్యము :

అభిలాషలను విడిచినవాడై విరక్తుడై జనసాంగత్యమును సర్పమును వలె ఎప్పుడు సర్వదా విడుచునో—సుందర స్త్రీని శవమువలె విడుచునో—అట్టి—పరమ హంస సమస్తమును సన్న్యసించినవాడు — సర్వోత్కృష్టుడై వర్తించుచున్నాడు. అతడు మోక్షమును పొందుచున్నాడు. (వైరాగ్య మున్నగాని జ్ఞానము సాధించుటకు వీలుకాదని ఉపదిష్టము.)

(అపరోక్షానుభూ సంపూర్ణము.)

(శ్రీః)



(కొన్ని ప్రతులందు 144 శ్లోకముతోనే ముగింపు కలదు)

# వేదాంతడిండిమము

అవతారిక: (1-వ శ్లోకమునకు)

వేదాంతమునందలి ముఖ్య భావములను ప్రకరణము గ్రంథముగా రచింప దలచి శ్రీ శంకర భగవత్పాదులు మంగళాచరణము చేయుచున్నారు.

వేదాంతడిండిమా స్తత్త్వమేక ముద్ఘోష యన్తియత్।
అస్తాం పురాస్తాత్తత్తేజో దక్షిణామూర్తి సంజ్ఞితమ్॥ 1

తాత్పర్యము:

వేదాంతములన్న డిండిమములు (భేరి-భేరులు) యేది యొక్కటే తత్వమని యుద్ఘోషించుచున్నవో - శ్రీ దక్షిణామూర్తి యన్న పేరుగల ఆ తేజస్సు (నా) ముందు నిలుచునుగాక।

విశేషములు:

వేదాంతముల యొక్క ఉద్ఘోష భేరి నాదములతో పోల్చి శ్రీ శంకర భగవత్పాదులు రూపకాలంకారముగా చెప్పినారు.

సర్వ మొక్కటేయైన తత్త్వమును శ్రీ భగవత్పాదులు దక్షిణామూర్తి తేజస్సుగా నిచ్చట సంభావించిరి. జ్ఞానమును బోధించు శ్రీ గురుమూర్తియైన దక్షిణామూర్తిని సాంకేతికముగా జ్ఞానరూపమని బ్రహ్మతత్త్వమని చెప్పిరి.

అవతారిక: (2-వ శ్లోకమునకు)

వ్యవహారిక జగత్తునందు రెండే పదార్థము లున్నవని చెప్పుచున్నారు.

ఆత్మాఽఽ నాత్మా పదార్థౌద్వౌ భోక్తృ భోగ్యత్వ లక్షణౌ।
బ్రహ్మైవాఽఽ త్మాన దేహాదిరితి వేదాంతడిండిమః॥ 2

తాత్పర్యము:

ఆత్మ అనాత్మ యని రెండు పదార్థములు. ఆత్మ భోక్త. అనాత్మ భోగ్యము. ఆత్మ బ్రహ్మమే అగును. దేహాదులు ఆత్మకాదు - అని వేదాంత డిండిమములు ఘోషించుచున్నవి.

విశేషములు:

ఆత్మ - చైతన్యము; అనాత్మ జడము, ఆత్మానాత్మ వివేకము వలన ఆత్మను గుర్తింపవలెను.

అవతారిక: (3-వ శ్లోకమునకు)

జ్ఞానాజ్ఞానములను గురించి చెప్పుచున్నారు.

జ్ఞానాఽజ్ఞానే పదార్థౌద్వౌ ఆత్మనో ముక్తిబంధదౌ।
జ్ఞానాన్ముక్తిర్నిబంధోఽ న్యాదితి వేదాంతడిండిమః॥ 3

తాత్పర్యము:

జ్ఞానము, అజ్ఞానము అను పదార్థములు రెండు. అజ్ఞానము ఆత్మకు బంధము నొసంగును. జ్ఞానము మోక్షము నొసంగును. జ్ఞానమువలననే మోక్షము కలుగుననియు యితరము — అజ్ఞానము వలన బంధమే యనియు వేదాంత డిండిమము.

విశేషములు:

భేరి మ్రోతగా చెప్పు మాటలు శ్లోకములందు చెప్పబడుచున్నవి. కావున నివి శాస్త్ర సారభూతములై — మహార్థగర్భితములైన వాక్యములే అని చెప్పబడుచున్నవి. 'జ్ఞానాదేవతు కైవల్యమ్' అన్న శ్రుతివాక్య భావన మీ శ్లోకమున ఘోషించుచున్నది.

అవతారిక:

జ్ఞాత జ్ఞేయములను గురించి చెప్పుచున్నారు.

జ్ఞాతృజ్ఞేయం పదార్థౌ ద్వే భాస్యభాసక లక్షణౌ।
జ్ఞాతా బ్రహ్మ జగత్ జ్ఞేయ మితి వేదాంతడిండిమః॥ 4

తాత్పర్యము:

జ్ఞాత జ్ఞేయము అని పదార్థములు రెండు. అందు జ్ఞేయము స్వప్రకాశము లేనిది. ప్రకాశింపచేయ దగినది. జ్ఞాత భాసకుడు ప్రకాశింపచేయువాడు. జ్ఞాతయే బ్రహ్మము. జ్ఞేయము జగత్తు అని వేదాంత డిండిమము.

విశేషములు:

మిథ్య యగు జగత్తును — సత్యమగు ఆత్మ — బ్రహ్మను గురించి చెప్పుచు వ్యావహారిక మెట్టిదో తెలిపిరి.

సుఖదుఃఖే పదార్థౌద్వౌ ప్రియవిప్రియకారకే।
సుఖం బ్రహ్మ జగ ద్దుఃఖ మితి వేదాంతడిండిమః॥ 5

తాత్పర్యము :

సుఖము దుఃఖము అను రెండు పదార్థములు. అందు సుఖము ప్రియమును దుఃఖము అప్రియమును కలుగజేయును. సుఖము బ్రహ్మమని, దుఃఖము జగత్తు అని వేదాంతడిండిమము.

సమష్టి వ్యష్టిరుపాద్వౌ పదార్థౌ సర్వసమ్మతౌ।
సమష్టి రీశ్వరో వ్యష్టిః జీవో వేదాంతడిండిమః॥ 6

తాత్పర్యము:

సమష్టి, వ్యష్టి అను రెండు పదార్థములు సర్వవిధములైన వాదములు చేయు వారికివి సమ్మతములు. సమష్టి ఈశ్వరు డని, వ్యష్టి జీవు డని వేదాంతడిండిమము.

జ్ఞాన కర్మ పదార్థౌద్వౌవస్తు కర్త్రాత్మ తంత్రకౌ।
జ్ఞానాన్మోక్షో న కర్మభ్యః ఇతి వేదాంతడిండిమః॥ 7

తాత్పర్యము:

జ్ఞానము కర్మము అని రెండు పదార్థములు. జ్ఞానము వస్తువున కధీనమగు కర్తృతంత్రము. జ్ఞానమువలననే మోక్షము లభించునుగాని కర్మము వలన కాదని వేదాంత డిండిమము.

శ్రోతవ్యాఽ శ్రావ్య రూపౌ ద్వౌపదార్థౌ సుఖదుఃఖదౌ।
శ్రోతవ్యం బ్రహ్మనైవాఽన్యదితి వేదాంతడిండిమః॥ 8

తాత్పర్యము:

శ్రవణము చేయవలసినది, శ్రవణము చేయగూడనిది — అని రెండు పదార్థములు. ఇందు మొదటిది సుఖ మిచ్చునది. రెండవది దుఃఖ మిచ్చునది. వినవలసినది బ్రహ్మమే. ఇతరము వినగూడదని వేదాంతడిండిమము.

విశేషములు:

శ్రవణము బ్రహ్మమును గురించియే. అది యొక్కటే సత్యము — ఉన్నది. లేనిదానిని గురించి — మిథ్యయగుదానిని గురించి విని యేమి ప్రయోజనము?

చిన్త్యాఽ చిన్త్యే పదార్థౌద్వౌ విశ్రాన్తి దాయకా।
చిన్త్యం బ్రహ్మపరం నాఽన్య దితి వేదాంతడిండిమః॥ 9

తాత్పర్యము:

చింత్యము అచింత్యము అని రెండు పదార్థములు. అందు మొదటిది విశ్రాంతి నిచ్చునది. రెండవది శ్రమ యిచ్చునది. చింత్యము పరబ్రహ్మమేగాని యితరము కాదని వేదాంతడిండిమము.

విశేషములు:

చింతన చేయుట యనగా మననము చేయుటయే. శ్రవణము చేసిన వానినే మననము చేయవలయును గాన - శ్రవణము చేసిన పరబ్రహ్మమును గురించియే మననము — చింతన చేయవలయునని.

ధ్యేయాఽ ధ్యేయో పదార్థౌ ద్వౌధీ సమాధ్య సమాధి దౌ।
ధ్యాతవ్యం బ్రహ్మనైవాఽన్య దితి వేదాంతడిండిమః॥ 10

తాత్పర్యము :

ధ్యేయము అధ్యేయ మని రెండు పదార్థములు. అవి బుద్ధికి సమాధినీ — సమాధి లేమిని కలిగించునవి. ధ్యేయము బ్రహ్మమే — యితరము కాదని వేదాంత డిండిమము.

విశేషములు:

శ్రవణ మననములను చేసిన దానిని నిది ధ్యాస చేయవలెను. అనగా ధ్యేయ మైనది. బ్రహ్మమును గురించియే శ్రవణ మననములు కావున అదియే ధ్యేయము. దానిని గురించియే నిది ధ్యాస.

యోగినో భోగినోవాఽపి త్యాగినో రాగిణోఽపి చ।
జ్ఞానాన్మోక్షోన సందేహః ఇతి వేదాంతడిండిమః॥ 11

తాత్పర్యము:

యోగికైనను, భోగికైనను, రాగికైనను — (ఎవ్వరికి గాని — మోక్షమును సాధించవలయునన్న తీవ్ర కృషి కలవారికి) జ్ఞానము వలననే మోక్షము కలుగును. ఇందు సందేహము లేదని వేదాంతడిండిమము.

విశేషములు:

సాధనావిధాన మెట్టిదైనగాని — చివరకు జ్ఞానమువలననే మోక్షమని (జ్ఞానాదేవతు కైవల్యమ్) ఉపనిషత్సూక్తిని వెల్లడించినారు.

నవర్ణాశ్రమ సంకేతైః న కర్మోపాసనాదిభిః।
బ్రహ్మజ్ఞానం వినామోక్షః ఇతి వేదాంతడిండిమః॥ 12

తాత్పర్యము:

వర్ణాశ్రమాది సాంకేతిక సందర్భములచేత గాని, కర్మలచేత గాని ఉపాసన (కేవల) చేతగాని మోక్షము లభింపదు. చివరకు బ్రహ్మజ్ఞానము లభించినప్పుడే మోక్షము కలుగును — అని వేదాంతడిండిమము.

విశేషములు:

ఉపాసన వలన ఈశ్వరానుగ్రహము కలిగి అందువలన జ్ఞానము లభించును. కాబట్టి ఉపాసన మోక్షమునకు పరోక్షసోపానమే కాని బ్రహ్మజ్ఞానమువలె మోక్షము కాదు.

అసత్య స్సర్వ సంసారో రసా భాసాదిదూషితః।
ఉపేక్ష్యో బ్రహ్మవిజ్ఞేయ మితి వేదాంతడిండిమః॥ 13

తాత్పర్యము:

సర్వ సంసారము అసత్యమే. అది రసాభాసమే—మొదట సుఖముగా తోచి దుఃఖమునందు పర్యవసించును. ఇట్టి దోషము కలది కావున దానిని ఉపేక్షింపవలెను. బ్రహ్మమును తెలిసికొనవలెను. — అని వేదాంత డిండిమము.

విశేషములు:

సంసారము — జగత్తు మిథ్య యని — సత్యమైన బ్రహ్మమును గురించి అవగాహన చేసికొనవలెనని — (అథాతో బ్రహ్మ జిజ్ఞాసా) ప్రబోధము.

వృథాక్రియా వృథాఽఽలాపాన్।
వృథావాదాన్ మనోరథాన్।
త్యక్త్వైకం బ్రహ్మవిజ్ఞేయ మితి వేదాంతడిండిమః॥ 14

తాత్పర్యము:

వ్యర్థమైన కర్మకలాపమును వృథాగా భాషించుటయు వృథావాదములను వృథా మనోరథములను వదిలిపెట్టి బ్రహ్మము నొక్కటే యెఱుంగవలెనని వేదాంత డిండిమము.

విశేషములు :

కర్మకలాపము, వాగింద్రియ కార్యము, వాదములు, వాంఛాదులు (స్వర్గ భోగాది వాంఛలు) వ్యర్థములని - బ్రహ్మము నెఱుంగుటకు చేయు జిజ్ఞాస మాత్రమే ఫలవంత మని చెప్పుట.

స్థితో బ్రహ్మాత్మనా జీవో బ్రహ్మ జీవాత్మనా స్థితమ్।
ఇతి సంపశ్యతాం ముక్తిరితి వేదాంతడిండిమః॥ 15

తాత్పర్యము :

జీవుడు బ్రహ్మరూపముననే వున్నాడు. బ్రహ్మము జీవరూపముననే వున్నది. ఇట్లు చూచుచుండువానికి మోక్షము - ముక్తి - అని వేదాంతడిండిమము.

విశేషములు :

జీవ బ్రహ్మైక్యత - జీవుడు బ్రహ్మమేనని అద్వైత సిద్ధాంతము. జీవ బ్రహ్మైక్యత అనుసంధించినపుడే మోక్షము.

జీవో బ్రహ్మాత్మ నాజ్ఞేయో జ్ఞేయం జీవాత్మనాపరమ్।
ముక్తిస్తదైక్య విజ్ఞాన మితి వేదాంతడిండిమః॥ 16

తాత్పర్యము :

జీవుని బ్రహ్మరూపముగా నెరుంగవలెను. బ్రహ్మమును జీవుని రూపముగా ఎరుంగవలెను. జీవబ్రహ్మైక్య జ్ఞానము నొందుటయే ముక్తియని వేదాంతడిండిమము.

విశేషములు :

'జ్ఞానాదేవతు కైవల్యమ్' జీవ బ్రహ్మ ఐక్యతా జ్ఞానమే మోక్ష మని ఉపనిషత్సారాంశము.

సర్వాత్మనా పరంబ్రహ్మ శ్రోతురాత్మత యాస్థితమ్।
నాఽఽయాప స్తత్త్వవిజ్ఞప్తా ఇతి వేదాంతడిండిమః॥ 17

తాత్పర్యము :

పరబ్రహ్మము సర్వాత్మగా సర్వరూపమున నున్నది. వేదాంత శ్రవణము చేయు చున్న శ్రోతకును ఆత్మయయి యున్నది. అందుచేత తత్త్వజ్ఞానము నందు ఆయాసము-ప్రయాస - లేనే లేదని వేదాంతడిండిమము.

విశేషములు :

పరబ్రహ్మము సర్వాత్మగా నున్నదట. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' యన్న శ్రుతి పాఠభావము.

తత్త్వజ్ఞానమునందు ఆయాసము లేదని చెప్పుట యేమనగా — నీవే బ్రహ్మా భిన్నుడవు కావున — నీకు బ్రహ్మతత్త్వజ్ఞాన విషయమున శ్రమ యెట్లుండును?

ఐహికంచాఽఽ ముష్మికంచ తాపాన్తం కర్మ సంచయమ్।
త్యక్త్వా బ్రహ్మైవ విజ్ఞేయ మితి వేదాంతడిండిమః॥ 18

తాత్పర్యము :

కర్మసంచయము - కర్మకాండ - ఐహిక సుఖసాధనము కొరకైనది గాని లేక ఆముష్మిక భోగసాధన కొరకైనది గాని చివరకు తాపమునే కలిగించును. కావున కర్మకాండమును త్యజించి బ్రహ్మమునే తెలియవలెనని వేదాంత డిండిమము.

విశేషములు :

కర్మసంచయము - ఐహిక - ఆముష్మిక ఫలాపేక్షతో చేసినచో తాపాంతమే అయితే నిష్కామ కర్మ మాత్రము చిత్తశుద్ధిని కలిగించి అందువలన ఈశ్వర భక్తి దృఢమై - తద్వారా ఈశ్వరానుగ్రహము లభించి అప్పుడు అద్వైతవాసన కలుగును.

కర్మసంచయము వలన ప్రయోజనము లేదని చెప్పుటలో ఫలాపేక్ష (ఐహికము గాని ఆముష్మికము గాని) తో చేసిన కర్మ కాండ యాపత్తు మోక్ష సాధన కుపయోగింపజాలదని వెల్లడించుటయే. మోక్షమునకు బ్రహ్మవిచారమే మార్గమని సూచితము.

అద్వైతద్వైత వాదౌద్వౌసూక్ష్మ స్థూల దశాం గతౌ।
అద్వైత వాదాన్మోక్షస్స్యా దితి వేదాంతడిండిమః॥ 19

తాత్పర్యము :

అద్వైత వాదము ద్వైతవాదము - యీ రెండును ఒకటి సూక్ష్మదశను రెండవది స్థూలదశను పొందినట్టిది. అద్వైత వాదము వలననే మోక్షము లభించునని వేదాంతడిండిమము.

కర్మిణో వినివర్తన్తే నివర్తన్తే ఉపాసకాః।
జ్ఞానినో ననివర్తన్తే ఇతి వేదాంతడిండిమః॥ 20

తాత్పర్యము :
కర్మము (యజ్ఞాదులు) చేసినవారు తిరిగి వచ్చుచున్నారు. కేవల ఉపాసన చేసినవారును తిరిగి వచ్చుచున్నారు. జ్ఞానులు మరలి రారు అని వేదాంతడిండిమము.

పరోక్షాఽసత్ఫలం కర్మజ్ఞానం ప్రత్యక్ష సత్ఫలం।
జ్ఞానమేఽవాభ్యసే త్తస్మాత్ ఇతి వేదాంతడిండిమః॥ 21

తాత్పర్యము :
కర్మము పరోక్షమైన అసత్ఫలము కలది. జ్ఞానము ప్రత్యక్షమైన సత్ఫలము కలది. కాబట్టి జ్ఞానమునే అభ్యసింప వలయునని వేదాంతడిండిమము.

వృథాశ్రమోఽయం విదుషాం వృథాఽయం కర్మిణాంశ్రమః
యది న బ్రహ్మ విజ్ఞానం ఇతి వేదాంతడిండిమః॥ 22

తాత్పర్యము :
బ్రహ్మజ్ఞానము లేనట్టి విద్వాంసుల శాస్త్రాభ్యాస శ్రమ వ్యర్థమని, కర్మములు చేయువారి శ్రమయు వ్యర్థమని వేదాంతడిండిమము.

అలం యాగై రలం యోగై రలం భోగై రలం ధనైః।
పరస్మిన్బ్రహ్మణి జ్ఞాతే ఇతి వేదాంతడిండిమః॥ 23

తాత్పర్యము :
పరబ్రహ్మతత్వము - జ్ఞానము తెలిసికొన్న పిమ్మట యాగము లేల? యోగము లేల? భోగము లేల? ధనము లేల? అని వేదాంతడిండిమము.

అలం వేదై రలం శాస్త్రై రలం స్మృతి పురాణకైః
పరమాత్మని విజ్ఞాతే ఇతి వేదాంతడిండిమః॥ 24

తాత్పర్యము :
పరమాత్మకు తెలిసిన తరువాత వేదము లేమిటికి? శాస్త్రము లేమిటికి? స్మృతులు పురాణములు మాత్రమేల? అని వేదాంత డిండిమము.

నర్చ్వన యజుషాఽర్థోఽస్తి నసామ్నాఽర్థోఽస్తి కశ్చన।
జ్ఞాతే బ్రహ్మాత్మ విజ్ఞానే ఇతి వేదాంతడిండిమః॥ 25

తాత్పర్యము :

బ్రహ్మాత్మ జ్ఞానము కలిగిన పిమ్మట ఋగ్వేదమువలన ప్రయోజన మేమియు లేదు. యజుర్వేదముచే నేమియు ప్రయోజనము లేదు. సామవేదముచేత కూడ ప్రయోజనము లేదు అని వేదాంత డిండిమము.

కర్మాణి చిత్త శుద్ధ్యర్థం ఐకాగ్ర్యార్థ ముపాసనమ్।
మోక్షార్థం బ్రహ్మవిజ్ఞాన మితి వేదాంతడిండిమః॥ 26

తాత్పర్యము :

కర్మములు చేయుట చిత్తమున కల్మషమును పోగొట్టుకొని శుద్ధి పొందుటకు, ఉపాసన చంచలమైన మనస్సును ఏకాగ్రత పొందించి, ఇంద్రియములను నియమించుటకొరకు, మోక్షముకొరకు బ్రహ్మజ్ఞానము అని వేదాంతడిండిమము.

సంచితాగామి కర్మాణి దహ్యన్తే జ్ఞాన వహ్నినా।
ప్రారబ్ధానుభవా న్మోక్షః ఇతి వేదాంతడిండిమః॥ 27

తాత్పర్యము :

సంచితము అగామి అను కర్మఫలములు జ్ఞానాగ్నిచే దహింపబడుచున్నవి. ప్రారబ్ధము అనుభవించిన పిమ్మట మోక్షము - అనగా విదేహముక్తి కలుగునని వేదాంతడిండిమము.

నపుణ్య కర్మణావృద్ధిః నహానిః పాప కర్మణా।
నిత్యా సఙ్గాత్మ నిష్ఠానా మితి వేదాంతడిండిమః॥ 28

తాత్పర్యము :

నిత్యమై అసంగమైన ఆత్మయందు నిష్ఠగలవానికి అనగా ఆత్మనిష్ఠునికి (బ్రహ్మనిష్ఠునికి) పుణ్యకర్మముచే వృద్ధిగాని, పాపకర్మచే హాని గాని లేదని వేదాంత డిండిమము.

విశేషములు :

పుణ్యము పాపము అనునవి బ్రహ్మనిష్ఠునికి మాత్రమే - (సర్వము బ్రహ్మ యని తెలిసికొని అట్టి నిష్ఠయందున్నవానికి మాత్రమే) లేవు. వ్యావహారిక దృష్టి గలవా రందరకు కలవు.

దృగ్దృశ్యౌద్వౌపదార్థౌస్తః పరస్పర విలక్షణౌ।
దృగ్బ్రహ్మదృశ్యం మాయాస్యాదితి వేదాంతడిండిమః॥ 29

తాత్పర్యము :

దృక్కు దృశ్యము అని ప్రసిద్ధములైన పదార్థములు రెండు. ఈ రెండును ఒకదాని కొకటి విలక్షణములు. దృక్కు బ్రహ్మము దృశ్యము మాయ అగునని వేదాంతడిండిమము.

విశేషములు:

బ్రహ్మము సాక్షి యని — అధ్యాసమై దృశ్యమగుచున్నదెల్ల మాయాకల్పిత మని భావము.

అవిద్యోపాధికో జీవోమాయోపాధిక ఈశ్వరః।
మాయాఽ విద్యాగుణాతీతః ఇతి వేదాంతడిండిమః॥ 30

తాత్పర్యము :

పరబ్రహ్మము — పరమాత్మ — అవిద్యా ఉపాధియందు జీవు డగును. మాయా ఉపాధి గతుడై యీశ్వరు డగును. అయితే పరమాత్మ మాయయొక్కయు అవిద్య యొక్కయు గుణముల కతీతుడని వేదాంతడిండిమము.

విశేషములు :

ఇచ్చట నిర్గుణ పరబ్రహ్మము యొక్క ఈశ్వరుని యొక్క జీవుని యొక్క వివరణము - మాయా - అవిద్యల ఉపాధి విషయము చెప్పబడినది. శుద్ధచైతన్యము బ్రహ్మము. మాయావిచ్ఛిన్న చైతన్యము అనునది ఈశ్వరుడు. అంతఃకరణ పతి కరణా విచ్ఛిన్న చైతన్యము జీవుడు. వృత్త్యవిచ్ఛిన్న చైతన్యము అనునది అంతః కరణ పరిణామ రూపవృత్తుల యందు ప్రతిఫలించు చైతన్యము. (ఇదియే జ్ఞానము. ప్రత్యక్షాది పెక్కు భేదములు కలది) విషయావచ్ఛిన్న చైతన్యము ఘటపటాదులు.

బుద్ధి పూర్వాబుద్ధి పూర్వకృతానాం పాప కర్మణామ్।
ప్రాయశ్చిత్త మహోజ్ఞాన మితి వేదాంతడిండిమః॥ 31

తాత్పర్యము :

బుద్ధిపూర్వకముగా గాని లేక అబుద్ధి పూర్వకముగా గాని చేసిన పాప కర్మము లన్నిటికి జ్ఞానమే ప్రాయశ్చిత్తము. ఇది ఆశ్చర్యమని వేదాంతడిండిమము.

విశేషములు :

సంచిత ఆగామి కర్మమును నశింపచేయునది జ్ఞానమేనని తాత్పర్యము. జ్ఞానమువలన కర్మక్షయ మగునని జ్ఞాననిష్ఠునికి పుణ్యపాప కర్మఫలము లుండవు.

సాకారంచ నిరాకారం నిర్గుణం చ గుణాత్మకమ్।
తత్త్వం తత్పరమంబ్రహ్మ ఇతి వేదాంతడిండిమః॥ 32

తాత్పర్యము :

సాకారమును, నిరాకారమును, నిర్గుణమును, గుణాత్మకము నగు నది యేదో ఆ తత్త్వము పరబ్రహ్మయేనని వేదాంతడిండిమము.

విశేషములు :

ఈ గ్రంథమునందే 30-వ శ్లోకమున చెప్పినట్లు మాయావిచ్ఛిన్న చైతన్య మైన ఈశ్వరుడు సాకారునివలె, గుణలక్షణయుక్తుని వలె కన్పించినప్పటికి — మాయావరణము తొలగించుకొన్న వానికి పరబ్రహ్మ తత్త్వమే అగునని వివరణము.

ద్విజత్వం విధ్యనుష్ఠానాత్ విప్రత్వం వేదపాఠతః।
బ్రాహ్మణ్యం బ్రహ్మ విజ్ఞానాదితి వేదాంతడిండిమః॥ 33

తాత్పర్యము :

స్మృతులు మొదలగు శాస్త్రగ్రంథము లందు విధింపబడిన (ఉపనయనాది సంస్కారముల విధుల) కర్మానుష్ఠానము వలన ద్విజత్వమును, వేదపాఠ అధ్యయనము వలన విప్రత్వమును, బ్రహ్మజ్ఞాన లాభమువలన బ్రాహ్మణత్వమును అని వేదాంతడిండిమము.

విశేషములు :

ఉపనయన సంస్కారము వలన పునర్జన్మ లభించి ద్విజత్వము 'విప్రాఃవేద పారగాః' వేదపఠనమువలన విప్రత్వము, బ్రహ్మజ్ఞానము వలన "బ్రాహ్మణ" నామము.

సర్వాత్మనాస్థితం బ్రహ్మ సర్వం బ్రహ్మాత్మనాస్థితమ్।
నకార్యం కారణాద్భిన్న మితి వేదాంత డిండిమః॥ 34

తాత్పర్యము :

బ్రహ్మము సర్వాత్మకము, సర్వమును బ్రహ్మాత్మకము. కార్యము కారణము కన్న భిన్నము కాదని వేదాంతడిండిమము.

విశేషములు :

'సర్వం ఖల్విదం బ్రహ్మ' మని శ్రుతి పాఠము. బ్రహ్మము సర్వవ్యాపి యని- సర్వము బ్రహ్మమే నని.

సత్తా స్ఫురణ సౌఖ్యాని భాసంతే సర్వవస్తుషు।
తస్మాద్బ్రహ్మమయం సర్వమితి వేదాంతడిండిమః॥ 35

తాత్పర్యము :

సత్త ప్రకాశము, ఆనందము, సర్వ వస్తువు లందును భాసిల్లుచున్నవి. ఆ కారణమువలన సర్వమును బ్రహ్మమయ మని వేదాంతడిండిమము.

విశేషములు :

సత్త ప్రకాశము, ఆనందము - ఇవి బ్రహ్మసంబంధములే. అందుచేత అవి భాసించుచున్నదెల్ల బ్రహ్మ మని భావము.

అవస్థాత్రితయం యస్య క్రీడాభూమి తయాస్థితమ్।
తదేవబ్రహ్మ జానీయాత్ ఇతి వేదాంతడిండిమః॥ 36

తాత్పర్యము :

అవస్థలు మూడును దేనికి విహార స్థానములుగా (క్రీడాభూములుగా) ఉన్నవో అదియే బ్రహ్మ మని తెలియవలెనని వేదాంత డిండిమము.

విశేషములు :

సాక్షిగా నున్న ఉపాధిగతమైన బ్రహ్మమునకు అవస్థాత్రయము విహార స్థానములుగా నున్నవి.

యన్నాఽఽదౌయచ్చనాఽ స్త్యన్తే తన్మధ్యేభాత మప్యసత్।
అతోమిథ్యా జగత్సర్వమితి వేదాంతడిండిమః॥ 37

తాత్పర్యము :

ఏది ఆదియందు లేదో, మరియు అంతమునందు కూడ లేదో, అది మధ్యమందు కనబడినప్పటికి అసత్తే అగును. కాబట్టి జగత్తు సర్వమును మిథ్య యని వేదాంతడిండిమము.

విశేషములు :

ఆది అంతము కలది నశించునదే. శాశ్వతము కాదు. అట్టిది పారమార్థికముగా సత్యము గాదు. మిథ్య అని తాత్పర్యము.

యదస్త్యాదౌ యదస్త్యన్తె యన్మధ్యేభాతి తత్స్వయమ్।
బ్రహ్మైవైకమిదం సత్యమితి వేదాంత డిండిమః॥ 38

తాత్పర్యము :

ఏది ఆది యందును కలదో, ఏది అంత్యమునందును కలదో, ఏది మధ్యకాలము నందును కన్పించుచున్నదో అది తాను ఏకమగు బ్రహ్మమే అగును. ఇది నిత్యమని వేదాంతడిండిమము.

విశేషములు :

ఆదియందు అంతమునందు ఉండుట మధ్యయందు కన్పించుట అనగా ఆది మధ్యాంతములు లేని దని భావము. అట్టిది నిత్యపదార్థమే. నిత్యమైనది బ్రహ్మ పదార్థమే.

పురుషార్థత్రయా విష్టాః పురుషాః పశవోధ్రువమ్।
మోక్షార్థీ పురుషః శ్రేష్ఠః ఇతి వేదాంతడిండిమః॥ 39

తాత్పర్యము :

ధర్మము, అర్థము, కామము అను మూడు పురుషార్థములందు మాత్రమే ఆసక్తి కలవారు నిశ్చయముగా పశువు లనియే చెప్పవలెను. నాలుగవ

పురుషార్థమైన మోక్షమును అర్థించిన నాడు పురుషులందు శ్రేష్ఠుడని వేదాంత డిండిమము.

విశేషములు:

పురుషార్థములు (చతుర్విధము) నాలుగు. అందు మొదటి మూడును సాంసారిక జీవిత సంబంధములైనవి. నాలుగవదైన మోక్షము మాత్రమే శాశ్వతమైనది. దానిని కోరుట శ్రేష్ఠము.

ఘటకుడ్యాదికం సర్వం మృత్తికామేవచ।
తథా బ్రహ్మ జగత్సర్వ మితి వేదాంతడిండిమః॥ 40

తాత్పర్యము :

కుండ గోడ మొదలుగా భూమిపై కన్పించుచున్నవన్నియు మట్టితో తయారైనవే. మృత్తికామాత్రములే కదా! అదేవిధముగా బ్రహ్మపదార్థమే సర్వత్ర ఉండిన జగత్తు అంతయు బ్రహ్మమే యని వేదాంతడిండిమము.

విశేషములు :

భూమి నుండి జనించిన వన్నియు భూమియే అయినట్లు బ్రహ్మపదార్థము అధ్యాస వలన జగత్తుగా తోచుచున్నది. కాబట్టి జగత్తు అంతయు బ్రహ్మమేనని భావము.

షణ్ణి హత్యత్రయం హిత్వాద్వయం ఛిత్వాఽఖిలాతిగమ్।
ఏకం బుద్ధ్వాఽశ్నుతే మోక్ష మితి వేదాంతడిండిమః॥ 41

తాత్పర్యము :

ఆరింటిని చంపి మూడింటిని విడిచి రెండింటిని ఛేదించి సర్వాతీతమైనట్టి ఒక దానిని తెలిసి మోక్షమును పొందుచున్నాడని (జ్ఞాని) వేదాంతడిండిమము.

విశేషములు :

1) ఆరింటిని చంపుట యనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములన్న అరిషడ్వర్గమును విసర్జించుట.

2) మూటిని విడుచుట అనగా దారేషణ, ధనేషణ, పుత్రేషణ అను ఏషణ త్రయమును విడుచుట.

3) రెంటిని ఛేదించుట అనగా - అహంకార మమకారములను ఛేదించుట.

4) ఒకటని తెలియుట అనగా బ్రహ్మపదార్థమును గురించి తెలిసికొనుట.

భిత్త్వాషట్ పంచభిత్త్వాఽథ చతురస్త్రికమ్।
ద్వయం హత్వాశ్రయే దేకమితి వేదాంతడిండిమః॥ 42

తాత్పర్యము :

ఆరింటిని ఛేదించి పిమ్మట అయిదింటిని ఛేదించి తరువాత నాలుగింటిని ఛేదించి మరల మూడింటిని ఛేదించి రెండింటిని విడిచి ఒకటి నాశ్రయింపవలెనని వేదాంతడిండిమము.

విశేషములు :

1) ఆఱు అనగా ఆఱు ఊర్ములను. అవి: ఆకలి, దప్పిక, శోకము, మోహము, జరా, మృత్యువులు వీటిని అతిక్రమింపవలెనని భావము.

2) ఐదింటిని అనగా పంచకోశములు — అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు - వీటిని విస్మరించి ముందునకు సాగవలెను.

3) నాలుగింటిని అనగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారం. వీనికి అంతఃకరణ చతుష్టయము అని పేరు. వీటిని కూడ అతిక్రమింపవలయునని భావము.

4) మూటిని అనగా త్రిపుటిని — సాధ్యము, సాధన, సాధకుడు. ఈ మూటిని ఒకటి చేయు ప్రయత్నము చేయవలెను.

5) రెంటిని అనగా ద్వైతమును, జీవబ్రహ్మలు వేరు అన్న భావమును త్యజింపవలెను.

6) ఒకటిని అనగా పరబ్రహ్మమును.

దేహోనాఽహమమహం దేహీ దేహ సాక్షీతి నిశ్చయాత్।
జన్మమృత్యు ప్రహీణోఽసౌ ఇతి వేదాంతడిండిమః॥ 43

తాత్పర్యము :

నేను దేహమును కాను. ఏలనంటే నేను ప్రాణమునకు సాక్షియైన దేవుడ నన్న నిశ్చయము వలన. ఇట్టివాడు జన్మ మృత్యురహితుడని వేదాంతడిండిమము.

విశేషములు :

దేహాత్మవాదమును తృణీకరించి - అందుకు ఉపపన్నములు చూపినారు.

ప్రాణోనాఽహమహందేవః ప్రాణసాక్షీతి నిశ్చయాత్।
క్షుత్పిపాసోపశాన్తి స్స్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 44

తాత్పర్యము :

నేను ప్రాణమును కాను. ఏలనంటే నేను ప్రాణమునకు సాక్షియైన దేవుడనన్న నిశ్చయము వలన. ఇట్టివానికి ఆకలిదప్పులు నాశమగునని వేదాంతడిండిమము.

విశేషములు :

ప్రాణాత్మక వాదమును ఖండించి హేతువును చెప్పినారు.

మనోనాహమహం దేవో మనస్సాక్షీతి నిశ్చయాత్।
శోకమోహాపహానిస్స్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 45

తాత్పర్యము :

నేను మనస్సును కాను. ఎందుచేత ననగా మనస్సునకు సాక్షియైన దేవుడను అనునట్టి నిశ్చయమువలన శోక మోహ నివృత్తి యగునని వేదాంతడిండిమము.

బుద్ధిర్నాఽహ మహందేవో బుద్ధిసాక్షీతి నిశ్చయాత్।
కర్తృభావ నివృత్తిస్స్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 46

తాత్పర్యము :

నేను బుద్ధి కాను. ఎందుచేత ననగా బుద్ధికి సాక్షియైన దేవుడను అనునట్టి నిశ్చయము వలన కర్తృత్వాది నివృత్తి యగునని వేదాంత డిండిమము.

నాఽజ్ఞానం స్యామహం దేవోఽజ్ఞాన సాక్షీతి నిశ్చయాత్।
సర్వానర్థ నివృత్తిస్స్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 47

తాత్పర్యము:

నేను అజ్ఞానము కాను. ఎందుచేత ననగా అజ్ఞానమునకు సాక్షియైన దేవుడను అను నిశ్చయము వలన సర్వానర్థములకును, నివృత్తి యగునని వేదాంత డిండిమము.

అహం సాక్షీతియో విద్యాత్ వినిచ్యైవం పునః పునః।
స ఏవముక్తోఽసౌ విద్వాన్ ఇతి వేదాంతడిండిమః॥ 48

తాత్పర్యము :

ఇట్లు పలుమారు విచేచించి "నేను సాక్షిని" అని యెవ్వడు తెలియునో అట్టి వాడే ముక్తుడు. అతడు విద్వాంసుడని వేదాంతడిండిమము.

విశేషములు :

నేను ప్రాణము కాను. దేహమును కాను. దేహము కాని, తత్ప్రాణము కాని, దేహేంద్రియములు కాని, ఇంద్రియములకు రాజైన మనస్సు కాని, బుద్ధికాని చిత్తము కాని — కావని గుర్తించి — యీ యిన్నింటికి సాక్షియైన ఆత్మ యని యెఱుంగుటే ఆత్మజ్ఞానసిద్ధి. ఆత్మజ్ఞానలబ్ధి పొందినవాడే జీవన్ముక్తుడు. అతడే — విద్వాంసుడు — అనగా తెలిసినవాడు. తెలియదగనిదేదో దానిని తెలిసినవాడని భావము.

నాఽహం మాయాన తత్కార్యం
నసాక్షీ పరమోఽ స్మ్యహమ్
ఇతి నిస్సంశయ జ్ఞానాత్
ముక్తి ర్వేదాన్తడిండిమః॥ 49

తాత్పర్యము :

నేను మాయను కాను. మాయ యొక్క కార్యమును గాను, సాక్షియు గాను, నేను వీనికన్నిటికిని అతీతుడనై యున్నాను అని నిస్సంశయముగా నెఱుగుటవలన ముక్తి యని వేదాంతడిండిమము.

విశేషములు :

సాధారణముగా జీవుని—సాక్షిగా చెప్పుట కలదు. (లోక వ్యవహారమునకు) ఇదియును విశితపరిశీలన విషయములో చెప్పినది కాదు. సామాన్య విషయము సాక్ష్యము వాస్తవము కానప్పుడు సాక్షి యనుట పొసగదు. అందుచేత నేను సాక్షియును కానని చెప్పుట.

మాయ కాదని—మాయాకార్యము కాదని సాక్షియు కాకుండుటవలన పరబ్రహ్మమేనని తెలియుట జరుగగా—అది నిస్సంశయముగా బ్రహ్మజ్ఞాన మగుచున్నది. అది ముక్తి. జీవన్ముక్తి.

నాఽహం సర్వమహం సర్వంమమ సర్వమితి స్ఫుటమ్।
జ్ఞాతే తత్త్వేకుతో దుఃఖ మితి వేదాంతడిండిమః॥ 50

తాత్పర్యము :

నేను ప్రపంచమును కాను. అయితే ప్రపంచము నేనే. అదెట్లనగా నా యందు ప్రపంచము కల్పితము కావున, ఇట్లు స్ఫుటముగా తత్త్వము తెలిసిన పిమ్మట దుఃఖ మెక్కడిది? అని వేదాంతడిండిమము.

విశేషములు :

తాను ప్రపంచమును కానని తనయందే అజాతమైన ప్రపంచ మంతయు కల్పింపబడినదని తెలిసినవాడు బ్రహ్మైక్యమును పొందినవాడే. అంతయు తానైన అట్టివానికి దుఃఖ మేమిటి? ఉండదు. దుఃఖ మేమిటి యననేల—లౌకికములైన రాగ ద్వేషాదులు—గుణసంకలితములు—ఎవ్వియు లేవు.

దేహాది పంచకోశ స్థాయా సత్తా ప్రతిభాసత్।
సాసత్తాఽత్మాన సందేహ మితి వేదాంతడిండిమః॥ 51

తాత్పర్యము :

దేహాది పంచకోశము లందుండినదై — ఏ సత్త తోచుచున్నదో — ఆ సత్తయే ఆత్మ అగును. సందేహమే లేదని వేదాంతడిండిమము.

దేహాది పంచకోశస్థాయా స్ఫూర్తిరను భూయతే।
సాస్ఫూర్తి రాత్మానైవాఽన్య దితి వేదాంతడిండిమః॥ 52

తాత్పర్యము :

దేహము మొదలుగా పంచకోశము లందుండినదై ఏ స్ఫూర్తి కన్పించు చున్నదో—ఆ స్ఫూర్తి ఆత్మయే యగును. ఇతరము కానేకాదని వేదాంత డిండిమము.

దేహాది పంచకోశ స్థాయా ప్రీతిరను భూయతే।
సాప్రీతి రాత్మా కూటస్థః ఇతి వేదాంతడిండిమః॥ 53

తాత్పర్యము :

దేహము మొదలుగా పంచకోశ గతముగా ఏ ప్రీతి కన్పించుచున్నదో ఆ ప్రీతి కూటస్థుడగు ఆత్మయే యగునని వేదాంతడిండిమము.

వ్యోమాది పంచభూత స్థా యా సత్తా భాసతే నృణామ్।
సా సత్తా పరమం బ్రహ్మ ఇతి వేదాంతడిండిమః॥ 54

తాత్పర్యము :

ఆకాశము మొదలుగా పంచభూతము లందుండి ఏ సత్త మానవులకు తోచు చున్నదో ఆ సత్తయే పరబ్రహ్మమని వేదాంతడిండిమము.

విశేషములు :

పైన 51 నుండి 53 శ్లోకములలో ఆత్మయొక్క వివరణను శ్రీ భగవత్పాదులవారు కావించిరి. తరువాత పరబ్రహ్మస్వరూప వివరణము.

వ్యోమాది పంచభూత స్థా యా చిదేకాఽను భూయతే।
సా చిదేవ పరంబ్రహ్మ ఇతి వేదాంతడిండిమః॥ 55

తాత్పర్యము :

ఆకాశము మొదలుగా పంచభూతములందు—ఏచిత్—భావము ఒక్కటే కన్పించుచున్నదో—ఆ భావమే పరబ్రహ్మమని వేదాంతడిండిమము.

వ్యోమాది పంచభూత స్థా యా ప్రీతిరనుభూయతే।
సాప్రీతిరేవ బ్రహ్మస్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 56

తాత్పర్యము :

ఆకాశము మొదలుగా పంచభూతములందు ఏ ప్రీతి కన్పించుచున్నదో ఆ ప్రీతియే బ్రహ్మమని వేదాంతడిండిమము.

దేహాది కోశగా సత్తా యా సా వ్యోమాది భూతగా।
మానాఽభావాన్నతద్భేదః ఇతి వేదాంతడిండిమః॥ 57

తాత్పర్యము :

దేహమున పంచకోశగతమై యున్న సత్త యేది కలదో—అదియే ఆకాశాది పంచభూత గతమైనట్టి సత్త. అయితే ప్రమాణము తోచకుండుటచేత ఆ సత్తలో భేదము మాత్రము లేదని వేదాంతడిండిమము.

విశేషములు :

జీవుని గురించి చెప్పి, పంచభూత గతమైన బ్రహ్మను వివరించి యిప్పుడు జీవబ్రహ్మల ఐక్యతను గురించి చెప్పిరి. ఇట్లే స్ఫూర్తి ప్రీతులను గూర్చి చెప్పు చున్నారు.

దేహాది పంచకోశగా స్ఫూర్తిర్యా సా వ్యోమాది భూతగా।
మానాఽభావాన్న తద్భేదః ఇతి వేదాంతడిండిమః॥ 58

తాత్పర్యము :

దేహాది పంచకోశగతమైనట్టి స్ఫూర్తి యేది కలదో - అదియే ఆకాశపంచ భూత గతమైనట్టి స్ఫూర్తి. అయితే ప్రమాణము తోచకుండుట వలన ఆ స్ఫూర్తిలో భేదము లేదని వేదాంతడిండిమము.

దేహాది కోశగా ప్రీతిర్యాసా వ్యోమాది భూతగా।
మానాఽభావాన్న తద్భేద ఇతి వేదాంతడిండిమః॥ 59

తాత్పర్యము :

దేహాది పంచకోశగతమైన ప్రీతి యేది కలదో అదియే ఆకాశాది పంచభూత గతమైనట్టి ప్రీతి. అయితే ప్రమాణము తోచకుండుటవలన ఆ ప్రీతిలో భేదము లేదని వేదాంతడిండిమము.

సచ్చిదానంద రూపత్వాత్ బ్రహ్మైవాఽత్మా న సంశయః।
ప్రమాణకోటి సంధానాత్ ఇతి వేదాంతడిండిమః॥ 60

తాత్పర్యము :

సచ్చిదానంద రూపు డగుటవలన ఆత్మ బ్రహ్మమే అగుచున్నది. ఇందుకు సందేహము లేదు. అనేక ప్రమాణములయొక్క పర్యాలోచన ఫల మిది యని వేదాంతడిండిమము.

న జీవ బ్రహ్మణోర్భేదః సత్తారూపేణ విద్యతే।
సత్తా భేదేన మానం స్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 61

తాత్పర్యము :

జీవునికి బ్రహ్మమునకు సత్తా రూపముచే భేదము లేదు. ఎందుచేత ననగా సత్తలకు భేద మున్నదనుటకు ప్రమాణ మేదియును లేదని వేదాంతడిండిమము.

నజీవ బ్రహ్మణో ర్భేదః స్ఫూర్తి రూపేణ విద్యతే।
స్ఫూర్తి భేదేన మానంస్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 62

తాత్పర్యము :

స్ఫూర్తిరూపముచేత్త కూడ జీవ బ్రహ్మములకు భేదము లేదు. ఎందుచేతనన నా స్ఫూర్తులకు భేద మున్నదనుటకు ప్రమాణ మేదియు లేదని వేదాంత డిండిమము.

నజీవ బ్రహ్మణో ర్భేదః ప్రియరూపేణ విద్యత్।
ప్రియ భేదేన మానం స్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 63

తాత్పర్యము :

ప్రీతిరూపము చేతనైనను జీవబ్రహ్మలకు భేదము లేదు. ఎందుచేతనంటే ప్రీతులకు భేదమున్నదనుటకు ప్రమాణము లేదని వేదాంతడిండిమము.

న జీవ బ్రహ్మణో ర్భేదో నామ్నా రూపేణ విద్యతే।
నామ్నో రూపస్య మిథ్యాత్వాత్ ఇతి వేదాంతడిండిమః॥ 64

తాత్పర్యము :

నామరూపములు మిథ్య యగుటచేత — నామరూపములచేత జీవబ్రహ్మలకు భేదము లేదని వేదాంతడిండిమము.

నజీవ బ్రహ్మణో ర్భేదః పిండ బ్రహ్మాండ భేదతః।
వ్యష్టేస్సమష్టే రేకత్వాత్ ఇతి వేదాంతడిండిమః॥ 65

తాత్పర్యము :

వ్యష్టియు సమష్టియు ఒక్కటే యగుటవలన పిండబ్రహ్మాండముల భేదము చేత కూడ జీవబ్రహ్మలకు భేదము లేదని వేదాంతడిండిమము.

బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాఽపరః।
జీవన్ముక్త స్తుత ద్విద్వాన్ ఇతి వేదాంతడిండిమః॥ 66

తాత్పర్యము :

బ్రహ్మయు సత్యము. జగత్తు మిథ్య. జీవుడు బ్రహ్మమే. ఇతరుడు కాదు. అది తెలిసిన విద్వాంసుడు జీవన్ముక్తుడు అని వేదాంతడిండిమము.

న నామ రూపే నియతే సర్వత్ర వ్యభిచారతః।
అనామ రూపం సర్వం స్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 67

తాత్పర్యము :

నామ రూపములు సర్వత్ర నియతములు కావు. వ్యభిచారమువలన. కావున ప్రపంచ నామము రూపములు లేనట్టిదే (సచ్చిదానందాత్మకము) అగునని వేదాంత డిండిమము.

అనామ రూపం సకలం సన్మయం చిన్మయం పరమ్।
కుతో భేదః కుతో బంధః ఇతి వేదాంతడిండిమః॥ 68

తాత్పర్యము :

నామరూపములను తొలగించినచో సమస్తమును సన్మయము చిన్మయము ఆనందమయము అయియున్నది. భేద మెక్కడిది? బంధ మెక్కడిది? అని వేదాంత డిండిమము.

న తత్త్వాత్కథ్యతే లోకో నామాద్యైర్వ్యభిచారతః।
వటుర్జరఠ ఇత్యాద్యై దితి వేదాంతడిండిమః॥ 69

తాత్పర్యము :

చిన్నవాడు, ముసలివాడు—ఇత్యాది నామములచే వాస్తవముగా లోకము చెప్పబడుటలేదు. నామములకు వ్యభిచారము కలుగుటవలన నిట్లని వేదాంత డిండిమము.

నామ రూపాత్మకం విశ్వమింద్రజాలం విదుర్బుధాః
అనామత్వా దయుక్తత్వాత్ ఇతి వేదాంతడిండిమః॥ 70

తాత్పర్యము :

పండితులు నామరూపాత్మకమైన యీ జగత్తును ఇంద్రజాలమని యెఱుగుదురు ఏలయనగా నామ రూప రహితమగుట వలన (నామరూపము అయుక్తమగుట వలన) (అనన్వ్యాతము కామివలన) నని వేదాంతడిండిమము.

అభేద దర్శనం మోక్షః సంసారో భేద దర్శనమ్।
సర్వవేదాంత సిద్ధాంతః ఇతి వేదాంతడిండిమః॥ 71

తాత్పర్యము:

అభేద దృష్టి మోక్షము, భేద దృష్టి సంసారము. ఇది సర్వ వేదాంతముల సిద్ధాంతమని వేదాంతడిండిమము.

న మతాభి నివేశత్వాత్ న భాషాఽఽవేశ మాత్రతః।
ముక్తిర్వినాఽఽత్మ విజ్ఞానాత్ ఇతి వేదాంతడిండిమః॥ 72

తాత్పర్యము :

మతాభినివేశము వలన గాని, భాషావేశమువలన గాని ఆత్మజ్ఞానము (ముక్తి) కలుగదని వేదాంతడింపిమము.

న కామ్య ప్రతిషిద్ధాభిః క్రియాభిర్మోక్ష వాసనా।
ఈశ్వరానుగ్రహాత్సాస్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 73

తాత్పర్యము :

కామ్యకర్మములు నిషిద్ధములుగా గల (కామ్యకర్మ రహితములగు కర్మలచే నిత్యనైమిత్తికములు చేత ననుట) కర్మములకీ మోక్షవాసన కలుగదు. ఇది ఈశ్వరానుగ్రహము వలననే కలుగవలయును అని వేదాంతడిండిమము.

విశేషములు :

'ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైత వాసనా' అని శ్రుతి వాక్యము.

అవిజ్ఞాతే జన్మనష్టం విజ్ఞాతే జన్మసార్థకమ్।
జ్ఞాతురాత్మా న దూరే స్యాత్ ఇతి వేదాంతడిండిమః॥ 74

తాత్పర్యము :

ఆత్మను తెలియని యెడల జన్మ నిరర్థకమగును. తెలిసికొన్నచో జన్మము సార్థకమగును. తెలియువానికి ఆత్మ దూరమునందు లేదని వేదాంతడిండిమము.

దశమస్య పరిజ్ఞానే నాఽఽయాసోఽస్తి యథా తథా।
స్వస్య బ్రహ్మాత్మ విజ్ఞానే ఇతి వేదాంతడిండిమః॥ 75

తాత్పర్యము :

ఎట్లు పదియవ వాని నెఱుంగుటయం దాయాసము లేదో అట్లు తనకు బ్రహ్మ రూపుడైన తన్ను ఎఱుంగుట ఆయాసము - శ్రమ లేదని వేదాంతడిండిమము.

విశేషములు :

పదియవ వాని నెఱుంగుట యనగా — వీథిలో కన్పించు మనుష్యులను వరుసగా లెక్కపెట్టగా పదియవ వానిని లెక్కించుట.

ఉపేక్ష్యోపాధికాన్ దోషాన్ గృహ్యన్తే విషయా యథా।
ఉపేక్ష్య దృశ్యం యద్బ్రహ్మ ఇతి వేదాంతడిండిమః॥ 76

తాత్పర్యము :

ఎట్లు ఔపాధికములైన దోషముల నుపేక్షించి విషయములు గ్రహింపబడునో అట్లు దృశ్య మేదో దాని నుపేక్షించి బ్రహ్మమును గ్రహింపవలెనని వేదాంత డిండిమము.

సుఖమల్పం బహుః క్లేశో విషయ గ్రాహిణాం నృణామ్।
అనంతం బ్రహ్మ నిష్ఠానామ్ ఇతి వేదాంతడిండిమః॥ 77

తాత్పర్యము :

విషయములు గ్రహించు పురుషులకు సుఖ మల్పము, క్లేశ మనంతము, బ్రహ్మ నిష్ఠులకో సుఖము అనంత మని వేదాంతడిండిమము.

ధనైర్వా ధనదైః పుత్రైః దారాగార సహోదరైః।
ధ్రువం ప్రాణ హరై ర్దుఃఖ మితి వేదాంతడిండిమః॥ 78

తాత్పర్యము :

ధనముగాని, ధనమిచ్చువాడు గాని, భార్యగాని, పుత్రులుగాని, గృహముగాని, తోబుట్టువులుగాని నిశ్చయముగా ప్రాణములను హరించువారే, దుఃఖమును కలిగించు వారే — నని వేదాంతడిండిమము.

సుప్తే రుత్థాయ సుప్త్యంతం బ్రహ్మైకం ప్రవిచింత్యతామ్।
నాఽతి దూరేన్నృణాం మృత్యుః ఇతి వేదాంతడిండిమః॥ 79

తాత్పర్యము :

నిద్రనుండి లేచినది మొదలు మరల నిద్రపోవు వరకు బ్రహ్మము నొక్కటే ఏల చింతన చేయవలెను? నరునకు మృత్యువు దూరముగా లేదు. అతి దగ్గరగా నున్నాడు. అందుచేత కాలము వృథా చేయక బ్రహ్మచింతనము చేయవలెనని వేదాంత డిండిమము.

పంచానామపి కోశానాం మాయాఽనర్థవ్య యోచితా।
తత్సాక్షీ బ్రహ్మ విజ్ఞాన మితి వేదాంతడిండిమః॥ 80

తాత్పర్యము :

అయిదు కోశముల (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ) యొక్క స్ఫూర్తి యేది అనర్థమునకు నాశనమునకు యోగ్యమై యున్నదో దానికి సాక్షియగు కూటస్థుడే జ్ఞానస్వరూపమగు బ్రహ్మము అని వేదాంత డిండిమము.

దశమత్య పరిజ్ఞానే నవజ్ఞస్య యథా సుఖమ్।
తథాజీవస్య సత్ప్రాప్తిః ఇతి వేదాంతడిండిమః॥ 81

తాత్పర్యము :

తొమ్మిదిమందిని తెలిసినవానికి తాను దశము డని తెలిసికొనుట వలన ఎట్లు సుఖమో అట్లు జీవునకు తాను సద్రూప బ్రహ్మమని తెలియుటవలన నని వేదాంత డిండిమము.

నవభ్యోఽస్తిపరం ప్రత్యక్ నవవేద పరంపరమ్।
తద్విజ్ఞానాద్భవేత్తు ర్యాముక్తిర్వేదాంతడిండిమః॥ 82

తాత్పర్యము :

ప్రత్యగాత్మ తొమ్మిదింట కంటెను వేరుగా నున్నాడు. ఎందుచేత ననగా ప్రత్యగాత్మ తొమ్మిదింటిని తనకన్న వేరుగా నెరుగును. (పుర్యష్టకము చిదాభాసుడు చేరి తొమ్మిది) ఆ ప్రత్యగాత్మను తెలియుట వలన తురీయ ముక్తి యగునని వేదాంత డిండిమము.

విశేషములు :

పుర్యష్టకము - వివరములు తరువాత శ్లోక వ్యాఖ్యానమున కలవు.

నవాఽఽభాసానవ జ్ఞత్వాత్ నవోపాధీర్నవాత్మనా।
మిథ్యాజ్ఞాత్వాఽవశిష్టేతు మౌనం వేదాంతడిండిమః॥ 83

తాత్పర్యము :

తొమ్మిదియు (పుర్యష్టకము చిదాభాసుడు) ఆభాసము ఎందుచేత ననగా — ఇతడే తొమ్మిదింటిని ఎఱుగువాడగుట వలన. ఈ తొమ్మిది రూపముల నుండు యీ తొమ్మిది ఉపాధులను మిథ్యయని తెలిసిన పిదప అవశిష్టుడగు కూటస్థుని విషయమున మౌనమేనని వేదాంతడిండిమము.

విశేషములు :

ఈ 82, 83 శ్లోకములందును, యంతకు ముందు 75, 81 శ్లోకములందును, తొమ్మిది పైన పదవవాడని లెక్క తెలియుటను గురించి యున్నది. దానిని వివరించు గాథ కలదు.

పదిమంది కలిసి యాత్రకు పోవుచు త్రోవయందు యొక యేఱు అడ్డుపడగా - ఈత మొదలగు ఉపాయములచే దానిని దాటి ఆవలిగట్టు చేరిరి. అందరూ అపాయము లేక దాటిరని తెలియుటకై అందులో నొకడు అందరిని ఎంచి తన్ను మాత్రము ఎంచక తొమ్మండుగురే ఉన్నారని, ఒకడు నీటిలో పడిపోయెనని తలపోసి ఏడ్వ నారంభించెను. మిగిలిన వారందరును కూడ ఏడ్వసాగిరి. అంత దారిని పోవు చున్న వాడొకడు వచ్చి వారి దుఃఖమునకు కారణ మడిగి తెలిసికొని పదియవ వా డున్నాడని వారికి చెప్పి - మరల నెంచుమని — ఒకడు తొమ్మిది మంది నెంచి నిలువగా — పదియవవాడవు నీవే యని చెప్పి వారి దుఃఖమును పోగొట్టెను. ఇది దశమ వృత్తాంత గాథ.

1. కర్మేంద్రియ పంచకము, 2. జ్ఞానేంద్రియ పంచకము, 3. ప్రాణ పంచకము, 4. భూత పంచకము, 5. అంతఃకరణ చతుష్టయము, 6. కామము, 7. కర్మము, 8. వాసన — యీ పూర్యష్టకమును చిదాభాసుదును తొమ్మండుగురితోను, ప్రత్యగాత్మ దశమునితోను పోల్చబడినది.

పరమే బ్రహ్మణి స్వస్మిన్ ప్రవిలాప్యాఽఖిలం జగత్।
గాయన్న ద్వైతమానందం ఆస్తే వేదాంతడిండిమః॥ 84

తాత్పర్యము :

పరబ్రహ్మమైన తనయందు సమస్త జగత్తును లయము చేసి అద్వైతానంద మును గానము చేయుచు విద్వాంసు డుండునని వేదాంతడిండిమము.

ప్రతిలోమానులోమాభ్యాం విశ్వారోపాపవాదయోః।
చింతనే శిష్యతే తత్త్వం ఇతి వేదాంతడిండిమః॥ 85

తాత్పర్యము :

బ్రహ్మమునందు ప్రపంచము యొక్క అధ్యారోపమును (ప్రపంచరూపతను ఆరోపించుటను) అనులోమముగాను అపవాదమును (బ్రహ్మమునందు ప్రపంచ రూపతను నిరసించి బ్రహ్మ మాత్రమే యని నిర్ణయించుటను) ప్రతిలోమముగాను మననము చేసినయెడల తత్త్వము శేషించునని వేదాంతడిండిమము.

నామరూపాభి మానస్స్యాత్ సంసార స్సర్వదేహినామ్।
సచ్చిదానంద దృష్టిస్స్యాత్ ముక్తిర్వేదాంతడిండిమః॥ 86

తాత్పర్యము :

సమస్త దేహులకు నామ రూపాభిమానమే సంసారమగును. సచ్చిదానంద దృష్టి సంసార నివృత్తియైన ముక్తి యని వేదాంతడిండిమము.

సచ్చిదానంద సత్యత్వే మిథ్యాత్వే నామరూపయోః।
విజ్ఞాతేకిమిదం జ్ఞేయం ఇతి వేదాంతడిండిమః॥ 87

తాత్పర్యము :

సచ్చిదానందములు సత్యమనియు, నామరూపము మిథ్య యనియు తెలిసిన పిదప, మరి తెలియదగిన దేమున్నది? అని వేదాంతడిండిమము.

సాలంబనం నిరాలంబం సర్వాలంబావలంబితమ్।
ఆలంబేనాఽఖిలాలంబమితి వేదాంతడిండిమః॥ 88

తాత్పర్యము :

బ్రహ్మము సవిశేషము నిర్విశేషము. సర్వ విశేషముల కధిష్ఠానము. చక్కగా విచారించినచో సమస్తమునకు అధిష్ఠానము కాదు. అని వేదాంతడిండిమము.

నకుర్యాన్న విజానీయాత్ సర్వం బ్రహ్మేత్యను స్మరన్।
యథా సుఖం తథాతిష్ఠేత్ ఇతి వేదాంతడిండిమః॥ 89

తాత్పర్యము :

చేయవలసిన కార్యక్రమమేమియు లేదు. శ్రమించి తెలుసుకోవలసినది నేమియు లేదు. బ్రహ్మయొక్క రూపమేనని స్థిరభావము కలిగి - ఎట్లు సుఖమో అట్లు ఉండవలసినదని వేదాంతడిండిమము.

విశేషములు :

సర్వము బ్రహ్మమే నన్న స్థిరభావము కలిగినప్పుడు మనస్సు మరియొక భావన చేయదు. అనగా వృత్తిరహితము అగును. మనస్సు వృత్తులచేతనే ప్రవర్తించు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు స్తంభించి క్రియారహితమగును. అట్టి స్థితిలో సుఖముగా నుండవలెనట.

స్వకర్మ పాశవశగః ప్రాజ్ఞోఽన్యో వాజనోధ్రువమ్।
ప్రాజ్ఞ స్సుఖం న యేత్కాల మితి వేదాంతడిండిమః॥ 90

తాత్పర్యము :

జ్ఞానిగాని ఇతరుడు గాని స్వకర్మ పాశమునకు వశుడే అగును. ఇది నిశ్చయమైన విషయము. అయితే జ్ఞాని కాలమును సుఖముగా గడుపును అని వేదాంత డిండిమము.

విశేషములు :

జ్ఞాని విషయమున ప్రారబ్ధకర్మ మొక్కటే అనుభవమునకు మిగులును. ఇతరులకు ప్రారబ్ధ సంచిత ఆగామి కర్మలు మూడును తప్పవు.

జ్ఞాని ప్రారబ్ధానుసారముగ కర్మల నాచరించుచున్నను, కోర్కె లేనివాడగుట వలన వానివైపు చూడక సర్వకాలములందు ఆత్మావలోకనము చేయుచుండును.

''అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణ కుంభ ఇవాంబరే। అంతశ్శూన్యో బహిశ్శూన్య శూన్య కుంభ ఇవాంబరే'' అను స్మృత్యర్థ ప్రకారమైన భావనతో నిర్వికల్ప నిష్ఠ యందుండును.

నవిద్వాన్ సంతపేచ్చిత్తం కరణాఽకరణే ధ్రువమ్।
సర్వమాత్మేతి విజ్ఞానాత్ ఇతి వేదాంతడిండిమః॥ 91

తాత్పర్యము :

విద్వాంసుడు కార్య, అకార్యములందు మనస్సంతాపము చెందడు. సర్వమును ఆత్మ యని తెలియుట వలనని వేదాంతడిండిమము.

విశేషములు :

సర్వమును బ్రహ్మమై - తా నా బ్రహ్మమైనపుడు మనస్సంతాపము పొందుటకు హేతువు లేదు.

నైవాఽఽభాసం స్పృశేత్కర్మ మిథ్యోపాధి మపిస్వయమ్।
కుతోఽధిష్ఠాన మత్యచ్ఛమితి వేదాంతడిండిమః॥ 92

తాత్పర్యము :

మిథ్యోపాధి కలిగిన ఆభాసుని కూడ కర్మము స్పృశింపనే స్పృశింపనప్పుడు. ఇక అతి స్వచ్ఛమైన అధిష్ఠానము నెట్లు స్పృశింపగలదని వేదాంతడిండిమము.

అహోఽస్మాకమలం మోహై రాత్మా బ్రహ్మేతి నిర్ణయమ్।
శ్రుతి భేరీరవోఽత్యాఽపి శ్రూయతే శ్రుతి రంజనః॥ 93

తాత్పర్యము :

ఆశ్చర్యము! మాకు మోహములు వలదు. ''ఆత్మ బ్రహ్మ'' అని నిర్ణయముగా శ్రుతిభేరి ధ్వని, ఇప్పుడు కూడ చెవుల కింపుగా విన్పించుచునే యున్నది.

వేదాంత భేరీ ఝుంకారః ప్రతివాది భయంకరః।
శ్రూయతాం బ్రాహ్మణైః శ్రీమద్దక్షిణామూర్త్యనుగ్రహాత్॥ 94

తాత్పర్యము :

ప్రతివాదులకు భయంకరమైన వేదాంత భేరీఝాంకారము బ్రాహ్మణులచేత, శ్రీమద్దక్షిణామూర్తి అనుగ్రహము వలన వినబడుగాక.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ శంకర భగవత్పూజ్య పాదకృతిషు వేదాంతడిండిమః.

ఇట్లు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ శంకర భగవత్పూజ్య పాద కృతియైన వేదాంతడిండిమము అని ఆంధ్ర తాత్పర్యము —

— సమాప్తము. —

శ్రీః

# ఆత్మబోధ

భూమిక :

అద్వైతసిద్ధాంతమును దిగంతవ్యాప్త మొనర్చిన శ్రీ శంకరభగవత్పాదుల రచనలలో ప్రముఖమైనవి ప్రస్థానత్రయభాష్యములు. (ఉపనిషత్, బ్రహ్మసూత్ర, భగవద్గీతా భాష్యములు) విపులమైన, ప్రగాఢవిద్వద్భరితములైన యీ భాష్యములను చదువుటకు కావలసిన ఓర్పు, పాండిత్యము లేనివారి కొరకు - సులభముగా సిద్ధాంతమును అవగాహన చేయవలెనన్న లోక సంగ్రహణబుద్ధితో శ్రీ భగవత్పాదులు పెక్కు ప్రకరణ గ్రంథములు రచించిరి. అట్టి ప్రకరణ గ్రంథములలో "ఆత్మబోధ" యొకటి. దీనియందు 68 శ్లోకములు కలవు.

బోధ అనగా జ్ఞానము. "ఆత్మబోధ" యనగా ఆత్మజ్ఞానమని తాత్పర్యము, ఆత్మబోధ యన్న సమాసమును - రెండు విధములుగా అర్థసమన్వయము చేయవచ్చును. జ్ఞానమైన ఆత్మయని, ఆత్మను గురించిన జ్ఞానమని ఈ ఆత్మబోధ గ్రంథమున శ్రీ భగవత్పాదులవారు సుబోధకముగా చెప్పిన విషయములు రెండు: 1. కేవలమైన సత్యము యొక్క స్వభావము గురించి — (అది వేదాంతసిద్ధాంతమున చైతన్యమైన ఆత్మయే). 2. మోక్షము (ఆత్మసిద్ధికి)నకు హేతువైన జ్ఞానమును గురించి.

కేవల సత్యమైన ఆత్మను ఉపనిషత్తులలో చైతన్యమని, బ్రహ్మమని సాంకేతికములు. ఆత్మ వ్యష్టిసూచకము, బ్రహ్మము సమష్టిసూచకము. రెండు నొక్కటే యన్నీ విచారణమువలన తెలియుచున్నది.

వేదాంతములైన ఉపనిషత్తులు అద్వితీయమైన ఆత్మను గురించి విచారించినవి. అవి దానిని సారవిషయముగా - ప్రపంచ సాపేక్షకముగా — రెండు విధములుగా వివరించినది.

ఆత్మయొక్క నిర్వచనమది సత్ చిత్ ఆనందమని. అది ఉనికి గలది కాదు, ఉనికియే సర్వమయమైనది. కాలము దానిపైన ప్రభావము చూపలేదు. అనగా పెరుగుట, మరణించుట, పరిణమించుట వంటి కాలోచిత లక్షణములు దానికి లేవన్న

మాట. దాని అభావము ఊహింప వీలుపడదు. అది శుద్ధ చైతన్యము. కర్త, కర్మ దానికి పట్టవు. అది స్వయంప్రకాశము. వేరొకదానిచేత అది ప్రకాశము పొందుట లేదు. అది అఖండమైన ఆనందము. కేవలమైనది, అన్యవస్తువులకు ఆత్మయొక్క సంబంధము వలన విలువలు లభించును. ఇట్టి ఆత్మ - అద్వితీయమైనది. దానికి పరిమితులు, హద్దులు లేవు.

అయితే లోకమున మనకు బహుత్వము అనుభవములో నున్నది. మనము ఎవరికి వారు ప్రత్యేకత్వము కలిగియున్నామని భావించుకొనుచున్నాము. ఇది అంతయు "అవిద్య" వలన. అంతరమైన ఆత్మను గుర్తింపలేక బాహ్యదృశ్యములను సత్యములని భావించుట వలన నిది యంతయు జగత్తు దృశ్యమున — ఆత్మ ఆధారము. ఆత్మ జగత్తు కాదు. ఆత్మ భ్రమవలన జగత్తుగా తోచుచున్నది. ఈ భ్రమ కారణముగా — యితర పరిమితులు వచ్చుచున్నవి — ఆత్మల బహుత్వము, వాటికి దేహములు, అంతఃకరణాదులు, ఇంద్రియములు - తదనుభూతులు. ఇంద్రియ విషయములు మొదలగునవి.

అవిద్యను పోగొట్టుకొనుటకు జ్ఞానము కావలెను. అయితే జ్ఞానము కల్మషము లేని చిత్తము గలవారికే లభించును. చిత్తము వీతకల్మషము చేసికొనుట కెన్నియో చెప్పబడినవి. వీతరాగ భయ క్రోధాదికమై, కల్మషరహితమైన చిత్తము - వేదాంత శ్రవణమునకు యోగ్యత కలిగినదగును.

నిత్యానిత్య వస్తువివేకము, (నిత్యమేది అనిత్యమేది అన్న వివేకము), ఇహాముత్ర ఫలభోగ విరాగము — (ఇహలోక పరలోక ఫలభోగములందు అనిచ్ఛ) శమదమాది షడ్గుణ సంపత్తి, ముముక్షుత్వము — కలుగునన్న మాట. ఈ గుణములు కలుగగా వేదాంత శ్రవణము ద్వారా సత్యజ్ఞాన అధికారము లభించినదన్న మాట.

నిత్యానిత్య వివేకమున — ఆత్మ అనాత్మ పదార్థముల భేదములను గ్రహించుటకు పెక్కు పద్ధతులు చెప్పబడినవి. ఆత్మను, దానిని ఆవరించియున్న కోశముల నుండి వేరుగా తలచవలెను. భౌతిక శరీరము (స్థూలశరీరము) ప్రాణము, అంతఃకరణ చతుష్టయము (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) ఇంద్రియాదులు ఆత్మ కాదు, అవి జడములు. వీటిని దర్శించుచున్న సాక్షి ఆత్మ. అవిద్యవలన ఆత్మ యథార్థ స్వరూపము తెలియుట లేదు. బ్రహ్మ విచారమువలన అవిద్యను తొలగించుకొనవలెను.

సర్వసాక్షియైన ఆత్మ బ్రహ్మమే — అని ఉపనిషత్తుల బోధ. బ్రహ్మమును గురించి తెలుపుటకు ఉపనిషత్తులు - రెండు విధములైన సాంకేతిక భాష ఉపయోగించుచున్నవి. ఆత్మ బ్రహ్మమే. అది సత్ చిత్ ఆనందము. అది శాశ్వతము. నిత్యము. అనంతము, మృత్యురహితము, నిత్యశుద్ధము, బద్ధముక్తము, అఖండము. ఈ వివరములు బ్రహ్మయొక్క లక్షణములుగా భావింపరాదు. అందువలననే "నేతి (న ఇతి) నేతి" అని కూడా ఉపనిషత్తులు చెప్పుచున్నవి.

అయితే పరమమైన విషయము మహావాక్యములు చెప్పుచున్నవి. ఈ మహావాక్యములు ఆత్మను బ్రహ్మ భిన్నమని చెప్పుచున్నవి. ఈ మహావాక్యములందు ముఖ్యపదములు — ఆత్మ — బ్రహ్మము. ఉదాహరణకు "తత్త్వమసి" మహావాక్యమున "తత్, త్వమ్ అసి" అని. "అది నీవే అగుదువు". ఈ వాక్యమును సామాన్య అర్థముతో కాక ప్రత్యేక అర్థముతో గ్రహింపవలెను. అది — (బ్రహ్మపదార్థము) త్వమ్ (ఆత్మయగు) అసి (అగుదువు).

ఇట్టి మహా వాక్యములు గల ఉపనిషత్తులను పెద్దలవద్ద శ్రవణము చేయవలెను. వినిన దానిని మననము చేయవలెను. దాని తాత్పర్యమును నిదిధ్యాస (యుక్తియుక్తముగ అనుభవ స్థిరము) చేయవలెను. శ్రవణమువలన — ఉపనిషత్తులు — అద్వితీయమైన ఆత్మ పదార్థమును గురించి చెప్పుచున్నవని తెలియును. మననము వలన ఆత్మను గురించిన సందేహములు నివర్తించును. నిదిధ్యాసవలన తప్పు భావములు తప్పుగానున్న నమ్మకములు తొలగును. శ్రవణాదులవలన తొలుత సత్యమును గురించి తెలిసి - పిమ్మట క్రమక్రమముగా అనుభవమునకు వచ్చును. చివరకు మనస్సు అఖండాకారవృత్తిని అవలంబించును. అప్పుడు మనస్సు యొక్క యితర వృత్తులు నశించును. మనస్సే లుప్తమగును.

ఇది వేదాంత లక్ష్యము, ఆత్మసిద్ధి, మోక్షము. ఇది నూతనముగా లభించునట్టిది కాదు. ఆత్మయొక్క స్థితి నూతనము కాదు. అవిద్య వలన అది తిరోధానమైయుండ — జ్ఞానము అవిద్యను పోగొట్టగా మరల ఆత్మసిద్ధి లభించినట్లు తోచును. ఇట్లు ఆత్మసిద్ధి లభించుటకు దేహనాశము కలుగ నక్కర లేదు. ఆత్మసిద్ధి శరీర ముండగనే లభింపవచ్చును.

ఇది వేదాంతసారమైన విషయము. ఈ వేదాంత విషయమును "ఆత్మబోధ" యందు శ్రీ శంకర భగవత్పాదులవారు సుబోధకముగా — అందరకు తెలియు ఉదాహరణములతో వివరించిరి. ఈ ఉదాహరణము వలన ప్రతివారికి తృప్తి కలుగక

పోవచ్చును. శిష్యలోకమునకు తత్త్వబోధ చేయుటకీ ఉదాహరణలు చక్కగా తోడ్పడును. వేదాంతమును బోధించు ప్రకరణ గ్రంథములతో ఆత్మబోధ మిక్కిలి గణనీయమైనది.

అవతారిక :

గ్రంథారంభము చేయుచు అనుబంధ చతుష్టయమును చెప్పుచున్నారు.

తపోభిః క్షీణ పాపానాం, శాంతానాం వీతరాగిణామ్।
ముముక్షూణామపేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే॥ 1

తాత్పర్యము :

తపస్సుచేత తమ పాపములను క్షీణింపజేసుకొన్నటువంటి, శాంత మనస్కులైనటువంటి, రాగద్వేషాది గుణములను త్యజించినట్టి, మోక్షేచ్ఛ గలవారలకొరకై, ఆత్మబోధయన్న యీ ప్రకరణ గ్రంథము రచింపబడుచున్నది.

వ్యాఖ్యానము :

శాస్త్ర విషయములను తెలుపు గ్రంథములను రచించునపుడు ముందుగా నాలుగు సంగతులు చెప్పవలెను. అనుబంధ చతుష్టయమని, వాటికి పేరు. ఆ నాలుగును, విషయము, ప్రయోజనము, సంబంధము, అధికారి అనునవి.

గ్రంథమునందు చెప్పబోవుచున్న విషయమేమిటి? ఇది మొదటిది — విషయము. దీనివలన ప్రయోజనమేమిటి (ఫలము)? అన్నది రెండవ విషయము. అన్యోన్య సంబంధమును తెలుపునది మూడవది ఈ ప్రయోజనముల పొందుటకు అధికారి — యోగ్యత ఎవరికున్నది? అన్నది నాలుగవ విషయము. ఈ ప్రథమ శ్లోకమున శ్రీ శంకర భగవత్పాదులవారీ నాలుగు — అనుబంధ చతుష్టయమును — వెల్లడించిరి.

గ్రంథమునందు విషయము — ఆత్మబోధ — ఆత్మజ్ఞానము. ఇది గ్రంథ నామమునందు కూడా చెప్పబడినది. ఈ విషయము ఉపనిషదాది వేదాంత గ్రంథముల సారభూతమైనది. దానినే శ్రీ భగవత్పాదులవారీ గ్రంథమున సామాన్యులకు కూడా అవగాహన అగునట్లు చెప్పిరి.

వేదాంత పఠనము వలన ప్రయోజనము మోక్షము, కైవల్యము. ఇది సర్వ వేదాంత గ్రంథముల ప్రయోజనము. విషయ ప్రయోజనముల సంబంధముగా నున్నదీ వివరణము. ఈ ప్రయోజనమును సాధించుకొనుటకు అధికారియైనవాడు మోక్షము

కావలెనన్న గాఢేచ్ఛ కలిగినట్టి ముముక్షువు. దానికి నిత్యానిత్య వివేకము, ఇహాముత్ర ఫలభోగ విరాగశమాది షట్కము మొదలగు సాధన సంపత్తియుండును.

వేదాంత విచారమును ప్రారంభించుటకు ముందు చిత్తము కల్మషరహితమై యుండవలెను. చిత్తము కల్మషరహితమగుటకు నిత్యనైమిత్తికాది విహిత కర్మాచరణము - ఫలాపేక్ష లేకుండా చేయవలెను. ఫలాపేక్ష లేకుండ చేసిన కర్మవలన చిత్తగత కల్మషము నశించును. చిత్తము కల్మషరహితమై పరిశుద్ధమైనపుడు — నిత్య, అనిత్య వస్తువు లెవ్వియన్న వివేకము కలుగును. లోకము దానియందున్న భోగములు నిత్యము కావని తెలిసికొన్నపుడు లౌకిక, పారలౌకిక భోగములందు వైముఖ్యము కలుగును. పరలోక భోగములు కూడ అనిత్యములే కాబట్టి, ఇట్టి వివేకము, విరక్తి కలిగినపుడు, శమాది షడ్గుణములు కలుగును; శమము (అంతరింద్రియ నిగ్రహము? దమము (బహిరింద్రియ నిగ్రహము) ఉపరతి (విషయ వైముఖ్యము) తితీక్ష (శీతోష్ణాది ద్వంద్వములందు సమభావము) సమాధానము, శ్రద్ధ లభించును. ఆ పిమ్మట మోక్షేచ్ఛ — ముముక్షుత్వము లభించును.

ఈ విధమైన సాధన చతుష్టయము కలవారికై 'ఆత్మబోధ' శ్రీ భగవత్పాదుల వారిచేత రచింపబడినది.

అవతారిక:

జ్ఞానము మోక్షసాధనమని చెప్పుచున్నారు.

బోధోఽన్య సాధనేభ్యోహి సాక్షాన్మోక్షైక సాధనమ్।
పాకస్య వహ్నివద్ జ్ఞానం వినామోక్షోన సిద్ధ్యతి॥ 2

తాత్పర్యము :

ఇతర సాధనములతో పోల్చిచూడగా. జ్ఞానము మాత్రమే — మోక్షమునకు సాధనము — వంట చేయుటకు నిప్పువలె. జ్ఞానము లేకుండ మోక్షము సిద్ధింపనే సిద్ధింపదు.

వ్యాఖ్యానము :

మోక్షమునకు జ్ఞాన మొక్కటే సాధనమన్నది అవగాహన అగుటకుగాను మోక్షమనగా నేమి? దానికి విరుద్ధమైన బంధమనగా నేమి? జ్ఞాన అజ్ఞానములగా నేమి? అన్నవి తెలిసికొనవలెను.

అద్వైత సిద్ధాంతము ప్రకారము ముక్తి (మోక్షమన్నది) క్రొత్తగా సాధింప వలసిన దేదియోకాదు. ముక్తస్థితి అద్వితీయమైన బ్రహ్మమునకు నిత్యమైనది. ఈ సత్యమును తెలియని అజ్ఞానము బంధమునకు హేతువు. అందువలన భిన్న భిన్న ఉపాధులతో జన్మము. అజ్ఞానము, అవిద్య బంధమునకు కారణములు. అజ్ఞానమును పోగొట్టుటకు జ్ఞానము కావలెను. అద్వితీయమైన ఆత్మను గురించిన జ్ఞానము. కర్మ ముక్తిని సిద్ధింపచేయజాలదు. ఏలననగా ముక్తి — క్రియాత్మకమైన కృషివలన పొందబడునది కాదు కాబట్టి.

కర్మవలన నాలుగు ఫలములు రావచ్చును.

ఉత్పత్తి, ప్రాప్తి, వికార, సంస్కారములు. ముక్తి యీ నాలుగు వర్గము లందు దేనికి చెందదు. నిత్యమైన అద్వితీయమైన ఆత్మయొక్క స్వభావము కాబట్టి, ముక్తి ఉత్పత్తి అనునది కాదు. సాధింపతగినదియు కాదు. మార్పు (వికార)గా చేయతగినదియు కాదు. పరిశుద్ధము చేయతగినది (సంస్కార)యు కాదు. అయితే ఏకాగ్రత కలిగిన శ్రద్ధాభక్తులున్న కర్మాచరణము నిష్ప్రయోజనమని చెప్పుట కాదు. అట్టి కర్మాచరణము వలన చిత్తము విగత కల్మషమగును. అందువలన ఆత్మ జ్ఞాన సిద్ధికి ప్రయత్నము సుకరమగును.

ఇక్కడ చెప్పదలచిన దేమనగా ఆత్మజ్ఞాన మొక్కటే ముక్తికి ప్రత్యక్ష సాధనమని.

పైన చెప్పిన ఉదాహరణమున "నిప్పుమటుకు కావలసినట్లు" అని. అయితే వంటకు మరెన్నియో కావలెను ధాన్యపుగింజలు (బియ్యము) నీరు కట్టెలు మొద లగునవి. ఇన్నిటిలో నిప్పు ప్రత్యేకమైనది. వండుటకు అతి ముఖ్యమైనది. నిప్పులేక (ఏదో రూపమున) ఏదియు ఉడుకదు, వంట జరుగదు.

అవతారిక :

అవిద్యా నిర్మూలనము కర్మవలన జరుగదని చెప్పుచున్నారు.

అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్।
విద్యాఽ విద్యాం నిహన్త్యేవతేజస్తిమిరసంఘవత్॥ 3

తాత్పర్యము :

కర్మాచరణము వలన అవిద్య — అజ్ఞానము తొలగదు — కర్మాచరణము అవిద్యకు విరోధము కాదు కాబట్టి - తేజస్సు - కాంతి - చీకటిని పోగొట్టువిధముగా జ్ఞానము అవిద్యను (అజ్ఞానమును) పోగొట్టును.

వ్యాఖ్యానము :

కర్మ యనగా - శరీరము యొక్క ఇంద్రియములు చలించుట కాదు. అనగా శరీర చేష్టకాదు. తాను కర్తగా భావించుకొని కావించు కార్యవిశేషము. తన్ను దేహేంద్రియాది ఉపాధితో అభిన్నముగా భావించుకొన్నపుడు అతడు ఇంద్రియ విషయములకు భోగి అగుచున్నాడు. అట్టి అభిన్న సంభావన ఉన్నంతకాలము — దేహము చేష్టలు లేకుండా నున్నను - కర్మ జరుగుచున్నట్లే. ఆ సంభావన పోయినపుడు దేహము కలిగియున్నను - కర్మలేదు. కర్మగాని అకర్మగాని - అంతర సంభావనలపై ఆధారపడియున్నవి. దేహముయొక్క చలనముపైన కాదు. అందుచేతనే కర్మ యన నేమో అకర్మ యననేమో అవగాహన తేలిక పనికాదని భగవద్గీత పలుకుచున్నది. అకర్మయందు కర్మను, కర్మయందు అకర్మను చూచువాడు బుద్ధిమంతుడు అని కూడ చెప్పినది.

ఈ శ్లోకము (4 - 18)

"కర్మణ్య కర్మయః పశ్యేద కర్మణి చ కర్మయః।
సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్న కర్మకృత్"

వివరించుచు శ్రీ శంకరు లోక ఉదాహరణమును నిచ్చుచున్నారు. ఒక నదిలో పడవపై ప్రయాణము చేయువానికి నదిగట్టున స్థిరముగానున్న చెట్లు వేరే దిక్కుగా ప్రయాణము చేయుచున్నట్లుండును. చాలా దూరమున కదలుచున్న వస్తువులు కదలిక లేనివిగా తోచును. అయితే బుద్ధిమంతునికి కదలుచున్న చెట్లు కదలికలేనివని కదలిక లేనట్లుగానున్న దూర వస్తువులు కదలిక కలవని తెలియును.

(ఎచట కర్మము కలదని జనులు సాధారణముగా తలచుచున్నారో అచట కర్మము లేదనియు, ఎచట కర్మము లేదని తలచుచున్నారో అచట కర్మమున్నదనియు ఎవ్వ డెఱుంగుచున్నాడో అతడు జ్ఞానియు యోగియు సర్వ కర్మము లాచరించువాడును అగును.)

దేహేంద్రియములకే సంబంధించిన కర్మను తప్పుగా, అజ్ఞానము వలన ఆత్మయందు ఆరోపించుచున్నారని — ఆత్మకు కర్మ అభావమని, అట్లే అకర్మ — దేహేంద్రియాదుల నిశ్చేష్టిత కూడ - ఆత్మకు సంబంధించినది కాదని - అజ్ఞానము వలన ఆత్మయం దారోపింపబడుచున్నదని తెలియవలెను.

"అవ్యక్తోఽయమ చింత్యోఽయమ్, నజాయ తే్రమియతే"

ఇత్యాదిగా ఆత్మయందు కర్మ అభావము శ్రుతి స్మృతిన్యాయ ప్రసిద్ధము ప్రతిపాదింపబడినది. దేహాది ఆశ్రయమైన కర్మను ఆత్మయందారోపించుకొని "నేను కర్తను, నాది యీ కర్మము నేసీ కర్మఫలమును భుజించుచున్నాను" అనియును, "నే నూరకయున్నాను. అందుచే నాయాసములేనివాడనై కర్మము లేనివాడనై సుఖినగుచున్నాను" అని కార్య కరణాశ్రయంబగు వ్యాపార ఉపరతిని తత్కృతంబగు సుఖిత్వమును ఆత్మయం దధ్యారోపించి - అభిమానించుచున్న లోకము అజ్ఞానము వలన విపరీత దర్శనము.

కర్మము, అకర్మము కూడ - దేహాదులతో ఆత్మాభిన్నభావము వలననే కలుగుచుండుటవలన - ఈ భిన్నభావము అజ్ఞానముచేత కలుగుచుండుటవలన — కర్మము అజ్ఞానమును తొలగింపలేదని (నహితమః తమసోని వర్తకం భవతి) శ్రీ భగవత్పాదులు గీతాభాష్యమునందు (4-18) చెప్పినట్లు కర్మము అజ్ఞాన నివృత్తి చేయలేదు. పూర్ణిమ చంద్రునిపై క్రమ్ముకొన్న మేఘము చీకటిని పెంపొందించునే గాని వెన్నెల వెలుగును వృద్ధిచేయదు. కర్మము అజ్ఞాన విరోధము కాదు. పైగా అజ్ఞానజన్యము అందుచేత అజ్ఞానవృద్ధి చేయును.

కర్మ జ్ఞానములను కలుపుటకు కూడా వీలులేదు. ఏలననగా ఈ రెంటియొక్క గుణఫలితములు వేరు వేరు. జ్ఞానముయొక్క విషయము ఆత్మ. అది అద్వయము, స్వతంత్రము. నిత్యము. కర్మలయొక్క విషయములు అశాశ్వతములైనవి. అవి తాత్కాలిక సముచ్చయములపై ఆధారపడినవి. జ్ఞానముయొక్క ఫలితము విముక్తి కాని కర్మముయొక్క ఫలితముగా అనుభవములు జీవుని మరియు మరియు బద్ధునిగా చేయును. ఇదివరకే సిద్ధముగానున్న మోక్షముతో జ్ఞానము సమన్వయింపవలెను. కర్మము మనోభీష్టము బట్టి వెలువడును. దాని ఫలితము అపూర్వము. కాబట్టి మోక్షమును సాధించుటకు జ్ఞానకర్మముల సముచ్చయమువలన లాభము లేదు. తాను తా ననుకొన్న అహంభావి కర్మము చేయుటకు తగినవాడు. అహంభావ శూన్యుడు. జ్ఞానసాధన యోగ్యుడు.

మానసిక క్రియాలాభమే కదా జ్ఞానము? అని ప్రశ్న ఉదయించవచ్చును. జ్ఞానము క్రియ కాదు. జ్ఞానమునకు ముందు క్రియ ఉండిన ఉండవచ్చును—అన్నది సమాధానము.

అతి సామాన్య విజ్ఞాన విషయమున కూడా ప్రయత్న క్రియకును జ్ఞానమునకు అవినాత్వము లేదన్నది అనుభవములోని విషయము. పరమమైన విషయమున నిది నొక్కి చెప్పనక్కరలేదు.

బ్రహ్మసూత్ర భాష్యమున శ్రీ శంకరులు (I-i-I) "బ్రహ్మము శాశ్వతమైనది - సర్వత్ర ఉన్నది. అది మానవకృషి యత్నముపై ఆధారపడి యుండలేదు" అని వివరించిరి.

చీకటికి వెలుతురు వ్యతిరేకమైనట్లు జ్ఞానము అవిద్యకు విరోధము. ఆత్మయే అయిన బ్రహ్మజ్ఞానము - బంధమునకు కారణమైన అవిద్యను నశింపజేయును.

అవతారిక :

అవిద్య నశించగా ఆత్మ ప్రకాశించునని చెప్పుచున్నారు.

అవచ్ఛిన్న ఇవాజ్ఞానాత్తన్నాశే సతికేవలః।
స్వయం ప్రకాశతే హ్యాత్మా మేఘాపాయేఽంశుమానివ॥ 4

(అవిచ్ఛిన్న అనుటకు బదులు పరిచ్ఛిన్న అని పాఠాంతరము).

తాత్పర్యము :

అవిద్య వలన ఆత్మ ఉపాధి బద్ధమై పరిచ్ఛిన్నమైనటు తోచును. అవిద్య నశింపగా శుద్ధమైన అత్మ స్వయంప్రకాశమై (మేఘము తొలగిన సూర్యునివలె) వెలుగొందును.

వ్యాఖ్యానము :

లౌకిక విషయ పరిజ్ఞానముకంటే ఆత్మజ్ఞానము భిన్నమైనది. ఒక వస్తువు మనస్సునకు తెలియుటెట్లు? మనస్సు యొక్క భాగ మొకటి ఆ వస్తువున లగ్నమైనపు డా వస్తువు తెలిసినట్లు అగును. అనగా ఆ వస్తువునందు బుద్ధి వరావృతమగుచున్న దన్నమాట, సాంకేతికముగా వివరించినచో మనస్సు యొక్క వృత్తివ్యాప్తి కలిగి ఫలవ్యాప్తి అయినదన్నమాట. ఈ వస్తువు చైతన్యరహితమై స్వయంప్రకాశమైనది కాదు. కాబట్టి - ఈ విధముగా జరుగుచున్నది. ఆత్మజ్ఞాన విషయ మట్లు కాదు. ఆత్మ చైతన్యస్వభావము కలది. స్వయంప్రకాశమైనది. కావున వృత్తివ్యాప్తి ఫలవ్యాప్తి అక్కరలేదు. మనస్సు అంతయు ఆత్మలగ్నము కావలెను. ఆత్మను కప్పుచున్న అజ్ఞానమును మనస్సు తొలగించుకొనగా ఆత్మ స్వయంప్రకాశమై వెలుగును మేఘము తొలగిన సూర్యుడు ప్రకాశించినట్లే — యిది జరుగును.

(సూర్యుని వెలుగు చూచుటకు కరదీప పక్కఱ లేదుకదా!)

అవతారిక :

జ్ఞానాభ్యాసమువలన జీవము వినిర్మలమగునని చెప్పుచున్నారు.

అజ్ఞాన కలుషం జీవం జ్ఞానాభ్యాసా ద్వినిర్మలమ్।
కృత్వా జ్ఞానం స్వయం నశ్యే జ్జలం కతకరేణువత్॥ 5

(జ్ఞానాభ్యాసాద్వి నిర్మలమ్ - అనుటకు జ్ఞానాభ్యాసాద్ధి నిర్మలమ్ — అని పాఠాంతరము).

తాత్పర్యము :

అజ్ఞానము వలన కలుషితము చేయబడిన జీవము జ్ఞానమును అభ్యసించుట వలన నిర్మల మగును. కతక గంధము నీటిలోని మాలిన్యమును తొలగించి వాటితో కలిసి అడుగునకు పడిపోయినట్లగును.

వ్యాఖ్యానము :

ఆత్మను గురించిన జ్ఞానము వృత్తి జ్ఞానము. అది బుద్ధి సంబంధి. ఆత్మయే యైన జ్ఞానము స్వరూపము.

విముక్తికి జ్ఞానము సాధనమని చెప్పినప్పుడు - యిచట 'జ్ఞానము' అనగా బుద్ధియొక్క వృత్తి సంబంధమైనదనియే చెప్పవలెను. అయితే దాని విషయము ఆత్మ. బుద్ధియొక్క వృత్తిసంబంధమగుటవలన నది జ్ఞానజనితము. ఇచ్చట ఉదయించు ప్రశ్న యొకటి కలదు. ఆత్మకంటే భిన్నముగా జ్ఞాన మొకటి యుండినయెడ (ఆత్మను గురించినది) — ద్వైతముండుట లేదా? ద్వైతమున్నచో విముక్తి యెట్లు? ఈ ప్రశ్నలకు సమాధానము —

బుద్ధివృత్తి - ఆత్మయొక్క రూపమును - అఖండాకార వృత్తిని - తీసుకొన్నదై - యితర బుద్ధివృత్తుల నన్నిటిని నిర్మూలించును - మూలభూతమైన అజ్ఞానమును కూడ తొలగించును. చివరకు తన్ను తాను తొలగించుకొనును. అద్వయమైన ఆత్మ యొక్కటే చివరకు మిగులును.

ఇక్కడ ఉదహరింపబడిన ఉదాహరణము కతకరేణు (గింజను) గుఱించి దాని గంధము మడ్డి నీటిలో కలుపగా - అది నీటిలోని మట్టిని గట్టిపరచి క్రిందకు తీసికొని పోవును. తాను గూడ క్రిందకు పోవును. తెలుగులో దీనిని చిల్లగింజ యందురు. ఈ సందర్భమున మఱికొన్ని ఉదాహరణలు.

అడవిలో వెదుళ్ళు — ఒకదాని నొకటి రాచుకొని నిప్పు పుట్టించును. ఆ నిప్పు అడవిలోని యితర చెట్లను — యీ వెదుళ్ళను కూడ దగ్ధము చేయును.

శ్మశానమున కళేబరము తగులబెట్టునపుడు నిప్పు నెగ్రత్రోయుట కుపయోగింప బడిన కట్టెను కూడ చివరకు నిప్పులో వేయుదురు. అది కూడ భస్మమగును.

స్వప్నమునందు కన్పించిన పెద్ద పులి అన్నిటిని పరుగెత్తించి కన్పింపకుండ జేసి - చివరకు తాను కూడ కన్పించకుండ పోవును.

దీనియందు చెప్పబడిన ఉపమానమును "జలకతకరేణున్యాయ"మని చెప్పు దురు. (జలము నందుంచబడిన కతకబీజగంధము.

'లౌకిక న్యాయ సంగ్రహ' మన్న గ్రంథమునం దీ న్యాయ మిట్లు చెప్ప బడినది.

"యథాస పంకజలే నిక్షిప్తః కతకస్యౌషధివిశేషస్యరేణవో రాజహంసి తస్మాత్ జలాత్ పంకం విలాప్రస్వయం ఏవవిలీయంతే తథా తత్త్వజ్ఞానం సవిలాసా సాజ్ఞానం నివర్త్య ఏవ నివర్తతే."

లౌకిక న్యాయ రత్నాకరమను గ్రంథమునం దీ ఆత్మబోధ శ్లోకము యీ న్యాయమునకు ఉదాహరణముగ చెప్పబడినది — "తదుక్తం భగవత్పాదైః" అనుచు.

శ్రీ సురేశ్వరాచార్యుల వారు తమ బృహదారణ్యక భాష్యవార్తికమునం దీ న్యాయమును నుపయోగించిరి (IV - iii - 975 - 6)

అపాంకతక సంపర్కాత్ యథాత్యంత ప్రసన్నతా
అపాస్తశేష సంసార భావ నశ్యైవం ఆత్మనః
స్వాస్త్యం ప్రసన్నతై తస్మిన్ సుషుప్తే భవతీ త్యతః
సంప్రసాదం ఇమాం ప్రాహుః సుసుప్తం తద్విదోజనాః

అవతారిక :

సంసారము స్వప్నతుల్యమని నిరూపించుచున్నారు.

సంసారః సప్న తుల్యో హి రాగద్వేషాది సంకులః।
స్వకాలే సత్యవద్భాతి ప్రబోధేఽసత్య వద్భవేత్॥ 6

తాత్పర్యము :

రాగద్వేషాదులతో సంకులమైన సంసారము నిజముగా స్వప్నతుల్యమైనది. అది దానికాలమున సత్యముగా భాసించును. ప్రబోధము కలుగగా అసత్యమైపోవును.

వ్యాఖ్యానము :

సంసారము బంధము. అది అజ్ఞానము వలన కలుగుచున్నది. ఆత్మకు దేహోపాధియందు జాగ్రత్, స్వప్న సుషుప్తులన్న మూడవస్థ లున్నవి. జాగ్రదవస్థయందు బాహిరమైన ప్రపంచ దృశ్యము లున్నవి. స్వప్నమునందు అంతరమైన దృశ్యములు కలవు. సామాన్యులచేత కూడ మిథ్యగా అంగీకరింపబడిన స్వప్న జగత్తుతో సామాన్యుడు జాగ్రదవస్థలోని ప్రపంచమును పోల్చుకొనుచు ఆ జాగ్రదవస్థా దృశ్యములు సత్యములని భ్రమించుచున్నాడు.

అతనికున్న యీ భ్రమను తొలగించుటకుగాను జాగ్రదవస్థలోని జగత్తుకూడ స్వాప్నిక జగత్తువలెనే మిథ్యయని చెప్పబడుచున్నది. అయితే యీ జాగ్రదవస్థా జగత్తునకు స్వాప్నిక జగత్తునకు భేదములు లేవనికాదు. అద్వైతము కర్తృకత్వ ఆదర్శవాదము కాదు. జాగ్రదవస్థ కూడ స్వప్నావస్థ అని చెప్పుటలేదు. ప్రపంచము స్వప్నమని చెప్పుటలేదు. స్వప్నము వంటిదని చెప్పుచున్నది.

స్వప్నావస్థలోని దృశ్యములను కూడ గ్రహించవలెను. ఇవియు అదృశ్యమగునవి. నశించునవి. మేల్కొనగా స్వప్నము ముగిసిపోవును. స్వప్నకాలమున జరిగిన దంతయు అసత్యమని నిశ్చయము కలుగును. అదేవిధముగా ప్రబోధము కలిగినప్పుడు యీ జాగ్రదవస్థా ప్రపంచ మంతయు మిథ్యయని అవగాహన అగును. ఇది ఉదాహరణము. జాగ్రదవస్థలో నున్నవానికి స్వప్న ప్రపంచ మేవిధమైనదో— అదే విధముగా జాగ్రదవస్థా ప్రపంచమంతయు - ఆత్మకు.

ఆత్మ పరమార్థమైన సత్యము.

లౌకిక ప్రపంచము వ్యావహారిక సత్యము.

World in real in relation to itself but unreal in relation to Brahman (Atma, Self)

అవతారిక :

శుక్తి రజతము వలె జగత్తు స్థితి యని చెప్పుచున్నారు.

తావత్సత్యం జగద్భాతి శుక్తికారజతం యథా।
యావన్న జ్ఞాయతే బ్రహ్మ సర్వాధిష్ఠాన మద్వయమ్॥ 7

(అద్వయమ్ - అనుటకు అవ్యయమ్ - అని పాఠాంతరము)

తాత్పర్యము :

ఈ జగత్తు ఎంతకాలము సత్యమే యని భాసించుననగా—సర్వాధిష్ఠానమును (అన్నిటియందు అధిష్ఠించి యున్నది) అవ్యయము, అద్వయమును అగు బ్రహ్మమును తెలియని యంతకాలమును ఆలుచిప్ప ప్రకాశించుచు వెండిగా ఎంతకాలము భ్రమపెట్టును? అది ఆలుచిప్పయని తెలియనంతకాలము. అదేవిధముగా బ్రహ్మపదార్థ మెఱుగనంతకాలము జగత్తు సత్యముగా తోచును.

వ్యాఖ్యానము :

ఇచ్చట జగత్తు యొక్క మిథ్యాత్వమును చెప్పుట కొరకు ఉదాహరణ మీయబడినది. ఆ ఉదాహరణము మనకందరకు జాగ్రదవస్థలో అనుభవమున ఉన్నది. ముత్తెపుచిప్ప సూర్యరశ్మిలో ప్రకాశించుచు వెండియని భ్రమ కలిగించును. అది వెండి కాదు. వెండి దానిపైన భ్రాంతిగా అధ్యారోపింపబడినది. శుక్తి అధిష్ఠానము వెండియొక్క దృశ్యమునకు వెండిగా తోచుట ఎంతకాలము? అది ముత్తెపుచిప్పయని తెలియని యంతకాలము. అది శుక్తియని తెలిసినపుడు వెండియన్న భ్రమ నశించి పోవును. మిగిలియుండదు.

జగత్తునకు అధిష్ఠానము అద్వితీయమైన బ్రహ్మము. జగత్తు బ్రహ్మముయొక్క పరిణామమువలనగాని మార్పు చేయబడుటవలన గాని కలుగలేదు. అది వివర్తమైనది. భ్రాంతి జనితము. జగత్తుగా కన్పించునపుడు కూడ బ్రహ్మ పదార్థమునందు మార్పు లేదు. బ్రహ్మము తెలియబడగా జగత్తులేదు. భ్రమ యున్నంతకాలమే జగత్తు దృశ్యము. బ్రహ్మమును గుఱించిన జ్ఞానలాభము కలుగగా అజ్ఞానము నశించును. అంతవరకు దృశ్యముగా గోచరించుచున్న జగత్తు మనలను భ్రమింపచేయుట మానుకొనును.

అవతారిక :

జగత్తునకు ఆధారము పరమేశ్వరుడని చెప్పుచున్నారు.

ఉపాదానేఽఖిలాధారే జగన్తి పరమేశ్వరే।
సర్గ స్థితిలయాన్ యాంతి బుద్బుదానీవవారిణి॥ 8

తాత్పర్యము :

సకల జగదధిష్ఠానమైన పరమేశ్వరుని యందు జగత్తులు పుట్టి స్థితిని సాగి లయించును — జలమునందు బుద్బుదములు — (నీటిబుడగలు) పుట్టినట్లుగా.

వ్యాఖ్యానము :

బ్రహ్మము గురించి చెప్పునపుడు రెండు విధములైన నిర్వచనములు కలవు. ఆ రెండును తైత్తిరీయ ఉపనిషత్తునందున్నవి.

బ్రహ్మము సత్ చిత్ ఆనందమని నిర్వచన మొకటి [తైత్తిరీయ ఉపనిషత్తు ii (1)] ఈ నిర్వచనము సారభూతమైనది. నిత్యముగా నుండునది. జ్ఞానస్వరూపమైనది. ఆనందమైనది.

మఱియొక నిర్వచనము — యీ భూతములు (సృష్టిజాలము) దేని నుండి ప్రభవించుచున్నవో — దేనివలన (ప్రభవించిన వన్నియు) ఉనికి కలిగియున్నవో - మరల అంత్యమున దేనియందు లయించుచున్నవో — అది బ్రహ్మము (తై. ఉ. iii (1). )

బ్రహ్మము సచ్చిదానందమైనది. ప్రపంచమున కిది కారణము. కారణమనగా అవగాహన చేసికొనవలసిన పద్ధతి యొకటి కలదు. కారణములు పెక్కువిధములు. ఉపాదానము. నిమిత్తము మొదలైనవి. కుండకు మట్టి ఉపాదాన కారణము. కుమ్మరి నిమిత్తకారణము. ప్రపంచము కుండవలె కార్యము కాదు. అసలు బ్రహ్మముకంటె వేరొకటి లేదు. అందుచేత కారణముల భిన్నత్వమునకు అవకాశములేదు. ప్రపంచమునకు బ్రహ్మము ఏకైక కారణము. సంపూర్ణకారణము. అయితే జగత్తు నిజమైన కార్యముకాదు. భ్రమ జనితము. శుక్తి రజతోదాహరణము - పూర్వశ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున నీటి బుడగల ఉదాహరణము. నీటి బుడగలు నీటియందు కన్పించి, కొంతసేపు నీటియందుండి మరల నీటిలో కలసిపోవును. నీటిబుడగల ఉదాహరణము జగత్తు యొక్క నశ్వరత్వమును సూచించును.

జగత్తునకు కారణముగా బ్రహ్మమును ఈశ్వరు డనుచున్నాము. ఈశ్వరు డనగా మరియొక బ్రహ్మముకాదు. అద్వితీయమైన బ్రహ్మమే. అయితే మాయాసహితముగా జగత్తునకు కారణమై కన్పించును.

అవతారిక :

వివర్తమునకు ఉదాహరణము చూపుచున్నారు.

సచ్చిదాత్మన్యనుస్యూతే నిత్యే విష్ణౌ ప్రకల్పితాః।
వ్యక్తయో వివిధా స్సర్వాహాట కేకటకాదివత్॥ 9

నిత్యమై సర్వవ్యాపియైన బ్రహ్మమునందు, సత్. (సర్వకాలములం దునికి). చిత్ ఆత్మయు అనునవి అన్నియు అంతర్లీనముగా వ్యక్తమగుచున్నవి బంగారమున హస్తాభరణములు మొదలగునవివలె.

వ్యాఖ్యానము :

సచ్చిత్తు అగు ఆత్మయే బ్రహ్మము. అదియే సర్వాంతర్యామియైన సత్తు. అది నిత్యము — సర్వమును వ్యాపించియున్నది. అందుచేత విష్ణువు అని పిలువబడు చున్నది. దానిపైన నామరూప జగత్తు అధ్యారోపితమైనది. నామరూపములు మాయా కల్పితములు. అవి నిజముగా యథార్థమైనవి కావు, ఒక ఉదాహరణము చెప్పబడి నది. బంగారము పెక్కు భిన్న భిన్న ఆభరణములుగా వేఱు వేఱు పేర్లతో — కంకణములు, హారములు ఉంగరములు (మొదలగునవి) కన్పించుచున్నది. ఈ కంకణాది ఆభరణములు బంగారము కంటె వేరైన ఉనికి కలవికావు. యథార్థములు కావు.

ఛాందోగ్య ఉపనిషత్తు (VI-i5) దీనితోపాటు పెక్కు యితర ఉదాహరణ ముల నిచ్చుచున్నది. మఱియు - ప్రియవ్రతా - ఒక చిన్న బంగారు ముక్క వలన బంగారముతో చేయబడినదంతయు తెలియుచున్నది — దానికి గలుగు మార్పు లన్నియు — నామములలోని మార్పే కడియములని, హారములని — ఉంగర ములని అక్షరముల మార్పువలన పేరుల మార్పు. యథార్థమునకు అంతయు బంగారమే.

ఇక్కడ ముఖ్యముగా గమనింపవలసిన దొకటి కలదు. ఈ ఉదాహరణము పరిణామ ఉదాహరణము కాదు. వివర్తమునకే ఉదాహరణము. కంకణములుగా హారములుగా తోచుచున్నప్పుడు బంగారము వేఱు వేఱుగా పరిణామము చెందుటలేదు. శ్రీ శంకర భగవత్పాదులు వేసిన పదప్రయోగమున మార్పుగా కన్పించునది నామము లలో — శబ్దములలో నిజముగా మార్పు — పరిణామము చెందినది ఏమియు లేదు. ''వాగాలంబన మాత్రం నామైవ కేవలం నవికారో నామవాస్తవస్తి.''

అవతారిక :

ఆకాశోదాహరణము చెప్పుచున్నారు.

యథాఽఽకాశో హృషీకేశో నానో పాధిగతో విభుః
తద్భేదాద్భిన్న వద్భాతి తన్నాశే కేవలో భవేత్॥ 10

తాత్పర్యము :

ఆకాశమువలె - భిన్న భిన్న ఉపాధులందున్న పరమాత్మ (హృషీకేశుడు) భిన్న భిన్నముగా - (ఆ భిన్న ఉపాధులు కారణముగ) తోచును. ఆ భిన్న భిన్న ఉపాధులు నశించినపుడు కేవలుడై భాసించును.

వ్యాఖ్యానము :

ఈ శ్లోకమునందు చాలా విస్పష్టమైన ఉదాహరణ మొసగబడినది. సర్వ వ్యాపియైన ఆకాశము పరిమితముగా తోచుట యన్నది. బృహదారణ్యక ఉపనిషత్తు యందు గార్గి అడిగిన ప్రశ్నలకు యాజ్ఞవల్క్యమహర్షి చెప్పిన సమాధానములలో సూక్ష్మమైనది స్థూలమైనదానికి ఆధారముగా నున్నదని చెప్పెను. సూక్ష్మమైన దాని చుట్టు స్థూలమైనది అల్లబడినది. సమకూర్చబడినది. ఇట్లు స్థూలమునుండి సూక్ష్మము నకు విచారణ చేయుచు యాజ్ఞవల్క్యమహర్షి ఆకాశముపరకు కొనిపోయెను. "ఓ గార్గి! అది భూమిక్రింద నున్నది - స్వర్గమునకు పైన నున్నది — స్వర్గభూము లైనది. వాని మధ్య నున్నది. భూత భవిష్యద్వర్తమానము లందున్నది — ఆకాశము చేత పరివ్యాప్తమైనది. అయితే ఆకాశము పరమమైనది కాదు. కేవలము కాదు. "అయితే ఆకాశము దేనిచేత వ్యాపింపబడి యున్నది. అని గార్గి ప్రశ్న. సమాధాన ముగా యాజ్ఞవల్క్య మహర్షి తుదివాక్యముగా "నిత్యమై, శాశ్వతమైన బ్రహ్మము పరమమైనది" అని చెప్పెను.

ఈ శ్లోకము ఆకాశ ఉదాహరణము చెప్పబడినది ఏల? అనగా ప్రపంచ ఆధారమైన బ్రహ్మము సంఘటనలనుబట్టి పరిమితమై తోచినను — అది అఖండ మని చెప్పుటకు మనము ఘటాకాశమని — (ఘటము నందున్న ఆకాశము) గృహా కాశమని (గృహము నందున్న ఆకాశము) చెప్పుదుము. నిజమునకు ఆకాశమునం దిట్టి భేదములు లేవు. ఘటము పగులకొట్టబడగా ఘటము నందున్న ఆకాశము మహా కాశముతో కలసిపోయినది. ఆకాశములో భేదములు తోచవు; అట్లే ఉపాధులు కారణ ముగా ఆత్మలు భిన్నములుగా తోచును. నిజమునకు అద్వితీయమైన బ్రహ్మ మొక్కటే. మాయవలన పెక్కుగా తోచును. మాయ తొలగింపబడగా, ఆత్మ యొక్క అద్వితీయత్వము వెల్లడి యగును.

ఈ శ్లోకమున బ్రహ్మము హృషీకేశమని చెప్పబడినది. "హృషికేశ" అన్నది విష్ణు నామములందు ఒకటి. హృషికేశ అనగా హృషీక + ఈశ—ఇంద్రి

యాధిష్ఠానదేవుడని భావము. ఇంద్రియములు ఉపాధులు. బ్రహ్మము నాథుడు. ఆ ఉపాధులచేత ప్రభావితము కానివాడని.

అవతారిక :

ఉపాధి లక్షణములను చెప్పుచున్నారు.

నానో పాధివశాదేవ జాతి నామాశ్ర మాదయః।
ఆత్మ న్యారోపితాస్తోయే రసవర్ణాది భేదవత్॥ 11

తాత్పర్యము :

జలమునందు, రుచి. రంగు మొదలగునవి ఏర్పడినట్లు ఆత్మపైన ఉపాధులను బట్టి జాతి. నామ. ఆశ్రమాదులు ఆరోపితములైనవి.

వ్యాఖ్యానము :

అఘటిత ఘటనాపటీయసి మాయ; లేని దృశ్యములను ఉన్నట్లుగా చూపించు సామర్థ్యము కలది మాయ. లేనివానిని ఉన్నట్లుగా చూపుట అనగా లేని ప్రపంచము ఉన్నట్లుగా చూపుట - ఉన్న పరమాత్మను లేనట్లుగా చూపుచున్నది . మాయ. ఈ మాయా సామర్థ్యమును శ్రీ శంకర భగవత్పాదులు "మాయా పంచక" మను అయిదు శ్లోకములందు వివరించిరి.

ఆత్మ, అనాత్మ - కాంతి, చీకటి వంటివి. వీనిని ఒకదాని కొకటి పొరబాటుగా భావించుట కవకాశమే లేదు. ఒకదాని గుణముల నింకొక దానికి ఆరోపించుటకును అవకాశము లేదు. అసలు నిజమునకు అనాత్మ యన్నదే లేదు. మాయ ఆత్మను క్రమ్ముకొనును. అనాత్మను ప్రదర్శించును. ఈ కారణముచేత ఆత్మకు లక్షణములు పరిమితులు కన్పించుచున్నవి. దేహబుద్ధి గుణములు ఆత్మపై ఆరోపింపబడు చున్నవి. కులనామ, ఆశ్రమాదులు — అట్లు తోచుచున్నవి.

"అపగత గుణకర జాతిభేదే సుఖచితి విప్ర విదాద్యహం కృతించ । స్ఫుట యతి సుతదార గేహే మోహం త్వఘటిత ఘటనా పటీయసి మాయా॥" భర్తృత్వ కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములు పుణ్య పాపాదికర్మలు గుణదోషములు జాతి వికారములు లేని ఆనందరూపమైన ఆత్మకు బ్రాహ్మణాది జాతి భేదమును, ధనవంతుడను, గుణవంతుడను, పండితుడను, అను అహంకారమును భార్యా పుత్ర గేహములందు మోహమును కలుగజేసి జీవుని మరపించునది మాయ. ఇది దానియొక్క అఘటిత ఘటనా సామర్థ్యము వలననే.

ఒక ఉదాహరణము చూపబడినది. పరిశుద్ధమైన జలము రుచిలేనిది. రంగు లేనిది. అయితే దానితో రుచులు తీపి, ఉప్పు మొదలగునవి కలిసినందువలన నీరు తీయగా ఉప్పగా తోచును. అట్లే రంగుగల పదార్థముతో కలసినందువలన రంగులేని పరిశుద్ధజలము - రంగుకల్గిన దానివలె - తెల్లగా - నల్లగా - నీలముగా - ఎరుప రంగుగా తోచును. అట్లే ఉపాధులతో కలసిన శుద్ధఆత్మ విషయము కూడ.

అవతారిక :

దేహముయొక్క విషయము చెప్పుచున్నారు.

పంచీకృత మహాభూత సంభవం కర్మసంచితమ్।
శరీరం సుఖ దుఃఖానాంభోగాయతన ముచ్యతే॥ 12

తాత్పర్యము :

పంచ మహాభూతముల పంచీకరణము వలన సంభవించిన స్థూలదేహము, పూర్వకర్మ సంచితమైయుండి సుఖదుఃఖముల అనుభవస్థానమని చెప్పబడుచున్నది.

వ్యాఖ్యానము :

సృష్టి జరిగిన విధానమును గురించి చెప్పు ఉపనిషద్వాక్యములకు వేదాంత శాస్త్రమున ఆదరములేదు. అసలు వేదాంతము సృష్టియొక్క యథార్థ్యము అంగీక రింపదుకదా! సృష్టిని గురించి చెప్పుట అది యథార్థమని నిరూపించుటకు కాదు.

స్థూల సూక్ష్మసృష్టిని చూపుచున్నది మాయ. ఆత్మ పదార్థమునకు పరిధులు కల్పించుట ఉపాధులుగా నున్నవి. స్థూలశరీరములు తాము సృష్టి దృశ్యములై యుండి___స్థూల శరీరము భౌతికదేహము - సూక్ష్మశరీరము మనస్సు దాని వర్గము.

స్థూలశరీరముయొక్క నిర్మాణ మిచ్చట వివరింపబడినది. స్థూలశరీరము పంచ భూత నిర్మితము. ఆ పంచభూతములు పృథివి, జలము, అగ్ని, వాయు ఆకాశములు. అయితే మన ఇంద్రియములకు గోచరించు భూమి మొదలగునవి కావవి. మన ఇంద్రియములకు గోచరించునవి స్థూలభూతములు. సూక్ష్మభూతములు తన్మాత్రలు - (సారభూతము) ఇంద్రియాతీతములు. పంచీకరణమువలన యీ సూక్ష్మభూతములు స్థూలరూపములను ధరించి ఇంద్రియములకు గోచరములగును. పంచీకరణమున ప్రతి స్థూలభూతమును అయిదు విభాగముల సమష్టిరూపముగా భావముచేయుట. సూక్ష్మభూతములైదును మొదట రెండు సగములుగా చేయబడి - అందొక సగము నాలుగు భాగములుగా చేయబడును. ఈ భాగ మొక్కొక్కటి - ఇతర భూతముల సగ

భాగముతో కలుపబడును. ఇది విస్పష్టముగా తెలియుటకు ఉదాహరణముగా —
స్థూలమైన పృథివియందు. 1/2 పృథివి + 1/8 జలము + 1/8 అగ్ని + 1/8
వాయువు + 1/8 ఆకాశము కలవు. ఇతర స్థూలభూతముల విషయమున కూడ
సరిగావిదే పరిస్థితి.

స్థూల పంచభూతములచేత స్థూల విశ్వము చేయబడినది. స్థూల భౌతిక శరీర
ములు స్థూల విశ్వమున దృశ్యములు. ఏ ఆత్మకు ఏ విధమైన స్థూలశరీరము కలుగ
వలెనని నిర్ణయముచేయునది ఆ ఆత్మయొక్క పూర్వ కర్మఫలము. ఆత్మయొక్క సుఖ
దుఃఖముల అనుభవస్థానము స్థూలశరీరము. ఈ స్థూలశరీరము ఆత్మయొక్క వెలుపలి
అతిబాహిరమైన — కోశము. శ్రీ భగవత్పాదుల 'పంచీకరణ' ప్రకరణము, శ్రీ
సురేశ్వరుల వార్తికము చూచిన వివరములు లభించును.

అవతారిక :

సూక్ష్మశరీర విషయము చెప్పుచున్నారు.

పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్।
అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్॥ 13

తా. సూక్ష్మశరీరము పంచప్రాణ, మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమై
అపంచీకృత భూతములనుండి ప్రభవించినవి. ఇది భోగములను అనుభవించుటకు
సాధనము.

వ్యాఖ్యానము :

ఆత్మ సుఖము దుఃఖములను అనుభవించుటకు స్థూలశరీరము స్థానము.
అయితే యీ సుఖదుఃఖానుభవమునకు సాధనములైనవి సూక్ష్మశరీర భాగములు.
సూక్ష్మశరీర భాగములుగా మనస్సు దాని అనుయాయి వర్గము చెప్పితిమి. ఈ శ్లోకము
నందు సూక్ష్మశరీర విభాగమును గురించిన వివరణ కలదు.

సూక్ష్మశరీరముగా సమష్టిగా చెప్పబడు భాగములు పదునేడు. అవి ప్రాణము
లైదు (పంచ ప్రాణములు) మనస్సు, బుద్ధి, జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియము
లైదు. కాని మరికొన్ని గ్రంథములందు చిత్తము, అహంకారము కూడ కలిపి
పంతొమ్మిది భాగములు సూక్ష్మశరీర విభాగములుగా చెప్పబడుచున్నవి. — మనస్సు,
బుద్ధి, చిత్తము, అహంకారము యీ నాలుగును అంతఃకరణ చతుష్టయమని పిలువ
బడును. ఈ అంతఃకరణ చతుష్టయమునందు నాలుగును భిన్న భిన్న కార్యములవలన

భిన్న భిన్న నామములు కలిగియున్నవి. మనస్సు సంకల్ప వికల్పాత్మకమైనది. ఈ భావముతోడనే ఈ శ్లోకమునందు "మనస్సు" శబ్దము ప్రయోగింపబడినది. బుద్ధి అనగా నిశ్చయాత్మకము. ఈ రెండును చిత్తము (జ్ఞాపకము) అహంకారమును కలిసి అంతఃకరణము. పంచప్రాణములకు వాటి వాటి విధులున్నవి. పంచజ్ఞానేంద్రియములు, చక్షుశ్శ్రోత్ర ఆఘ్రాణ జిహ్వాస్పర్శములు. అనగా కన్నులు, చెవులు, ముక్కు జిహ్వ, స్పర్శేంద్రియము - కర్మేంద్రియములు, కాళ్లుచేతులు వాక్కు ఉపస్థ, మల విసర్జనేంద్రియము. ఈ ఇంద్రియములను బయటకు కన్పించునట్టివిగా నెంచరాదు. చూచు శక్తి, రుచి చూచుశక్తి, స్పర్శ తెలుసుకొనుశక్తి, పంచ జ్ఞానేంద్రియములు అట్లే కర్మేంద్రియముల విషయమున కూడ. సూక్ష్మశరీర భాగములు అపంచీకృతపంచభూతములనుండి ప్రభవించినవి. అందుచేత నవి చాలా సూక్ష్మాతి సూక్ష్మ పాటవము కలవి.

ఈ సూక్ష్మశరీర సాధనమువలన ఆత్మ స్థూలదేహమున సుఖదుఃఖానుభవమును పొందకలుగుచున్నవి.

**అవతారిక :**

అవిద్యాకారణ శరీరములు ఆత్మకంటే భిన్నమగుట తెలుపుచున్నారు.

అనాద్య విద్యాఽనిర్వాచ్యా కారణోపాధి రుచ్యతే।
ఉపాధిత్రితయా దన్యమాత్మా న మవధారయేత్॥ 14

**తాత్పర్యము:**

అనాదియైనట్టిదియు, అనిర్వాచ్యమైనట్టిదియునగు అవిద్యకారణ శరీరమని చెప్పబడుచున్నది. ఈ ఉపాధిత్రయముకంటె ఆత్మభిన్నమని తెలియవలెను.

**వ్యాఖ్యానము :**

అవిద్య యని చెప్పబడు మాయ ఆత్మకు కారణ శరీరము. అవిద్య యనగా స్థూలముగా మాయ యని గ్రహింపవచ్చును. లేక మాయయొక్క ఒక ప్రత్యేక స్థితిగా భావింపవచ్చును. ఈ రెండవ వివరణము స్వీకరింపగా అవిద్య వైయక్తిక ఆత్మయొక్క ఉపాధి అగుచున్నది. మాయ ఈశ్వరుని ఉపాధి.

అవిద్య ఆత్మకు కారణశరీరమని చెప్పుటకు కారణమేమనగా అవిద్యయే ఆత్మకు ప్రధానమైన ఆవరణ కల్పన చేయుచున్నది. దాని నుండియే స్థూలసూక్ష్మ జగత్తుల ద్రవ్యములగు మహాభూతములు కలుగుచున్నవి. ఈ అవిద్యకు ఆది

యెప్పుడో చెప్పనలవికాదు. ఏలననగా అన్ని ప్రారంభములు, ఆదులు, అవిద్య యందే ఉన్నవి కాబట్టి, అసలు కాలముకూడ అవిద్యాదృశ్యమే. అందుచేత అవిద్య అనాది అని చెప్పుట. అట్లు చెప్పుటచేత అవిద్య నిత్యమని శాశ్వతమని చెప్పుట కాదు. నిరంతరము ప్రవహించుచున్న నది వంటిది. అవిద్య అనిర్వచనీయముకూడ. ఇదమిత్థమని నిర్ణయింప వీలుకానిది. ఏలననగా — అది వాస్తవము కాదు. అవాస్తవమును కాదు. అవాస్తవమనుటకు వీలులేదనుటకు కారణము — అది ప్రపంచముగా దృశ్యమై యున్నది కాబట్టి — వాస్తవము కాదని చెప్పుటకు కారణమేమనగా — ఆత్మజ్ఞానము కలిగినప్పుడిది అదృశ్యమగు చున్నది. అయితే ఇది వాస్తవము అవాస్తవము అని విరుద్ధ శబ్దములతో వర్ణింప వీలులేదు. విరుద్ధ సంగతులొక్కదానియందుండవు కనుక. అందుచేత నిర్వచింప వీలులేదని అనిర్వచనీయమని చెప్పుట.

స్థూల సూక్ష్మకారణ శరీరములను గురించి విచారణ చేయుటవలన ప్రయోజనము — ఆత్మ యీ మూటికన్న భిన్నమైనదని గ్రహించుటకు.

అవతారిక :

ఆత్మ పంచకోశాతీతమని చెప్పుచున్నారు.

పంచకోశాది యోగేన తత్తన్మయ ఇవస్థితః।
శుద్ధాత్మా నీలవస్త్రాది యోగేన స్ఫటికో యథా॥ 15

తాత్పర్యము : (నీలవస్త్రాది - అని పాఠాంతరము)

ఆత్మపంచ కోశముల సంబంధము వలన ఆ యా కోశముల మయమై యున్నట్లుగా నుండును. నీలవస్త్రము మొదలైన వాటి సంబంధము వలన శుద్ధమైన స్ఫటికము నీలపురంగు మొదలగు రంగు కలిగియున్నట్లుగా నుండినటుల.

వ్యాఖ్యానము :

ఆత్మకు స్థూల సూక్ష్మ కారణ శరీరము లున్నవని పూర్వ శ్లోకముల వలన తెలిసికొంటిమి. ఈ మూడు శరీరములను అయిదు కోశములుగా వెలార్చుచున్నవి. అనగా ఆత్మను చుట్టుకొని అయిదు కోశము లున్నవి. స్థూల దేహము అన్నమయ కోశము. సూక్ష్మదేహమున పదునేడు భాగము లున్నవని — (పంచప్రాణములు, పంచ జ్ఞానేంద్రియ పంచ కర్మేంద్రియములు మనస్సు బుద్ధి) — తెలిసికొంటిమి. ఇందు పంచ ప్రాణములు పంచ కర్మేంద్రియములు కలిసి ప్రాణమయకోశమగు

చున్నది. మరల యీ పంచ జ్ఞానేంద్రియములు బుద్ధితో కలసి విజ్ఞానమయకోశమగు చున్నది. కారణ శరీరమే ఆనందమయకోశము అయితే యీ ఆనందమయకోశము ఆనందమైన బ్రహ్మరూపము కాదని గ్రహింపవలెను. ఆనందమయము ఆనందము కాదు. ఆనంద అభాస మాత్రమే. అవిద్యయందు ఆత్మ ప్రతిబింబము. ఇవి కోశము అని చెప్పట ఏలననగా — ఇవి ఆత్మచుట్టును ఆవరించుకొని ఉన్నవి. కత్తికి ఒఱవలె. ఈ అయిదు కోశములును ఆత్మపై చుట్టుకొని యుండుటవలన — ఈ కోశము లొక్కటొక్కటి ఆత్మయేనని భ్రాంతి కలుగుచున్నది. ఆత్మ పొట్టి కాదు. పొడుగు కాదు. అయితే అన్నమయకోశమైన స్థూల శరీరమే తాననుకొన్న భ్రాంతిలో "నేను పొడుగు, నేను పొట్టి అని పలుకుచున్నారు. ఆకలిదప్పికలు ప్రాణమయ కోశమునకు చెందినవి. ఆ ప్రాణమయకోశమే తానుగా భ్రమించి "నేను ఆకలి గొన్నాను. దప్పిగొన్నాను" అనుచున్నాము. సంకల్ప వికల్పములు మనోమయ కోశమువి. అవగాహన విజ్ఞానమయ కోశమువి. అవి ఆత్మకు చెందినవనుకొని "నేను సంకల్పించుచున్నాను. నాకు అవగాహన అయినది" అనుచున్నాము. అట్లే సుఖ అనుభవము ఆనందమయ కోశమువి. అవిద్య వలన "నేను ఆనందించు చున్నాను" అనుచున్నాము.

ఇచ్చట శుద్ధ స్ఫటికమునకు రంగు లేదు. నీలిరంగు వస్తువు ప్రక్కనది ఉంచినచో — అది నీలిరంగుగా తోచును. దాని ప్రక్క ఎఱ్ఱని మందార పూవుని పెట్టినచో స్ఫటికము ఎఱ్ఱని రంగు కలదానివలె తోచును.

అవతారిక :

కోశాతీతముగ ఆత్మను తెలియవలెననుచున్నారు.

వపుస్తు పాదభిః కోశైర్యుక్తం యుక్త్యవఘా తతః।
ఆత్మా న మాంతరం శుద్ధం వివించ్యాత్తండులం యథా॥ 16

తాత్పర్యము :

పంచకోశములు, స్థూలశరీరము అన్న పెచ్చు (ఊక)తో నున్న ఆత్మను ఆత్మ విచారణయన్న దంపుడు వలన — పరిశుద్ధమైన అంతర సత్యమైన ఆత్మను తెలియవలెను. వరిగింజ నుండి బియ్యపుగింజ దంపుడు వలన ఊకను తొలగించి నపుడే బయటపడుచున్నది కదా!

వ్యాఖ్యానము:

పరిగింజలో బియ్యము చుట్టు ఊకతవుడు మొదలైనవి ఆవరించియున్న విధముగానే, ఆత్మను స్థూల, సూక్ష్మ కారణ శరీరములు, పంచకోశములు ఆవరించి యున్నవి. ఊకను తవుడును తొలగించుటకు దంపుడు చేసినట్లే విచారణచేసి వివేకమువలన పంచకోశాతీతముగ నున్న ఆత్మను గ్రహించవలెను.

శాస్త్ర ప్రమాణము మాత్రమేకాదు. యుక్తి సహాయము వలన కూడ అనాత్మ నుండి ఆత్మను భిన్నమైనదానిగ వివేకముతో గ్రహింపవచ్చును. ఆత్మ విచారణము వలన — శాస్త్రములందు చెప్పబడిన సత్య మెట్టిదో అనుభవమునకు తెచ్చుకొన వచ్చును. ఆత్మ విచారణ (బ్రహ్మవిచారణ) కు శ్రవణమనన నిది ధ్యానములు మార్గ ములు. శాస్త్రములందు చెప్పబడిన దానిని గ్రుడ్డిగా విశ్వసింపమని వేదాంతము చెప్పుటలేదు. శ్రీశంకర భగవత్పాదులు బ్రహ్మసూత్ర భాష్యమునందు — ఏ సిద్ధాంతమునుగాని విమర్శించకుండ గ్రుడ్డిగా నమ్మినవాడు సత్యమునుండి జారి అపమార్గమున పడిపోవునని చెప్పిరి. (1—i—2)

అవతారిక :

ఆత్మ సర్వగతమైనను కొన్నియెడల మాత్రమే భాసించునని చెప్పుచున్నారు.

సదా సర్వగతోఽ ప్యాత్మా న సర్వత్రావ భాసతే।
బుద్ధావేవావ భాసతే స్వచ్ఛేషు ప్రతిబింబవత్॥ 17

తాత్పర్యము :

ఆత్మ సర్వమునందుండినప్పటికి — అన్నిటియందది భాసించదు. స్వచ్ఛము లైన దర్పణాదులందే ప్రతిబింబములు కన్పించునట్లు — ఆత్మ బుద్ధియందు మాత్రమే అవభాసించును.

వ్యాఖ్యానము :

ఆత్మ సర్వగతమైనది. అన్నిటియందు నిండి — వ్యాపించియున్నది. అన్ని వస్తువులందు, అన్ని పదార్థములందు ఉన్నది ఆత్మయే. చరాచర, జడ, అజడ— స్థావర జంగమములందెల్ల ఆత్మయే కలదు. అయితే, ఆత్మయొక్క ఉనికి వెల్లడి యగుచున్నది - బుద్ధియందు మాత్రమే. ఆ కారణమువలన బుద్ధికోశము — జీవుడని చెప్పబడుట, జీవుని చిదాభాసుడని చెప్పుటకు కారణము కూడ నిదియే.

బ్రహ్మ పదార్థమును గురించి చెప్పుటలో సత్ చిత్ ఆనందములని వివరించుట కలదు.' ఇందు సత్ సత్తు — సర్వ పదార్థములందున్నది. అన్ని పదార్థములు నిదియే. చిత్ — చిత్తు — ప్రాణవంతములైన వానియందు — బుద్ధియందు భాసించును. ఆనందము సకృత్తుగా కొన్ని ప్రత్యేక సందర్భములందు ప్రకాశించును.

ఈ శ్లోకమునందు చిత్తుయొక్క ప్రకాశనము బుద్ధియందని వచింపబడినది. ఆత్మకు భౌతికకాయము, (స్థూలశరీరము) చుట్టుకొనియున్నది. దానియందు పంచ ప్రాణము లున్నవి. అయితే జీవత్వ మెచ్చటననగా — బుద్ధియందు ప్రతిబింబించుట యందున్నది. దాని ప్రకాశనము యొక్క ఉద్ధృతి బుద్ధియొక్క స్వచ్ఛతపై ఆధార పడియున్నది. అంతఃకరణము కల్మషరహితమైనచో ఆత్మ ప్రకాశన మధికముగా నుండును. అయితే అన్ని బుద్ధులందు —(మనస్సులందు — అంతఃకరణములందు) ఆత్మ ప్రతిబింబము మాత్రము — స్వచ్ఛముగనో — అస్వచ్ఛముగనో - కలదు. అంతఃకరణమునందు ఆత్మయొక్క ప్రతిబింబమే ఆత్మ అనాత్మల (జీవ — జడ) బేధమును గ్రహించుచున్నది.

ఇచ్చట నిరూపింపబడిన ఉదాహరణము — అద్దము — నీటి నిలువలు — మొదలగు వాటియందు ప్రతిఫలించు ప్రతిబింబములు. శ్రీ విద్యారణ్యులు రచించిన పంచదశియందు (చిత్రదీప ప్రకరణమున) వర్ణచిత్రము తీసుకొనబడినది. చిత్ర పటమున పెక్కు వస్తువులు చిత్రింపబడినవి. మానవుల చిత్రముల వస్త్రములు కూడ చిత్రింపబడినవి. జడములైన కొండలకు గాని, నదులకుగాని వస్త్రములు చిత్రింపబడలేదు. చైతన్యస్ఫూర్తిగల వృక్షములకైనను వస్త్రములు చిత్రించబడ లేదు. జంతువులకైన లేదు. కారణమేమి? మానవునికి బుద్ధిబల మున్నది. ఇతర ములకు లేదు. మానవుడు సత్యమునకై బుద్ధితో అన్వేషించి కనుగొనగలడు.

**అవతారిక:**

ఆత్మయొక్క సాక్షిత్వమును చెప్పుచున్నారు.

దేహేంద్రియ మనోబుద్ధి ప్రకృతిభ్యో విలక్షణమ్।
తద్వృత్తి సాక్షిణం విద్యా దాత్మానం రాజవత్సదా॥ 18

**తాత్పర్యము:**

దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ప్రకృతి గుణములు మొదలైన వాటికంటె విలక్షణమై — యీ అన్నిటి వృత్తులకు సాక్షియైన ఆత్మను (మంత్రులు మొదలగువారి చర్యలకు సాక్షియైన రాజువలె) తెలియునది.

వ్యాఖ్యానము:

ఆత్మను చుట్టియున్న పంచకోశములును, శరీరత్రయమును, ఆత్మకాదని — యింతకుపూర్వమే వివరించబడినది — ఆత్మ విచారణవలన ఆత్మను చుట్టియున్న కోశాదుల నుండి ఆత్మ భిన్నమని గ్రహింపవలయునని చెప్పబడినది. ఈ సందర్భమున భిన్నముగా గ్రహించుట అనగా — అనాత్మ ఆత్మకాదని గ్రహించుట. అసలు అనాత్మయని చెప్పబడుచున్నదేది గాని సత్యమైనది కాక — మిథ్య యనియు గ్రహించుట.

ఆత్మ విచారణ చేయుటలో ఒక పద్ధతి యెట్టిదనగా — భిన్నములై — అదృశ్యములగు వానియందన్నిటి యందున్నదేమిటి యని విచారించుట. స్థూల శరీరము, సూక్ష్మశరీరము (ఇంద్రియములు మనస్సు బుద్ధి మొ॥) మాయ (లేక) ప్రకృతి. ఇవి నిత్యములు సత్యములు కావని తెలిసికొనవలెను. జాగ్రదవస్థయందు స్థూలశరీరము కొన్ని వృత్తులు కలిగియున్నట్లు తెలియుచున్నది. ఈ పనులు స్వప్నావస్థయందు కాని, గాఢనిద్రయందు కాని స్థూలశరీరమునకు లేవు. స్వప్నావస్థయందు సూక్ష్మశరీర మున్నది పనులు చేయుచు. అయితే గాఢనిద్రయందది దాని కారణమైన అజ్ఞానములో కలిసిపోవుచున్నది.

ఈ అజ్ఞానము జ్ఞానము లభింపగా నశించుచున్నది. కాబట్టి పంచకోశాదులు, శరీరత్రయము నిత్యములు కావు. అయితే నిత్యమైనది — ఈ అన్నిటికి సాక్షియైన ఆత్మ. అన్ని అవస్థలయొక్క అనుభవము కలది. అది ఉద్భవించదు. అది స్వయంప్రకాశమైనది — అది సాక్షిచైతన్యము. కూటస్థము.

ఈ శ్లోకమున సాక్షిచైతన్యమైన ఆత్మను రాజుతో పోల్చుట జరిగినది. రాజు రాజసభలో అధ్యక్ష స్థానమున కూర్చుండి మంత్రి సామంతాదుల కృత్యములను పర్యవేక్షించును.

శ్రీ విద్యారణ్యులవారు రచించిన పంచదశిలో (నాటక దీప ప్రకరణము) సాక్షి చైతన్యమైన ఆత్మ నాటకరంగస్థలమున వెలుగుచున్న దీపముతో పోల్చనడినది. నాటక రంగస్థలమున నున్న దీపము రంగస్థలమును వెలుతురుతో నింపును. రంగస్థలమున నటించుచున్న నటీనటులను పారిషదులకు కన్పించునట్లు వెలుగుతో నింపును. పరిషత్తును కూడ వెలుగులో నుంచును. నాటకశాలను అంతటిని వెలుగులో నింపును. నాటకము ముగిసిపోయినను — నాటకశాల నిర్మానుష్యమైనను దీపపు వెలుగునకు భంగము లేదు.

అవతారిక :

ఇంద్రియము లాత్మయను భ్రాంతికి ఉదాహరణము చూపుచున్నారు.

వ్యాపృతేష్వింద్రియేషు ఆత్మా వ్యాపారీవా వివేకినామ్।
దృశ్యతేఽభ్రేషు ధావత్సుధావన్నివ యథాశశీ॥ 19

తాత్పర్యము :

అవివేకులైన వారికి, ఇంద్రియములు తమ తమ వ్యాపారములు చేయుచుండగా - ఆత్మయే ఆ వ్యాపారములు చేయుచున్నట్లు తోచును. చుట్టుకొనియున్న మేఘములు కదలుచుండగా చందమామ కదులునట్లే తోచువిధముగా.

వ్యాఖ్యానము :

ఆత్మకు వ్యాపారములు లేవు. అది వ్యాపారములు చేయదు. జ్ఞానేంద్రియములకు వ్యాపారము లున్నవి. అవి ఆయా—వాటి వాటి—వ్యాపారములను చేయును. ఇంద్రియ వ్యాపారములను తప్పుగా ఆత్మ వ్యాపారములని భావించుట జరుగుచున్నది. అవి ఆత్మ చేయుచున్నట్లే తలపోయుచున్నారు. ఆత్మ సంకల్పములు చేయుచున్నదని చూచుచున్నదని. ఆలోచించుచున్నదని, సంభావించుచున్నదని తలచుదురు. ఇది అజ్ఞానమువలన. అయితే జ్ఞానులు ఆత్మ అఖండ అద్వితీయ సత్పదార్థమని దానికి క్రియలు ప్రతిక్రియలు లేవని తెలియుదురు.

వెన్నెల వెలుగులో మేఘములు కదులుచుండగా చందమామ కదులుచున్నట్లే తోచును. మేఘములు కదులుచున్నట్లు తోచదు. ఈ దృశ్యమును చూసి పిల్లలు చందమామ మేఘపు కొండలలో దాగుడుమూతలు ఆడుచున్నాడని నమ్ముదురు. అయితే అన్నియు తెలిసిన పెద్దవారు విషయమును పూర్తిగా గ్రహింతురు. మేఘములలో సాపేక్షముగా కదులుచున్నది చందమామ కాదనియు, చలనము కలిగి సాగిపోవుచున్నది మేఘము లనియు తెలియుదురు.

అవతారిక :

ఇంద్రియాదుల వ్యాపారములను గురించి చెప్పుచున్నారు.

ఆత్మచైతన్య మాశ్రిత్య దేహేంద్రియ మనోధియః।
స్వకీయార్థేషు వర్తంతే సూర్యాలోకం యథా జనాః॥ 20

(స్వకీయ అనుటకు స్వక్రియా అని పాఠాంతరము)

తాత్పర్యము:

చైతన్యమైన ఆత్మను ఆశ్రయించి, దేహము జ్ఞానేంద్రియ పంచకము మనస్సు బుద్ధి తమ తమ అర్థములందు (విషయ వ్యాపారము లందు) వర్తించు చున్నవి. జనులు సూర్యుని ప్రకాశముపై ఆధారపడి తమ తమ వ్యాపారములను చేసుకొనుచున్న విధముగా.

వ్యాఖ్యానము :

ఆత్మ క్రియాశీలి—చేష్టలు కలది—కాదు. అయితే ఆత్మను ఆశ్రయముగా తీసికొని అన్ని చేష్టలు జరుగుచున్నవి. ఆత్మ యీ చేష్టలకు ప్రతినిధికాదు. ఈ చేష్టల ఫలమును అనుభవించునదియు కాదు. ఈ చేష్టలకు, అనుభవములకు (ఇవి కేవల దృశ్యములు మాత్రమే) అది స్థితి భ్రమభావములైన భ్రాంతులకు - (సర్పము, పూలదండ - నీటిధార మొదలుగా) అవకాశమే లేదు — త్రాడు (రజ్జువు) లేకున్న యెడల.

మానవుల సంచార వ్యాపారాది చేష్టలకు సూర్యుని వెలుతురు కావలసినట్లే - ఆత్మ ప్రకాశనము - చైతన్యము - యీ అన్ని సంఘటనలకు ఆవశ్యకము, సూర్యుడు వెలుగుచుండగా జను లెన్నో పనులు చేయుదురు - మంచి పనులు - వ్యర్థమైన పనులు - ఈ అన్ని పనులకు ప్రత్యక్షముగా సూర్యునియొక్క బాధ్యత ఏమియులేదు. ఈ పనుల ఫలితములు కూడ సూర్యుని బాధించవు. అదేవిధముగా సాక్షీభూతమైన ఆత్మ — యీ యింద్రియాదుల వ్యాపార క్రియలతో - చేష్టలతో - సంబంధము పెట్టుకొన్నది కాదు. అవి జరుగుటకు మాత్రము వీలు కల్పించును.

అవతారిక :

అజ్ఞానులు ఇంద్రియాదుల కర్మలను భావించు వైఖరిని వివరించుచున్నారు.

దేహేంద్రియ గుణాన్ కర్మాణ్యమలే సచ్చిదాత్మని।
అధ్య స్యతేఽ వివేకేన గగనే నీల తాదివత్॥ 21

తాత్పర్యము :

అవివేకులు దేహ ఇంద్రియ గుణములను కర్మములను సచ్చిత్తు అయిన ఆత్మపై అధ్యారోపించుకొనుచున్నారు; ఆకాశమున నీలపు రంగును అపాదించుకొను చున్న విధముగా.

వ్యాఖ్యానము :

అధ్యారోపణము మఱియొక ఉదాహరణముతో విశదీకరింపబడినది. అఖండమైన ఆత్మయందు పరిమితములైన గుణకర్మ లెట్లు అధ్యారోపింపబడగలవన్న ప్రశ్న వచ్చును. ఈ ప్రశ్నకు సమాధానముగా ఆకాశముయొక్క ఉదాహరణము విశదీకరణము చక్కగా నుపయోగపడును.

మన తాత్త్విక సంప్రదాయములలో న్యాయవైశేషిక దార్శనిక భావములందు ఆకాశము సర్వవ్యాపి విభువు. ఆకాశము వర్ణము (రంగు) లేనిది — పరిమితి లేనిది కాని నీలిరంగు కలదిగా - కప్పువంటి ఆకారము కలదిగా తోచును. తెలియనివాడు ఆకాశమునకీ లక్షణములున్న వనుకొనును.

అదేవిధముగా సత్యమైన శాశ్వతమైన ఆత్మ — చైతన్యమున — దేహము యొక్క — జ్ఞానేంద్రియములు మొదలగువానియొక్క — గుణకర్మ విశేషములను అధ్యారోపించుచున్నారు. పరిశుద్ధమైన అఖండమైన ఆత్మ పరిమితమై మలినముగా తోచుచున్నది.

అవతారిక :

పూర్వ శ్లోకమున చెప్పినదానికే మఱియొక ఉదాహరణము చెప్పుచున్నారు.

అజ్ఞానాన్మానసోపాధేః కర్తృత్వాదీనిచాత్మని।
కల్ప్యన్తేఽమ్బుగతే చంద్రే చలనాదిః యథాంభసః॥ 22

తాత్పర్యము:

అజ్ఞానము కారణము వలన మనస్సుయొక్క కర్తృత్వాదులన్నియు ఆత్మయందు కల్పించుకొనుచున్నారు. నీటియందు ప్రతిఫలించిన చంద్రబింబము పైన నీటియొక్క ప్రవాహాదులను కల్పించుకొన్న విధముగా.

వ్యాఖ్యానము :

నేను, నాది — అన్న భావములు, కర్తృత్వము, సంకల్పము మొదలైన వన్నియు అంతఃకరణమునకు చెందినవి.

"నేను చేయుచున్నాను, నేను భోగించుచున్నాను" మొదలైన భావములు కలిగినది మనస్సు - చైతన్యము యొక్క ప్రతిబింబము - తెలియమివలన ఈ భావాదులను ఆత్మకు అంటగట్టుట జరుగుచున్నది. "నేను చేయుచున్నాను. నేను

భోగించుచున్నాను'' ఆత్మ చేయుచున్నదని, ఆత్మ భోగించుచున్నదని తలచుట జరుగుచున్నది.

ఈ సందర్భమున చంద్రుని దృష్టాంతము చెప్పబడుచున్నది. ఒకే చంద్రుడు జలమునందు ప్రతిఫలించుచున్నాడు - జలము ప్రవహించుచుండగా - సంభవించు అలలలో, సుడులలో చంద్రుని ప్రతిబింబము కదులును. తెలియనివారు ప్రతిబింబము కదులుచున్నట్లు కన్పించుటవలన చంద్రుడు కదులుచున్నాడని భ్రమింతురు.

అవతారిక :

రాగాదులు బుద్ధి సంబంధములని చెప్పుచున్నారు.

రాగేచ్ఛా సుఖ దుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే।
సుషుప్తౌ నాస్తి తన్నాశే తస్మాద్ బుద్ధేస్తు నాత్మనః॥ 23

తాత్పర్యము:

రాగ, ఇచ్ఛ, సుఖ దుఃఖాదులు బుద్ధి ఉన్నపుడే ప్రవర్తించునవి. నిద్రయందు బుద్ధి లయము పొంది ఉండు సమయమునందవి లేవు. కాబట్టి అవి బుద్ధికి సంబంధించినవే కాని ఆత్మకు సంబంధించినవి కానేకావు.

వ్యాఖ్యానము :

ఏది మార్పు చెందక సతతము ఉండునో, అది వాస్తవము అయినది, సత్యమైనది. మార్పులకు పరిణామములకు లోనై నిరంతర ముండనట్టిది సత్యము కాదు. వాస్తవమును కాదు. ఈ విధముగా వాదము పొడిగించి, అన్వయించి, ఆత్మ యొక్కటే సత్యమైనదని, ఇంద్రియాదులు సత్యము కాదని నిరూపించవచ్చును.

రాగము, ఇచ్ఛ, సుఖ దుఃఖములు ఆత్మసంబంధములు కావు. అవి ఆత్మను ఆశ్రయించి లేవు. అనుబంధించి లేవు. నిద్ర యందు కూడ ఆత్మ ఉన్నది. ఈ రాగ ఇచ్ఛ సుఖ దుఃఖాదులు లేవు. అవి జాగ్రదవస్థయం దున్నవి. స్వప్నమునం దున్నవి. అప్పుడు బుద్ధి పనిచేయుచున్నట్లు కన్పించుచున్నది. కావున అవి బుద్ధి సంబంధములు. అయితే బుద్ధి నిత్య సత్యము కాదు. దానికి సంబంధించినని కూడా నంతే. ఆత్మ ఎల్లప్పుడున్నది కావున నిత్యసత్యము. అది లేని స్థితి అనూహ్యము.

న్యాయవైశేషిక దార్శనిక సంప్రదాయమున రాగాదులు ఆత్మగుణములని చెప్పుట జరుగుచున్నది. ఆత్మ - ఒక ద్రవ్యము. ఇతర ద్రవ్యములకంటే ఆత్మ

ద్రవ్యము భేదించుట దాని గుణముల వలన - గుర్తించుట, ఇచ్ఛ కలిగియుండుట. ద్వేషము కలిగియుండుట, సుశీలము దుశ్శీలము కలిగియుండుట మొదలగునవి. గుణములు. ఈ గుణములు ఆకస్మికములు - అనిభావన - అవిసతతము ఆత్మయం దుండుట లేదు. కాబట్టి ముక్తస్థితిలో ఆత్మకే గుణములు లేవు. చైతన్యము కూడ లేదు.

న్యాయవైశేషిక దార్శనిక దృష్టిని అద్వైత సిద్ధాంతము పూర్వపక్షము చేయు విధాన మిట్లున్నది. ఈ గుణములు ఆత్మనివిష్టములైనచో అవి ఆత్మయందప్పు డప్పుడు లేకుండు టెట్లు? అవి లేకుండు టన్నది కలుగునేని అవి ఆత్మయందు గలవి కావు. అవి ఆత్మయొక్క సంఘటిత స్థితియందే ఉండునవి యగుచో (అట్లు న్యాయ వైశేషికము లనుచున్నవి) అవి ఆత్మను చుట్టుకొనిన బుద్ధివంటి వాటికే చెంది యుండవలెను.

అవతారిక :

ఆత్మ విషయము చెప్పుచున్నారు.

ప్రకాశోఽర్క స్యతోయస్యశైత్య మగ్నేర్యథోష్ణతా।
స్వభావః సచ్చిదానంద నిత్యనిర్మల తాత్మనః॥ 24

తాత్పర్యము :

సూర్యునికి ప్రకాశించుట స్వభావమైనట్లు, జలమునకు చల్లగా నుండుట స్వభావమైనట్లు, అగ్నికి వేడి స్వభావమైనట్లు ఆత్మకు సత్, చిత్, ఆనందములు నిత్యత్వము నిర్మలత్వము స్వభావములు.

వ్యాఖ్యానము :

స్వభావము నైజమైనది, అది మార్పు చెందదు. తెలుగునం దొక సామెత యున్నది "పుట్టితో పుట్టినది పుడకలతో పోవలెను" అని అనగా పుట్టుకతో వచ్చిన స్వభావము - పుడకలతో శరీరదహనముతో గాని పోదని.

మాండుక్య కారికలందు శ్రీ గౌడ పాదాచార్యులవారు "స్వభావమును మఱొక విధముగా మార్పు చేయుటకు వీలు లేదని చెప్పిరి. (ప్రకృతే రన్యథా భావఃనకథం చిద్ భవిష్యతి) దేనికిగాని ఉన్న లక్షణ మొకటి మారిపోయిన దన్నచో — ఆ లక్షణము దానిది కాదన్న మాట. ఒకదాని యొక్క స్వభావము ఆకస్మికము కానే

కాదు. ఒక వస్తువు దాని స్వభావము రెండు నొక్కటియే. వెలుగులేని సూర్యుని, చల్లదనము లేని జలమును, వేడిలేని నిప్పును ఊహించుటకే వీలులేదు. సూర్య గ్రహణ సమయమున సూర్యుని వెలుగు మనకు కన్పించనిచో — సూర్యుడు వెలుగును త్యజించినాడనికాదు. ఆయన వెలుగు మనకు కన్పించలేదని నీటికి నిప్పు తగిలించినచో వేడి పడును. అందుచేత జలమునకు చల్లదనము లేదని కాదు. దాని చల్లదనమును కొంతసేపు ఉష్ణత అధిగమించినది. అట్లే అగ్నియొక్క వేడిమి విషయమున కూడ.

సత్, చిత్, ఆనందము - సచ్చిదానందము బ్రహ్మము యొక్క స్వభావము. అది నిత్యము. శుద్ధము. ఈ స్వభావము మారదు. బ్రహ్మము సత్తు, కాలము దానిని లోబరచుకొనలేదు. బ్రహ్మమునకు కాలము లేదు. అది చిత్తు. స్వయంప్రకాశము అది ఆనందము. దానియందు దుఃఖము లవలేశము కూడ లేదు. అది నిత్యము శాశ్వతము, అఖండము, అనంతము, ఎట్టి కళంకము లేని శుద్ధము.

అవతారిక :

''అహం'' కారమును చెప్పుచున్నారు.

ఆత్మన స్సచ్చిదం శశ్చ బుద్ధే ర్వృత్తి రితిద్వయమ్।
సంయోజ్యచా వివేకేన జానామీతి ప్రవర్తతే॥ 25

తాత్పర్యము:

ఆత్మ యొక్క సత్ చిదంశము, బుద్ధియొక్క వృత్తి — ఈ రెండును అవివేకమువలన కలిపికొనుటవలన ''నేను తెలిసికొంటిని'' అన్న దేర్పడు చున్నది.

వ్యాఖ్యానము :

సత్యమును అసత్యముతో కలుపుట, ఆత్మను లక్షణములతో కలుపుట అజ్ఞానమువలన, అవిద్యవలన, అవివేకమువలన జరుగుచున్నది. ''నేను తెలిసి కొంటిని'' వంటి సంభావనలు అజ్ఞానమువలన జరుగుచున్న అధ్యారోపణ. దీని యందున్న 'నేను' 'అహంకారము'. జ్ఞానము ఆత్మస్వభావము.

జ్ఞానమైన ఆత్మ బుద్ధి వృత్తియందు ప్రతిబింబించినది. అజ్ఞానమువలన నిజ మగు అసలైన జ్ఞానమును తెలియక దాని ప్రతిబింబమునే అసలైనదనుకొనుట జరుగుచు జ్ఞానమును బుద్ధివృత్తికి అనుసంధించుచుండుట యగుచున్నది.

అవతారిక :

ఆత్మ బుద్ధులను వివరించుచున్నారు.

ఆత్మనో విక్రియా నాస్తి బుద్ధేర్బోధో న జాత్వపి।
జీవ స్సర్వమలం జ్ఞాత్వా కర్తా ద్రష్టేతి ముహ్యతి॥ 26

(జాత్వపి అనుటకు జ్వాత్వితి అని పాఠాంతరము. కర్తా అనుటకు జ్ఞాతా అని పాఠాంతరము).

తాత్పర్యము :

ఆత్మకు పరిణామము - మార్పులేదు. బుద్ధికి జ్ఞానమన్నది లేనేలేదు. వైయక్తిక ఆత్మ - జీవుడు - అన్నియు తెలిసి (తప్పుగా) మిక్కిలి భ్రమకులోనై "నేను కర్తను, నేను ద్రష్టను" అని తలచుచున్నాడు.

వ్యాఖ్యానము:

మార్పు పరిణామము వికల్పము బుద్ధికి కలుగును. చంచలత్వము, సంకల్ప వికల్పములు బుద్ధికి సంబంధించినవే. ఇవి ఆత్మకు కలుగనే కలుగవు. చెందనే చెందవు.

జ్ఞానము - బోధ - ఆత్మయొక్క అసలైన స్వభావము. బుద్ధి ప్రకృతి జన్య మగుటవలన స్వభావముగానే జ్ఞానము - తెలివి - కలదికాదు. ఆత్మమార్పు - నాశనము లేనిది. బుద్ధి సతతము మారుచుండును. నిద్రలో లయము చెందుచుండును. అవిద్య (అజ్ఞానము) వలన చైతన్యమైన ఆత్మయొక్క ప్రతిబింబము (బుద్ధియందు) ను ఆత్మగానే తలచుట జరుగుచున్నది. ప్రాథమికమైన యీ తప్పువలన సకల లౌకిక వ్యవహారము నడుచుచున్నది. పరిశుద్ధమైన ఆత్మ - ఆకారణమువలన "నేను తెలిసి కొంటిని - నేను చేయుచున్నాను. నేను చూచుచున్నాను" మొదలగు సంభావనలందు భ్రమించి విశ్వసించుట జరుగుచున్నది.

అవతారిక :

జీవభ్రాంతిని గురించి చెప్పుచున్నారు.

రజ్జు సర్ప వదాత్మానం జీవం జ్ఞాత్వా భయం వహేత్।
నాహం జీవః పరాత్మేతి జ్ఞాతంచేన్నిర్భయో భవేత్॥ 27

తాత్పర్యము :

త్రాడును సర్పముగా భ్రాంతిపొందినట్లు, ఆత్మను జీవునిగా తలంచుటవలన భయము పొందుట జరుగుచున్నది. ఆత్మ జీవుడుకాదని పరమాత్మయని తెలియగా నిర్భయమగుచున్నది.

వ్యాఖ్యానము:

ప్రసిద్ధమయిన సర్పరజ్జు భ్రాంతి ఉదాహరణ మిచట చెప్పబడినది. త్రాడు మాత్రమే ఉండగా దానిని చూచి (చీకటిలో) పాముగా భ్రాంతి కలిగినపుడు భయము కలిగినవాడై వణికిపోవును. కొంతమంది క్రిందపడిపోయి మరణించుట కూడ జరుగుచున్నది. కాని అపు డొక దీపమును పుచ్చుకొని దాని దగ్గరకుపోయి పరిశీలించినచో — అది త్రాడని పొరపాటున పాముగా భ్రాంతి పొందితినని తెలియును. ఈ తెలియుటవలన భయము అదృశ్యమగును.

అదే విధముగా పరమాత్మ అభిన్నమైన ఆత్మను జీవుడనుకొని పరిమిత ప్రజ్ఞా భౌతిక స్వరూపగతునిగా భావించుకొన్నపుడు - తత్ఫలితముగా సంసారమగ్నుడై తదుచితములైన బాధలు కష్టములు దుఃఖములు అనుభవించును. అయితే ఆత్మ విచారణము చేయుటవలన వివేకముకలిగి భ్రాంతిని తొలగించుకొని తాను అద్వితీయ అఖండ ఆత్మయన్న జ్ఞానలాభమును పొందును. ద్వయము - రెండు - ఉన్నపుడు భయముండునని ఉపనిషద్వచనము. ద్వయముకాకుండ — అద్వయమైనపుడు దేనిని గురించి భయము? భీతి లేకుండుట ద్వైతరహితము. అభయము అద్వైతము.

అవతారిక :

ఆత్మప్రకాశమును గురించి చెప్పుచున్నారు.

ఆత్మావభాస యత్యేకో బుద్ధ్యాదీ నింద్రియాణ్యపి।
దీపో ఘటాదివత్ స్వాత్మా జడైస్తై ర్నావ భాస్యతే॥ 28

తాత్పర్యము :

ఆత్మయే బుద్ధిని, జ్ఞానేంద్రియములను ప్రకాశింపజేయుచున్నది. దీపము ఘటాదులను ప్రకాశింపజేయునట్లు. ఆత్మ ఆ జడవస్తువులచేత ప్రకాశింపజేయబడదు.

(ఘటాదివత్ అనుటకు ''ఘటానివ'' అని పాఠాంతరము.)

వ్యాఖ్యానము :

ఆత్మ యొక్కటే స్వయంప్రకాశమైనది. ప్రకాశించుచున్నట్టి యితరము లన్నియు - జ్ఞానేంద్రియములును - బుద్ధి - ఆత్మ ప్రకాశము వలనే ప్రకాశించుచున్నవి. ఇచట "ప్రకాశము" (వెలుగు) అనగా చైతన్యము, బోధ జ్ఞానదీపము. ఆత్మచిత్తు బోధ. బుద్ధి లేక మనస్సు తెలివిగలదని మనము పొరబాటున భావించుచున్నాము. మనస్సు జడపదార్థ సంకలితము. మనస్సునకు జడవస్తువునకు గల భేదము వైవిధ్య గతము కాదు. పరిమాణగతమైనది కాదు. వస్తువుల పరిజ్ఞానము తెలిసికొనుచున్న మనస్సు ఆత్మ తనలో ప్రతిఫలించుటవలన నట్లు చేయగలుగుచున్నది. మనస్సు చైతన్యవంతమగుటకు దానికి ఆధారముగా ఆత్మయుండుట.

బుద్ధి వృత్తివలన ఆత్మజ్ఞాన మెట్లు సాధ్యమగును? దీనికి సమాధానము స్పష్టము చేయవలసియున్నది. వస్తువులను మనము తెలిసికొనుచున్నట్లుగా ఆత్మను తెలిసికొనుట జరుగదు. ఘటము మొదలగువస్తువులను తెలిసికొనుటలో బుద్ధి బాహిరముగా ప్రసరించి ఆ వస్తురూపమును గ్రహించిన పిమ్మట. అందువలన ఆ వస్తువునందు చైతన్య ప్రతిఫలము జరుగవలెను. అనగా ఆ వస్తువునందెల్ల బుద్ధి వృత్తి వ్యాప్తిని చెందవలెను. మరియు చైతన్య ప్రతిఫలము (ఫలవ్యాప్తి) జరుగవలెను.

ఇందు వృత్తి వ్యాప్తివల్ల అజ్ఞానము తొలగును. ఫలవ్యాప్తి వలన వస్తు ప్రత్యక్షత కలుగును. అయితే ఆత్మవిషయముగా నిట్లు జరుగనవసరములేదు. ఆత్మ చైతన్యమే అగుటవలన. బుద్ధిచేయవలసినదేమనగా అభ్యంతరముగా నున్న అంతర అజ్ఞానమును తొలగించుట. ఈ అంతర అజ్ఞాన నివారణమే ఆత్మజ్ఞానమని చెప్పబడుచున్నది.

ఇచ్చట చెప్పబడిన ఉదాహరణము "దీపము" దీపము ఘటాది వస్తువులను ప్రకాశింపజేయునేగాని తనయొక్క ఉనికి నిరూపణకు ఆ ఘటాదు లక్కఱలేదు.

అవతారిక :

జ్ఞానమునకు మరియొక జ్ఞానము అక్కఱలేదనుచున్నారు.

స్వబోధేనాన్య బోధేచ్ఛాబోధ రూపతయాత్మనః।
న దీప స్యాన్య దీపేచ్ఛా యథా స్వాత్మ ప్రకాశనే॥ 29

తాత్పర్యము :

స్వాత్మ జ్ఞానమునకై మరియొక జ్ఞానావసరములేదు. ఆత్మ జ్ఞానమే కాబట్టి. దీపము ప్రకాశించుటకు మఱియొక దీపాపేక్ష లేనేలేదు.

వ్యాఖ్యానము :

దీపముయొక్క ఉదాహరణ పొడిగింపబడినది. దీపము ప్రకాశించుటకు మరి యొక దీపముయొక్క ఆవశ్యకత లేదు. ఘటము మొదలగు వస్తువులను వెలిగించుచు దీపము తన్నుకూడా వెలిగించుకొనును కాబట్టి.

అదేవిధముగా స్వయంప్రకాశమైన ఆత్మ మఱియొక విధమైన ప్రకాశము పైనను ఆధారపడి యుండలేదు. తాను ప్రకాశించుటకు "అచట (ఆత్మయందు) సూర్యుడు ప్రకాశించడు, చంద్రుడు ప్రకాశించడు. తారకలును ప్రకాశించవు. విద్యుత్తును ప్రకాశించదు. అగ్నిమాత్రము ఎట్లు ప్రకాశించును? ఆత్మ ప్రకాశించగా-యివి యన్నియు ప్రకాశించును. ఆత్మయొక్క వెలుగువలన - ఇవి యన్నియు వెలార్చబడుచున్నవి." అని ఉపనిషద్వచనము.

అవతారిక :

ఆత్మ పరమాత్మల సమైక్యత తెలుగవలసిన విధానము చెప్పుచున్నారు.

నిషిధ్య నిఖిలోపాధీన్ నేతి నేతీతి వాక్యతః।
విద్యాదైక్యం మహావాక్యైర్జీవాత్మ పరమాత్మనోః॥ 30

తాత్పర్యము :

ఇది కాదు, ఇది కాదు, అని ఉపాధులన్నిటిని పరిత్యజించి - మహావాక్యోప దిష్టముగా జీవాత్మ పరమాత్మల ఐక్యతను అనుసంధించుకొనవలెను.

వ్యాఖ్యానము :

బ్రహ్మ - ఆత్మల నెట్లు తెలియపలెను? ఉపనిషత్తు లేమి చెప్పుచున్నవి. (ఆత్మ బ్రహ్మములను గురించి) ఉపనిషత్తులు రెండు విధములుగా చెప్పుచున్నవి. ఇదికాదు, ఇదికాదు అని. (అభావార్థకము) స్వభావ లక్షణములను చెప్పును, (భావార్థకమును)- ఆత్మ ఇది కాదు, ఇది కాదు అని చెప్పు ఉపనిషత్పాఠములు అభావార్థకముగ చెప్పు చున్నవి. ఈ ఉపనిషత్పాఠముల తాత్పర్య మేమనగా - పరిమితి, పరిమాణము కలిగి యున్నది - వస్తువుగా అనుభవయోగ్యమైనది - ఆత్మ కాదని. ఏది ఆత్మ కాదో అది నిషేధింపబడినది, అతద్వ్యావృత్తి. అజ్ఞానవశమున ఆత్మ దేహముగా, మనస్సు మొదలైనవిగా భావింపబడుచున్నది. ఈ భ్రాంతి తొలుత నివారింపబడవలెను. తరు వాత ఆత్మస్వభావమును ఉపనిషత్తులు భావార్థముగ చెప్పుచున్నవి. ఈ భావార్థ ప్రక టనము మహావాక్యములు చేయుచున్నవి.

నాలుగు వేదములకు నాలుగు మహావాక్యము లున్నవి. ఋగ్వేద మహావాక్యము- ప్రజ్ఞానం బ్రహ్మ (ప్రజ్ఞానమే బ్రహ్మము) ఇది ఐతరేయ ఉపనిషత్తు నందున్న మహా వాక్యము. (V-3). యజుర్వేద మహావాక్యము "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మను). ఇది బృహదారణ్యక ఉపనిషత్తు నందున్న మహావాక్యము (I-IV-20). సామవేద మహావాక్యము "తత్త్వమసి" - (అది నీవే) ఇది ఛాందోగ్య ఉపనిషత్తు నందున్న మహావాక్యము (VI-*3) అధర్వ వేద మహావాక్యము 'అయమాత్మ బ్రహ్మ' (ఈ ఆత్మయే బ్రహ్మము) ఇది మాండుక్య ఉపనిషత్తులో నున్న మహావాక్యము (2)

ఈ మహావాక్యములు నాల్గింటియందు - రెండు పదములు - ఒకటి వైయక్తిక ఆత్మ - రెండవది పరబ్రహ్మము - పొందికగా - ఏకాన్వయస్ఫూర్తిగా ఉపయోగింప బడినవి. ఈ పరిస్థితిలో తప్పక ఉత్పన్నమగు ప్రశ్న కలదు. "ఇన్ని హద్దులు పరి మితులు కల వైయక్తిక ఆత్మ అపరిమితమై - అఖండమైన పరమాత్మతో అభిన్న మెట్లగును?" దానికి సమీచీనమైన సమాధానమున్నది.

ఈ పదములయొక్క కేవల వాచ్యార్థము తీసికొన్నచో అర్థవైరుధ్యముండును. కాబట్టి యీ పదముల లక్ష్యార్థమును గ్రహింపవలెను. ఈ వాక్యముల అన్వయములో విశేషమున్నది.

ఒక వాక్య మన్వయింపవలసి రాగా శక్తిని గాని లక్షణను గాని గ్రహింప వలెను. శక్తియనగా పదములకు స్వతస్సిద్ధమైన యర్థము. లక్షణ అనగా శక్తిని ఆశ్రయించినపుడు తాత్పర్యమునకు హాని కలుగునేని అప్పుడు శక్యమగు శక్తిచే బోధింపబడిన పదార్థ సంబంధమైన మఱియొక దానిని తాత్పర్యమునకు అనుకూలముగ తెచ్చి దాని అర్థము చెప్పుట. మఱియు శక్యమును సంపూర్ణముగ వదులుటయు వదల కుండుటయు కలదు. ఈ లక్షణములకు క్రమముగా జహల్లక్షణ, అజహల్లక్షణ అని పేర్లు. "తత్త్వమసి" మహావాక్యమును అన్వయించుటకీ రెండు లక్షణములును పనికిరావు. ఇచట శక్తిచే తెలియజేయబడునవి (శక్యములు) వాచ్యార్థములే. అవి పరస్పర విరుద్ధములు. అందువలన ఈ పదార్థము (ఐక్యము) అన్వయించదు. విరుద్ధ ములకైక్యము పొసగదు కావున. అందుచే యీ వాక్య అన్వయమునకు శక్తిని ఆశ్రయించుటకు వీలులేదు. ఇక లక్షణమును ఆశ్రయింతుమన్న జహల్లక్షణ పనికి రాదు. వాచ్యార్థముల సంపూర్ణముగ వదలినచో నైక్యము స్వతస్సిద్ధము. అపుడు జీవేశ్వరులే వేరు. అప్పుడు వాక్యమే నిరర్థకము. ఏలననగా జీవేశ్వరులే లేనపుడు జీవేశ్వరైక్య మేమి?

అజహల్లక్షణము పనికిరాదు. వాచ్యార్థముల సంపూర్ణముగ విడువనిచో నైక్యము కుదురదని మొదటనే చెప్పియున్నాము. ఈ వాక్యమును అన్వయించుటకై "విడిచియు విడువకుండుట" అనునది స్వరూపముగా గల మూడవ లక్షణము జహద జహల్లక్షణ" అన్నది అంగీకరింపబడినది. ఇది లోకానుభవ విరుద్ధము కాదు. ఒక పురుషుని ఒక వయస్సున (ఒక కాలమున) నొక స్థలమున నొక వేషముతో జూచిన వాడు - అదే పురుషుని మరొక వయస్సున (కాలమున) మఱొక స్థలమున మఱొక వేషముతో చూచి 'వాడే వీడు' అని గుర్తించును. ఇది ప్రత్యక్షము. "వాడే వీడు' - "వాడును వీడును ఒక్కటియే" - అను సమన్వయ మెట్లు? వాడు అనగా తొలుత చూడబడినప్పటి దేశకాల వేషాదులవాడు. ఇట వాచ్యార్థములగు పూర్వప్రస్తుత దేశకాల యుక్తపురుషుల కైక్యము శక్తిచే కాని, జహల్లక్షణ, అజహల్లక్షణచే కుదరదు. కావున దేశకాలములను, సంపూర్ణముగ త్రోసివేయక వివేకదృష్టితో మాత్రమే తొలగించి, లక్ష్యార్థమగు పురుషులకు నైక్యము చెప్పు చున్నారు.

ఇట్లే యీ మహావాక్యమున వాచ్యార్థమును సంపూర్ణముగ త్రోసివేయక, వివేక దృష్టితో మాత్రము తొలగించి, లక్ష్యార్థములైన - కూటస్థ బ్రహ్మలకు జహద జహల్లక్షణచే నైక్యము చెప్పవలెను. అహంబ్రహ్మాస్మి = నేనే (కూటస్థుడునే) బ్రహ్మము. ప్రజ్ఞానంబ్రహ్మ = జ్ఞానస్వరూపుడగు జీవుడే (కూటస్థుడే) బ్రహ్మ - అయమాత్మ బ్రహ్మ - ఈ యాత్మయే (కూటస్థుడే) బ్రహ్మము. తత్త్వమసి = ఆ శుద్ధచైతన్యము కూటస్థ స్వరూపుడవగు నీవే అయియున్నావు.

అవతారిక :

నిత్యానిత్య వివేకమును చెప్పుచున్నారు.

అవిద్యాకం శరీరాది దృశ్యం బుద్బుదవత్క్షరమ్।
ఏతద్విలక్షణం విద్యాదహం బ్రహ్మేతి నిర్మలమ్॥ 31

తాత్పర్యము :

అవిద్యా (అజ్ఞాన) జన్యములైన వస్తువులు - దేహాదులు - నీటిబుడగవలె నశ్వరములు. ఇంతకు విలక్షణముగా నేను పరిశుద్ధమగు బ్రహ్మమునే అని తెలియ వలెను.

వ్యాఖ్యానము :

ఆత్మను - అనాత్మవస్తువులైన దేహాదులతో అభిన్నముగా సంభావించుట తొలుత పోవలెను. ఇది విచారణవలన సాధింపవలెను. ఈ విచారణ చేయవలసిన విధానమెట్టిదో - యీ శ్లోకమునందును, తరువాత శ్లోకములందును వివరించుట జరిగినది. ఇది ఆత్మవిచారణ బ్రహ్మ విచారము.

దేహాదులు ఆత్మకాదు. ఏలననగా అవి అజ్ఞాన (అవిద్యా) సంవలితములు. అవి ఇంద్రియాదులచే కనుగొనబడుచున్నవి - నీటిబుడగల వలె క్షణికములు. అజ్ఞానమువలన అవిద్యవలన తోచినదేదిగాని సత్యమే కాదు. రజ్జుసర్పమువలె దృశ్యమైన దేమియు - స్వప్నమున ప్రతీయమానములైన దృశ్యములవలె - సత్యముకాదు. ఏది నిత్యము కాదో - శాశ్వతము కాదో అది సత్యము కాదు నీటిబుడగవలె. ఆత్మ అవిద్యాకల్పితము కాదు. అది - ఆత్మ - అవిద్యను కూడ వెల్లడి చేయగలది. దృష్టిగోచరమైన దృశ్యముకూడ ఆత్మకాజాలదు. అది స్వయంప్రకాశము. ఆత్మ - ఉనికి లేనిదనికాని, అశాశ్వతమైనదనిగాని చెప్పుటకు వీలులేదు. ఎవడుగాని తన ఉనికిని కాదనజాలడు గదా! "నేను లేను - నాకు ఉనికి లేదు. అన్నవాడెవడు నుండడు. దేహమునకు, ఆత్మకు భేదమున్నదని గ్రహించి - అఖండ అద్వితీయ నిత్యశుద్ధ పరబ్రహ్మము తానేనని తెలియవలెను.

అవతారిక :

ఆత్మకు జన్మాదులు లేవని చెప్పుచున్నారు.

దేహాన్యత్వాన్నమే జన్మ జరాకార్శ్యలయా దయః।
శబ్దాది విషయై స్సంగోన నిరింద్రియ తాన చ॥ 32

తాత్పర్యము :

నేను దేహముకంటే భిన్నుడను కాబట్టి జన్మము, జర, పరిణామము, మరణము నాకు చెందవు. నాకు ఇంద్రియములు లేవు గనుక ఇంద్రియ విషయములైన శబ్దాదులతో నాకు సంబంధములేదు.

వ్యాఖ్యానము :

అధ్యారోపము రెండు విధములు. ఒకదానికి బదులు మరొకదానిని భావించుట. ఒకదాని లక్షణములను, గుణములను మరొక దానియందు సంభావించుట. త్రాడును

పాముగా పొరపాటుపడుట, మొదటిపద్ధతి. ఎఱ్ఱతామర పూవురంగు శుద్ధస్ఫటికమందు చూచుట రెండవ పద్ధతి. ఆత్మ విషయమునం దీ రెండు విధములైన అధ్యారోపము జరుగుచున్నది. — ఆత్మను అనాత్మగా భావించుట, అనాత్మగుణ లక్షణములను ఆత్మ గుణలక్షణములుగా సంభావించుట. ఈ అధ్యారోపము ఆత్మవిచారణ వలన తొలగించుకొనవలయును.

తొలుత భౌతికకాయమైన స్థూలశరీర మే విధముగా ఆత్మకాజాలదో పూర్వ శ్లోకములందు నిరూపింపబడినది. దేహము ఆత్మకానప్పుడు దేహము యొక్క గుణ లక్షణ దోషములు ఆత్మకుచెందవు. జన్మించి, పెరిగి - చెడిపోయి, నశించునట్టి దేహము శరీరమునకు మార్పులు పరిణామము కలవు — కాబట్టి అవి ఆత్మకు చెందవు. ఆత్మకు పుట్టుక లేదు. వయస్సు లేదు. పరిణమించుట లేదు. మృత్యువు లేదు. అది నిత్యము.

స్థూలదేహము కంటే సూక్ష్మమైనవి జ్ఞానేంద్రియములు. జ్ఞానేంద్రియముల పని యేమనగా - ఆయా ఇంద్రియ విషయములతో మనస్సునకు అనుబంధము కల్పించుట. అందువలన ఆ విషయ పరిజ్ఞానము కలుగును. ఆ విషయానుభవము కలుగును. ఆత్మ జ్ఞానేంద్రియములు కాదు కాబట్టి ఆ జ్ఞానేంద్రియముల క్రియా కలాపము ఆత్మకు చెందదు. చూచుట, వినుట, స్పృశించుట, రుచి చూచుట, వాసన చూచుట, ఆత్మ చేయు పనులు కావు. అట్లే నడచుట, ఆయాసపడుట కూడను కావు.

అవతారిక :

మనస్సు ఆత్మకాదు కనుక మానసికసంబంధములైన గుణక్రియలు ఆత్మకు లేవనుచున్నారు.

అమనస్త్వాన్నమే దుఃఖ రాగద్వేష భయాదయః।
అప్రాణోహ్యమనా శ్శుభ్ర ఇత్యాది శ్రుతి శాసనాత్॥ 33

తాత్పర్యము :

నేను మనస్సున్నవాడను కాదు కనుక, దుఃఖము, రాగము, భయము, ద్వేషము మొదలగునవి నాకు కావు. శ్రుతిశాసించుచునే యున్నది - ఆత్మకు ప్రాణము అనుబంధము లేదని - మనస్సు లేదని, పరిశుద్ధమైనదని - మొదలుగా —

వ్యాఖ్యానము :

మనస్సు - బుద్ధి - కూడ ఆత్మకాదు. కావున మనోవృత్తులు. బుద్ధివృత్తులు ఆత్మవికావు. నిజముగా వృత్తులు లేక మనస్సు లేదు. బృహదారణ్యక ఉపనిషత్తు. "కోరిక (వాంఛ) - ఊహ, విశ్వాసము, అవిశ్వాసము, స్థిరత, అస్థిరత, లజ్జ, ధ్యానతత్పరత, భీతి, — ఇట్టిదంతయు మనస్సు" అనుచున్నది. (I-V-3) మనము "నేను వాంఛించుచున్నాను" లేక "నేను ఊహించుచున్నాను" అనినప్పుడు మనస్సు పైన ఒక వృత్తిని ఆవరింపజేయుచున్నాము. వివేకమువలన ఆ ఆవరణములను తొల గింపవలెను.

ఈ శ్లోకమునందు ముండకోపనిషత్తు నుండి కొంత (II-i-2) ఉద్ధరింపబడి నది — "(ఆత్మ) ప్రాణవాయు రహితము, శుద్ధము, మహత్తు కంటే మహిత యైనది — నాశము లేనిది (అవ్యక్తమైన కారణము) అని ఆ ఉపనిషత్తులోని వచనములు.

అవతారిక :

ఆత్మను విశదీకరించుచున్నారు.

నిర్గుణో నిష్క్రియో నిత్యో నిర్వికల్పో నిరంజనః।
నిర్వికారో నిరాకారో నిత్యముక్తోఽస్మి నిర్మలః॥ 34

తాత్పర్యము :

గుణరహితమై, క్రియారహితమై, నిత్యమై, వికల్పశూన్యమై నిరంజనమై వికారములు (పరిణామములు) లేక, ఆకారవర్జితమై, ఆత్మనగు నేను నిత్యముక్తుడను, నిర్మలుడను.

వ్యాఖ్యానము:

భ్రమ కల్పితములైన గుణాదులను తొలగించినపుడు ఆత్మ పరిశుద్ధము అద్వితీయము. ఆత్మ లాభము కలిగినవాని సిద్ధి విశదీకరింపబడినవి.

బ్రహ్మముకంటే అన్యము కాని ఆత్మనగు నాకు గుణములు లేవు. గుణ కలితము అగు మనస్సు నాకు లేదు. దాని గుణములు నన్నంటవు. క్రియలు జ్ఞానేంద్రియము లవి. జ్ఞానేంద్రియములు నాకు లేవు గనుక ఆ క్రియలు నావి కావు. నేను నిష్క్రియుడను. అవస్థాత్రయ అనుభవసాక్షినై నేను నిత్యుడను. కాలముచేత నేను

అబాధ్యుడను. వికల్పము మానసిక సంబంధి. నాకు మనస్సు లేదు. అందుచేత నేను నిర్వికల్పుడను. నాకు రాగము లేదు. నేను అఖండుడను. కావున నిరంజనుడను. నాకు వికారములు లేవు. పరిమితుడను కాను కాబట్టి పరిణామములు లేవు. నాకు ఆకారము లేదు. నాకు పరిణామములు లేవు కావున, బంధము, భ్రాంతి సత్యము కాదు. నేను అందుచేత నిత్యముక్తుడను. నాపై ఏ ప్రభావము లేదు కావున నేను నిర్మలుడను.''

అవతారిక :

ఆత్మ విశదీకరణ చేయుచున్నారు.

అహ మాకాశవత్ సర్వ బహిరంతర్గతోఽచ్యుతః।
సదా సర్వ సమస్సిద్ధో నిస్సంగో నిర్మలోఽచలః॥ 35

తాత్పర్యము :

ఆకాశమువలె నేను బహిరంతరముల—సర్వమున—వ్యాపించి యున్నాను. నేను అచ్యుతుడను. ఎల్లప్పుడు నేను ఎల్లెడల సమసిద్ధుడను. నిస్సంగుడను. నిర్మలుడను. అచలుడను.

ఆకాశ ఉపమాన మిదివరకే వివరింపబడినది. ఆకాశమువలె ఆత్మ సర్వవ్యాపి. దానికి బయట లోపల అని లేదు. — అది అంతయు కాబట్టి అది పడిపోవుట కేదియు లేదు కావున అది అచ్యుతము. అది చలనము లేనిది. అచంచలము. ఎల్లప్పుడు, ఎల్లెడల సమస్థితి యందున్నది. ఎప్పుడో సంపాదించవలసినదిగాని, సాధింపవలసినది గాని కాదది. అది నిత్య సిద్ధము. ఆత్మసిద్ధి పొందవలెనని చెప్పుట అలంకారికము. ఆత్మసిద్ధి అనగా — ఇదివరకే సిద్ధియైన దానిని తెలియుట మాత్రమే. ఆత్మకు అనుబంధ సంబంధములు లేవు. అది అహంకార సంబంధము లేనిది. దానికి మలదోషము లేదు. త్రిగుణాతీతము కాబట్టి అది సర్వసంపూర్ణము కాబట్టి అచలము.

అవతారిక :

ఆత్మ విశదీకరణయే చేయుచున్నారు.

నిత్యశుద్ధ విముక్తైక మఖండానంద మద్వయమ్।
సత్యం జ్ఞాన మనంతం యత్పరం బ్రహ్మాహమేవ తత్॥ 36

తాత్పర్యము :

నిత్యమై, శుద్ధమై, బుద్ధము క్తమై, అఖండానందమై, అద్వయమై, సత్యమై, జ్ఞానమై, అనంతమై వెలయు పరమగు బ్రహ్మమునే — నేను.

వ్యాఖ్యానము :

కాలాతీతము కావున బ్రహ్మ నిత్యము. ఎప్పుడుగాని అజ్ఞాన ప్రభావము దానియందు లేదు కావున బ్రహ్మము శుద్ధము. అది స్వభావముగనే ముక్తము. దానిని బద్ధము చేయగలిగిన దేమియు లేదు. అది అద్వయము. అట్టిది మఱొకటి లేదు. అది అఖండమైన ఆనందము. దానికి స్పర్శ లేదు. తైత్తిరీయ ఉపనిషత్తు (ii-2) బ్రహ్మము సత్ చిత్, ఆనందముగా నిర్వచించినది సత్ — త్రికాలముచేత బాధింప బడనిది. చిత్ = స్వయంప్రకాశమైనది. అఖండ ఆనందస్వరూపమైనది. ఆత్మసిద్ధి అనగా అహంబ్రహ్మాస్మి అనుకొను స్థితి.

ఉపకారిక :

తైలధారవలె ఆత్మభావన చేయవలె ననుచున్నారు.

ఏవం నిరంతర కృతా బ్రహ్మైవాస్మీతి వాసనా।
హరత్య విద్యా విక్షేపాన్ రోగానివ రసాయనమ్॥ 37

తాత్పర్యము :

"అహం బ్రహ్మాస్మి" అన్న భావన నిరంతరము చేయుటవలన అవిద్యా విక్షేపములను హరించును - ఔషధము రోగములను నిర్మూలించినట్లు.

వ్యాఖ్యానము :

ఆత్మ విచారణవలన ఆత్మసిద్ధి కలుగనిచో - ఆత్మసిద్ధికి అవరోధములు తొలగింపబడలేదని, అనాదియైన అవిద్యవలన దేహమే ఆత్మ యన్న భావము అతి దృఢమై నిలచినది. దీనిని తొలగించుటకుగాను దానికి వ్యతిరేకముగా "అహం బ్రహ్మాస్మి" (నేను పరబ్రహ్మను) అన్న భావము నిరంతర మననముచేత బలపరచి దృఢముచేసి స్థిరము చేయవలెను. ఈ ధ్యానముయొక్క లక్ష్యమేమనగా మనస్సు యొక్క స్వభావ చంచలత్వమును పోగొట్టి ఏకాగ్రముగా అద్వితీయమైన ఆత్మయందు సంలగ్నము చేయుట.

అవిద్య దానిచే పరిదృశ్యమానము లగుచున్న ప్రపంచము—ఆత్మను కలవర పెట్టుచున్న రోగములు. ఈ రోగములను నిర్మూలించు ఔషధము ఆత్మధ్యానము

ఔషధము క్రొత్తదానిని తీసికొనిరాదు. అకస్మాత్తుగా వచ్చిన రోగమును నిర్మూలించి స్వాభావిక స్వాస్థ్యమును పునరుద్ధరించును. అట్లే అవిద్యయు దాని దృశ్యములను. ఆత్మధ్యానము వాటిని నిర్మూలించును. అది జరిగినపుడు ఆత్మయొక్క యథార్థస్థితి వెలార్చబడును.

అవతారిక :

ఆత్మధ్యాన మెట్లు చేయవలెనో చెప్పుచున్నారు.

వివిక్త దేశ ఆసీనో విరాగో విజితేంద్రియః।
భావయే దేక మాత్మానం తమ నంత మనన్యధీః॥ 38

తాత్పర్యము :

విజన ప్రదేశమున కూర్చుండి విరాగియై, ఇంద్రియములను నిగ్రహించి. ఏకమై అనంతమైన ఆత్మను గురించి ఏకాగ్రమైన మనసుతో ధ్యానింపవలెను.

వ్యాఖ్యానము :

ఆత్మ ధ్యానము చేయు పద్ధతి వివరింపబడినది. ధ్యాన మనగా మనస్సుయొక్క అపకేంద్రగామియైన స్వభావమును మధ్యగామియైన దానిగా మార్చుట. ఇందుకు దోహదమిచ్చు అంతరబాహిరమైన ఉపాయములను అనుసంధించుకొనవలెను. పతంజలి మనకు అష్టాంగయోగమును ప్రసాదించెను. ఈ యోగమువలన మానసిక శిక్షణతో ప్రారంభమై — దాని స్థిరత్వము లభించును. మానసిక ఏకాగ్రతయొక్క ఆవశ్యకతను ఉపనిషత్తులు భగవద్గీత కూడ చెప్పుచున్నవి. కఠోపనిషత్తు (ii-24) "చెడు ప్రవర్తన నుండి విడుపడనివాడు గాని. సరళ శాంతస్వభావుడు కానివాడు గాని ఆత్మను జ్ఞానమువలన సిద్ధి పొందలేడు" అని చెప్పినది.

భగవద్గీత ధ్యాన పద్ధతిని వివరించినది (vi-10-15)

యోగీయుం జీత సతత మాత్మానం రహసిస్థితః।
ఏకాకీయత చిత్తాత్మానిరాశీర పరిగ్రహః॥

శుచౌదేశే ప్రతిష్ఠాప్యస్థిర మాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతి నీచం చేలాజిన కుశోత్తరమ్॥

తత్రైకాగ్రం మనఃకృత్వాయత చిత్తేంద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగ మాత్మ విశుద్ధయే॥

సమంకాయ శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వందిశశ్చా నవలోకయన్॥

ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మ చారివ్రతేస్థితః
మనస్సంయమ్యమచ్చిత్తోయుక్త అసీత మత్పరః॥

యుంజన్నేవంసదాఽఽత్మానం యోగీనియత మానసః।
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి॥

(యోగము చేయువాడు సన్న్యసించి పర్వతగుహ మొదలగు నేకాంత స్థలమున నేకాకియై అంతఃకరణమును శరీరమును నిగ్రహించి నిష్కాముడై కాపీనాచ్ఛాదనాది పరిగ్రహములందు కూడ నాసక్తి లేనివాడై యెల్లపుడు అంతఃకరణమును సమాధిలో నుంచవలయును.

పరిశుద్ధ స్థానమునందు గదలనిదియు మిక్కిలి ఎత్తుగాని మిక్కిలి క్రిందు గానిదియు క్రింద సంస్తరసును దాని మీద జింకచర్మమును దానిమీద వస్త్రమును బఱుపబడి యున్నదియు నగు తన యాసనమును స్థాపించుకొనవలెను. ఆ ఆసనమున కూర్చుండి చిత్తేంద్రియముల వ్యాపారముల నిగ్రహించి మనస్సు నేకాగ్రము గావించుకొని చిత్తశుద్ధికొఱకు యోగము చేయవలెను. దేహ మధ్యభాగమును శిరస్సును కంఠమును ఋజువు (వంకర లేకుండా)గా నిశ్చలము చేసి స్థిరుడై తన నాసికాగ్రమును చూచుచున్న యట్లు నేత్రములను విషయ ప్రవృత్తి లేనివిగా అంతర్ముఖులు కావించి—దిక్కులు చూడకుండ నుండవలెను. ప్రశాంతమైన అంతఃకరణము కలిగి నిర్భయుడై బ్రహ్మచర్య మనుష్ఠించుచు మనోవృత్తులన్నిటిని నిగ్రహించి నాయందు చిత్తము నిలిపి మత్పరుడై సమాధి చేయుచు కూర్చుండవలెను. ఇట్లు యోగి యెల్లపుడు నియతమైన మనస్సు గలవాడై మనస్సును సమాహితము చేయుచు నా స్వరూపమే యయినట్టి మోక్షరూపమైన శాంతిని పొందుచున్నాడు.)

ధ్యానపద్ధతి మఱి పెక్కు గ్రంథములందు చెప్పబడినది. అకులాగమము శతపథశ్రుతి, యోగమార్తాండము మొదలగు గ్రంథములు.

ఈ శ్లోకమున విజన ప్రదేశమందు కూర్చుండి విరాగియై ఇంద్రియ నిగ్రహము చేసి ఆత్మ ధ్యానము చేయుచు, సకలేతర మనోవృత్తులను త్యజింపవలెనని చెప్పబడినది.

అవతారిక :

ఆత్మస్వభావము తెలుపుచున్నారు.

ఆత్మన్యే వాఖిలం దృశ్యం ప్రవిలాప్యధియా సుధీః।
భావయేదేక మాత్మానం నిర్మలాకాశ వత్సదా॥ 39

తాత్పర్యము :

బుద్ధి వృత్తిచేత దృశ్యప్రపంచము నంతటిని ఆత్మయందు విలీనము కావించి వివేకి—నిర్మలాకాశమువలె శుద్ధమైన ఆత్మ నొక్కదానినే భావింపవలెను. ధ్యానింపవలెను.

వ్యాఖ్యానము:

ప్రపంచమున బహుళత్వము దృశ్యమానమగుచుండగా అద్వితీయమైన ఆత్మను ధ్యానించుటెట్లని శంక కలుగవచ్చును. ప్రపంచమున దృశ్యమగుచున్నది ద్వైతమే. దానియొక్క సత్యస్థితిని విచారింపవలెను. ఆకాశము నీలిరంగుగా ప్రక్కలకు ప్రాలినట్లుగా కన్పించును. అయితే దానికి రంగులేదని ఆకారములేదని విచారించినవా డెరుగును. అట్లె యెఱుక గలవాడు దృశ్యమానమైనదంతయూ ఆత్మ స్వరూపమేనని తెలియును. ఈ ప్రపంచ భ్రాంతి వెనుక అద్వితీయ నిత్యసత్య పదార్థమున్నదని గ్రహించి స్థిరముగా దానిపై మనస్సు లగ్నముచేయవలెను.

ఇది తేలిక పనికాదు. వైరాగ్యమువలన, అభ్యాసమువలన సాధింపవచ్చును.

భగవద్గీత (vi-25) చెప్పినట్లు (శనైః శ్శనైరు పరమేద్బుద్ధ్యాధృతి గృహీతయా। ఆత్మసంస్థం మనఃకృత్వా న కించిదపి చింతయేత్) తిన్నతిన్నగా ధైర్యయుక్తమగు బుద్ధితో విషయములనుండి ఉపరమింపవలెను - మనస్సును ఆత్మనిష్ఠము గావించి ఏమియు జింతింపక యుండవలెను - ఈ భగవద్గీతశ్లోకముపై శ్రీ శంకర భగవత్పాదులు భాష్యమునందు - ఆత్మ ఏవసర్వం నతతః అన్యత్ కించిదస్తి ఇతి - మనస్సును ఆత్మనిష్ఠముచేసి - ఆత్మయొక్కటే సర్వమును - ఇతర మేమియులేదని స్థిరభావముతో నుండవలెననిరి.

అవతారిక :

ఆత్మసిద్ధి చెప్పుచున్నారు.

రూప వర్ణాదికం సర్వం విహాయ పరమార్థవిత్॥
పరిపూర్ణ చిదానంద స్వరూపేణావతిష్ఠతే॥ 40

తాత్పర్యము :

రూపము వర్ణము మొదలగునట్టివన్నిటిని వదిలి, పరమార్థమును తెలిసినవాడు పరిపూర్ణ చిదానంద స్వరూపముతో నుండును.

వ్యాఖ్యానము :

పరమార్థము - బహుళత్వమైన ప్రపంచములేనట్టిది. అద్వితీయమైన ఆత్మ యొక్కటే కలదు. పరమార్థవేత్త - అవిద్యాకారకములైన రూప, నామవర్ణాదు లన్నిటిని వదిలిపెట్టినవాడై అఖండ అద్వితీయ ఆనందమై యుండును. అతడు దేహ ఇంద్రియాదులతో అనుసంధించుకొనడు. ఇంద్రియానుభవము, భోగములు, ప్రాతి నిధ్యమువంటివి తనకు చెందవని తెలియును. అతని యెఱుక యేమనగా - అతడు - తాను - ఒక వ్యక్తికాదని - నిత్యసత్యమైన పరిపూర్ణ సచ్చిదానందమని.

అవతారిక:

జ్ఞాన జ్ఞేయ, జ్ఞాతృ విభేదములు లేవని చెప్పుచున్నారు.

జ్ఞాతృ జ్ఞానజ్ఞే యభేదః పరేనాత్మ నవిద్యతే।
చిదానందైక రూపత్వాద్దీప్యతే స్వయమేవతత్॥ 41

తాత్పర్యము :

జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అను భేదములు పరాత్మయందు లేవు. అది చిదా నందైక రూపమగుటచేత స్వయముగానదె ప్రకాశించును.

(దీప్యతే స్వయమేవతత్ - అనుటకు దివ్యతి స్వయమేవహి అని పాఠాంత రము.)

వ్యాఖ్యానము :

జ్ఞాత జ్ఞేయము, జ్ఞానము - తెలుసుకొనువాడు, తెలిసికొనబడునది. తెలిసికొన్న తెలివి - ఈ భేదముకూడ అవిద్యవలనే. తెలిసికొనువాడు అహంకృతి - తెలిసి కొనుట బుద్ధి - మానసికవృత్తి. తెలిసికొనబడునది బుద్ధి వృత్తియొక్క స్థితి నిరూపణమైన సంఘటన. ఇవి యన్నియు అవిద్యాకల్పితములు. ఆత్మయన్న చైతన్యముయొక్క ప్రతిబింబముయొక్క లాభమును పొంది ఎఱుక - తెలివిగా చెప్ప బడుచున్నది. ఏ వస్తువుగాని స్వయముగా చైతన్యమును ప్రతిబింబించలేదు. చైతన్య ప్రతిబింబమును వహించుచున్న బుద్ధి వృత్తి ఆ వస్తువుపై ప్రసరించినపుడు ప్రతి బింబించుట జరిగి ఆ వస్తువు తెలియబడుచున్నది. లౌకికముగా జ్ఞాత, జ్ఞేయము

మొదలుగా చెప్పుట అవిద్యాపరిధిలోనే. శుద్ధ చైతన్యమైన ఆత్మ విషయమునం దా విధముగా చెప్పుట సరికాదు. ఆత్మ స్వయంప్రకాశము. దానిని వెల్లడించుటకు మఱి యొక వెలుఁగు అవసరములేదు.

కొన్ని సందర్భములలో ఆత్మను కర్తగా - చూచువాడుగా చూడబడు దాని కంటే భిన్నముగా చెప్పుటకలదు. అట్లు చెప్పుట సులభముగా అవగాహన అగుటకు మాత్రమే. యథార్థముగా చూచునది చూడబడునది, కర్త కర్మ అన్నిటికి అంతస్సారము ఆత్మయే. ఆయితే కర్మ - చూడబడునది - కర్త - చూచువానికంటే దూరముగా నున్నట్లు తోచును. అందుచేత ఆత్మను కర్తతో అనుబంధించి చెప్పుట అవగాహనకు అధికముగా సహాయకారిగా నుండును. ఈ అనుసంధానముకూడ అధ్యాహార ఫలితమే నని జ్ఞాపక ముంచుకొనవలెను.

అవతారిక :

అవిద్యా వినాశమును గురించి చెప్పుచున్నారు.

ఏవమాత్మారణౌ ధ్యానమథనే సతతం కృతే।
ఉదితావ గతి జ్వాలా సర్వాజ్ఞానేం ధనం దహేత్॥ 42

తాత్పర్యము :

అట్లు ఆత్మయన్న అరణి (బుద్ధియందు) ధ్యానమును సతతము జరిపినపుడు, జ్ఞానమన్న అగ్నిజ్యోతి రగిలి అజ్ఞానమను కట్టెలను దహించును.

వ్యాఖ్యానము :

పూర్వులు అగ్నిని పుట్టించుటకు చేసిన పద్ధతి — రెండు కట్టెలను మథించుట — యీ శ్లోకమున — ధ్యానముయొక్క ప్రాముఖ్యమును చెప్పుటకు గాను చెప్పబడినది.

కైవల్యోపనిషత్తు నందొక మంత్రమునం దీ భావము కలదు. "ఆత్మను (బుద్ధిని) క్రింది కట్టెగాను, ప్రణవమును పై కట్టెగాను చేసి — ధ్యానాభ్యాస మునం దా రెండిటిని మథించి, వివేకవంతుడు బంధనమును దహించును" అన్నదా మంత్ర తాత్పర్యము.

రెండు కట్టెలను — ఆపకుండా — ఒకదానితో ఒకటి రుద్దవలెను. నిప్పు వచ్చువరకు చేయవలెను. అదేవిధముగా బుద్ధినంతయు ఆత్మ విషయమున తీవ్రముగా

లగ్నము కావలెను. ఈ విధమైన ధ్యానము జరుగుటవలన జ్ఞానము జ్వలించును. అప్పుడు దహింపబడు ఇంధనము అవిద్య, అధ్యారోపణములు. చివరకు ఆ బుద్ధి వృత్తి అవిద్యను దహించి — తాను పోవును. దీనికి దగ్ధేంధన వహ్ని న్యాయమని పేరు, అనగా ఇంధనమును దహించిపోవు అగ్ని ఉదాహరణము ఇది ఐదవ శ్లోకమున చెప్పబడిన జలకటక రేణు న్యాయమువంటిదే.

అవతారిక :

జ్ఞానోదయమును చెప్పుచున్నారు.

అరుణే నైవ భోధేన పూర్వం సంతమసేహృతే।
తత అవిర్భవేదాత్మా స్వయమేవాంశు మానివ॥ 43

తాత్పర్యము :

ఆవరించియున్న చీకటి (అజ్ఞానము) జ్ఞానమువలన తొలగింపబడగా (సూర్యుని రథ సారథియైన అరుణునివలన చీకటి తొలగింపబడినట్లు) అప్పుడు సూర్యు డుదయించినట్లు ఆత్మ ప్రకాశమగును.

వ్యాఖ్యానము :

బుద్ధియొక్క అఖండాకారవృత్తి — ఆత్మను గురించి సంలగ్నముగా నిరంతర చింతనము — ఈ శ్లోకమున ప్రాతస్సంధ్యారుణిమతో ఉపమింపబడినది.

పౌరాణికముగా సూర్యుని రథసారథి అరుణుడు. సూర్యోదయముకంటె ముందు అరుణోదయము. అరుణోదయమువలన చీకటి తొలగును. సూర్యోదయమునకు సర్వము సిద్ధము చేయబడును. సూర్యోదయమునకుగాను చీకటిని తొలగించుటకంటె జరుగవలసినది మరియొకటి లేదు. అంతరాయము తొలగగా సూర్యుడు స్వయంప్రకాశముగా వెలుగును.

అట్లే అఖండాకార వృత్తివలన అవిద్య నశింపచేయబడగా ఆత్మ స్వయం ప్రకాశమై వెలుగును.

భగవద్గీత యీ విషయము చెప్పినది (5 - 16)

**(ఆత్మ — అజ్ఞాన మెవ్వరికి జ్ఞానముచే నాశమునొందునో — వారికి మాత్రము ఆ జ్ఞానము — సూర్యుడు సర్వ ప్రపంచమును ప్రకాశింపజేయునట్లు పరమార్థ తత్త్వము సర్వమును ప్రకాశింపజేయుచున్నది.)**

ఇచ్చట గ్రహింపవలసినదేమనగా — ప్రయత్నము కావలసినది సాధనకు సాధన లభింపగా లక్ష్యము అదే సిద్ధించును.

అవతారిక :

ఆత్మ సిద్ధియన్న దానిని వివరించుచున్నారు.

ఆత్మాతు సతతం ప్రాప్తోఽప్యప్రాప్తవ దవిద్యయా।
తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా॥ 44

తాత్పర్యము :

ఆత్మ యెల్లప్పుడు ప్రాప్తమై యున్నది. అవిద్యవలన అప్రాప్తముగా తోచును. అవిద్య నశించగా, అపుడు ప్రాప్తమైనట్లు వెల్లడి యగును — స్వకంఠాభరణమువలె.

వ్యాఖ్యానము :

సాధన లభించినపుడు లక్ష్యము సిద్ధించినట్లేయని చెప్పుటేల? "లక్ష్యము" అను చెప్పుటలో రెండు భావము లున్నవి. (1) లక్ష్యము — ఇదివరకు సన్నిధిలో లేదు. సాధనచేసి దాని సాధింపవలెను. వర్తమానకాలమున లేదు. భవిష్యత్తున సాధింపవలెను. ఉదాహరణకు — ఒక సువర్ణాభరణము క్రొత్తగా చేయించుకొనుట. ఇచట దానికి సాధనమైన ధనము లభించినంతమాత్రమున ఆభరణము లభించినట్లు కాదు. ఈ ధనముతో నగల వర్తకుని దగ్గరకు పోయి ఆభరణము చేయించుకొన వలెను. (2) ఈ రెండవ భావమున లక్ష్య మిదివరకే కలదు. అయితే అది ఉన్నటుల దాని ఉనికిని మరచిపోవుట జరిగినది. ఇంకను దానిని సాధింపవలసి యున్నదను భ్రాంతిలో నుండుట జరుగుచున్నది. ఉదాహరణకు — ఒకని మెడలో కంఠాభరణ మున్నదని మరచిపోయి — అది ఎచటనో పోయినదని భ్రమించి దాని కోసము పలుచోట్ల వెదకుచుండెను. అతని స్నేహితుడు ఆ కంఠాభరణము అతని మెడలోనే కలదని చూపగా — వాడు "నా కంఠాభరణము నాకు తిరిగి లభించినది।" అని ఉపశమనము పొందును. కంఠాభరణము తిరిగి లభించినదనుట అలంకారికముగా చెప్పుటే. నిజముగా — పూర్వ మిదివరకే లభించియున్నదానిని అప్పుడు లభించినదనుకొనుట.

ఈ విధముగా రెండు విధములైన సిద్ధులు. ఇదివరకు లేనిదానినే పొందినట్లుగా భావించుట. ఈ రెండవవిధమైనది ఆత్మసిద్ధి మోక్షము. ఆత్మ సంతతమున్నదే,

దానిని పోగొట్టుకొనుట జరుగనే జరుగదు. అది సంతతము. సర్వత్ర వాస్తవికము. అది తప్ప మఱియొకటి వాస్తవమైనది, సత్యమైనది లేనేలేదు. మనము ఆత్మ పదార్థమే. అవిద్య వలన యథార్థము మనము గ్రహింపలేదు. దీనికి బంధనమని పేరు. జ్ఞానమువలన అవిద్య తొలగిపోగా, నిత్యసత్యమైన ఆత్మస్థితి సిద్ధించినది. పూర్వమే దానికి గలిగియున్న స్థానిని పొందినట్లుగా - ఎప్పుడో తొలిగిన బంధము — అప్పుడు బంధముక్తి కలిగినట్లుగా భావన.

అవతారిక :

స్థాణు పురుషభ్రాంతి వివరించుచున్నారు.

స్థాణౌ పురుష వద్భ్రాంత్యాకృతా బ్రహ్మణి జీవతా।
జీవస్య తాత్త్వికే రూపే తస్మిన్ దృష్టేనివర్తతే॥ 45

తాత్పర్యము :

బ్రహ్మమునందు జీవుడుగా తలంచుట భ్రాంతివలన స్థాణువైన స్తంభమును చీకటిలో మనుష్యుడని భావించినట్లు. బ్రహ్మమునందు జీవుని తాత్త్వికరూపము తెలిసినపుడు, జీవుని భిన్నభావము తొలగిపోవును.

వ్యాఖ్యానము :

ఈ శ్లోకమునందు మరియొక ఉదాహరణ మొసగబడినది. స్తంభము లేక చెట్టు మొదలును చీకటిలో మనుష్యుడని భ్రాంతిపడుట.

చీకటి యందు భయమువలన స్తంభమును దొంగగా భ్రాంతిపడినట్లు బ్రహ్మమును వైయక్తిక జీవాత్మగా తలంచుచున్నాము. జీవత్వము బ్రహ్మముపైన అధ్యారోపము. జీవత్వము బ్రహ్మపదార్థముయొక్క ఉపాధిభేదమే యని బ్రహ్మమొక్కటే సత్యమని తెలిసినపుడు భ్రాంతి తొలగును.

అవతారిక :

తత్త్వ స్వరూపానుభవమును చెప్పుచున్నారు.

తత్త్వ స్వరూపానుభవా దుత్పన్నం జ్ఞానమంజసా।
అహం మమేతిచా జ్ఞానం బాధతే దిగ్భ్రమాదివత్॥ 46

తాత్పర్యము :

తత్త్వస్వరూపమును అనుభవమునకు తెచ్చుకొనుటవలన కలిగిన జ్ఞానము వలన 'నేను' (అహం) నాదివంటి భావములను తొలగించును. సూర్యోదయమువలన దిక్కులు తెలియకపోయిన భ్రాంతి తొలగిపోవునట్లే.

వ్యాఖ్యానము :

అహం—నేను - నాది అన్న భావములు అవిద్యవలన దేహాభిమానమువలన "నేను" — దేహమునకు సంబంధించినదెల్ల నాది యని. ఈ అనుభవిక విషయములు నేను ఫలానావాడనన్న భావమువలన. "నేను గొప్పవాడను - నేను విద్వాంసుడను — ఈ గృహము నాది. ఈ సంపదలు నావి" ఇవి యన్నియు దేహాభిమాన జన్యములు.

యథార్థజ్ఞానమువలన నిట్టి భావములు తొలగిపోవును. దీనియందున్న ఉపమానము=రాత్రిపూట బాటసారి దిక్కులు తెలియక తప్పుత్రోవ పట్టును — తెల్లవారగా వానికి తిక మక తొలగి సరియైన మార్గము పట్టును.

అవతారిక :

వివేకమువలన ఫలితము చెప్పుచున్నారు.

సమ్యగ్విజ్ఞాన వాన్యోగీ స్వాత్మన్యేవాఖిలం స్థితమ్।
ఏకంచ సర్వమాత్మానమీక్షతే జ్ఞాన చక్షుషా॥ 47

తాత్పర్యము :

సమ్యగ్విజ్ఞానము కలిగిన యోగి తనయందే అఖిలమును అద్వితీయమైన ఆత్మయే సర్వముగను జ్ఞాననేత్రమువలన చూచును.

వ్యాఖ్యానము :

నిజమైన యోగి జ్ఞాని. జీవబ్రహ్మల అభేదస్థితి యోగము. ఇది సిద్ధింప చేసికొనుట వివేకము. ఇట్టి సిద్ధి కలవాడు జాగరితుడు జ్ఞానదృష్టితో అతడు చూచును. అతనికి భేదము ద్వైతము లేవు. అన్నిటియందు అన్నివేళల అతడు ఆత్మనే చూచును. అన్నియు ఆత్మాభిన్నములే. ఆత్మ యొక్కటే సత్యము.

భగవద్గీత (6-29) ఇట్లే చెప్పుచున్నది.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాఽఽత్మని
ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥

ఇట్లు యోగి ఉపాధులచే విషయములుగా దోచునట్టి సర్వభూతములందును నిర్విశేషమైన (బ్రహ్మాత్మైక్య దృష్టిగలవాడై తన్ను సర్వభూతస్థితునిగాను సర్వ భూతములును తనయం దేకమై యున్నవిగాను జూచును.)

అవతారిక :

ఆత్మవేత్త దృష్టిని చెప్పుచున్నారు.

ఆత్మై వేదం జగత్ సర్వం ఆత్మనోఽన్యన్న కించన।
మృదా యద్వద్ ఘటాని స్వాత్మానాం సర్వమీక్షతే॥ 48

తాత్పర్యము :

జగత్తు సర్వము ఆత్మయే. ఆత్మకంటే అన్యమైనది వేరేదియు లేదు. ఆత్మ వేది సర్వమును ఆత్మగా చూచుచు - ఘటము మొదలగు వానినెల్ల మట్టిగా చూచిన విధముననే.

వ్యాఖ్యానము :

ఆత్మకంటే వేరైన దేమియు జగత్తున లేనేలేదని గ్రహించుటెట్లు?

కుండలు, కూజాలు, మూకుళ్ళు, ప్రమిదలు మొదలైనవి అన్నియు మట్టియే యని తెలిసికొన్నట్లే — యీ గోచరమగు జగత్తు నందంతయు ఆత్మయే యని గ్రహింపవలెను.

అద్వైత సిద్ధాంతమున కారణమునందు కార్యమున్నదని చెప్పు సత్కార్య వాదమును సమర్థించుచున్నది. కారణమునందు కార్యము పూర్వము లేదను వాదము అసత్కార్యవాదము, దీనిని అద్వైతము అంగీకరించదు' కార్యము కారణముయొక్క రూపభేదమేనని కార్యకారణముల సారభూత మొక్కటే యని సాంఖ్యవాదము. దీనికి అద్వైతము సమ్మతించదు. అద్వైతసిద్ధాంతము ప్రకారము కారణ మొక్కటే నిజము. కార్యము దాని రూపమే. దీనిని సత్కారణవాద మనవచ్చును. కార్యము రూపాంతరము కాదు. రూపమునకు భిన్నదృష్టి. ఘటము మట్టికివలె, సర్పము త్రాడుకివలె.

అవతారిక :

జీవన్ముక్తిని గురించి చెప్పుచున్నారు.

జీవన్ముక్తస్తు తద్విద్వా న్పూర్వోపాధి గుణాం స్త్యజేత్।
సచ్చిదాత్మ ధర్మత్వం భజేద్భ్రమర కీటవత్॥ 49

(తద్విద్వాన్ అనుటను తద్విద్వాత్ అని పాఠాంతరము. సచ్చిదాది ధర్మత్వం భేజే అనుటకు సచ్చిదానంద రూపత్వాద్భపేత్ అని పాఠాంతరము.)

తాత్పర్యము :

కీటకము భ్రమరమైనట్లుగా జీవన్ముక్తి (బ్రతికియుండగనే ముక్తి) లభించున దెప్పు డనగా పూర్వ ఉపాధుల సంబంధమైన సకల వాసనాది గుణములను త్యజించి సత్, చిత్ మొదలగు ధర్మత్వమును అనుసరించగా.

జీవన్ముక్తి అనగా దేహధారణ ముండగనే విముక్తి — ముక్తి. అద్వైత సిద్ధాంతము ప్రకారము విముక్తి - ముక్తి యనగా నేమో పూర్వమే వివరింపబడినది. విముక్తి జీవునికి సంతతము, సహజమైనది. అది మరణానంతరము మాత్రమే లభించు అనుభూతి కాదు. క్రొత్తగా సాధింపవలసినదిగాని పొందవలసినది గాని కాదు. దేహము, మనస్సు, వాటి కారణము, అవిద్య మొదలగు వాటివలన నిత్యమైన బద్ధముక్తస్థితి అనుభవములో లేదు. ఆ అడ్డంకులు తొలగింపబడగా నిత్యశుద్ధ బద్ధ ముక్తస్థితి ప్రకాశించును.

సమర్థుడైన శిక్షకుడు, యోగ్యతగల శిష్యునికి శిక్షణ నొసగినపుడు మార్పు జరిగినట్లు తోచును. బద్ధమైన జీవుడు బద్ధముక్తుడగును. ఆత్మసిద్ధుడైన గురువు శిష్యుని సిద్ధుని చేయును — కీటకమును నిత్య ఝుంకారముతో భ్రమరముచేసినట్లు.

ఇచట భ్రమరకీటన్యాయము చెప్పబడినది. బందీవలె నుంచబడిన కీటకము చుట్టు భ్రమరము నాదము చేయుచు తిరుగాడుట వలన కొన్నినాళ్ళకు కీటకము కూడ తన కీటకత్వమును వదలి భ్రమర రూపమును పొందినట్లుగా జీవుడు నిత్యబ్రహ్మాను సంధానమువలన బ్రహ్మమగును.

కీటక భ్రమరం ధ్యాయన్ భ్రమరత్వాయ కల్పతే శ్రీమద్భాగవతమున (VII-i-27) కీటః పేశస్కృతరుద్ధః కుడ్యాయాంతం అనుస్మరన్ సంరంభ భయ యోగే న విందతే తత్ సరూపతామ్.

అవతారిక :

యోగి స్థితిని చెప్పుచున్నారు.

తీర్త్వా మోహార్ణవం హత్వా రాగద్వేషాది రాక్షసాన్।
యోగీ శాంతి సమాయుక్తో హ్యాత్మారామో విరాజతే॥ 50

తాత్పర్యము :

మోహ మను సముద్రమును దాటి, రాగము ద్వేషము అను అడ్డు వచ్చు రాక్షసులను నిర్మూలించి, యోగి శాంతియుక్తుడై ఆత్మారాముడై విరాజిల్లును.

వ్యాఖ్యానము :

ఈ శ్లోకమున శ్రీమద్రామాయణగాథ ఉపమానముగా స్వీకరింపబడినది. బ్రతికి యుండగా విముక్తిని సాధించిన జీవన్ముక్తుడు శ్రీరామచంద్రునితో (సీతా పునస్సమాగమము పొందిన) పోల్చ బడినవాడు. అట్లే యోగి మోహసముద్రమును దాటి అంతశ్శత్రువులైన రాగద్వేషాదులను జయించి శాంతియుక్తమైన మనస్సుతో ఆత్మప్రకాశమున (ఆత్మారాముడై) విరాజిల్లును.

అవతారిక :

ఆత్మసిద్ధుని స్థితిని చెప్పుచున్నారు.

బాహ్యాఽనిత్యసుఖాసక్తిం హిత్వాఽఽత్మసుఖ నిర్వృతః।
ఘటస్థదీప వచ్ఛశ్వదంతరేవ ప్రకాశతే॥ 51

తాత్పర్యము :

అనిత్యములైన బాహ్యసుఖములందు ఆసక్తిని చంపుకొని ఆత్మ సుఖ నిర్వృతుడై (అతడు) ఘటమునందున్న దీపమువలె లోన ప్రకాశించును.

వ్యాఖ్యానము :

జీవన్ముక్తుని స్థితి వివరింపబడినది. అట్టివాని బాహ్యస్థితి వర్ణనమువలన వివరణ జరగదు. బాహ్యముగా జీవన్ముక్తుడు - ఇతరులకంటే భిన్నుడు కాడు. జీవన్ముక్తుడు కావున అతనికి కొమ్ములు మొలవవు. భగవద్గీత ద్వితీయాధ్యాయమున జీవన్ముక్తుని గురించి అర్జునుడు చేసిన ప్రశ్నలు స్థితప్రజ్ఞు డెట్లు మాట్లాడునని, కూర్చుండునని వర్తించునని, చరించునని. శ్రీ కృష్ణుడు చెప్పిన సమాధానమునం దీ ప్రశ్నలను స్పృశించలేదు. "యోగి మనోరథముల నన్నిటిని త్యజించి ఆత్మారాముడై యుండునని; దుఃఖము లతనిని తల్లక్రిందు చేయలేవని సుఖములం దతనికి వాంఛలు లేవని, రాగద్వేషములు లేవని, ఇంద్రియ విషయములనుండి ఇంద్రియములను వెలుపరించిన వాడని (తాబేలు అవయవములను లోపలికి లాగుకున్నట్లు) మనస్సు అచంచలమై శాంతియుక్తమైనదని - సముద్రమువలె విశాలమై సమ్యఙ్మయమై పూర్ణమైనవాడని" చెప్పెను.

ఈ శ్లోకము జీవన్ముక్తుని గురించి - అదే విధముగా చెప్పినది. కుండలోపల నున్న దీపమువలె వెలుగుట - యోగి బాహిరముగా వెల్లడించుకొనడు. బాహిర విషయ సుఖము లక్కరలేదు కావున, అంతర ప్రకాశముకలవాడు. ఈ వెలుగునకు దేహము. మనస్సు, ఇంద్రియములన్న వివరణ భేదము లేదు.

అవతారిక :

ఉపాధిగతదోషము లంటవని చెప్పుచున్నారు.

ఉపాధి స్థోఽపి తద్ధర్మైర్న లిప్తో వ్యోమవన్మునిః।
సర్వవిన్మూఢ వత్తిష్ఠే దసక్తో వాయువచ్చరేత్॥ 52

తాత్పర్యము :

పరిమితులున్న ఉపాధిగతుడైనప్పటికి, దానియొక్క గుణధర్మశీలము లతనికి పట్టవు - ఆకాశమునకువలె; సర్వము తెలిసినవాడయ్యు మూఢునివలె నుండును. వాయువువలె అనాసక్తుడై చరించును.

వ్యాఖ్యానము :

జీవన్ముక్తుని పరిధులు - ఉపాధిగతములు - మన ఇతరులదృష్టినుండి అతడు దేహగతుడై వాని ధర్మములను అనుసరించుచున్నట్లు యితరులకు తోచిననూ - నిజమున కతనిని బాధింపవు అంటవు. ఆకాశమునకేవియు అంటనట్లే ఆతనికి ఏవియు అంటవు. ఆకాశము నీలముగా నున్నదనుట సరికాదు. దానికి రంగులేదు. ఆకాశము గతవస్తువుల వర్ణమది. అట్లే జీవన్ముక్తునికి ఉపాధి (దేహ) ధర్మములు అంటవు.

జీవన్ముక్తుడు బాల ఉన్మత్తపిశాచమువలె చరించుట. అతనికి సంప్రదాయాది దేశకాలానుసరణలేదు. అవలంబన సూత్రములు, ప్రవర్తన నియమావళిలేవు. అన్నియు తెలిసిననూ ఆర్భాటముచేయడు. లౌకికముగా ఆడంబర ప్రవృత్తి కలవారికి ఉన్మత్తునివలె తోచును. సాధారణముగా నిష్ప్రయోజకునివలె, నిరుపయోగివలె, నిర్లక్ష్యము చేయబడును. అంతరప్రకాశము కలవాడు, బాహిరమున జడునివలె నుండును. (అంతర్బోధో బహిర్జడః)

అతనిని పరిధులలో నిలుపలేము. వాయువు యథేచ్ఛగా విహరించును. అట్లే అతడును ___

అవతారిక :

విదేహముక్తిని గురించి చెప్పుచున్నారు.

ఉపాధి విలయాద్విష్ణౌ నిర్విశేషం విశేన్మునిః।
జలేజలం వియద్వ్యోమ్నితేజస్తేజసి వాయథా॥ 53

తాత్పర్యము :

ఉపాధిలయము పొందినపుడు యోగి నిర్విశేషమైన సర్వవ్యాప్తమైన దానిని చేరును. జలము జలమును, ఆకాశము ఆకాశమును తేజస్సు తేజస్సును కలిసినట్లు.

వ్యాఖ్యానము :

జీవన్ముక్తికి విదేహముక్తికి తేడా చెప్పుట సామాన్యుని దృష్టిలో యోగి దృష్టిలో కాదు. దేహము సత్యముగాతోచు సామాన్యునికి జీవన్ముక్తుడు శరీరగతుడై యుండుటను గురించి అవగాహనకావలెను. మూడు కర్మవిభాగములందు (సంచిత ఆగామి ప్రారబ్ధ) జీవన్ముక్తునికి జ్ఞానాగ్నిలో సంచితము దగ్ధమై నశించినదనియు, ఆగామి అసలు రూపుకట్టనేలేదనియు (అది భవిష్యత్తునకు చెందినది కాబట్టి) ప్రారబ్ధము మాత్రము వ్యయముకాక తప్పదనియు (ధనుస్సునుండి వదలిన బాణము అది పోగలిగినంతదూరము పోవలెను గదా) గ్రహించవలెను. కుమ్మరివాని సారె, దాని త్రిప్పుకఱ్ఱ తీసివేసిన తరువాత కూడ కొంతసేపు తిరిగినట్లుగా - జీవన్ముక్తుని దేహముకూడ - అవిద్యా బంధనహేతువు నశించిన తరువాత కూడ కొంతకాల ముండును. ఆ ప్రారబ్ధము నశింపగా దేహము పతనమగును. జీవన్ముక్తుడు దేహము నుండి విముక్తుడై విదేహముక్తుడగును.

ఈ వివరణమంతయు విద్వాంసులు కాని సామాన్యులకోసము. వారు ప్రత్యక్షముగానున్న దేహమును కాదనలేరు. నిజమునకు జీవన్ముక్తుడైన యోగికి ప్రారబ్ధ కర్మకూడ లేదు.

ఈ శ్లోకమునందు విదేహముక్తి - వివరణ కోరువారి కొరకు - వర్ణింపబడినది. ప్రారబ్ధకర్మ వ్యయమైపోగా దేహరూపమైన ఉపాధి లయమైపోవును. అప్పుడు నిర్విశేష బ్రహ్మముతో సమైక్యతను పొందును. బ్రహ్మైక్యమును చెప్పుటకు మూడు ఉదాహరణలు చెప్పబడుచున్నవి.

(1) ఒక పెద్ద ఓడ విశాలమైన జలతలమును విభాగించినట్లు తోచును. ఆ ఓడ తొలగింపబడగా - ఓడ జలము - విశాల జలతలముతో కలసిపోవును.

(2) ఒక కుండ - మొదలగువాని వలన ఆకాశమునకు పరిమితు లేర్పడినట్లు తోచును. ఆ కుండ పగిలిపోగా - ఆకాశమంతయు ఒకటియగును.

(3) నిప్పుకణము నిప్పుకంటె భిన్నముగా కొంతసేపు తోచినను మరల నిప్పుతో కలసిపోవును. జలము జలముతో ఆకాశము ఆకాశముతో తేజస్సుతో తేజస్సు సమైక్యత పొందును.

ముండకోపనిషత్తు (III-ii-8) "ప్రవహించు నదులు తమ నామరూపము లను పోగొట్టుకొని - సముద్రములో సంలీనమైనట్లు జ్ఞాని నామరూపముల నుండి విముక్తిపొంది - ఉన్నతముకంటె ఉన్నతమైనది దివ్యత్వమును పొందును" అన్నది.

అవతారిక :

బ్రహ్మమును గురించి చెప్పుచున్నారు.

యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నా పరం సుఖమ్।
యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్ బ్రహ్మేత్యవధారయేత్॥ 54

తాత్పర్యము :

దేనిని పొందిన లాభముకంటె అధికమగు లాభమేదియు లేదో, దేని సుఖము కంటె అధికమగు సుఖము లేనిదేదో, దేని జ్ఞానముకంటె అధికమైన జ్ఞానములేదో - దానిని బ్రహ్మమని తెలియుము.

వ్యాఖ్యానము:

ఈ శ్లోకమునందు దీని తరువాత వచ్చు శ్లోకములందు బ్రహ్మమును గురించి (దేనిని పొందుటవలన ముక్తి యో) చెప్పుచున్నారు.

పరబ్రహ్మను (విశ్వాత్మ) పొందుటకంటె అధికమైన ఏ లాభముగాని లేదు. ఆత్మసిద్ధియే ముక్తి. దానికంటె ఉన్నత లక్ష్యము లేదు. ఆత్మసిద్ధి యొక్కటే చరమమైన లక్ష్యము. ఐశ్వర్యము సుఖము ధర్మప్రవర్తన అన్నియు ప్రయోజన సాధనములు. ఆత్మ సంతతము సిద్ధిగానే యున్నది. నిత్యశుద్ధ బుద్ధముక్తము. సాధింపవలసినదేమీ లేదు. దేనినిగాని ప్రయత్నముచే లభింపచేసికొన్ననది మరల పోవచ్చును. ఏది శాశ్వతమైనదో అవి పోదు.

ప్రతివారు కోరునది అద్వితీయ ఆనందము. వస్తువులవలన లభించు సుఖము అశాశ్వతము. పరిమితము, పరిమితమైన దానియందు ఆనందము లేదని, అపరిమిత

మైన అనంతమైన దానియందే ఆనందమున్నదని ఛాందోగ్య ఉపనిషత్తు (VII-xxiii--1) ఈ ఉపనిషన్మంత్ర పాఠమును వ్యాఖ్యానించుచు శ్రీ భగవత్పాదులు — "అల్పమైన దానివలన సుఖములేదు. అల్పమైనది అధికమైన దానియందు వాంఛను కలిగించును. వాంఛ దుఃఖమూలము. దుఃఖమూలమైనదేదియు సుఖసంపాదకము కాదు. (ఉదా: జ్వరము మొ॥) కావున అల్పమైన వానియందు సుఖము లేదని చెప్పుట సరియైనది.

తైత్తిరీయ ఉపనిషత్తున ఆనందవల్లియందు ఆనందమీమాంస కలదు. మానుషానందము నుండి బ్రహ్మానందము వరకు వివరణమున్నది. బ్రహ్మమైన ఆనందము కల్పింపబడిన ఆనందము కాదు, విశేషము కాదు. సహజమైనది. అద్వితీయమైనది. లౌకికానందములు దీనియందు అల్పాల్పములు. అద్వితీయము అఖండము కావున బ్రహ్మానందము సహజము. చరమమైనది. ఇక అపుడు ఆనందించువాడు ఆనందింపబడునవి లేవు. యాజ్ఞవల్క్య మహర్షి బృహదారణ్యక ఉపనిషత్తునందు బ్రహ్మమును గురించి చెప్పుచు (IV-iii-82) — "ఇది తురీయమైన సిద్ధి. పరమమైన స్థితి. మహోన్నతమైనది. పరమమైనది. దీని అణువున యితరములు జీవించుచున్నవి" అనెను.

జ్ఞానము రెండు విధములు: అల్పవిషయపరిజ్ఞానము, ఉన్నతజ్ఞానము, అల్పవిషయపరిజ్ఞానము ప్రాకృతికము. ఉన్నతజ్ఞానము. బ్రహ్మవిషయమైనది. మొదటి దానియందు జ్ఞాతజ్ఞేయము ఉండుట — అది పరిమితము. రెండవది, అద్వితీయము. అఖండము. మొదటిది అవిద్యాధారము రెండవది అవిద్యానాశకము బ్రహ్మజ్ఞానము కంటె మించిన జ్ఞానము లేదు.

యద్దృష్ట్వానా పరం దృశ్యం యద్ భూత్వా న పునర్భవః।
యద్జ్ఞాత్వా న పరంజ్ఞేయం తద్ బ్రహ్మేత్యవధారయేత్॥ 55

తాత్పర్యము :

దేనిని చూచిన మఱి చూడవలసినది లేదో, ఏది అయిన మఱి కావలసిన దిక లేదో, దేనిని తెలిసికొన్న మరల తెలిసికొనవలసినది లేదో - అది బ్రహ్మమని తెలియుము.

వాఖ్యాన్యము :

బ్రహ్మమును చూచుట యనగా సామాన్య భౌతికార్థము కన్నులతో చూచుట కాదు. చూచువాడు చూడబడునది ఉండుట కాదు. అన్ని విభేదములు తొలగించు

బ్రహ్మానుభవము చెప్పబడినది. అట్లే - బ్రహ్మము అగుట అనగా - ఇదివరకు కానిదేదో అగుటయును కాదు. క్రొత్తగా ఏదో అయినచో కొంతకాలమునకు మరల దానినుండి మారి తొలుత ఉన్నది కావచ్చును. బ్రహ్మము అగుట అనగా - బ్రహ్మము అనుభవించుట. అట్టి అనుభవమురాగా మరల జన్మలేదు. అనగా అసలు జన్మించుట యన్నది లేదని అవగాహన అయి, నిజమునకు అజాతమని.

బ్రహ్మజ్ఞానమే నిజమైన జ్ఞానము. కావున బ్రహ్మము నెరింగిన తరువాత నెఱుంగవలసినది మఱేమియు లేదు.

తిర్యగూర్ధ్వమథః పూర్ణం సచ్చిదానంద మద్వయమ్।
అనంతం నిత్యమేకం యత్తద్ బ్రహ్మేత్యవధారయేత్॥ 56

తాత్పర్యము :

ఏది తిర్యగూర్ధ్వము లందు అధోమార్గమున సంపూర్ణమైనదో — ఏది అద్వయమై సత్తు చిత్తు ఆనందమైనదో, ఏది అనంతమై, నిత్యమై, అఖండమై, ఏకమైనదో అది బ్రహ్మమని తెలియుము,

వ్యాఖ్యానము:

బ్రహ్మము దేశకాలాతీతమైనదని చెప్పుటకు దేశసంబంధమైన సంకేతములు- ఊర్ధ్వ అధో, తిర్యక్కులందు సంపూర్ణముగా బ్రహ్మము చెప్పబడినవి. అంతటను బ్రహ్మమేగాన దేనికిపైనగాని, క్రిందగాని, మఱి ఏ దిక్కునగాని వేఱొకటిలేదని, ముండక ఉపనిషత్తు (II-ii-II) బ్రహ్మము — "ఇది శాశ్వతము, బ్రహ్మము ముందు, బ్రహ్మము వెనుక, దక్షిణమున, వామ భాగమున, పైన, క్రింద, నిజముగా బ్రహ్మము — ఈ జగత్తు అంతయు ఇది పరము."

బ్రహ్మము పూర్ణము అనగా దానికంటె వేఱొకటి లేదు. అది అనంతము. విభజనకు అందనిది. అది తరగదు. పెరుగదు. సంకోచవికోచములు లేనిది. దానికి హెచ్చింపు లేదు. విభాగము లేదు. దానికి కలుపుటకు మరేమియులేదు. దానినుండి తీసివేయుటకులేదు.

బృహదారణ్యక ఉపనిషత్తు (V-i-i) "అది అనంతము పూర్ణము. మరియు విది అనంతము పూర్ణము. అనంతము, అనంతము నుండి సాగును. అనంతము నుండి (పూర్ణము) అనంతము (పూర్ణము) తీసివేసిన అనంతమే (పూర్ణమే) మిగులును."

ఈ శ్లోకమున బ్రహ్మము గురించి 'నేతి' అని చెప్పబడలేదు. బ్రహ్మము ఏకము నిత్యము సచ్చిదానందము. విరుద్ధసంప్రయోగములు — అద్వితీయము — అని చెప్పినపుడు కూడ అర్థము సాధుభావమే.

అతద్వ్యావృత్తిరూపేణ వేదాంతైర్లక్ష్యతేఽవ్యయమ్।
అఖండానందమేకం యత్తద్ బ్రహ్మేత్యవధారయేత్॥ 57

తాత్పర్యము :

ఉపనిషత్తులు దేనిని నిరూపించుటకు ఇది కాదని ఇది కాదని అతద్వ్యావృత్తిరూపమున తెలుపుచున్నవో ఏది అఖండము. ఏకము అగు ఆనందమో దానిని బ్రహ్మమని తెలియుము.

వ్యాఖ్యానము:

బ్రహ్మము గురించి చెప్పుటకిది కాదు — ఇదికాదు అను పద్ధతిని ఉపనిషత్తులు అవలంబించినవి. ఒకటొకటీ బ్రహ్మముకాదని చెప్పుట — అతద్వ్యావృత్తి. ఆత్మ - దేహముకాదు. ఇంద్రియము కాదు. అనుభవింపదగిన వస్తువు కాదు. అందుచేత అది ఇతమిత్థమని నిర్వచింప వీలుకానిది. అనిర్వచనీయము.

ఇది కాదు ఇది కాదు అని చెప్పుట - కాదని మాత్రమే చెప్పుటకాదు. అయిన దేదో చెప్పుట. ఏకము అఖండము అయిన ఆనందమిది.

అవతారిక:

బ్రహ్మాది పిపీలకాపర్యంతము ఆనందలవలేశముపై ఆధారపడినవని చెప్పుచున్నారు.

అఖండానంద రూపస్య తస్యానందలవాశ్రితాః।
బ్రహ్మాద్యాస్తారతమ్యేన భవత్యానందనోఽఖిలాః॥ 58

(పాఠాంతరము - లవాః - అఖిలాపి అనుటకు)

తాత్పర్యము :

బ్రహ్మమునందొక కణమును ఆశ్రయించినవారై (ఆ బ్రహ్మము అఖండ ఆనందరూపము) సృష్టికర్తయగు బ్రహ్మ మొదలగు నందరు తారతమ్యముగ ఆనందినులగుచున్నారు.

వ్యాఖ్యానము :

పూర్వము 54 శ్లోక వివరణమున ఆత్మ యొక్కటే పరమమైనదని, ఆనంద మని ఆనందకారకములుగా తోచువస్తువులు ఆనందమైన ఆత్మను ప్రతిఫలించు చున్నవని చెప్పబడినది.

సృష్టికర్తయగు బ్రహ్మ మొదలు జగత్తంతయు పరమానందలేశముపై ఆశ్రయించియున్నదని ఈ శ్లోకమున చెప్పబడినది. వానియందు ఆనందరూపమైన ఆత్మ ప్రతిఫలించినది. ఆ ప్రతిబింబములను ఆనందమేనని భ్రాంతిని పొందు చున్నాము. ఆనందముగా భ్రమ కల్గించుచున్నదానికై మనము శ్రమించి, అది లభింపగా, అది ఆనందము కాదు. నిరాశపడుదుము. ఎండమావుల వెంటపడినట్లే ఆ ప్రయత్నము. కావున ఈ శ్లోకమునందు చెప్పబడినదేమనగా సృష్టికర్తయందు భాసించు ఆనందము కూడ ఆభాసయేకాని సత్యము కాదని. పరమమైన ఆనందము ఆత్మ, మిగిలినవన్ని ఆనంద ఆభాసలు. అందు ఒకదానికంటే ఒకటి తరతమములు గానే ఉన్నవి. అయితే వీటిలో ఘనమైనది కూడ సత్యమైన ఆనందము కాదు.

అవతారిక :

బ్రహ్మము సర్వవ్యాపి యని చెప్పుచున్నారు.

తద్యుక్త మఖిలం వస్తు వ్యవహారశ్చిదన్వితః।
తస్మాత్సర్వగతం బ్రహ్మక్షీరే సర్పిరివాఖిలే॥ 59

తాత్పర్యము :

సకల వస్తువులను దాని (బ్రహ్మము)తో నిండియున్నవి. వ్యవహారమంతయు చిత్తుతో సమన్వితమై యున్నది. పాలయందు వెన్నవలె.

వ్యాఖ్యానము :

లౌకిక జగత్తునందు దృశ్యమైన వస్తువుల కేమియు విలువలేదు. అవి ఆత్మ సంబంధముల్లై విలువ కలవిగా తోచును. ఆ వస్తువులలో దేనినిగాని దాని కొరకు ప్రేమించము. ఏ వస్తువుగాని దానియంతట నది ప్రేమాస్పదము కాదు. ఆత్మకొరకై ఆ వస్తువులు ప్రేమపాత్రము లగుచున్నవి.

జగత్తునందు అయిదు లక్షణములు. అస్తి (ఉనికి) భాతి (వెల్లడియగుట) ప్రియం (ప్రీతికరమగుట) నామ (పేరు కలిగియుండుట) రూప (రూపము కలిగి

యుండుట) ఇందు అస్తి భాతి ప్రియములు ఆత్మపదార్థ సంబంధములు. నామ రూపములు జడమునకు సంబంధించినవి. మొదటి మూడు మార్పులేనివి — విశ్వ జననమైనవి. మిగిలిన రెండును మార్పుకలవి. మార్పు పరిణామము చెందు సంఘ టనలలో (సత్యమైన ఆత్మ) ఆత్మ వాటియందు వ్యాపించి వానికి అస్తిత్వము కూర్చుచున్నది. ఆత్మసంబంధము లేనిచో వాటికి విలువలేదు.

అయితే ఆత్మ నిత్య సత్యముగా ఏల గమనింపబడుట లేదు? అవిద్యాకార ణముగ. అవిద్యా మూలమున ఆత్మ వెల్లడియగుటలేదు. కావున ఆత్మ సత్యము కాదనరాదు. వెన్న పాలయందు కన్పింపదు. అందుచేత పాలలో ఏ లవమునందు గాని వెన్నలేదని చెప్పజాలము కదా!

అవతారిక :

మరల బ్రహ్మ లక్షణములను కొన్నిటి చెప్పుచున్నారు.

అనణ్వ స్థూల మహ్రస్వమదీర్ఘ మజమవ్యయమ్।
అరూపగుణ వర్ణాఖ్యం తద్ బ్రహ్మేత్యవధారయేత్॥ 60

తాత్పర్యము :

ఏది స్థూలము కాదో, ఏది సూక్ష్మము కాదో, ఏది హ్రస్వము గాని దీర్ఘము గాని కాదో, ఏది జన్మింప లేదో ఏది అవ్యయమో, ఏది రూపనామ గుణవర్ణములు లేవిదో దానిని బ్రహ్మమని తెలియుము.

వ్యాఖ్యానము :

పూర్వము 57 శ్లోకమున అతద్వ్యావృత్తిచేత కొన్ని లక్షణములు చెప్పబడి నవి. దీనియందు మరల బ్రహ్మము ఏదికాదో చెప్పిరి.

బృహదారణ్యక ఉపనిషత్తున (III-viii-8) నిట్లున్నది. "ఓ గార్గీ! బ్రహ్మ వేత్తలు ఇది (బ్రహ్మము) అవ్యయ మనిరి. ఇది స్థూలము కాదు. సూక్ష్మమును కాదు; హ్రస్వము కాదు. దీర్ఘమును కాదు—ఎరుపు కాదు. అంటుకొన్న స్వభావము కలది కాదు. ఛాయవంటిది కాదు. నలుపు కాదు. వాయువు కాదు. ఆకాశము కాదు. సంగము కలది కాదు. రుచి కలది కాదు. కన్ను ఉన్నది కాదు. శ్వాసకలది కాదు. నోరు కలది కాదు. పరిమాణమున్నది కాదు. అంతర్బాహిరము లున్నది కాదు. అది దేనిని తినదు. దానిని ఏదియు తినదు. "ఈ ఉపనిషత్పాఠమును సూచించుచు శ్రీ

భగవత్పాదులు "బ్రహ్మమునకు గుణవిశేషము లేవియు లేవని—అది అద్వితీయము కాబట్టి దేనితోగాని దీనిని ఉపమింప వలనుపడదు" అనిరి.

యద్భాసాభాస్యతేఽర్కాదిభాస్యైర్యస్తున భాస్యతే।
యేన సర్వ మిదంభాతి తద్ బ్రహ్మేత్యవధారయేత్॥ 61

తాత్పర్యము :

దేని ప్రకాశమువలన సూర్యాదులు వెలుగునో, ఏది ఇతరములైన వస్తువుల చేత ప్రకాశింపదో, ఏది యీ సర్వమైననో, దానిని బ్రహ్మముగా తెలియుము.

వ్యాఖ్యానము :

పూర్వము 58 వ శ్లోకమున ఆత్మ మనస్సును జ్ఞానేంద్రియాదులను ప్రకాశింప జేయుచున్నదని (అవి ఆంతర వెలుగులకు) అది దేనివలనగాని ప్రకాశింపబడుట లేదని చెప్పబడినది. అవి జడములు—ఆత్మప్రకాశము వలననే అవి ప్రకాశించు చున్నట్లు తోచును.

ఈ శ్లోకమున విశ్వమునందు వెలుగులుగా తోచునవి కూడ జడములే నని వాటి ప్రకాశమున కాధారము కూడా ఆత్మయే నని చెప్పబడినది. చంద్రుడు ప్రకాశించుట మనము చూచుచున్నాము. నిజమునకు సూర్యకిరణములు చంద్రునిపై బడినందువలన చంద్రుడు ప్రకాశించుచున్నాడు. భౌతికముగా సూర్యుడు ప్రకాశించుచున్నాడు. ఆధ్యాత్మికముగా సూర్యుడు కూడ జడమే. ఆత్మ యొక్కచే ప్రకాశించుచున్నది. ఆత్మ వెలుగులేక మరి జగత్తున వెలుగే లేదు.

స్వయమన్త ర్బహిర్వ్యాప్త భాసయ న్నఖిలం జగత్।
బ్రహ్మ ప్రకాశతే వహ్ని ప్రతప్తా యసపిండవత్॥ 62

తాత్పర్యము :

అంతరబహిర్వ్యాప్తి కలిగి జగత్తునంతయు ప్రకాశింపజేయుచు బ్రహ్మము ప్రకాశించుచున్నది. ఇనుప గుండును ఎఱ్ఱని ముద్దగా చేయు అగ్నివలె.

వ్యాఖ్యానము :

ఇక్కడ బాగుగా కాలిన ఇనుపగుండు ఉదాహరణముగా చెప్పబడుట — ఆత్మయే నిజమైన ప్రకాశము గాని—లోకమున వెలుగుగా కన్పించునవి కావని చెప్పుటకు.

ఇనుపగుండు వేడిగా వెలుగుగా నుండును. అందు వేడిగా వెలుగుగా నుండు నది దానియందున్న అగ్ని. అదేవిధముగా సర్వవ్యాపియైన అంతర్బహిస్సులందు వ్యాపించిన ఆత్మయే జగత్తును ప్రకాశింపజేయుచున్నది — అవిద్యవలన వెలుగును జగత్తుకు అంటగట్టుతున్నాము.

జగద్విలక్షణమ్ బ్రహ్మ బ్రహ్మణోఽన్యన్నకించన।
బ్రహ్మాన్యద్భాసతే మిథ్యా యథామరుమరీచికా॥ 63

తాత్పర్యము :

జగత్తుకంటె బ్రహ్మము విలక్షణమైనది. అయితే బ్రహ్మముకంటె అన్యమైన దేమియు లేదు బ్రహ్మముకంటె అన్యమైన దేదిగాని వెలుగుచున్నచో — అది ఎడారిలో ఎండమావులవలె భ్రాంతి కల్పితమే.

వ్యాఖ్యానము :

ఎండమావుల ఉదాహరణతో బ్రహ్మ జగత్తుల సంబంధము వివరింపబడు చున్నది. జగద్విలక్షణం—అనుటకు ఏతద్విలక్షణం అని పాఠాంతరము.

ఎడారిలో నీటి సరస్సున్నట్లు తోచును. అది ఎడారి భూముల కంటె భిన్నము. కాని నిజమైన జలమునకు ఎడారిభూమికి ఉన్న భేదము వంటి భేదము కాదిది. ఎడారిభూమికంటె ఎండమావి లేదు. వేరుగా కన్పించుట భ్రాంతి కల్పనము.

అట్లే బ్రహ్మమునకు జగత్తు భ్రాంతి కల్పనము. జగత్తు బ్రహ్మము కాదు. బ్రహ్మముతో సమైక్యత లేదు. అయితే బ్రహ్మముకన్న వేరుగా దానికి ఉనికి లేదు. అది వేరుగా కన్పించుట భ్రాంతి.

బ్రహ్మమునకు జగత్తునకు సంబంధ మేమిటన్న ప్రశ్నకు సమాధాన ముగా—ఏమియు సంబంధము లేదనవలెను. రెండును భిన్నములు. బ్రహ్మము జగత్తుయొక్క సత్యము.

అద్వైత సిద్ధాంతము ప్రకారము, జగత్తు, బ్రహ్మము ఒకేవిధము కాదు. అంతయు భగవంతుడన్న భావము కాని—భగవంతు డంతయు అన్న భావము కాని—ఇచట అప్రస్తుతము.

దృశ్యతే శ్రూయతే యద్యద్ బ్రహ్మణోఽన్యన్నవిద్యతే।
తత్త్వజ్ఞానాచ్చ తద్ బ్రహ్మ సచ్చిదానంద మద్వయమ్॥ 64

తాత్పర్యము :

దృశ్య మగునది (శ్రవ్యమగునది) బ్రహ్మముకంటె వేరుకాదు. తత్త్వజ్ఞానము వలన బ్రహ్మము అద్వయమైన సచ్చిదానంద మని సిద్ధించును.

వ్యాఖ్యానము :

బ్రహ్మముకంటె వేరొకటి లేనపుడు కన్పించునది విన్పించునది బ్రహ్మమే కావలయును. ఎండమావి అన్పించినా కన్పించునది ఎడారిభూమియే. అట్లే జగత్తు దృశ్యమైనప్పటికి చూడబడునది బ్రహ్మమే. బహుళత్వముగా జగత్తు కన్పించుట అవిద్యవలన. అద్వయమైన ఆత్మజ్ఞానము వలన తెలియును. 'కన్నులతో దేనిని చూచినను అది ఆత్మగా భావింపుము. చెవులతో దేనిని వినినను అది ఆత్మగా సంభావింపుము.'

> సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్ష్యతే।
> అజ్ఞాన చక్షుర్నేక్షతే భాస్వంతంభానుమంధవత్॥ 65

తాత్పర్యము :

జ్ఞాన నేత్రము కలవానికి సర్వాత్మకమైన సచ్చిదానందమైన ఆత్మ తెలియును. అజ్ఞాన నేత్రము కలవానికి కన్పించదు. గ్రుడ్డివానికి సూర్యుడు కన్పించనట్లు.

వ్యాఖ్యానము :

మనకు దృశ్య మగుచున్నది బ్రహ్మమే అగునెడల మన మేల దృశ్యమును బ్రహ్మముగా గుర్తించుట లేదు? మనసు సత్యమును చూచుటలేదు. చుట్టుకొని యున్న మాయావరణమువలన అవిద్యామయమైన కంటితో చూడగా మనకు బహుళత్వమే దృశ్యమాన మగుచున్నది. జ్ఞాన నేత్రమునకు అద్వితీయమే కనుపించును.

ఆత్మ సర్వవ్యాపి. సత్తు. చిత్తు కాని అవిద్య మన దృష్టిని కప్పగా ఆత్మ మనకు కన్పించదు.

(సర్వం ప్రకాశయన్ సర్వం ప్రకాశమే అని పాఠాంతరములు)

ముండకోపనిషత్తు (III-i-8)—"అది దృష్టివలన తెలియబడదు. వాక్కుచేత కూడ కాదు. మఱియు ఇతర జ్ఞానేంద్రియములచేతను తెలియబడదు. తపస్సుచేతగాని, కర్మచేతగాని వలనుపడదు. జ్ఞానానుగ్రహముచేత చిత్తము (మనస్సు) కల్మషరహితము కాగా—ఆ విధముగా—అట్లు ధ్యానించి కూడ దానిని (అఖండమైనట్టిదానిని) తెలియజాలడు.

కఠోపనిషత్తు (iii-12) ఆత్మ అన్నిటియందు అంతరముగా నున్నప్పటికీ వెలుపలకు వెల్లడికాదు. అయితే జ్ఞానులైన యోగుల కది తెలియును.

భగవద్గీత (V-15) జ్ఞానము అజ్ఞానముచే ఆవరింపబడియున్నది. అందులో జీవులు భ్రమలో పడుచున్నారు. (XV-10) అజ్ఞానులు ఆత్మను తెలియలేరు. జ్ఞాన నేత్రము కలవారే దాని సిద్ధి గ్రహింతురు.

అవతారిక :

బంధవిముక్తిని గురించి చెప్పుచున్నారు.

శ్రవణాదిభిరుద్దీప్తో జ్ఞానాగ్ని పరితాపితః।
జీవస్సర్వమలాన్ముక్త స్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్॥ 66

తాత్పర్యము :

శ్రవణాదులవలన ప్రజ్వలింపబడిన జ్ఞానాగ్నిలో తపించి జీవి సర్వ మలములనుండి విముక్తి పొంది బంగారువలె స్వయముగా వెలుగును.

వ్యాఖ్యానము :

జ్ఞానము నెట్లు పొందవలెను? జ్ఞానమేమి చేయును? శ్రవణ మనన నిదిధ్యాసల వలన జ్ఞానము కలుగును. వేదాంత పాఠములను సమర్థులైన గురువులకడ శ్రవణము చేయుట - చదువుట - ప్రథమ సోపానము. పిమ్మట విన్నదాని సారమును మననము చేత అవగాహన చేసికొనవలెను. యుక్తియుక్తముగ అందువలన ఆత్మను గురించి తెలియుట మొదలగును. నిరంతర నిదిధ్యాస వలన - మహావాక్య అర్థ అనుసంధానము వలన ఆత్మజ్ఞానము లాభము కలుగును.

ఆత్మజ్ఞానము తుదిబుద్ధివృత్తి - ఆత్మను మరగుపరచుచున్న వానిని నిర్మూలించి - చివరకా బుద్ధివృత్తి అదృశ్యమగును. అడ్డుగానున్నవి తొలగింపబడుటతో ఆత్మ ప్రకాశించును.

దేనితో కలసినను బంగారము బంగారమే. బంగారు వన్నెను కల్తీ సరకు పాడుచేయలేదు. దాని వన్నెను మరగుపరచవచ్చును. నిప్పులో కాల్చినపుడు కల్తీ సరకు కరగిపోవును. శుద్ధ బంగారము ప్రకాశించును. అదేవిధముగా జ్ఞానాగ్నిలో అవరోధములు నశింపగా ఆత్మ పరిశుద్ధమై వెల్లడియగును.

అవతారిక :

ఆత్మ ప్రకాశమును గురించి చెప్పుచున్నారు.

హృదాకాశోదితోహ్యాత్మా బోధ భానుస్తమోపహృత్।
సర్వవ్యాపీ సర్వధారీభాతి భాసయతేఽఖిలమ్॥ 67

(సర్వం ప్రకాశయన్ సర్వం ప్రకాశతే - అని పాఠాంతరములు)

తాత్పర్యము :

హృదయాకాశమున జ్ఞానసూర్యుడన్న ఆత్మ ఉదయించి అవిద్యయన్న చీకటిని నశింపజేయును. సర్వవ్యాపియై సర్వధారియై అన్నిటిని వెలిగించి తాను వెలుగును.

వ్యాఖ్యానము :

ఆత్మ వెల్లడియగు ఆకాశము దహరా (హృది) కాశము. ఇది భౌతిక హృదయము కాదు. ఈ దహరాకాశమున సన్నివిష్టమైన ఆత్మ ధ్యానింపబడవలెను. (శ్రీ) శృంగేరి జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామివారు సదా ఆత్మధ్యానము చే- వారు.

దహరాకాశమున జ్ఞాన సూర్యోదయము, అప్పుడు అజ్ఞాన తిమిర నిర్మూలనము- చీకటి ఉన్నచోట వెలుగు ఉదయించుట. హృదయమున చీకటి - అందుచేత అచటనే జ్ఞానసూర్యోదయము. హృదయమున అజ్ఞానాంధకారము. అచట ఆత్మ అనాత్మ కలుపబడి (సత్యము - మిథ్య) దుఃఖకారణ మగుట. దానిని హృదయగ్రంథి యని చెప్పుట. ఆ గ్రంథిని జ్ఞానముచేత ఛేదింపవలెను. అప్పుడు స్వయంప్రకాశమగు ఆత్మ స్వయముగా ప్రకాశించును.

ఆకాశమువలె ఆత్మ సర్వవ్యాపి. హృదయ మనునది ఆత్మయొక్క పరిమిత వెలార్పు. ఆ పరిమితి విచారణ వలన తొలిగింపబడగా అద్వితీయమైన ఆత్మ వెలారింపబడును.

ఎడారిభూమి ఎండమావులకు ఆధారమైనట్లుగా - చీకటిలో రజ్జువు సర్పమునకు ఆధారమైనట్లుగా - ముత్తెపుచిప్ప వెండికి ఆధారమైనట్లుగా - ఆత్మ జగత్తునకు ఆధారము.

అవిద్య తొలగింపబడగా - ఆత్మ అన్నిటిని వెలిగించును - వాటికి వేరైన ఉనికి ఉండదు కాబట్టి అప్పటి సిద్ధి - 'ఇది యంతయు బ్రహ్మము- నేనును బ్రహ్మము

అనునట్లుండును. అయితే అంతయు - అన్నియ అనుట - 'నేను'కు సమానమని కాదు. అన్నిటిగా అగుపించునదియు, నేనైనదియు బ్రహ్మము కన్న వేరుకాదని. బ్రహ్మమే సత్యము. వేరేదియు సత్యము కాదు.

**అవతారిక :**

ఆత్మబోధయన్న ప్రకరణ గ్రంథమును ఉపసంహరించుచు ఫలశ్రుతిని చెప్పుచున్నారు.

దిగ్దేశ కాలాద్య నపేక్ష్య సర్వగం
శీతాది హృన్నిత్య సుఖం నిరంజనమ్।
యస్స్వాత్మ తీర్థంభజతే వినిష్క్రియః
ససర్వవిత్సర్వగతోఽమృతోభవేత్॥ 68

**తాత్పర్యము :**

అన్ని క్రియలను త్యజించి, దేశకాల దిక్కుల అపేక్ష లేకుండ ఆత్మతీర్థమును భజించువాడు (అది సర్వగతము, శీతాదులను హరించునది, నిత్యసుఖమైనది నిర్మలమైనది) సర్వగుడై సర్వవేత్తయై అమృతుడగును.

**వ్యాఖ్యానము :**

ఆత్మ విచారణ లక్ష్యము యొక్క ప్రశంసయు, దాని సిద్ధిని సాధించినవాని ప్రశస్తియు చెప్పబడినవి.

సదాచారశీలురు పుణ్యక్షేత్ర పుణ్యనదీ తీర్థములను సేవించుటకు పోవుదురు. పుణ్యతీర్థాటనమువలన ఇహలోక సంపద పరలోక సుఖము లభించును. అయితే పరలోక (స్వర్గలోక) సుఖము చాల గొప్పదైనప్పటికి కాలమునకు వశమైనదే. అందుచేత శాశ్వతము కాదు. పైగా అట్టి తీర్థయాత్రాటనము నందెన్నియో కష్టములు అవాంతరములు బాధలు. పుణ్యక్షేత్రములున్న దిక్కులకే తీర్థయాత్రలకు పోవలయును. నిర్దేశించిన కాలమునందే పోవలెను. (కాశీ, ప్రయాగ, అర్థోదయ మహోదయము మొ॥) అతిశీతల అతి వేసవి కాలములందు నదీస్నానాదులు (తీర్థ) సుఖముగానుండక పోవచ్చును. అసలు యాత్రాగమనమే సంకటము కావచ్చును. అచట ఎన్నో కర్మలు క్రియలు. ఎంతో కష్టపడి సాధించిన లక్ష్యము యొక్క ఫలము శాశ్వతము కాదు. కాలమును బట్టి వ్యయము కాక తప్పదు.

ఆత్మతీర్థమును పొందినవానికి అంతరాయములు బాధలు మొదలగునవి లేవు. ఆత్మ సర్వవ్యాపి - శాశ్వతము. కావున దానికొరకు. దిక్దేశకాల సంబంధములైన యత్నములు లేవు. ఆత్మసిద్ధివలన సర్వదుఃఖోపశమనము కనుక ఆత్మసిద్ధి ప్రయత్నమున శీతోష్ణాది బాధలు లేవు. విరుద్ధభావనల శమన మది. ఆత్మసిద్ధియే లక్ష్యము. అది పరమానందము. అది క్రియాసాధ్యము కాదు. నిష్క్రియము. ఆత్మసిద్ధి పొందిన వివేకి సర్వజ్ఞుడై సర్వగతుడై శాశ్వతుడగును. మోక్షము సర్వజ్ఞత్వము, సర్వగతత్వము, శాశ్వతము. ఆత్మసిద్ధియే మోక్షము. ఆత్మ నిత్యశుద్ధ బుద్ధముక్త సచ్చిదానందమై అఖండ అనంత అద్వితీయమైన బ్రహ్మమే.

ఆత్మబోధ ప్రకరణ గ్రంథము సమాప్తము.

శ్రీః



శ్రీ గురుభ్యో నమః

శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

# శతశ్లోకీ

వ్యాఖ్యాత: పరమహంస పరివ్రాజకాచర్యవర్య శ్రీ అప్పయానందభారతీస్వామి

(పూర్వాశ్రమమున శ్రీరామలింగేశ్వరరావుగారు)

భూమిక:

శ్రీ శంకర భగవత్పాదులు రచించిన లఘుప్రకరణ గ్రంథములందు శతశ్లోకి యొకటి. అద్వైత సిద్ధాంతమును శ్రీ శంకర భగవత్పాదులు ప్రస్థానత్రయమునందు విపులముగా విశ్లేషించి యున్నదానిని విద్వాంసులు కాని వారిపై అనుగ్రహబుద్ధితో వేయి శ్లోకములలో (ఉపదేశ సహస్రి) అయిదు వందల శ్లోకములలో (వివేక చూడామణి) నూరు శ్లోకములలో (శతశ్లోకి) పది శ్లోకములలో (దశశ్లోకి) ఒక శ్లోకములో (ఏకశ్లోకి జ్యోతిర్బ్రాహ్మణ విద్య) నిబంధించి ప్రసన్న గంభీరముగ చెప్పిరి.

ఈ శతశ్లోకి యందు ఉపనిషత్సమ్మతమైన అద్వైత వేదాంతమును అంత సూత్రముగా చెప్పినప్పటికి ఆ సిద్ధాంతమును విషయనిందా, వైరాగ్య ముముక్షుత్వాది నిరూపణము, ఆత్మ నిష్క్రియత్వము, జగన్మిథ్యాత్వము జీవన్ముక్తి ఆనంద స్వరూపము మొదలగు విషయముల ద్వారా సులభ సుందరముగ సామాన్య జనుల అవగాహనానుకూలముగ ప్రతిపాదించిరి.

శ్రీ శృంగేరి జగద్గురు చరణుల ఆనతిం బడి దీని వ్యాఖ్యానమునకు పూనుకొనుట జరిగినది.

శ్రీ భగవత్పాదుల రచనల కెంతైన వివరణ వ్యాఖ్యానము వ్రాయవచ్చును. నీటి కొలది తామర యన్నట్లు శక్తికొలది వ్రాయుట. (వ్యాఖ్యాత)

దృష్టాంతోనైవ దృష్టస్త్రిభువన జఠరే సద్గురోర్జ్ఞాన దాతుః
స్పర్శ శ్చేత్తత్రకల్ప్యః స నయతి యదహో స్వర్ణతామశ్మసారమ్।
నస్పర్శత్వం తథాపిశ్రిత చరణయుగే సద్గురుః స్వీయశిష్యే
స్వీయం సామ్యం విధత్తే భవతి నిరుపమస్తేన వాఽలౌకికోఽపి॥ 1

శిష్యుని యందు అనుగ్రహ బుద్ధితో జ్ఞానము నొసంగి తన యంతటి వానిని చేయు సద్గురువుతో పోల్చదగిన వస్తువు ముల్లోకములందును లేదు. ఇనుమును బంగారముగా మార్చగలిగిన స్పర్శవేదిని (పరుసవేది) దృష్టాంతముగా తీసికొందు మనుకొన్నచో నదియు సరిపోవదు. ఏలననగా - అది స్పృశించుటవలన లోహమును బంగారముగా మార్చగలదే కాని - దానిని తనవలె మరియొక స్పర్శవేదిగా మార్చ జాలదు కదా!

సద్గురు వట్లు కాదు. తన చరణ యుగమును భక్తితో నాశ్రయించిన శిష్యుని జ్ఞానప్రదానము చేసి తనయంతటి వానిని చేయగలడు. కాబట్టి సద్గురువునకు పోల్చ దగిన వస్తువు - సాటియైన వస్తువు - ముల్లోకములం దేదియు లేదు. ఆ కారణము చేత సద్గురువు సాటిలేనివాడు మాత్రమే కాదు. లోకోత్తరుడైన వాడు కూడ - అని యనవలెను.

విశేషములు :

స్పర్శవేది: స్పర్శముచేత లోహాది వస్తువులను సువర్ణముగా మార్చునట్టి అసాధారణ మూలికా విశేషము.

ఈ శ్లోకమును సాహిత్య దృష్టితో పరిశీలించినపుడు దీనియందు మంగళా చరణము, అనుబంధ చతుష్టయము తోచుచున్నది.

సద్గురువు శిష్యుని తనయంతటివానిగా చేయుచుండగా స్పర్శవేదియొక్క దృష్టాంతానర్హత్వమువలన గురువు నిరుపమానుడని, ఆయనతో పోల్చిచెప్పుటకు దృష్టాంతమే లేదని - (దృష్టాంత శూన్య) అలౌకికముగా, ప్రపంచాతీతముగానైనను దృష్టాంతము లేదని (భగవద్గీతలో భగవద్వచనము జ్ఞానీత్వాత్మైవమేమతమ్'' (4 వ అధ్యాయము 4-37, 7-17) ఇచ్చట గమనింపవలెను.

గమనిక :

(శ్రీ శృంగేరి జగద్గురు సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీమహాస్వామి వారు పరిష్కరించిన పాఠమునే అనుసరించుచున్నాము. (వ్యాఖ్యాత)

యద్వచ్ఛ్రీఖండవృక్ష ప్రసృత పరిమలేనాభితోఽన్యేఽపి వృక్షాః
శశ్వత్సౌగంధ్యభాజోఽప్యతనుతను భృతాం తాపమున్మూలయంతి
ఆచార్యాల్లబ్ధబోధా అపి విధివశతః సంనిధౌ సంస్థితానాం
త్రేధా తాపంచపాపం సకరుణ హృదయాః స్వోక్తిభిః క్షాళయంతి॥ 2

శ్రీగంధము వృక్షమునుండి వచ్చు పరిమళమువలన దాని పరిసరము నందున్న వృక్షములు కూడ సువాసనాభరితములై విధివశమున తమ్ము ఆశ్రయించు సకల ప్రాణుల తాపమును పోగొట్టును. అదే విధముగా సద్గురువువలన జ్ఞానోపదేశమును పొందిన శిష్యులు కూడ కరుణాభరిత హృదయము కలవారై యాదృచ్ఛికముగా తమ సన్నిధియందు వర్తించు జనావళిని యంతటిని యథాధికారముగ కర్మోపాసనా జ్ఞానకాండ నిరూపకములౌ తమ వచస్సులవలన వారియొక్క ఆధ్యాత్మిక ఆధి భౌతికాధి దైవిక తాపత్రయమును కాయిక వాచిక మానసిక పాపములను క్షాళనము చేయుదురు.

(విధివశతః అను పదమువలన బోధలాభము దుర్లభమని సూచితము)

ఆత్మానాత్మ ప్రతీతిః ప్రథమ మభిహితా సత్యమిథ్యాత్వయోగాత్
ద్వేధాబ్రహ్మ ప్రతీతిర్నిగమ నిగదితాస్వాను భూత్యోపపత్త్యా
ఆద్యాదేహాను బంధార్భవతి తదపరాసాచ సర్వాత్మకత్వా
దాదౌబ్రహ్మాహ మస్మీత్యనుభవ ఉదితే ఖల్విదం బ్రహ్మపశ్చాత్॥ 3

తొలుత తత్త్వవిచారము చేసినందువలన సత్యము (ఆత్మ యని) మిథ్య (అనాత్మ యని) కోటిద్వయము తెలియును. సత్యమిథ్యాత్వ యోగమువలన ఆత్మా నాత్మ ప్రతీతి కలుగుట. అందు బ్రహ్మ ప్రతీతి ద్వివిధములుగా కలుగును. అప రోక్షానుభవము (స్వానుభవము) ఉత్పత్తి అనునవి రెండు విధములును. ఆ రెండు ప్రతీతులును క్రమముగా దేహానుబంధమువలన సర్వాత్మకత్వ భావమువలనను కలుగు నని శ్రుతులు చెప్పుచున్నవి.

ఎట్లనగా తొలుత అహంబ్రహ్మాస్మి (నేను బ్రహ్మమునే) అను అనుభవలబ్ధి అయిన తరువాతగాని సర్వం ఖల్విదంబ్రహ్మ (సర్వమును బ్రహ్మమేకదా) అను సర్వాత్మభావము (ఉపపత్తులతో) ప్రతీతము కాదు.

విశేషములు :

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" (శ్రుతి. తై. ఉపనిత్తు)

సత్యం - జ్ఞానము. మిథ్యా - తద్విపరీత మజ్ఞానము.

"యోమామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్
స సర్వ విద్భజతిమాం సర్వభావేన భారత" (భ. గీ. 15-19)

ఆత్మా చిద్వి త్సుఖాత్మాఽను భవ పరిచితః సర్వదేహాది యన్తా
సత్యేవంమూఢ బుద్ధిర్భజతి ననుజనోఽనిత్య దేహాత్మ బుద్ధిమ్
బాహ్యోఽస్థిస్నాయు మజ్జాపలరుధిరవసా చర్మమేదో యుగన్త
ర్విణ్మూత్ర శ్లేష్మపూర్ణం స్వపరవపుర హోసం విదిత్వాఽపిభూయః॥ 4

ఆత్మ చైతన్య జ్ఞాన పరమానంద స్వరూపము అపరోక్షమైన అనుభవ గోచరము (ఆత్మ కేవలము ఆ విధమైన స్వరూపముగా తోచదు. ఉపనిషద్వాక్య ముల ద్వారా నిరంతర అభ్యాసమువలన అనుభవింపవలెను) ఆత్మ దేహాది నియంత (ఇంద్రియ ప్రాణాదులకు నియంతయగుట వలన చిద్రూపము-సుషుప్తి యందు ఆనందరూపము, ఇట్లే అవస్థాత్రయమున అనుభావ్యము) యథార్థస్థితి యిట్లుండగా - ఆశ్చర్యము! ఆశ్చర్యము. మూఢబుద్ధులు నిత్యము స్వపర దేహములను పెక్కింటిని చూచుచు ఆ స్థూల దేహములు ఎముకలు, స్నాయు, మజ్జ, మాంస రక్త, వస మేధస్సు - వీనియొక్క సముదాయమేననియు, అంతర శరీరము మలమూత్ర శ్లేష్మపూర్ణమనియు దేహమును గూర్చి తెలిసికొనియు మఱచిపోవు వివేకమును పోగొట్టుకొని అనిత్యమైన దేహమునే ఆత్మ యని మరల మరల శరీర తాదాత్మ్యమును పొందుచు చరించుచున్నారు.

దేహస్త్రీ పుత్రమిత్రాను చరహయవృషాస్తో షహేతుర్మమేత్థం
సర్వేస్వాయుర్నయంతి ప్రథితమలమ మీ మాంస మీమాంస యేహ
ఏతే జీవన్తియేన వ్యవహృతి పటవో యేన సౌభాగ్య భాజ
స్తం ప్రాణాధీశ మంతర్గత మమృత మముంనైవ మీమాంసయంతి॥ 5

దేహము, పుత్రమిత్రులు, స్త్రీలు, అనుచరులు, గుఱ్ఱములు, ఎద్దులు మొద లగునవియే మూఢబుద్ధులు సుఖకారణములని, వాటిని గూర్చియే నిరంతరము ఆలోచించుచు తమ తమ జీవితములను వ్యర్థము చేయుచున్నారు. కాని ఎవని మూలమున దేహ వ్యవహార సామర్థ్యము కలవారై సౌభాగ్య సంపన్నులగుచున్నారో అట్టి అంతర్గత అంతర్యామిత్వమువలన స్థితుడై, ప్రాణాధీశుడై ఆ మరణకాలము దేహమున ముఖ్య ప్రాణమును అమృతవంతము చేయుచున్న ఆ ఆత్మను గురించి విచారణ చేయరు. ఇది మహాశ్చర్యము.

**అవతారిక :**

దేహాత్మ సాహచర్యమును దృష్టాంతముచే నిరూపించుచున్నారు.

కశ్చిత్కీటః కథంచిత్పటుమ తిరభితః కంటకానాం కుటీరం
కుర్వంస్తేనైవ సాకం వ్యవహృతి విధయే చేష్టతే యావదాయుః।
తద్వజ్జీవోపి నానాచరిత సముదితైః కర్మభిః స్థూలదేహం
నిర్మాయాత్త్రైవతిష్ఠన్ననుదినమమునా సాకమభ్యేతి భూమౌ॥ 6

ఒక కీటకము తన చుట్టును పాటవముచేత తన కఫసూత్రము వలన నొక కంటకమయ కుటీరమును నిర్మించుకొని ఆ కుటీరమునందే తాను యావజ్జీవము (తనకు ఆయువు ఉన్నంతకాలము) తన జీవిత వ్యవహారము కొనసాగించును. అదే విధముగా జీవుడును నానావిధములైన సంచిత కర్మల ప్రారబ్ధములవలన తత్తత్కర్మ ఫలభోగ సాధనమైన స్థూలశరీరమును నిర్మించుకొని దానియందుండి యావజ్జీవము దాని సంబంధమును విడువలేక చరించుచుండును.

విశేషము:

ఇచ్చట రథాశ్వ న్యాయమును అనుసంధించుకొనవలెను. స్థూల శరీరము జీవుడు లేక చలనమే లేకుండ నుండును. జీవునికి స్థూలశరీరము లేకున్న లౌకిక వ్యవహారమే లేదు. అందుచేత నిచట దేహాత్మ సాహచర్యము దృష్టాంతము చేత సూచింపబడినది.

అవతారిక :

దేహము లభించినప్పటికి పారమార్థికము కాదు. (అది అవిద్యా కల్పిత మగుట కృత్రిమ మగుటవలన) తదనురూప కార్య కర్తృకము కాదని దృష్టాంతము చూపుచున్నారు.

స్వీకుర్వన్ వ్యాఘ్రవేషం స్వజఠర భృతయేభీషయన్ యశ్చముగ్ధాన్
మత్వావ్యాఘ్రోఽహమిత్థం నర పశుముఖాన్ బాధతేకింను సత్త్వాన్
మత్వాస్త్రీ వేషధారీస్త్ర్యహమితి కురుతేకింనటో భర్తురిచ్ఛాం
తద్వచ్ఛారీర ఆత్మాపృథగనుభవతో దేహతోయః స సాక్షీ॥ 7

ఒక దెవ్వడైన కడుపు నింపుకొనుటకు గాను పెద్ద పులివేషమును వేసికొని చూచువారికి కొంత భయము కలిగించునట్లు నటించినను, వాడు పెద్ద పులి కాజాలడు కదా। వాడు నరమృగాదులను పెద్దపులివలె హింసింపలేడు కదా। పురుష దెవ్వరైన స్త్రీ వేషమును ధరించి తాను స్త్రీయేనని ఎంత భావన చేసినప్పటికి పురుషుడేగాని స్త్రీ కాజాలడు కదా। అతడు స్త్రీవలే భర్తయొక్క కోర్కెలను తీర్పజాలడు కదా।

అదే విధముగా జీవుడు (ఆత్మ) వేరువేరు శరీరములతో బహు వేషములను వేసినను దేహానుభవముతో, శరీర తాదాత్మ్యమును సంభావన చేసికొన్నను ఆత్మ శరీరముకంటె భిన్నమేగాని దేహము కాదు. కావున జీవుడు దేహముకంటె భిన్నుడైన సాక్షి మాత్రమే అగుచున్నాడు. దేహానురూప చేష్ట కార్యము కాదని స్వస్వరూపాను రూపమైనదే స్థాతవ్య మని భావము.

అవతారిక :

శ్రుతి కుశలులకు ఆత్మ ప్రతీతి బహు ప్రకారములుగా కలుగుచున్నదని చెప్పుచున్నారు.

> స్వంబాలంరోదమానం చిర సమయమముం శాంతమానే తుమగ్రే
> ద్రాక్షం ఖార్జూర మామ్రం సుకదల మథవాయోజయత్యం బికాఽస్య
> తద్వచ్చేతోఽతి మూఢం బహుజనన భవాన్మౌఢ్య సంస్కారయోగా
> ద్బోధోపాయైరనేకైరవశము పనిషద్బోధయా మాస సమ్యక్॥ 8

కొంత సేపటినుండి పోరుపెట్టి యేడ్చుచున్న బిడ్డను శాంతింపజేయుటకై తల్లి ఆ బిడ్డముందు ద్రాక్ష పండ్లను, ఖర్జూర పండ్లను, మామిడి పండ్లను లేక అరటి పండ్లను పెట్టుచు ఆ బిడ్డ అభీష్ట ఫలములను చూచి రోదనమును మాని శాంతించునని కోరును. అదే విధముగా బహుజననములవలన కలిగిన మౌఢ్య సంస్కారమువలన అవశము చంచలము అతిమూఢ అజ్ఞాన ఉపహతమునైన చేతస్సులకు ఉపనిషత్తులు బహువిధములైన జ్ఞానసాధనోపాయములను అధికార తారతమ్యమును బట్టి చూపించుచు ఉద్బోధించినవి.

అవతారిక :

ఆత్మకు సర్వాపేక్షయా ప్రియత్వమును చెప్పుచున్నారు.

> యత్ప్రీత్యాప్రీతి పాత్రంతను యువతితనూజార్థ ముఖ్యం సతస్మాత్
> ప్రేయానాత్మాఽథశోకాస్పద మితరదతః ప్రేయ ఏ తత్కథం స్యాత్।
> భార్యాద్యం జీవితార్థీ వితరతి చవపుః స్వాత్మనశ్శ్రేయ ఇచ్ఛన్
> తస్మాదాత్మాన మేవప్రియ మధికముపాసీత విద్వాన్ నచాన్యత్॥ 9

సుఖదుఃఖాన్యతర సాక్షాత్కారమైన భోగమునకు ఆస్పదములై, ఆత్మకు ప్రీతి పాత్రములైన తను, యువతి పుత్ర ధనములకంటె ఆత్మకు వాస్తవముగా ఆత్మయందే

మిక్కిలి ప్రీతి. విషయ భోగార్థము ప్రవృత్తములైన ఈ వస్తుజాతము ఆత్మకు ప్రీతిని కలిగించునట్లు తోచును. ఈ వస్తుజాతమునందు ప్రథమము శరీరము, భోగ సాధన మగుటవలన, తరువాత భోగమునకు అంతరంగమైన యువతి. తరువాత ఉభయ ప్రీతి జన్యమగు తనూజుడు (పుత్రుడు) తరువాత తన్నిర్వాహకమైన ద్రవ్యము ఆ తరువాత ద్రవ్యముచేత సాధింపదగిన పానీయ వస్త్ర అలంకారాదికములు. అయితే అన్నింటికంటె ప్రీతిపాత్రమైనది ఆత్మయే. ఇతర వస్తుజాతములందు ప్రీతిగౌణమే నవి ప్రత్యక్షముగా తెలియుచున్నది. ఆ యువతి తనూజాదులు శరీరము దుఃఖ నిలయ ములు కదా. తన రక్షణకై అందరిని త్యజించుటకు సిద్ధము కదా!

కావున విద్వాంసుడు విషయ ప్రీతి ప్రాతి భాసికము మాత్రమేనని పారమార్థి కము కాదని గ్రహించి, అది దుఃఖాస్పదమని తెలిసికొని, ఆ విషయజాతముకై ఆరాటపడక సర్వాధిక ప్రీతి పాత్రమైన ఆత్మనే ఉపాసింపవలెను.

విశేషములు :

ఆది మధ్యావసానములందు దుఃఖము కలది దుఃఖాస్పదము. అందుచేతనే "అర్జనే రక్షణే నాశే క్లేశదో విషయోభవేత్ సుఖాయ సజ్జతే తత్ర మూఢధీరితి విస్మయః" అని అభియుక్తోక్తి.

'ఆత్మానం సతతం రక్షేద్దారైరపిధనైరపి' అనియు అభియుక్తోక్తి.

భవిష్యత్తున ఉత్తమ శరీర లాభమునకై ఈ శరీరమును గంగయందు వదలుట, క్షత్రియ ధర్మమును వహించి శరీరమును వదలుట చూచుచున్నాము.

అవతారిక :

ఆపేక్షికమైన ప్రియత్వమును గురించి వివరించుచున్నారు.

యస్యాద్యావత్ప్రియం స్యాదిహ హి విషయతస్తావదస్మి న్ప్రియత్వం
యావద్దుఃఖం చ యస్మాద్భవతి ఖలు తతస్తావ దేవాప్రియత్వమ్।
నైకస్మిన్ సర్వకాలేఽస్త్యుభయ మపికదాప్య ప్రియోఽపి ప్రియఃస్యాత్
ప్రేయానప్య ప్రియోవా సతతమపి తతఃప్రేయ ఆత్మాఖ్యవస్తు॥ 10

భార్యాది విషయ భోగవస్తువులు సుఖమును కలిగించుచున్నంతవరకు అవగా దుఃఖమును కలిగించనంతవరకు ప్రియములు. దుఃఖములు కలిగించునప్పుడు అప్రియములే. ఒక విషయ భోగవస్తువునందు సర్వదా ప్రియత్వముండదు. ఈ

ఏకకాలమున ప్రియత్వ అనియత్వము లుండవు. అనగా విషయములందు కార్య వశమున ప్రియత్వము. అది భార్యాది విషయములందు కూడ నట్లే. నియతవశమున కాలవశమున అప్రియము కావచ్చును.

ఆత్మాఖ్య వస్తువు సతతము ప్రియమైనదే. ఈ విషయమును శ్రుతికూడ నిట్లే చెప్పినది. "నవా అరేపుత్రాణాంకామాయ పుత్రాః ప్రియాభవంత్యాత్మనస్తు కామాయపుత్రాః ప్రియాభవంతి"*

"తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయోఽన్యస్మా త్సర్యస్మా దంతర తరం యదయమాత్మా సయోన్యమాత్మనః ప్రియం బ్రువాణం బ్రూయాత్ ప్రియం రోత్స్యతీతీశ్వరోహతథైవ స్యాదాత్మానమేవ ప్రియముపాసీత నయ ఆత్మాన మేవ ప్రియ ముపాస్తే న హాస్య ప్రియం ప్రమాయుకం భవతి"

ఇది యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయికి చెప్పిన ఉపదేశము. ఉత్పత్తి స్థితి నాశాదికాలత్రయము అందును విషయములు దుఃఖహేతువులు. దేనివలన దుఃఖము కలుగునో దానిని ప్రీతిపాత్రముగా గణించుటెట్లు?

ఈ విషయమును భగవద్గీతయందు పరమాత్మ కూడ చెప్పెను.

యేహి సంస్పర్శజా భోగాదుఃఖయో నయ ఏవతే
ఆద్యంతవంతః కౌంతేయ నతేషు రమతే బుధః॥

దుఃఖహేతువులైన వస్తుజాతమునందు ఈశ్వరుని ప్రసన్నత మన కెట్లు అనుభవమునకు వచ్చును? అందుచేత పుత్రాది విషయములకై తహతహపడుట మానుకొని ఆత్మోపాసన చేయవలెను.

పుత్రవిత్తాదికమునందు ప్రియము చేయుటవలన నేమి ప్రయోజనము? ఏమియు లేదు. శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతయం దిట్లు చెప్పెను.

"యం లబ్ధ్వాచాపరం లాభం మన్యతే నాధికం తతః"

ఏ లాభమును పొందిన తరువాత అన్యలాభము కొరకై మానవుడు ప్రయత్నింపడో అది ఆత్మలాభము.

శ్రేయః ప్రేయశ్చలోకే ద్వివిధమభిహితం కామ్యమా త్యంతికంచ
కామ్యం దుఃఖైకబీజం క్షణలవవిరసం తచ్చికీర్షంతిమందాః॥

---

*బృ. ఉ. 6-5-6.

బ్రహ్మైవాత్యంతికం యన్ని రతిశయ సుఖస్యాస్పదం సంశ్రయంతే
తత్త్వజ్ఞా స్తచ్చకాఠోపనిషదభిహితం షడ్విధాయాంచ వల్ల్యామ్॥ 11

లోకమునందు శ్రేయము ప్రేయముననను రెండు అభిహితములు. శ్రేయస్సు సుకృత సాధనము. ప్రేయస్సు ప్రేమాస్పదము. ప్రేయము కామ్యమైనది. అనిత్యము. శ్రేయము అత్యంతికమైనది. నిత్యము. అత్యంతికమైనదనగా మోక్షసాధకమైనది. శ్రేయస్సు జాయాపుత్రాదికమైనది. ఇది దుఃఖమునకు బీజము వంటిది.

లోకముయొక్క ప్రవృత్తి క్షణలవవిరసమైన ప్రేయస్సుయందే - శుక్తి రజత భ్రాంతమై మందబుద్ధితో - కోరిక పెంచుకొనుచున్నది. నిరతిశయ సుఖాస్పదమైన దానిని తత్త్వజ్ఞులు ఆశ్రయింతురు. ఈ నిరతిశయ సుఖాస్పదమైన బ్రహ్మమును కఠోపనిషత్తు బహుధా ప్రతిపాదించినది.

ఆత్మాంభోధేస్తరంగోఽ స్మ్యహమితి గమనే భావయన్నాసనస్థః
సంవిత్సూత్రానువిద్ధో మణిరహమితి వాఽస్మీంద్రి యార్థప్రతీతౌ
దృష్టోస్మ్యాత్మావలోకాదితి శయన విధౌమగ్న ఆనందసింధా
వంతర్నిష్ఠో ముముక్షుః సఖలు తనుభృతాం యోనయత్యేవమాయుః॥

ముముక్షువు తన ఆయుఃకాలము నంతటిని యెట్లు గడుపవలయు ననగా-గమన సమయమునందు 'నేను ఆత్మ యను మహాసముద్ర జలమునం దొక్క తరంగముగా నున్నానని భావన చేయవలయును (మహాసముద్ర జలమంతయు నొక్కచే దావి తరంగము సముద్ర మధ్య నుండి తీరమునకు ప్రయాణించునట్లుండును. అట్లే స్థానాంతర చలనము చేయునపుడు భావన చేయవలయును. 'క్రీడన్నార్మి రపామివ' అని శ్రుతి) ఆసనమున కూర్చుండియున్నపుడు సంవిద్రూప సూత్రమునందున్న జీవు డను మణినను భావవ చేయవలయును. (మయి సర్వోమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ - అని గీత) ఇంద్రియములద్వారా బహిర్విషయములను దర్శించు నపుడు ఆత్మావలోకనము - నన్ను నేను చూచుకొనుచుంటినను (దృష్టోఽస్మీతి) భావనము చేయవలయును. సుషుప్తి సమయమున ఆనంద సింధువున మునిగియుంటి నని తలపోయవలెను.

వైరాజవ్యష్టి రూపం జగదఖిలమిదం నామరూపాత్మకం స్యాత్
అంతస్థస్య ప్రాణముఖ్యాత్ ప్రచలతిచపున ర్వేత్తి సర్వాన్ పదార్థాన్।

నాయం కర్తానభోక్తా సవితృవిదితి యోజ్ఞానవిజ్ఞానపూర్ణః
సాక్షాదిత్థం విజానన్ వ్యవహరతి పదాత్మానుసంధాన పూర్వమ్॥ 13

జ్ఞాన (శాస్త్రోత్థం) విజ్ఞాన (అనుభవ)పూర్ణుడై పరమాత్మ స్వరూపమును లెస్సగా నెఱిగి ఆత్మానుసంధాన పూర్వక అంతర్నిష్ఠుడై ముముక్షువు వ్యవహరించును. లెస్సగా నెఱుగుట యెట్లనగా ఆత్మాకారాంతః కరణవృత్తి కలిగి బాహ్యదృష్టికి నామ రూపాత్మకమైన జగత్తు తోచినపుడు దానిని స్థూలసమష్టి రూపము గల విరాడ్రూపుని వ్యష్టిరూపులని గ్రహించుట. ఈ వ్యష్టిరూపములు అంతస్థప్రాణ ముఖ్యరూపములుగా చిద్రూపమువలె చరించుచున్నవని, వ్యాపారము చేయుచున్నవని తెలియుట: ఆ ప్రాణులు నిఖిల పదార్థ జ్ఞానము కలిగియున్నవని గ్రహించుట; ఆత్మ (సూర్యుని వలె) కర్తృత్వము లేనిదని, చాలకత్వమునందును కర్తృత్వాభిమాన శూన్యమని అందుచేత భోక్తయుకాదని పదార్థ గ్రాహకత్వమును కలిగినను, భోక్తృత్వాభిమాన శూన్యమని, ఆ విధముగా వ్యవహరించుచున్నదని తెలియుట.

స్థూల సమష్టి రూపమగు బ్రహ్మ విరాట్టు-సూక్ష్మ సమష్టి రూపమగు బ్రహ్మ హిరణ్యగర్భుడు.

నైర్వేద్యం జ్ఞానగర్భం ద్వివిధమభిహితం తత్ర వైరాగ్యమాద్యం
ప్రాయోదుఃఖావలోకాద్భవతి గృహసు హృత్పుత్ర విత్తైషణాదేః।
అన్యత్ జ్ఞానోపదేశాద్యదుదిత విషయే వాంత వద్ధేయ తాస్యాత్
ప్రవ్రజ్యాఽపి ద్విధాస్యాన్నియమిత మనసాందేహతోగేహతశ్చ॥ 14

నైర్వేద్యమని, జ్ఞానగర్భమని వైరాగ్యము రెండు విధములు (వైరాగ్యము విజ్ఞానోపాయము) - దుఃఖము - నిర్వేదము వలన ఉత్పన్నమైనది నైర్వేద్య వైరాగ్యము. ఇది ఆద్యమైనది. గృహ సుహృత్ పుత్ర విత్త ఏషణాదులందు ప్రాయికముగా దుఃఖ దర్శనమువలన కలుగును. రెండవదియైన జ్ఞానగర్భ వైరాగ్యము జ్ఞానోపదేశమువలన కలుగును. ప్రథమమున దుఃఖదర్శనాదులవలన కలుగును అనంతరము ఆత్మాతిరిక్తమైనది సర్వమును దుఃఖ రూపమన్న ఉపదేశమువలన కలుగు జ్ఞాన వైరాగ్యమువలన సుహృత్పుత్ర కళత్రాదికమునందు వాంతియందువలె హేయభావము కలుగును. తిరిగి తద్గ్రహణేచ్ఛ ఉదయింపదు. జ్ఞాన వాసిష్ఠమునం దీ విషయము చెప్పబడినది.

బుద్ధ్వాఽప్యత్యంతవైరస్యం యః పదార్థేషు దుర్మతిః।
బధ్నాతివాసనం భూయోనరోనాసౌస గార్ధభః

అట్లే సన్న్యాసము రెండు విధములు. మొదటిది గృహమును వదలి త్యజించుట ఇది ప్రథమ వైరాగ్యమువలన కలుగునది. పిమ్మట జ్ఞానగర్భ వైరాగ్యమువలన దేహతాదాత్మ్యాభిమానము తొలగిపోవుటవలన సిద్ధించు దేహాభిమానత్యాగ రూపమైన సన్న్యాసము. ఇది రెండవది - ఇది దేహాభిమాన శూన్యత్వ మనునది.

అవతారిక :

ఉపదేశరీతిని చెప్పుచున్నారు.

యః కశ్చిత్ సౌఖ్యహేతోస్త్రి జగతి యతతే నైవ దుఃఖస్యహేతోః
దేహేఽహంతా తదుత్థా స్వవిషయ మమతాచేతి దుఃఖాస్పదేద్వే
జానన్ రోగాభి ఘాతాద్యనుభవతి యతోనిత్య దేహాత్మబుద్ధిః
భార్యాపుత్రార్థనాశే విపదమథ పరామేతి నారాతినాశే॥ 15

ముల్లోకములం దెవ్వడుగాని సుఖమును పొందుట కొరకే ప్రయత్నము చేయును. దుఃఖము కోసమై ప్రయత్నింపడు. కాని దేహమే అహమనుకొను బుద్ధిని, దానికి మూలమగు స్వవిషయ మమకారము అను రెండును దుఃఖకారణములని తెలిసియు నిత్య దేహాత్మ బుద్ధి కలవాడై రోగాది దుఃఖ మనుభవించును. మమకారమును పెంచుకొని భార్యాపుత్రాది ధనాది నష్టముచే ఉత్కృష్టమైన మహాపద ప్రాప్తించినట్లు రోదించును.

దేహాత్మబుద్ధి మమకారము శూన్యమైనవాడు దుఃఖమును పొందడు. శత్రువు ఎడల మమతా బుద్ధి లేదు గనుక శత్రుభావమువలన దుఃఖము లేదు. ఎచట దేహాత్మబుద్ధి మమకారము కలవో అచ్చట దుఃఖము (ధూమవహ్ని న్యాయమువలె) తప్పదని నిశ్చయము.

తిష్ఠన్గేహే గృహేశోఽప్యతిథిరివ నిజం ధామగన్తుంచికీర్షు
ర్దేహస్థం (దుఃఖ) సౌఖ్యం న భజతి సహసా నిర్మమత్వాభిమానః।
ఆయాత్రా యాస్యతీదం జలదపటలవ ద్యాతృయాస్యత్య వశ్యం
దేహాద్యం సర్వమేవం ప్రవిదిత విశయో యశ్చతిష్ఠ న్యయత్నః॥ 16

ఇంటికి వచ్చిన అతిథి ఇంటి యజమానుని దుఃఖములో పాల్గొనక తన త్రోవను తాను పోవునట్లు గృహ యజమానియు దేహగేహములం దభిమానము మమకారమును విడిచి - యీ దేహము క్షణికము. ఇది అల్ప సమయము వాసస్థలముగా నైనది అని గ్రహించి అది కదలిపోవుచున్న మేఘపటలము వంటిదని తెలిసికొని దాని సుఖ దుఃఖములతో తనకు సంబంధము లేదని యెరిగి) దేహాదులందు దృష్టి లేక చరించి నచో - దేహసంబంధములైన సుఖదుఃఖము లంటవు.

శక్త్యానిర్మోకకః స్యాద్గృహి రహిరివయః ప్రవ్రజన్ స్వీయగేహా
చ్ఛాయాం మార్గద్రుమోత్థాం పథిక ఇవమనా క్సంశ్రయే ద్దేహసంస్థామ్
క్షుత్పర్యాప్తం తరుభ్యః పతిత ఫలమయం ప్రార్థయేద్భైక్షమన్నం
స్వాత్మారామం ప్రవేష్టుం సఖలు సుఖమయం ప్రవ్రజేద్దేహతోపి॥ 17

వైరాగ్య బలమువలన స్వీయగేహము నుండి బయలువెడలి (సర్పము తన శరీరభాగమే అయినప్పటికి కుబుసమును పరిత్యజించి దానిని హేయముగా చూచి దూరము వెళ్లునట్లే.) రావలయును.

అట్లు వెడలివచ్చిన తరువాత - బాటసారి మార్గమునందున వృక్షచ్ఛాయలందు తాత్కాలికముగా నిలిచి దేహరక్షణమును కావించుకొనునట్లు (బాటసారి చెట్టు క్రిందనే ఉండిపోడు) దేహధారణము కొరకు ఆవశ్యకములగు సాధనములను అవలంబించి ఫలవృక్షములను ప్రార్థించి వాటినుండి నేలపై రాలిన ఫలములను ఆకలి నివారణకు భిక్షాన్నముగా గ్రహింపవలెను. ఫలమును సంగ్రహింప రాదు. కోసికొనరాదు.

చివరకు సుఖమయము ఆనంద స్వరూపమునగు స్వాత్మారామమును ప్రవేశించుట కొరకు దేహాభిమానమును పరిత్యజింపవలెను. (ఇది దేహసన్న్యాసము)

బృహదారణ్యక శ్రుతి యం దిట్లు చెప్పబడినది.

"తద్యథాఽహి నిర్ల్వయనీ వల్మీ కీమృతా ప్రత్యస్తాశయీా తైవమే వేదగ్ం శరీరగ్ం శేతేఽథాయ మశరీరోఽమృతః"

అవతారిక :

కామ క్రోధ లోభాదులు - ఎల్లరకు పాత హేతువులని చెప్పుచున్నారు.

కామో బుద్ధావుదేతి ప్రథమమిహ మనస్యుద్ధిశ త్యర్థజాతం
తద్గృహ్ణతీంద్రి యాస్యైస్త దనధిగమతః క్రోధ ఆవిర్భవేచ్చ।

ప్రాప్తావర్ధస్య సంరక్షణ మతిరుదితో లోభ ఏతత్త్రయం స్యాత్
సర్వేషాం పాతహేతు స్తదిహ మతిమతాత్యాజ్య మధ్యాత్మయోగాత్॥18

(ఇంద్రియాసైః అనుటకు ఇంద్రియాఖ్యైః అని పాఠాంతరము.)

తొలుత బుద్ధియందు కామ ముదయించి, వస్తుజాతమునందు అభిలాష కలిగించును. (వస్తుజాతము అర్ధజాతము పదార్థజాతము రూపరసాదులందు సంకల్ప విషయము కలిగించును) ఆ వస్తుజాతము లభించగా — ఇంద్రియముల ద్వారా గ్రహించును. అనేకాంతరాయములు కారణముగా అవి లభింపని యప్పుడు క్రోధము ఆవిర్భవించును. (కామాత్ క్రోధోభిజాయతే — గీత).

దైవవశమున ఆ కోరినవి లభించినపుడు నానావిధములైన ఉపాయములచేత లభించిన వస్తుజాతమును రక్షించుటకు ప్రాకులాట. అదియే లోభము. అనగా ఆ వస్తువులయందు స్వీయత్వాభిమానము కామక్రోధ లోభములను నీ మూడును సకల జీవులకు సకల దుఃఖస్వరూప సంసార కారణములు. అందుచేత మతిమంతులు వాటిని త్యజింపవలెను. ఎట్లనగా ఆధ్యాత్మయోగమువలన — నిరంతరాను సంధాన రూప అభ్యాసయోగమువలన.

అవతారిక :

ఈ కామక్రోధాదులను రాక్షసులను జయించుటవలన దేవతాత్త్వ ప్రాప్తియని చెప్పుచున్నారు.

దానం బ్రహ్మార్పణం యత్క్రియత ఇహనృభిఃస్యాత్ క్షమాఽక్రోధ సంజ్ఞా
శ్రద్ధాఽఽస్తిక్యం చ సత్యం సదితి పరమతః సేతుసంజ్ఞం చతుష్కమ్
తత్స్వా ద్బంధాయ జంతోరితి చతుర ఇమాన్ దానపూర్వైశ్చతుర్భి
తీర్త్వాశ్రేయోఽమృతంచ శ్రయత ఇహనరః స్వర్గతిం జ్యోతిరాప్తిమ్॥ 19

మానవులచే బ్రహ్మార్పణముగా చేయబడినదే దానము. క్రోధము లేకుం డుటయే క్షమ. ఆస్తిక్యమును కలిగియుండుటే శ్రద్ధ. అస్తే సత్యమైనదే బ్రహ్మ. ఈ నాలుగును ముక్తిని కోరువారికి సాధనములు. ఈ నాలుగింటికి విరుద్ధమైన రూపముగల చతుష్కమునకు సేతువని పేరు. అదానము, అక్రోధము అస్తిక్యతలేని శ్రద్ధ, త్రికాలబాధ్య వ్యావహారికమును సత్యమనుకొనుట ఈ నాలుగును (సేతువని. ఈ సేతువులోనికి) బంధహేతువులు. అందుచేత ఆ సేతువులోని వానివలన

సంసారము పునరావృత్తమగుచుండును. మానవుడు యీ సేతు సంజ్ఞగలవానిని ఉల్లంఘించి వాటిని దాటి పురుషార్థార్థియై కృషిచేసినచో శ్రేయస్సును అమృతమును, దేవత్వమును, స్వర్గతిని, పరంజ్యోతిరూపమును పొందును.

విశేషములు :

ఈ సందర్భమున సామవేద ఛంద ఆర్చికమును చూడవచ్చును.

"(హాఉః ౩ । సేతుస్తర ౩ । దుస్తరాత్ ౩ । దానేనదానం ౩ । హాఉః ౩ । ............... సేతుస్తీర్త్వా)" దీనికి భాష్యమునం దీ శ్లోక తాత్పర్యమే చెప్ప బడినది.

భగవంతుడు గీతయందు —

> యత్కరోషియ దశ్నాసి యజ్జుహోషి దదాసియత్
> యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ (9-27)

అని ఏమి చేసినను ఈశ్వరార్పణముగా చేయుమని ఉద్బోధించెను. ఇది ఆదాన తర్పణం. పరంజ్యోతి రూపమును పొందుట యనగా — జ్ఞానప్రకారముగా 'అహమస్మీతి' అహం ఋతస్య' అహం సత్యస్య, ప్రథమజోస్మి — అని అన్నిటికంటె ముందు జాతమైనది. (సర్వస్మాత్ప్రాక్) శబలత్వమువలన ఉపాసితము - దేహభార్యాపుత్రాదులకు అంతర్గతము 'హిరణ్యగర్భోహమని' తెలిసి బ్రహ్మార్ప ణముగా సర్వమును భావింపుమని అర్థము.

క్రోధమును జయించుట ఎట్లనగా — క్షమవలన క్రోధమును జయింప వలెను.

మనశ్చక్షురాదులు దేవతలు — అమృతము బ్రహ్మకు నాభి. బుద్ధిరూపముగా 'తారకోహమస్మి' అని భావింపవలెను. క్రోధము బుద్ధియందున్నదే. అందువలన 'తతోగ్నే బ్రహ్మైవాహమస్మి' అని భావము.

"యో బుద్ధేః పరతస్తుసః" అని గీత. సేతువునందు మూడవదియగు అశ్రద్ధను శ్రద్ధచేత జయింపవలెను. అది పరమాత్మ పరము కాదు. (అస్యైవ పరమాత్మాన పరం) అని భావింపవలెను. ఇతరమువలన ప్రయోజనము లేదు. (మహ్యం దదాతి సర్వం నివేదయతి' అని దైవము) ప్రాప్తించిన సర్వము నందును — ఇట్టి ఆస్తిక్యబుద్ధి కలిగియుండి అశ్రద్ధను తరించవలెను.

ప్రాతిభాసికమైన విశ్వాకారమును సత్యమైన బ్రహ్మమువలన తరించవలెను. దానికి విధానము.

''అహం జీవరూపిణో అగ్నిం ఆద్భి'' వలయే అగ్నిం అందంతం భక్ష యంతం అగ్నాఽద్యువాధిభూతం సర్వం అగ్నే ఆహుతి ప్రక్షేపవజ్ఞుహోమి 'యోవశిష్యేత సోస్మ్యహం' అని భావింపవలెను.

ఈ విధముగా చెప్పబడినట్లు అమృతమును పొందుట. ఈ ఉపాయముల వలన స్వర్గతిని సాధించిన 'జ్యోతిరమృతం' సాధింపుడని ఉపదేశము బృహ దారణ్యక ఉపనిషత్తునందు (4-4-28) ఛాందోగ్య ఉపనిషత్తునందు కూడా విధి చెప్పబడినది.

''ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతి రేషభూతపాల ఏవ సేతుర్విధరణ ఏషాం లోకా నామ సంభేదాయ'' (బృ)

''తస్మాద్వా ఏతగ్ం సేతుం తీర్త్వాంధం సన్న సందోభవతివిద్ధః సన్న విద్ధోభవత్యుప తాపీ సన్ననుతాపీ భవతి తస్మాద్వాం ఏతగ్ం సేతుం తీర్త్వాఽపినక్త మహరేవాభి నిష్పద్యతే సకృద్విభాతోహ్యేవైష బ్రహ్మలారః (ఛాం. 8-4-1-2).

అన్నం దేవాతిథిభ్యోఽర్పితమమృత మిదం చాన్యథామోఘమన్నం
యశ్చాత్మార్థం విధత్తే తదిహనిగదితం మృత్యురూపం హి తస్య
లోకేఽసాకేవలాఘో భవతి తనుభృతాం కేవలాదీచ యఃస్యాత్
త్యక్త్వా ప్రాణాగ్ని హోత్రం విధివదను దినం యోఽశ్నుతే సోఽపిమర్త్యః॥

వైశ్వదేవాది నిత్య పూజాదులందు దేవతలకు అర్పింపబడినదియు, వైశ్వ దేవాంతమున సమాగతుడైన అతిథికి అర్పించినదియు నగు అన్నము అమృతము అట్లు వైశ్వదేవ అతిథులకు సమర్పింపబడని అన్నము నిష్ఫలము. ఆత్మార్థము, తన కడుపు నింపుకొనుటకు తయారుచేసుకున్న అన్నము మృత్యురూపముగా పరిణమించి విషము వంటిదగును. ఎవ్వరికినీ పెట్టక కేవలము తానే భుజించువాడు మహాపాపి యగును. మరియును ప్రాణాగ్ని హోత్రమునందు (యథావిధిగా) హోమము చేయక భుజించువాడును మృత్యువునకు దగ్గరపడుచున్నాడు.

విశేషము :

ఈ విషయమునందు శ్రుతియు విట్లే చెప్పినది.

"మోఘమన్నం విందేతే అప్రచేతాః। సత్యం బ్రవీమి వధ ఇత్సతస్య। నార్యమాణం పుష్యతి నోసఖాయమ్। కేవలాఘో భవతి కేవలాదీ" తైత్తిరీయ బ్రాహ్మణము.

లోకేభోజః స ఏవార్పయతి గృహ గతా యార్థినేఽన్నం కృశాయ
యస్తస్మై పూర్ణమన్నం భవతి మఖవిధే జాయతేఽజాతశత్రుః
సఖ్యేనాఽన్నార్థినేయోఽర్పయతి నసఖా సేవమానాయనిత్యం
సంసక్తాయాన్న మస్మాద్విముఖ ఇవపరావృత్తి మిచ్ఛేత్కదర్యాత్॥ 21

ఆకలిచే పీడితుడై బిక్కచిక్కి అన్నార్థియై వచ్చిన వానికి అన్నము పెట్టి ఆకలి తీర్చినవానిని లోకమున భోజుడని దాత యని చెప్పుదురు. అట్టి దానమువలన ఫలమే మనగా - ఆ దాతకు అన్నమునకు కొదువ యుండదు. యజ్ఞయాగాదులందు దేవతానుగ్రహమువలన పూర్ణమగు అన్నమే వీనికి కలుగును. అజాత శత్రువగును. అనగా వానికి శత్రువులు సైతము మిత్రులగుదురు. తనకు సఖులు, ఆశ్రితులు, సంసక్తులు, అనన్య శరణ్యులు (సర్వభూతములు) అన్నార్థులై యుండగా వారికి పెట్టక తాను భుజించువాడు పశుతుల్యుడు. అట్టి లుబ్ధుని గడపను యాచకులు కూడ త్రొక్కుట కిష్టపడరు.

విశేషములు :

ఈ విషయముననే శ్రుతి (ఋగ్వేదము) యిట్లు చెప్పుచున్నది.

స ఇద్భోజోయో గృహవేదదాత్యన్న కామాయ చరతే కృశాయ। అరమస్మై భవతి యామ హూతా ఉతాపరీషు కృణుతే సఖాయమ్॥ నచసఖా యోన దదాతి సఖ్యే సచాభువే సచమానాయ పిత్వః। ఉపాస్మాత్ప్రేయాన్నత దోకో అస్తిపృణంత మన్య మరణం చిదిచ్ఛేత్॥

లుబ్ధుని ముఖమును యాచకుడు కూడ చూడడని చెప్పుటలో ఆ లుబ్ధుడు సర్వ నికృష్టుడని, సంఘము నందెట్టి వారిచేతను ఆదరము పొందనివాడని చెప్పుట.

స్వాజ్ఞాన జ్ఞానహేతూ జగదుదలయలయౌ సర్వసాధారణౌస్తః
జీవేష్వాస్వర్ణగర్భం శ్రుతయ ఇతి జగుర్హీయతే స్వప్రబోధే
విశ్వం బ్రహ్మణ్య బోధేజగతి పునరిదం హూయతే బ్రహ్మయద్వత్
శుక్తౌరౌప్యం చ రౌప్యేఽధికరణ మథవా హూయతేఽన్యోన్యమోహాత్॥ 22

నామరూపాత్మకము చరాచరము అగు జగత్తుయొక్క ప్రాదుర్భావము లయము ఆత్మ అజ్ఞానమువలన జరుగుచుండును. ఇది హిరణ్య గర్భాది సర్వజీవుల విషయమున సర్వసాధారణమని శ్రుతులు చెప్పుచున్నవి. హిరణ్యగర్భుడు కూడ స్వస్వరూప జ్ఞాన విస్మృతిచేత తాను సర్వనియంత యగునట్టి ఈశ్వరుడనని అభిమానమును వహించును.

స్వప్రబోధమువలన, బ్రహ్మాకార అంతఃకరణ వృత్తిచేత దేహాభిమాన అభావము జరుగును. అబోధమువలన ఈ సర్వమును బ్రహ్మ సృష్టించినాడన్న భావము. దీనికి ఉదాహరణ మేమనగా భ్రాంతి నివృత్తి కాలమున శుక్తియందు రజత మనుకొన్న భావముండదు. ప్రాతిభాసిక కాలమున శుక్తియందు వెండి - శుక్తి అధికరణము అది రౌప్యముగా భాసించును. అన్యోన్య మోహమువలన శుక్తి అజ్ఞానమువలన రజత ఉదయము. రజత అజ్ఞానమువలన శుక్తి.

విశేషములు :

అన్యోన్య మోహమనగా - ఇది శుక్తి యని యథార్థస్థితి తెలియనపుడు అది వెండి యనియే భావము. యథార్థ జ్ఞానము కలుగగా వెండి అను జ్ఞానము లేనందు వలన శుక్తి అనియే తెలియును. అన్యోన్య అజ్ఞానము వలన శుక్తి రజతములు. అట్లే బ్రహ్మ జగత్తుల విషయము.

తుచ్ఛత్వాన్నా సదాసీద్గగన కుసుమ వద్భేదకం నోసదాసీత్
కిం త్వాభ్యా మన్యదాసీ ద్వ్యవహృతిగతి సన్నాస లోకస్త దానీమ్
కిం త్వర్వాగేవశుక్తౌ రజతవద పరోనోవిరా ద్వ్యోమపూర్వః
శర్మణ్యాత్మన్యథై తత్కుహక సలిలవత్కింభ వేదావరీవః॥ 23

ప్రళయావసానమున జగత్తు సృష్టికి ఉపాదాన కారణము అసత్తు కాజాలదు. ఏలననగా, అట్లు అసత్తే కారణమైనచో అది గగన కుసుమము వంటిదే కావలెను. సృష్టికి ఉపాదాన కారణముగా అత్యంత సత్త్వముండెనని కన్పించుటచేత, అసత్తు వలె తుచ్ఛముగా కన్పించుటలేదు కూడ. అయితే జగత్కారణము 'సత్' అని చెప్పుద మన్నను ప్రతిబంధకము కన్పించుచున్నది. ప్రళయాంతకాలమున సృష్టికి పూర్వము సర్వమును సత్ అగు ఆత్మగా నుండి - సృష్టి తర్వాత ఆ సద్రూపము వలె నున్నదని చెప్పుటకు వీలులేకున్నది.

సదసద్విలక్షణమైన సదసదాత్మకమైన దొకటి కలదని, అదియే కారణమై యుండవచ్చునని భావింపవలెను. సదసత్తులు రెండును విరుద్ధభావములు. వానికి సహావస్థ లేదు. అవి రెండు తాదాత్మ్యమై కారణమగుట చెల్లదు.

సత్, అసత్, సదసత్ - మూడును కానప్పుడు మరియొక అనిర్వచనీయమై వ్యవహారయోగ్యమైన దేదో యొకటున్నదని అది కారణము కావచ్చునని యనగా సర్వజగద్రూపమైన ఈ విరాడ్రూపము ప్రళయ వేళలేదు. భ్రాంతికి పూర్వము శుక్తి రజతములు లేనట్లు.

ఇంద్రజాలికుని మాయగాని, అతడు కల్పించిన మాయాజాలముగాని అతనినే ఆవరింపవు కదా! అట్లే విరాడ్రూపమున్నచో దేనిని ఆవరింపవలెను. ఆత్మ మాయాతీతము కావున ఆత్మశక్తియైన మాయయు, మాయాకార్యము ఆత్మను ఆవరింపదు.

ప్రళయ సమయమున భోగ్యభోక్తృ ప్రపంచములు రెండును లేవు. ఈ భావమును శ్రుతి (ఋగ్వేదము) చెప్పినది:—

"నా సదాసీన్నో సదాసీత్తదానీమ్
నాసీద్రజోనో వ్యోమాపరోయత్
కిమా వరీవః కుహకస్య శర్మన్
అంభః కిమాసీద్గహనం గభీరమ్".

బంధోజన్మాత్యయాత్మా యది నపున రభూత్తర్హి మోక్షోఽపి నాసీత్
యద్వ్రద్రాత్రి ర్దినం వానభవతి తరణౌ కింతు దృగ్దోష ఏషః
అప్రాణం శుద్ధమేకం సమభవ దథ తన్మాయయాకర్తృ సంజ్ఞాం
తస్మాదన్యచ్చ నాసీత్ పరివృత మజయా జీవభూతం తదేవ॥ 24

ప్రళయమునందు సర్వజీవములను సంహరించుట కొక కర్త యుండవలెను కావున సకల సంహారకర్త యగు మృత్యు వుండెనని సమ్మతింపవలసి వచ్చుచున్నది. అట్లు కానిచో ఆ మరణ రూప ప్రాణస్థితి యుండవలెను కదా! దానికి సమాధానము.

ప్రాణులయొక్క సుఖ దుఃఖ భోగములకు హేతుభూతమగు కర్మ పరిపక్వమైనపుడు ప్రపంచము నిష్ప్రయోజనమై పోవును. అపుడు ఇచ్ఛామాత్రము చేతనే పరమేశ్వరుడు సర్వమును లయించును. అందుచేత పరమేశ్వరుని కంటె

వేరొకటి మృత్యువుగాని మరొకటిగాని లేదు. జన్మాత్యయ రూపసంబంధము లేదు కావున మోక్షము లేదు. సూర్యచంద్రులు లేరుగాన దివారాత్రములు లేవు. అహో రాత్రములు లేవు. సూర్యచంద్రులు లేరు. కాలము కూడ లేదు. సాంఖ్యులు చెప్పు చున్న ప్రధానమైన మాయ నపుడు స్వతంత్రమై జగత్కారణముగా నుండె ననుట కును వీలులేదు. జడమగు మాయ స్వతంత్రముగా జగత్కారణము కాజాలదు.

అపు డున్నది తటస్థ లక్షణోపలక్షితము (సృష్టి స్థితిలయ కర్తృత్వరూప) అద్వితీయము, అఖండమునగు పరబ్రహ్మ తత్త్వము. అది మాయతో అవిభాగా పన్నమై యున్నది. అదియే జగత్కారణము మాయావచ్ఛిన్న చైతన్యమైన నది యొక్కటియే అపుడున్నది. (బద్ధో ముక్తో ఇతి వ్యాఖ్యా గుణతో మేన వస్తుతః తథా ద్వితీయస్యాభావోత్కో బద్ధః కశ్చ ముచ్యతే)

దీనినే ఋగ్వేదము కూడ చెప్పినది.

నమృత్యురాసీ దమృతం నతర్హి నరాత్ర్యా అహ్న ఆశీత్ప్రికేతః
అనీదవాతం స్వధయాతదేకం తస్మా ద్ధాన్యన్న పరఃకించనాసః॥

ప్రాగాసీద్భావరూపం తమ ఇతితమసా గూఢమస్మాద తర్క్యం
క్షీరాంతర్య ద్వదంభోజనిరిహ జగతో నామరూపాత్మకస్య
కామాద్ధాతుః సిసృక్షో రనుగతజగతః కర్మభిః సంప్రవృత్తా
ద్రేతోరూపై ర్మనోభిః ప్రథమ మనుగతైః సంతతైః కార్యమాణైః॥ 25

సృష్టికి పూర్వము జగత్తున్నదా? లేనిచో లేనిది ప్రభవమగుటెట్లు? ఉత్పన్న మగుచున్నదని చెప్పుకొందమన్నచో ఆ సత్కార్యవాదమును గ్రహించినట్లే అగును. అట్లు కాదని పూర్వమే జగత్తు కలదని చెప్పుచు సత్కార్యవాదమును అనుసరించుద మన్నచో పూర్వ మున్నది. మరల సృష్టి యెందుకు? ఈ ప్రశ్నలకు సమాధానముగా భగవత్పాదు లీ శ్లోకమును రచించిరి.

సూర్యకాంతి లేనప్పుడు చీకటిచేత జగత్తు కప్పబడి ఆచ్ఛాదింపబడి - ఏది చీకటియో, ఏది జగత్తో తేల్చుకొనుటకు వీలులేని అతర్క్యముగా నుండును. అజ్ఞాయ మానముగా నుండును. అదెట్లనగా పాలలో కలసిపోయిన నీటివలె.

సృష్టికి పూర్వము నామరూపాత్మకమగు జగత్తు మాయా తమస్సుచే ఆవరింప బడి నామరూపములను పోగొట్టుకొని విత్తునందు వృక్షము సూక్ష్మరూపముగా నున్నట్లు

మాయలో మునిగిపోయి యున్నది. కారణ సామగ్రి వ్యతిరేకముగా నేదియు ఉత్పన్నము కాదు. పరమేశ్వరుని ఇచ్ఛచేత అనుగతమై సంప్రవృత్తమగు చున్నది. అనాదిగా వర్తించుచున్న జగత్తే మరల ప్రేరితమై వెలువడి సృష్టి యగుచున్నది. బీజభూతముగా నుండి మరల అనాది ప్రవహితముగా నిష్పాదిత మగుచున్నది.

ఈ విషయమును శ్రుతి యిట్లు చెప్పినది.

తమ అసీత్తమసా గూళహమగ్రేఽప్రకేతం సలిలం సర్వమా ఇదమ్
తుచ్ఛేనాశ్వపిహితం యదాసీత్తప స్తన్మహినా జాయతైకమ్।
కామ స్తదగ్రేసమ వర్తతాధి మనసోరేతః ప్రథమం యదాసీత్
సతోబంధు మసతి నిరవిందన్ హృది ప్రతిష్యాకపయో మనీషా॥ (ఋగ్వేద)

జగత్తు తమస్సునందు కర్మ కర్తృభావ యౌక్తికముగా వర్తించునపుడు వ్యవహారిక దశ యందున్నట్లు నామరూపములు విస్పష్టముగా తెలియవు. తాదాత్మ్య మైనవి.

ఈ విషయమును మను స్మృతికారుదు కూడ చెప్పెను.

ఆసీది దతమో భూతమ ప్రజ్ఞాతమలక్షణమ్
అప్రతర్క్యమనిర్దేశ్యం ప్రసుప్త మివ సర్వతః॥

జగత్తు మాయావిలీనమై ప్రళయవేళ యందుండుట క్షీరమునందున్న నీటివలె ననుట లుప్తోపమ అలంకారము. క్షీరమునందు నీ రిది యని వేరుచేయ నలవి కాదు కావున అది దుర్విజ్ఞేయము అవిభాగాపన్నము.

తమో ఆచ్ఛాదితమైన జగత్తు మరల వెలువడుటకు పరమేశ్వరుని ఇచ్ఛ కారణము. (సోఽకామయత - బహుస్యాం ప్రజాయే యేతి . శ్రుతి) పూర్వ కల్పమున ప్రాణుల పుణ్యా పుణ్య రూపకర్మము పరిపక్వము కాగానే పరమేశ్వ రునికి (సర్వ కర్మాధ్యక్షునికి) సృష్టి పర్యాలోచన కలుగును. అప్పుడు యథా పూర్వముగా నామరూపాత్మకము చిత్ర విచిత్ర రూపకము నగు జగత్తు ఆవిర్భ వించును.

ఈ సమాధానమువలన అసత్కార్యవాదము సత్కార్యవాదము రెండును నిరాకరింపబడినవి.

అవతారిక :

మాయయొక్క ఉత్కర్షను వర్ణించుచున్నారు.

చత్వారోఽస్యాః కపర్దా యువతి రథభవేన్నూతనానిత్య మేషా
మాయావా పేశలాస్యాద ఘటన ఘటనా పాటవం యాతి యస్మాత్
న్యాదారంభే ఘృతాస్యా శ్రుతి భవవయు నాన్యేవ మాచ్ఛాదయంతీ
తస్యామే తౌసుపర్ణావివ పరపురుషాత్మిష్ఠతోఽర్థ ప్రతీత్యా॥ 26

ఆ మాయ సుందరియైన యువతివలె నున్నది. నాఁగు జడలు కలిగి యున్నది. నిత్యనూతనమైనది - ఎప్పుడును స్థవిర కానేకాదు. దేహాది వార్ధక్య మామెకు లేదు. ఎల్లప్పుడు తారుణ్యమే. ఆమె పేశలత్వము కలది. పేశలత్వ మనగా కౌశలము. అఘటన ఘటనా పాటవమున విక్షేపమందు కౌశలము కలది. ఇది ద్వితీయ ఉత్కర్ష (ప్రథమోత్కర్ష దేహాది వార్ధక్యము లేక నిత్యనూతనముగా నుండుట.)

ఆరంభమునందు ఘృతమువలె ధృష్టత్వమును దర్శింపచేయును. ఇది మూడవ ఉత్కర్ష. ఉపనిషద్వాక్య లందు ప్రతిపాదితమైన ఆత్మజ్ఞానమును ఆవరణ శక్తిచేత ఆచ్ఛాదన చేయును. ఇది నాలుగవ ఉత్కర్ష. ఇట్లు చతురుత్కర్షవతి యగు మాయనుబట్టి పరమాత్మ జీవాత్మ గరుడపక్షి ద్వయమువలె కూర్చుండి యుందురు. అర్థ ప్రతీతివలన పదార్థ భాసకత్వమువలన మాయ తిరోధాన కర్త్రి సకలభాసకత్వ పరమాత్మను మరగుపరచుచున్నది.

"చతుష్కపర్దాయువతిః సుపేశాఘృత ప్రతీకావయునాని వస్తే
తస్యాం సుపర్ణావృషణా నిషేదతుర్యత్ర దేవా రధిరే భాగధేయమ్."

అవతారిక :

జీవ పరమాత్మల ఐక్యతను పరమార్థమున చెప్పుచున్నారు.

ఏకస్తత్రాస్య సంగస్తదను తదపరోజ్ఞా న సింధుం ప్రవిష్టో
విస్మృత్యాత్మ స్వరూపం స వివిధ జగదాకార మాభాసమైక్షత్।
బుద్ధ్యాంతర్యావ ద్రైక్ష ద్విసృజతి తమజాసోఽపి తామేవమేకః
తావద్విప్రాస్తమేకం కథమపి బహుధా కల్పయంతి స్వవాగ్భిః॥ 27

జీవ పరమాత్మలందు అసంగు డయ్యును ఆత్మ (జీవుడు) అజ్ఞాన సముద్రము నందు మునిగినవాడై తన (ఆత్మ) స్వరూపమును విస్మరించి వివిధ జగదాకారుడగు ఆభాస రూపుడుగ తలపోయుచున్నాడు. ఈ ఆభాస రూపము ప్రాతిభాసికమే.

ఈ జీవుడు బుద్ధిచేత నిశ్చయించుకొనక ఉన్నంతకాలము ఆ మాయ అతనిని ఆవరించియే యుండును. ఎప్పుడు అంతర్దృష్టిచేత తన స్వస్వరూపమును సంభావన ప్రారంభించుటకు పూనుకునునో - అప్పటివరకు జీవ పరమాత్మలు రెండు పక్షులని వేత్తల కల్పనము. ఆ తరువాత బ్రహ్మవేత్తల ఉపదేశ వాక్కులచే ప్రబోధము జరిగి అపరోక్షానుభూతి పొందగా మాయ అతనిని వీడిపోవును. అప్పుడు అసంగుడై మాయావిముక్తుడై అద్వితీయుడగును.

ఆత్మ అద్వితీయమైనప్పటికి శిష్యబోధావసరమున బ్రహ్మవేత్తలు శ్రుతి యుక్తములగు వాక్యములచే బహువిధరూపములు కలవానినిపలె వర్ణించి చెప్పుదురు.

ఈ విషయమును ఋగ్వేద మిట్లు చెప్పుచున్నది.

"చతుష్క పదాన్ యువతిః సుపేశా ఘృత ప్రతీకావయునానివస్తే।
తస్యాం సుపర్ణా వృషణా నిషేదతుర్యత్ర దేవాదధిరే భాగ ధేయమ్।
ఏకః సుపర్ణః స సముద్రమా వివేశ స ఇదం విశ్వం భువనం విచష్టే॥

"తం సాకేన మనసాఽ పశ్యమన్తి తస్తం
మాతారేళ్హి స ఉరేళ్హి మాతరమ్"

"సుపర్ణం విప్రాః కవయోవచో భిరేకం సన్తంబహుధా కల్పయంతి"

అవతారిక :

జనన మరణానుబంధమును నిరూపించుచున్నారు.

నాయాతి ప్రత్యగాత్మా ప్రజనన సమయే నైవయాత్యంతకాలే
యత్సోఽఖండోస్తిలింగం మన ఇహ విశతి ప్రవ్రజత్యూర్ధ్వమర్వాక్
తత్ కార్శ్యం స్థూలతాంవానభజతివపుషః కింతు సంస్కారజాతే
తేజోమాత్రా గృహీత్వాప్రజతి పునరిహాయాతి తైస్తైః సహైవ॥ 28

ప్రత్యగాత్మ గర్భావిర్భావకాలమున నెచ్చటనుండియు రాదు. దేహావసాన కాలమున నెచ్చటకును పోడు. ప్రత్యాగాత్మ అఖండము. అపరిచ్ఛిన్నము ప్రవేశ నిర్గ

మనములు పరిచ్ఛిన్నమైనప్పుడే ఉండునవి లోకమున. జనన మరణాది వ్యవహారములు లింగము మొదలగునవి ఆత్మకు సంబంధించి కాదు. పంచదశ కలోపేతమైన మనస్సే (దశేంద్రియములు పంచప్రాణములు - ఈ లోకమున దేవలోకమునగాని గర్భమున ప్రవేశించుట మరియు నిర్గమించుటయు, అది ప్రత్యగాత్మ వ్యవహారము కాదు. ఈ పంచదశకలోపేత మనస్సునకైనను, దేహముయొక్క (స్థూల దేహముయొక్క) కృశతా (బలహీనత, సన్నగిల్లుట) స్థూలతా పుష్టిత్వం మొదలగునవి చెందవు. రోగములవలన కృశత్వము పాటవమువలన పుష్టిత్వము మనస్సునకు లేదు. అంత్యకాలమున తేజోమాత్రమౌ ఇంద్రియములతో గూడి తత్తత్ పూర్వజన్మ సముపార్జిత (పుణ్యపాప) సంస్కార సమాహితమై, దేహమును విడిచిపోవును. మరల వానితో గూడి ఆయా నూతన శరీరములను ప్రవేశించుచుండును.

బృహదారణ్యక ఉపనిషత్తునందీ విషయము చెప్పబడినది (4-4-1)

"సయత్రాయమాత్మాఽబల్యం న్యేత్య సంమోహమివ న్యేత్యథైన మేతే ప్రాణా అభిసమాయాంతిన ఏతాస్తేజో మాత్రాః సమభ్యాదదానో హృదయమేవా న్వవక్రామతి సయత్రైష చాక్షుషః పురుషః పరాఙ్ పర్యావర్తతేఽథారూపజ్ఞో భవతి"

అవతారిక :

పై విషయమునే ఋక్ శాఖీయ శ్రుతి వాక్యముతో సంవదించుచున్నారు.

ఆసీత్పూర్వం సుబంధుర్భ్రుశ మనవి సురోయః పురోధాః సనాతేః
బ్రాహ్మ్యాత్ కూటాభిచారాత్ సఖలు మృతిమితస్తన్మనోఽగాత్కృతాంతమ్
తత్భ్రాతా శ్రౌతమంత్రైః పునరయ దితి ప్రాహసూక్తేన వేదః
తస్మాదాత్మాభియుక్తం వ్రజతినను మనః కర్హిచిన్నాంతరాత్మా॥ 29

సనాతుడను రాజునకు పురోహితుడైన సుబంధువను బ్రాహ్మణుడుండెను. అతడు బ్రహ్మ చేసిన కూటాభిచారము (కాపట్యముతో కావించిన అభిచార అస్త్ర ప్రయోగము) వలన మృతిచెందెను. అతని మనస్సు యముని కడకుపోయెను. అతని సహోదరుడిది గ్రహించి శ్రౌతమంత్ర పఠనమువలన సుబంధు మనస్సును మరల తెప్పించెనని వేద సూక్తమువలన తెలియుచున్నది. ఆ కారణమువలన ఆత్మ ప్రతిబింబాభియుక్తమైన మనస్సే వచ్చుట పోవుట చేయుచున్నది. అంతరాత్మ కాదు.

దీనికి మూలభూతమైన శ్రుతి పాఠము కూడ నిట్లే చెప్పినది.

(ఋ 10-60-7-12 బృహద్దేవత 7-97-101)

యత్తేయమం వైవస్వతం మనో జగామ దూరకమ్
తత్త ఆవర్తయామసీహ క్షయయా జీవసే।
యత్తేదివం యత్పృథివీంమనో జగామ దూరకమ్
తత్త ఆవర్తయామసీహ క్షయయా జీవసే।
యమాదిహం వైవస్వతాత్ సుబంధోర్మన ఆభరమ్।
జీవతవే న మృత్యవేఽథో అరిష్టతాతయే॥

అవతారిక :

చలనాది ధర్మములు మనస్సునకే గాని ఆత్మకు కావని చెప్పుట.

ఏకోనిష్కంప ఆత్మాప్రచలతి మనసా ధావమానేన తస్మి
న్నిషణ్ణగ్రేఽథపశ్చాన్నహి తమనుగతం జానతే చక్షురాద్యాః
యద్వత్పాథస్తరంగైః ప్రచలతి పరితోధావమానైస్తదంతః
ప్రాక్పశ్చాదస్తి తేషాం పవనముదితైః తైః ప్రశాంతైర్యథావత్॥ 30

అద్వితీయుడు, నిశ్చలుడునగు ఆత్మ పరుగులు తీయుచున్న మనస్సుతోడి సంబంధము వలన చలించుచున్నట్లు తోచును. ముందు వెనుకలను అభివ్యాప్తమై అంతఃకరణమున వసించియుండును. గాలి తాకిడిచేత పైకిలేచి పలువైపులకు పరుగిడుచున్న తరంగములకు అన్నివైపుల జలము వ్యాపించియుండి, తరంగములు శాంతించినపుడు స్పష్టముగ తోచునట్లు చక్షురాదింద్రియములను వ్యాపించి యుండి అవి శాంతించినపుడు ఆత్మప్రస్ఫుటముగ వెల్లడియగును.

అవతారిక :

జీవుని బాహ్య ప్రపంచాను వృత్తిని నిరూపించుచున్నారు.

ఏకాక్యాసీత్స పూర్వం మృగయతి విషయా నానుపూర్వ్యాంతరాత్మా
జాయామే స్యాత్ప్రజావా ధనముపకరణం కర్మకుర్వం స్తదర్థమ్
క్లేశైః ప్రాణావశేషైః మహదపి మనుతే నాన్యదస్మాద్గరీయ
స్త్వేకాలాభేఽప్యకృత్స్నో మృత ఇవ విరమత్యేక హాన్యాఽకృతార్థః॥

అంతరాత్మ తొలుత ఏకాకిగానే యుండును. ఆ పిమ్మట అనుక్రమముగ విషయములందు ఆసక్తి పెంచుకొని - ప్రథమమున తనకు భార్య కావలెనని, తరువాత

సంతానము కావలెననుకొని, వారిని సుఖముగా పోషించుటకు ధనము కావలయునను కొని ఆ విత్త సంపాదనకొరకు ప్రాణావిశేషమైన క్లేశయుక్తమైన పనులను చేయుటకు దొడగును. ఈ ధనాది విషయప్రాప్తుల కంటే ఘనమైన వాటిని శ్రేష్ఠమైన వాటిని సరకు గొనడు. బహువిషయ సాధనపరులై అందొకటి లభింపకపోయినను తీరని కొరతతో దుఃఖించుచు, జీవించియుండియు చచ్చిన వాని వలె నుండును. లభించిన వస్తువులం దొకదానికి హాని కల్గినచో, సకలము నిరర్థకమైపోయినదను కుందురు.

ఈ విషయమును బృహదారణ్యక ఉపనిషత్తు (3-4-181) కూడా చెప్పినది.

"ఆత్మైవేదమగ్ర అసీదేవ ఏవ సోఽకామయత జాయామేస్యాదథ
ప్రజాయే య థ విత్తం మేస్యాదథ....తావన్మన్యతే తస్యాకృత్స్నతా॥

అవతారిక :

అవిద్యయొక్క ఆవరణ శక్తివలననే ప్రపంచ కల్పనమని చెప్పుచున్నారు.

నాసీత్పూర్వం సపశ్చాదతను దినకరాచ్ఛాదకో వారి వాహో
దృశ్యః కిం త్వంతరాసౌ స్థగయతి సదృశం పశ్యతోనార్క బింబమ్
నోచేదేవం వినాఽర్కం జలధరపటలం భాసతే తర్హి కస్మాత్
తద్వద్విశ్వం పిధత్తే దృశమథనపరం భాసకం చాలకం స్వమ్॥ 32

వర్షఋతువునకు ముందుగాని తర్వాతగాని మేఘము సూర్యమండలమునకు అడ్డము గారాదు. వర్షఋతువునందు మాత్రమే అట్లు చేయును. ఆకాశమును ఆవరించి సూర్యుని కప్పివేసినట్లు కన్పించును. ఈ కన్పించుట దృష్టి దోషమేగాని యథార్థము కానేకాదు. సూర్యమండలమును మేఘము కప్పివేయుట నిజమైనచో మరి మేఘ మును భాసింపజేయుచున్న దెవ్వరు? మేఘము మన దృష్టిని నిరోధించి మనకు సూర్యదర్శనము లేకుండ చేయునేగాని సూర్యమండలమును కప్పివేయజాలదు. అదే విధముగా మాయాశక్తి విజృంభితమగు యీ విశ్వము అవిద్యావంతుల దృష్టిని నిరోధించి వారికి సత్యమగు బ్రహ్మస్వరూపమును కన్పించకుండ చేయుచున్నది. అయితే తన్ను ప్రకాశింపజేయుచు ప్రవర్తింపజేయుచు నున్న పరబ్రహ్మమును యథార్థ ముగా కప్పివేయజాలదు. బ్రహ్మమునకు వ్యతిరేకముగా దానికి భాసక చాలక శక్తి లేనేలేదు.

అవతారిక :

స్వప్న దృష్టాంతముతో జగన్మిథ్యాత్వమును నిరూపించు చున్నారు.

భుంజానః స్వప్నరాజ్యం ససకల విభవోజాగరంప్రాప్య భూయో
రాజ్యభ్రష్టోఽహ మిత్థం నభజతి విషమం తన్మృషామన్యమానః
స్వప్నే కుర్వన్నగమ్యా గమనముఖమఘం తేన నప్రత్యవాయీ
తద్వజ్జాగ్రదశాయాం వ్యవహృతి మఖిలాం స్వప్నవద్విస్మరేచ్ఛేత్॥ 33

సేవాకోశాద్యుపస్కారయుక్తమగు రాజ్యమును అనుభవించినట్లు ఆ రాజ్యము భ్రష్టమైనట్లు స్వప్నము కలిగి మేల్కొని యెవ్వడును రాజ్యము భ్రష్టమైనదని వాపోవడు. అదే విధముగా స్వప్నమున పరదారగమనాది మహాపాపములు చేసినట్లు అనుభవము కలుగగా మేల్కొని మహాపాపములు చేసితినని యెవ్వడును పరితపించడు. ఆ స్వప్న పాపకృత్యములవలన ప్రత్యవాయము కలుగదు. అదే విధముగా జాగ్రద్దశా వ్యవహారమంతయు మిథ్యారూపమని నిశ్చితము చేసికొన్న తత్త్వవేత్తలకు పుణ్య పాపములు లేవు. సుఖదుఃఖములున్ను లేవు.

అవతారిక :

స్వప్నమునందువలె జాగ్రదవస్థ యందు కూడ భ్రమజనక మని చెప్పు చున్నారు.

స్వప్నావస్థానుభూతం శుభమథ విషమం తన్మృషా జాగరేస్యాత్
జ్జాగ్రత్యాం స్థూలదేహ వ్యవహృతి విషయం తన్మృషాస్వా పకాలే
ఇత్థం మిథ్యాత్వసిద్ధా వనిశముభయథా సజ్జతేత్రమూఢః
సత్యే తద్భాసకేఽస్మిన్నిహకుత ఇదం తన్నవిద్మోవయం హి॥ 34

స్వప్నమునందు కలిగిన శుభాశుభములన్నియు జాగ్రదవస్థయందు మిథ్యగా తోచును. అట్లే జాగ్రదవస్థలోని స్థూలదేహ వ్యవహారమంతయు స్వప్నమున మిథ్యయే అగుచున్నది. ఈ విధముగా నీ రెండు దశలలోని వ్యవహారమంతయు మిథ్యయే యని సిద్ధించినప్పటికి, అవిద్యామోహ పరవశులైనవారు యీ వ్యవహార మును అంటిపెట్టుకొని మూఢులు చరింతురు. కాని స్వప్న జాగ్రద్దశా వ్యవహా రావభాసకుడైన ఆత్మవిషయమును పట్టించుకొనరు. దీనికి కారణము తెలియుట లేదు.

అవతారిక :

పై విషయమును సోదాహరణముగా నిరూపించుచున్నారు.

జీవంతతం జాగ్రతీహ స్వజనమథ మృతం స్వప్నకాలేనిరీక్ష్య
నిర్వేదం యాత్యకస్మాన్మృత మమృతమముం వేక్ష్యహర్షం ప్రయాతి
స్మృత్వాప్యేఽతస్య జంతోర్నిధన మనుయుతిం భాషతే తేనసాకం
సత్యేవం భాతి భూయోఽల్పక సమయ వశాత్సత్యతా వామృషాత్వమ్॥

జాగ్రద్ధశయందు కుశలులై యున్న తన వారిని స్వప్నమున మృతి చెందినట్లు చూచి నిష్కారణముగా నిర్వేదమును పొందుదురు. జాగ్రదవస్థలో మృతులైన స్వజనమును స్వప్నమునందు జీవించియున్నట్లుగా చూచి హర్షమును పొందుదురు. ఈ విధముగా జాగ్రత్కాలమున అనుభవము స్వప్నకాలమున అసత్యమని దర్శింప బడుచున్నది. స్వప్నమున మృతినొందినవాడని యెరిగియు జాగ్రద్ధశలో వానితో మామూలుగా భాషింతురు. జాగ్రత్స్వప్నములయందు వస్తువులవలన అనుభవము సమానమేగాని, స్వప్నమున ఆ అనుభవ కాలపరిమితి స్వల్పమగుటయు, జాగ్రద్ధశ యందు ఆ అనుభవ కాలపరిమితి అధికమగుటయు కారణముగా, స్వప్నవస్తువులు మిథ్య యని, జాగ్రదవస్థలోని వస్తువులు సత్యము లని లోకవ్యవహార మేర్పడినది. నిజమున కీ రెండు దశలందును వస్తువులకు సత్యత్వము కన్పించదు.

అవతారిక :

అసదుపాదానకమైన విశ్వము సత్ అని దృష్టాంతము.

స్వప్న స్త్రీ సంగసౌఖ్యాదపి భృశమసతో యా చరేతశ్చ్యుతిః స్యాత్।
సాదృశ్యా తద్వదేతత్స్ఫురతి జగదసత్కారణం సత్యకల్పమ్
స్వప్నేసత్యః పుమాన్ స్యాద్వ్యుపతి రిహమృషై వానయోః సంయుతిశ్చ
ప్రాతఃశుక్రేణ వస్త్రోపహతిరితి యతః కల్పనామూలమే తత్॥ 36

స్వప్నమున మిథ్యా స్త్రీ సంగమమువలన పురుషునికి సత్యముగా రేతస్ఖలనము జరుగుచున్నది. ఇట్లే అసద్రూపమగు కారణమువలన దృశ్యమగు జగత్తు సత్యముగా తోచుచున్నది. జాగ్రద్దశయందు సత్యమగు పురుషుడే స్వప్నమునందును - స్త్రీ మాత్రము మిథ్య. ఆమెతోడి సంగమము కూడ అసత్తు కాని రేతస్ఖలనము. వస్త్రోపహతి సత్యముగా జరుగుచున్నవి. ప్రత్యక్షానుభవము. ఇదే విధముగా

ఆత్మ సత్యము - మాయ అసత్యము. ఆ రెండిటి సంబంధమువలన ఆధ్యాసికము మృషయే అట్లు జాతమైన జగత్తు వ్యవహారిక సత్యము. ఇది అంతయు కల్పనా మూలము.

అవతారిక:

త్రయ్యవస్థలయందు సత్యమగు ఆత్మను గురించి విచారింపరేమని ఆశ్చర్యమును ప్రకటించుచున్నారు.

పశ్యన్త్యా రామమస్య ప్రతిదివసమమీ జంతవః స్వాపకాలే
పశ్యత్యే నం నకశ్చిత్కరణ గణమృతే మాయ యాక్రీడమానమ్
జాగ్రత్యర్థ ప్రజానామథచ తనుభృతాం భాసకంచాలకం వా
నోజానీతేసుషప్తౌ పరమ సుఖమయం కశ్చిదాశ్చర్యమే తత్॥ 37

ప్రతి జీవియు ప్రతిదినము నిద్రాకాలమున ఆత్మక్రీడాదర్శనము పొందును. అయితే ఆత్మ నెవ్వడు చూడడు. గమనింపడు. బాహ్యేంద్రియములతో సంబంధము లేక మాయాసహితుడై క్రీడించు ఆత్మను దర్శింప రెవ్వరును. ఇది స్వప్న దశాకాలమున జాగ్రద్దశయందు ఆయా యర్థము లనుభాసింపజేయుచు తత్తత్ కర్మానుసారము ఆయా యర్థములందు ప్రవర్తింపజేయుచున్న ఆత్మను చూడరు. నిద్రావేళ పరమ సుఖమయమై దేహేంద్రియాంతః కరణములతో పొత్తులేకుండనున్న ఆత్మను గమనింపరు. ఇట్లు నిత్యము ప్రాణులు మూడు దశలందు ఆత్మయొక్క క్రీడలను దర్శించుచుండియు దానిని చూడకపోవుట కడు ఆశ్చర్యము. బృహదారణ్యక మిదే (4-3-9, 141-7) చెప్పుచున్నది.

స్వప్నే మంత్రోపదేశః శ్రవణ పరిచితః సత్య ఏషప్రబోధే
స్వాప్నో దేవప్రసాదాదభిలషిత ఫలం సత్యతాం ప్రాతరేతి
సత్యప్రాప్తి స్త్వసత్యాదపి భవతితథాకించ తత్ స్వప్రకాశం
యేనేదంభాతి సర్వం చరమచరమథో చ్చావచం దృశ్యజాతమ్॥ 38

స్వప్న దృష్టాంతమువలన జాగ్రదవస్థ కూడ మృషయనుటచేత గురువులు చేయు ఉపనిషద్వాక్య బోధ, కూడ మృష కావలయునా? అట్లే బ్రహ్మము కూడ వంధ్యా పుత్రునివలె అసద్రూపమగునా? అను ఆ శంకలను భావించి ఈ శ్లోకమును చెప్పినారు.

కొందరు మహాత్ములకు పూర్వ సంస్కారవశమున స్వప్నమున మంత్రోప దేశము జరుగును. మేలుకొన్న తరువాత కూడ ఆ మంత్రము శ్రవణ పరిచితముగా నుండును. అంతియేగాదు. తన్మంత్రావలంబనమువలన అభిలషిత వాంఛాఫలసిద్ధి కూడ లభించును. స్వప్నవస్తుజాతమంతయు మిథ్యయే యయ్యును, తత్కాల మంత్రోపదేశము, దానివలన ఫలసిద్ధి వ్యవహారిక సత్యములే అగుచున్నవి. అట్లే గురువులు మొదలైనవి మిథ్యా జగద్వస్తువులైనను ఆ యుపదేశము స్వయం ప్రకాశము సర్వమును భాసింపజేయునగు తేజరిల్లు ఆత్మయొక్క తేజస్సు తేజరిల్ల జేయును.

అవతారిక:

స్వప్న నిదర్శనమువలన జగన్మిథ్యాత్మమును నిరూపించి జగత్సత్వాభివ్యంజిక జాగ్రత్యము కూడ మిథ్యయని చూపుచున్నారు.

మధ్యప్రాణం సుషుప్తౌ స్వజని మనువిశం త్యగ్ని సూర్యాదయోఽమీ
వాగాద్యాః ప్రాణవాయుం తదిహనిగదితా గ్లానిరేషాం న వాయోః
తేభ్యోదృశ్యావభాసోభ్రమ ఇతివిది తః శుక్తికారౌప్యకల్పః
ప్రాణా యా మవ్రతం తచ్ఛ్రుతిశిరసిమతం స్వాత్మ లబ్ధౌ నచాన్యత్॥ 39

సుషుప్తికాలమున వాగాది ఇంద్రియములకు అధిష్ఠాన దేవతలైన అగ్ని సూర్యాదులు తమ తమ వ్యాపారములను విరమించి తమ ప్రవృత్తులకు కారణమైన త్రైలోక్య శరీరుడగు హిరణ్యగర్భునియందు (మధ్యప్రాణము) నిలుచును - వాగాదింద్రియములు ప్రాణాయత్తములు కాబట్టి అవి ముఖ్యప్రాణమునందుండును. ఇట్లు అగ్న్యాధిదేవతలును, వాగాదింద్రియములును (ముఖాదింద్రశ్చాగ్నిశ్చ....చక్షోః సూర్యో అజాయత-తై ఆ 3-12) సాధిదేవతానాం మింద్రియాణి - గ్లాని - అస్త మయమును పొందును. అయితే ప్రాణవాయువునకు అస్తమయము లేదు. నిద్రవేళ శ్వాసరూపమున ప్రత్యక్షముగా ఉపలభ్యమాన మగుటవలన, ఆ ప్రాణమునుండి యేసాధి దేవతాయుక్త వాగాదింద్రియములు పునర్భవమగుట ఇంద్రియముల చేత దృశ్యముగా భాసింపబడు వస్తుజాతమంతయు శుక్తి రజతము వలె అవిద్యాకల్పితము. ఈ కారణమువలన అవస్థాత్రయమునందు కూడ అస్తమించని ప్రాణాయామ వ్రతం స్వాత్మలబ్ధమని శ్రుతి శిరస్సుల మతము. చక్షురాదిఇంద్రియవ్రతము త్రయవ్యవస్థలయందును స్వాత్మలాభమునకు అశక్తము.

బృహదారణ్యకమునం దిట్లే కలదు.

"సేషాఽన స్తమితా దేవతాయద్వాయుః" (బృ 1-5-22)

"యతశ్చోదేతి.........సలోకతాం జయతీ" (బృ 1-5-23).

అవతారిక :

వైరాగ్యమువలననే జ్ఞానసిద్ధి యని చెప్పుట.

నోఽకస్మాదార్ద్రమేధః స్పృశతిచ దహనః కింతు శుష్కంనిదా ఘా
దార్ద్రి చేతోఽనుబంధైః కృతసుకృత మపి స్వోక్తకర్మప్రజార్తైః
తద్వత్ జ్ఞానాగ్ని రేతత్ స్పృశతి న సహసా కింతువైరాగ్యశుష్కం
తస్మాత్ శుద్ధో విరాగః ప్రథమ మభిహితస్తేనవిజ్ఞానసిద్ధిః॥ 40

జలోక్తములైన తడికట్టెలను అగ్ని అకస్మాత్తుగా ముట్టుకొనదు. వేసవి యెండలకు యెండిన యెండుకట్టెలనే దహించును. అట్లే జానాగ్నియు వైరాగ్యము వలన నెండిన మనస్సునే స్పృశించునుగాని - భార్యాది విషయములందు ఆర్ద్రిచే తస్పుకలిగి సంతాన సంపదలకొరకు స్వోక్త కర్మలతో కృతసుకృతమైన (స్వాశ్రమోచిత కర్మలతో సంతాన సంపదలకై చేసిన కర్మలతో తత్సంస్కార సమాహితమై సుకృత వాసనాజల సంసిక్తమైన) మనస్సును ముట్టుకొనదు (పుత్రేణైవ జయ్యోనాశ్యేన కర్మణా....నాపుత్రస్యలోకోఽస్తి బృ. ఉ.) కాబట్టి శుద్ధ వైరాగ్యము - (విషయ వితృష్ణత - ముఖ్యమైనదని ప్రథమమైనదని) విజ్ఞానసిద్ధికొరకు అత్యంత అవశ్యకమని చెప్పుట. దీనినే "నకర్మణా నప్రజయాధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః। పరేణ నాకం నిహితం గుహాయాం విభ్రాజతేతద్యత యో విశన్తి" (తైనా) అనుచున్నది. (వైరాగ్యం జ్ఞానగమ్యం)

యత్కించి న్నామరూపాత్మక మిదమస దేవోదితం భాతిభూమౌ
యేనానేక ప్రకారైర్వ్యవహరతి జగద్యేన తేనేశ్వరేణ
తద్వత్ ప్రచ్ఛాదనీయం నిభృతరశనయా యద్వదేష ద్విజహ్వా
స్తేనత్యక్తే న భోజ్యం సుఖమనతిశయం మా గృధోఽన్యద్ధనాద్యమ్॥41

నామరూపాత్మకమగు నీ మిథ్యాజగత్తు ఉన్నదానివలె ఉదయించి వెలుగుట ఈ జగత్తు పెక్కు రీతులుగా వ్యవహరింపబడుట ఎవ్వరివలన అట్టి ఈశ్వరునిచే (రజ్జు

జ్ఞానమున సర్వము చండము) జగత్తు ఆచ్ఛాదింపబడవలెను. అనగా సద్గురూపదేశము వలన - పరమేశ్వరుని (ఆత్మ) కంటె అన్యము వేరేమియు లేదని జగత్తు పరిత్యజింప బడవలెను. తృణప్రాయముగా చూడబడవలెను. త్యజింపబడవలెను. చిత్తవిక్షేప హేతువులగు పుత్రాది ఏషణత్రయమును త్యజించి ఆత్మ ప్రతిష్ఠితులు కావలెను. సర్వము ఆత్మయే యగుటచే మరి ధన పుత్రాదు లెక్కడివి? అట్లు ఆత్మానుసంధాన ముతో నిరతిశయ సుఖానందమును పొందుము.

దీనిని ఈశావాస్య ఉపనిషత్తు మొదటి మంత్రము చెప్పుచున్నది.

ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించిజ్జగత్యాంజగత్।
తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్విద్ధనమ్॥

ఆవతారిక :

మోక్షోపాయములు చెప్పబడుచున్నవి.

జీవన్ముక్తిర్ముముక్షోః ప్రథమమథతతోముక్తిరాత్యంతకోచ
తేఽభ్యాసజ్ఞానయోగా ద్గురుచరణ కృపాంగసంగేన లబ్ధాత్
అభ్యాసోఽపిద్విథా స్యాదధికరణ వశాద్దైహికో మానసశ్చ
శారీరస్త్వాసనాద్యోహ్యుపరతి రపరోజ్ఞానయోగః పురోక్తః॥ 42

ముముక్షువునకు లభించు జీవన్ముక్తియు పరువాత విదేహముక్తియు - యీ రెండును సద్గురు కృపాకటాక్ష వీక్షణమువలన లభించు క్రమాభ్యాసముచేతను, ఆ పిమ్మట జ్ఞానయోగమువలనను ప్రాప్తించును - అభ్యాసము, శారీరక మానసికములని ద్వివిధము. పద్మాసనాదుల అభ్యాసము శరీర సంబంధి - ప్రపంచోపరతి (ఏషణా త్రయ త్యాగము) అగు సన్న్యాసము మానసికము. ఈ జ్ఞానయోగము పూర్వోక్తమే.

అవతారిక :

ప్రథమమైన జీవన్ముక్తిని గురించి చెప్పుచున్నారు.

సర్వానున్మూల్యకామాన్ హృదికృతనిలయాన్ క్షిప్తశంకూనివోచ్చైః
దోర్యద్దేహాభిమాన స్త్యజతి చపలతామాత్మదత్తావధానః
యాత్యూర్ధ్వస్థానముచ్చైః కృతసుకృతభరోనాడికాభిర్విచిత్రం
నీలశ్వేతారుణాభిః స్రవదమృతభరం గృహ్యమాణాత్మసౌఖ్యః॥ 43

అనేక కల్పముల పర్యంతము సంస్కారరూపిణియగు హృదయమున స్థిరము లైన సర్వకామములను మనోరథములను ఉన్మూలించి దేహాభిమాన బుద్ధిని విడచిపెట్టి చిత్తమును అంతర్ముఖము చేసినచో చాంచల్యము లుప్తమగును. అట్లు చిత్తైకాగ్రత పొందిన తరువాత జీవన్ముక్తుడైనవాడు సుకృతాతిశయ సంపత్తికలిగి ఆత్మసౌఖ్యయు తుడై నాడికల కూడికవలన చిత్రవిచిత్రముగ శోభిల్లుచు అమృతధారావర్షము కురియు (సహస్రదళ పద్మస్థానమగు) సహస్రారమును పొందును.

బృహదారణ్య కండికా చతుష్టయము దీనిని చెప్పుచున్నది.

(1) యదాసర్వే.........................బ్రహ్మసమశ్నుతే।

(2) తద్యథాఽహి..............యాజ్ఞవల్క్యః

(3) అణుః పంథావితరః........................కిము క్తః

(4) తస్మిన్ శుక్ల....................పుష్యకృచ్చ॥

అవతారిక :

ఈశావాస్య ఉపనిషత్తునుండి ఈ యర్థమును చూడుడు.

ప్రాపశ్యద్విశ్వమాత్మే త్యయమహ పురుషః శోకమోహాద్వ్యతీతః
శుక్రం బ్రహ్మేత్యగచ్ఛత్ఖలు సకలవిత్సర్వసిద్ధ్యా స్పదం హి
విస్మృత్యస్థూలసూక్ష్మ ప్రభృతివపురసౌ సర్వసంకల్ప శూన్యో
జీవన్ముక్తస్తురీయం పదమధిగతవాన్ పుణ్యపాపై ర్విహీనః॥ 44

పురుష డీ దేహమునందే వర్తించుచు విశ్వమునంతయు ఆత్మాకారముగా దర్శించి శోకమోహాద్వ్యతీతుడై శుక్రము శబల బ్రహ్మమునగు హిరణ్యగర్భాఖ్యస గుణబ్రహ్మమును పొంది హిరణ్యగర్భత్వమువలన సర్వజ్ఞుడై అణిమాది అష్టసిద్ధులకు ఆస్పదుడగును - తరువాత క్రమముగా స్థూలసూక్ష్మకారణ శరీరతాదాత్మ్య భావమును విస్మరించి సర్వసంకల్పశూన్యుడై తురీయపదమును పొంది ఆత్మసుఖ మనుభ వించును. పుణ్యపాపములకు సకలకర్మలకు అతీతుడగును.

ఈ సందర్భమున సార్థకండికాశ్రుతి:-(ఈశావాస్య)

యస్మిన్ సర్వాణి భూతాని అత్మైవాభూద్విజానతః
తత్రకోమోహః కః శోకఏకత్వమనుపశ్యతః।

సపర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణ
మస్నావిరగ్ం శుద్ధ మపాప విధమ్॥

చాందోగ్య బృహదారణ్యక ముండకములందుకూడ నిది కలదు.

అవతారిక :

జీవన్ముక్తుని మనఃప్రాణములు ఊర్ధ్వగమనము చేయునని ఋక్శాఖా శ్రుతి ప్రకారము చెప్పుచున్నారు.

యః సత్వాకారవృత్తౌ ప్రతిఫలతి యువాదేహమాత్రా వృతోపి
తద్ధర్మై ర్బాల్యవార్ధ్యాదిభి రనుపహతః ప్రాణ ఆవిర్బభూవ
శ్రేయాన్సాధ్య స్తమేతం సునిపుణమతయః సత్యసంకల్పభాజో
హ్యభ్యాసాద్దేవయంతః పరిణతమన సా సాకమూర్ధ్వంన యన్తి॥ 45

ఆత్మ సత్వాకారవృత్తిచే అంతఃకరణమున ప్రతిఫలించి చిదావాసరూపమున శరీరేంద్రియ పరివృతుడైనప్పటికి, ఆ శరీరధర్మములైన బాల్యవార్ధక్యాదులవలన వృద్ధి క్షయమూ పరిణామములను పొందడు. నిత్యయౌవనుడై వెలయుచు ముఖ్యప్రాణ రూపమున ఆవిర్భవించును. ఈ ప్రాణము సర్వోత్కృష్టమగుటచేత నుపాస్యము. యోగవిద్యా నిపుణమతులైన మహాయోగులు సత్యసంకల్పులై యమనియమాద్య భ్యాసముపలన మనస్సును పరిపక్వాంతఃకరణముతోపాటు ప్రాణమును కూడ ఊర్ధ్వముగా కొనిపోవుదురు.

ఛాందోగ్యమున (8-6-1-6) ఇది కలదు.

మరియు ఋక్శాఖాశ్రుతి (3-1-7) కూడ చెప్పుచున్నది.

'యువా సువాసాః పరివీత అగాత్స ఉశ్రేయాన్ భవతి జయమానః।
సంధీరాసః కపయ ఉన్నయంతి స్వాభ్యో మనసా దేవయంతః॥

అవతారిక :

నిర్వాణముక్తిని గురించి చెప్పుచున్నారు.

ప్రాయోఽకామోస్తకామో నిరతిశయ సుఖాయాత్మకా మ స్తదాఽసౌ
తత్ర్పాప్తావాప్త కామస్థిత చరమదశ సస్యదేహావసానే

ప్రాణా నైవోత్క్రమంతి క్రమవిరతిమితా స్వస్వహేతౌ తదానీం
క్వాయం జీవోవిలీనో లవణమివజలేఽఖండ ఆత్మైవ పశ్చాత్॥ 46

జీవన్ముక్తుడు ఇహపరలోక సుఖవాంఛలు లేక నిష్కాముడును, నిరతిశయ సుఖానందమును కోరి (ఆత్మానందమునందు క్షుద్రానందములన్నియు అంతర్భూతములు - యం లబ్ధ్వాచాపరం లాభం మన్యతే నాధికంతతః - భ. గీ.) ఆత్మకాముడును, అపరోక్షాత్మానుభవమును పొంది ఆత్మస్వరూపనిష్ఠితుడై ఆప్తకాముడునగును. ఆప్తకాముడగు జీవన్ముక్తునకు దేహపతనానంతరము అర్చిరాదిమార్గ ఊర్ధ్వగమనముండదు. అతని వాగాదింద్రియములు తత్తదధిష్ఠాన దేవతలందు (స్వోపాదానకారణములు) నీటియందు లవణమువలె లయమగును. పిమ్మట వాగాదికళలు స్వప్రకృతులతో పాటు పురుషుని యందు లయించును. ఇట్లంతయు లయమైన వెనుక జీవుడెందుండును? అఖండాత్మయే అవచ్ఛేదకాభావమువలన విరాజిల్లును. (బ్రహ్మైవసన్ బ్రహ్మేత్యేతి'' - తై. ఆ 2-2).

నతస్య ప్రాణాంక్రామన్తి-

''అథాకామయమానోయోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామోభవతి''
(బృ. మా. ప్రశ్న).

పిండీభూతంయదం తర్జల నిధి సలిలం యాతితత్తైన్ధవాఖ్యం
భూయాఃప్రక్షిప్తమస్మి న్విలయముపగతం నామరూపే జహాతి
ప్రాజ్ఞః తద్వత్పరాత్మన్యథభజతిలయం తస్యచేతో హిమాంశౌ
వాగగ్నౌచక్షురర్కేపయసి పునరసృగ్రేతసీదిక్షు కర్ణౌ॥ 47

సముద్ర జలము గడ్డకట్టి ఉప్పుగా మారును. మరల నది జలమునందు కలసి నామరూపహీనమై పోవును. అట్లే ప్రాజ్ఞుడగు జీవుడు పరాత్మయందు లయమై నామరూపములు పోగొట్టుకొనును. కర్తయు, భోక్తయునగు జీవుడు లయింపగా నతని చేతస్సు చంద్రుని యందు, వాగింద్రియము అగ్నియందు, చక్షువు సూర్యుని యందు, రక్తరేతస్సులు జలమునందు, కర్ణములు దిక్కులందు లయము చెందును.

(ప్రశ్న ఉ-6-5, ముం 3-7. బృహ. ఉ. 4-4-12; 5-2-13)

అవతారిక :

విశ్వమంతయు ఆత్మ సంబంధముచేతనే చలించుచున్నదని

క్షీరాంతర్వ్యద్వదాజ్యం మధురిమవిదితంతత్ పృథగ్భూతమస్మాత్
భూతేషు బ్రహ్మతద్వద్వ్యపహృతి విదితం శ్రాంతవిశ్రాంతి బీజమ్।
యంలబ్ధ్వాలాభమన్యం తృణమివమనుతే యత్రనోదేతి భీతిః
సాంద్రానందంయదంతః స్ఫురతి తదమృతం విద్ధ్యతోహ్యన్యదార్తమ్॥

పాలయందు అంతర్గతముగా వ్యాపించియున్న నేయి స్వమాధుర్యముచేత విదితమై యుండి - తాను పాలకంటె వేరుగా నున్నట్లు తోచునట్లే - బ్రహ్మ 'అహం' మొదలగు వ్యవహారముచే విదితమగుచు భూతములందు వ్యాపించియుండి, భూతముల కంటె విలక్షణముగా తోచుచు. తాపత్రయాగ్నితప్త శ్రాంత ప్రాణులకు సుషుప్త్యాది దశలందు విశ్రాంతి కారణముగా నుండును. ఏ యాత్మ వస్తులాభము కలిగినచో జ్ఞాని తదన్య వస్తులాభమును తృణముగా నెంచునో, ద్వితీయ వస్తువు లేనందువలన నెచట భయము లుప్తమై అభయము సిద్ధించునో, ఏది బుద్ధిగుహయందు సాంద్రానంద రూపమున స్ఫురించునో, ఆ యాత్మ అమృతస్వరూపుడు, తద్భిన్నముగ తోచునదెల్ల. బాధితము. నశ్వరము.

ఈ భావమును పెక్కు శ్రుతులు చెప్పుచున్నవి.

"యత్రనాన్యత్ పశ్యతి....మహిమ్నితి" ఛాం. 7-24-1

"నదృష్టేర్ద్రష్టారం - అన్యదార్తం" బృహ. 3-4-2; 4-5-1; 5.7-3.

అవతారిక :

పరంపరగా విశ్వము ఓతః ప్రోతముగా బ్రహ్మమని

ఓతః ప్రోతశ్చతంతుష్విహవితత పటశ్చిత్రవర్ణేషు చిత్రః
తస్మిత్ జిజ్ఞాస్యమానే ననుభావతిపటః సూత్రమాత్రావశేషః।
తద్వద్విశ్వం విచిత్రం నగనగరనరగ్రామ పశ్వాదిరూపం
ప్రోతం వైరాజరూపే సవియతితదపి బ్రహ్మణి పోతమోతమ్॥ 49

చిత్రవర్ణయుక్తమైన వస్త్రమున చిత్రవర్ణములు గల నూలుపోగులు పడుగు పేకలుగా నున్నవి. పరిశీలింపగా నూలుపోగులు వస్త్రము వేరు వేరు కాదు. అందు

సూత్రములకంటె వేరేమియు లేదు. వస్త్రము సూత్రాత్మకమే. అదేవిధముగా చిత్రమైన గిరిపురజన గ్రామాది రూపముగల విశ్వము బ్రహ్మాండ విగ్రహమున వైరాజ రూపమున ప్రోతముగా నున్నది. అది ఆకాశమున ప్రోతము ఆ వియత్తు బ్రహ్మము నందు ప్రోతము. ఇట్లు అక్షరమైన బ్రహ్మము ప్రతిపాదితము.

దీనినే శ్రుతులు చెప్పుచున్నవి. బృ. ఉ. 5-8-3.

(సహో వాచ....తదక్షోతికళ్చన) తై. 4-12 (యస్మిన్ ఇదగ్ంప్రజాము) బృ. 3-8-11. (ఏతస్మిన్....ప్రోతశ్చ)

అవతారిక :

బింబప్రతిబింబన్యాయమున ఆత్మ సర్వాత్మకత్వము చెప్పుచున్నారు.

రూపం రూపం ప్రతీదం ప్రతిఫలనవశాత్ప్రాతిరూప్యం ప్రపేదే
హ్యేకోద్రష్టా ద్వితీయోభవతిచసలిలే సర్వతోఽనంతరూపః
ఇంద్రోమాయాభిరాస్తే శ్రుతిరితివదతి వ్యాపకం బ్రహ్మతస్మాత్
జీవత్వంయాత్యకస్మాదతివిమలతరే బింబితం బుద్ధ్యుపాధౌ॥ 50

ద్రష్ట యొక్కడే అయ్యును జలమునందు ప్రతిఫలించి రెండు రూపములుగా కన్పించుచున్నట్లు - బ్రహ్మము ప్రతి రూపమునందును ప్రతిఫలించి ప్రతిరూపమును పొందుచు సర్వత్ర అనంతరూపుడై తోచును. శ్రుతి - ఇంద్రుడు (పరమాత్మ) తన మాయాశక్తులవలన భిన్న భిన్న యుపాధులందు ప్రతిఫలించి భిన్న భిన్న రూపములుగా అభివ్యక్తమగునని చెప్పుచున్నది.

(ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే - ఋ. 6-47-13 బృ ఉ. 4-5-18 రూపం రూపం ప్రతిరూపో బభూవ - బృఉ. 4-5-18) సర్వవ్యాపకమగు బ్రహ్మము స్వచ్ఛమగు అంతఃకరణమున ప్రతిఫలించి ప్రతిబింబరూపమున నిర్హేతువుగా జీవత్వమును కలిగి వివిధరూపముల (నామ) తో అభివ్యక్తుడగుచున్నాడు.

అవతారిక :

ఈ విషయమున ఋగ్వేదము చెప్పుట చూపుచున్నారు.

తజ్ఞాఃపశ్యంతిబుద్ధ్యా పరమ బలవతో మాయయాఽక్తం పతంగం
బుద్ధ్వావంతః సముద్రేప్రతిఫలిత మరీచ్యాస్పదం వేధస స్తమ్।

యాదృగ్యావానుపాధిః ప్రతిఫలిత తథాబ్రహ్మతస్మిన్ యథాఽస్యం
ప్రాప్తాదర్శాను రూపం ప్రతిఫలతి యథావస్థితం సత్సదైవ॥ 51

అద్దము, కరవాలము, నీరు మొదలగు ఉపాధులయందు ముఖము ప్రతిఫలించి, ఆ యా యుపాధులకు అనుగుణముగా ప్రతిబింబములు కలదై, ఆ యా యుపాధులందు ధర్మములు కలదానివలె తోచుచు భిన్న భిన్నాకృతులలో కన్పించుచు నిజమునకు ఏకాకృతియై స్వస్వరూపమున భాసించును. సముద్రము సూర్యకిరణములచే నభివ్యాప్తమైనట్లు బుద్ధియందు బ్రహ్మయొక్క మాయచేత ఆవరింపబడిన జీవుని జ్ఞానులు పరిశుద్ధాంతఃకరణులై పరబ్రహ్మముగా దర్శింతురు.

దీనిని ఋక్శాఖామంత్రము (10-177-!) చెప్పుచున్నది.

''పతంగమక్తమసురస్య....పదమిచ్ఛంతివేధసః''

అవతారిక :

మరియొక దృష్టాంతముచే పై విషయము చెప్పుచున్నారు.

ఏకోభానుస్తదస్తఃప్రతిఫలనవశాద్యస్త్వనేకోదకాంతః
నానాత్వం యద్వ్యుపాధిస్థితిగతి సమతాంచాపి తద్వత్ పరాత్మా
భూతేషూచ్చావచేషు ప్రతిఫలిత ఇవాభాతితావత్స్వభావా
వచ్ఛిన్నోయః పరంతు స్ఫుటమనుపహతో భాతితావత్స్వభావైః॥ 52

సూర్యు డొక్కడే. కాని బహు జలాశయములందు ప్రతిబింబరూపమున నుండినట్లు తోచి ఆయా ఉపాధులనుబట్టి నిశ్చలముగ చలించుచున్నట్లుగ, మలినుడుగ, పరిశుద్ధుడుగ, నానావిధముగ ఆయా యుపాధిధర్మానుగుణముగ తోచుచుండియు.ఆ ధర్మములచే స్పృశింపబడక తన స్వస్వరూపముతో విరాజిల్లును. అట్లే పరమాత్మయు బహువిధములగు నుపాధులందు ప్రతిఫలించి ఆయా ఉపాధి ధర్మములను కలిగిన వానివలె భిన్న భిన్నాకృతులతో చరించియు. ఆ యుపాధి స్వభావములతో నే విధమైన సంబంధమును లేక తన నిజస్వభావముతోనే భాసమానుడగును.

అవతారిక :

జలాశయములందు సూర్యబింబము స్వకీయ రూపమునే ప్రకటించును. పదార్థాంతరము కాదు. ఆత్మ ప్రతిబింబము జీవశ్చేతస్సులందు పదార్థాంతర జ్ఞాపకమెట్లు చేయుచున్నదను ఆ శంకకు సమాధానము చెప్పుచున్నారు.

యద్వత్పీయూషరశ్మౌ దినకరకిరణైర్బింబితై రేతిసాంద్రం
నాశంనైశంతమిస్రంగృహగతమథవా మూర్ఛితైఃకాంస్యపాత్రే
తద్వత్బుద్ధౌపరాత్మద్యుతిభిరనుపదంబింబితాభిః సమన్తాత్
భాసంతే హీంద్రియాస్య ప్రసృతిభిరనిశం రూపముఖ్యాః పదార్థాః॥ 53

'ఆదిత్యేన చంద్రమాభాతి' అని శ్రుతి చెప్పినట్లు సూర్యకిరణములు చంద్రుని యందు ప్రతిబింబించి రాత్రియందు చీకటిని పోగొట్టును. సూర్యకిరణములు పగటివేళ కంచుపాత్రయందు ప్రతిఫలించి గృహములనందున్న చీకటిని పోగొట్టును.

అట్లే పరమాత్మ చైతన్యద్యుతి బుద్ధియందు ప్రతిఫలించి ఇంద్రియముల ద్వారా వెలుపలకు ప్రసరించుచు నామరూపాత్మక పదార్థజాతమును ప్రకాశింపజేయుచుండును.

అవతారిక :

బ్రహ్మప్రతీతి త్రివిధములను (ఉపాధులను బట్టి) చెప్పుచున్నారు.

పూర్ణాత్మానాత్మ భేదాత్ త్రివిధమిహపరం బుద్ధ్యవచ్ఛిన్న మన్యత్
తత్రైవాభాసమాత్రం గగనమివజలేత్రి ప్రకారం విభాతి
అంభో వచ్ఛిన్న మస్మిన్ ప్రతిఫలితమతః పాథసోఽంతర్బహిశ్చ
పూర్ణా వచ్ఛిన్న యోగ్నేవజతిలయ మవిద్యాస్వకార్యైః సహైవ॥ 54

జలము నావరించి, జలమున ప్రతిఫలించి, జలమున లోవెలుపల వ్యాపించి ఆకాశము త్రివిధముగ జలమున నుండును. జలము నావరించినది జలావచ్ఛిన్నాకాశము. జలమునందు లోపల వెలుపల నున్న ఆకాశము పూర్ణాకాశము. జలమునందు ప్రతిఫలించిన యాకాశము ఆభాసమే (లేనిది ఉన్నట్లుండుట) కాని వస్తుస్థితి కాదు. జలములన్న ఉపాధి నశింపగా జలావచ్ఛిన్నాకాశము పూర్ణాకాశమున కలియును. ప్రతిఫలించిన ఆభాస ఆకాశము లయించును.

అదేవిధముగ ఆత్మ బుద్ధిని ఆవరించియు, బుద్ధియందు ప్రతిఫలించియు బుద్ధికి లోపల వెలుపల నుండును. బుద్ధిని ఆవరించినది బుద్ధ్యవచ్ఛిన్న చైతన్యము ప్రతిఫలించినది బుద్ధి ప్రతిబింబిత చైతన్యము. వెలుపల లోపల నుండునది పూర్ణ ఆత్మ. జలములందు ప్రతిఫలించిన ఆకాశమువలె, బుద్ధియందు ప్రతిఫలించిన చైతన్యము

కూడ (చిదాభాసుడు) ఆభాసమాత్రమే. వస్తుస్థితి కలవాడు కాదు. బ్రహ్మజ్ఞాన లాభముచేత బుద్ధి యుపాధి నశింపగా బుద్ధ్యవచ్ఛిన్న చైతన్యము పూర్ణాత్మ యగును. ప్రతిఫలించిన చిదాభాసుడు - తత్కారణమగు అవిద్యతో పాట లయము పొందును. అధిష్ఠాన సాక్షాత్కారము వలన ఆభాస నశించును.

అవతారిక :

సర్వాత్మక బ్రహ్మము సూత్రరూపమని నిరూపించుచున్నాడు.

దృశ్యంతే దారునార్యోయుగపదగణితాః స్తంభసూత్రప్రయుక్తాః
సంగీతం దర్శయంత్యో వ్యవహృతిమపరాంలోకసిద్ధాంచ సర్వామ్
సర్వత్రాను ప్రవిష్టాత్ అభినవవిభవాత్ యావదర్థాను బంధాత్
తద్వత్ సూత్రాత్మ సంజ్ఞాత్వ్యవహరతి జగత్ భూర్భువస్స్వర్మ
హాంతమ్॥ 55

అనేకములైన కొయ్యబొమ్మలు (తోలుబొమ్మలు) స్తంభసూత్ర బద్ధములై తత్ప్రేరితములై ఆడును పాడును. లోకోత్తర వ్యవహారమును, లోకసిద్ధ వ్యవహారమును ప్రదర్శించును. అట్లే సర్వాను ప్రతిష్ఠమైన సూత్రాత్మ సంజ్ఞగల పరమాత్మచేత ప్రేరితమై భూర్భువ స్సువః పర్యంత జగత్తు వ్యవహరించుచున్నది. (అతర్క్య సామర్థ్యముతో) స్వస్వవ్యవహారములందు - స్వనియతత్వమున కాక సూత్రాత్మ సంబంధము చేతనే ప్రవర్తించుచున్నది.

దీనిని శ్రుతి చెప్పుచున్నది.

తై. సం. 4. 1-8; తై. 2-5; బృ. ఉ. 5-2-7 ఋగ్వే 1-164-16; శ్వే.ఉ. 4-3; 5-10.

అవతారిక :

సత్యశబ్దవ్యపదేశము (బ్రహ్మము)గా చెప్పుచున్నారు.

తత్సత్యంయత్ త్రికాలేష్వనుపహతమదః ప్రాణదిగ్వ్యోమముఖ్యాం
యస్మిఞ్ విశ్రాన్తమాస్తే తదిహనిగదితం బ్రహ్మసత్యస్య సత్యమ్
నాస్త్యన్యత్క్రించ యద్వత్పరమధికమతో నామ సత్యస్య సత్యమ్
సచ్చత్యచ్చేతి మూర్తాద్యుపహితమవరం సత్యమస్యాపి సత్యమ్॥ 56

త్రికాలాబాధ్యమైనది సత్యము. మూర్తములైన పృథివ్యప్తేజస్సులు సత్యము లని వ్యవహరింపబడుచు సత్యములుగా తోచుచున్నప్పటికి వినాశమున్నవై యుండుటచే సత్యములు కావు. ప్రాణ, దిక్, ఆకాశకాలములు మూర్తిహీనములు. స్థితగతులు కలవి కాన త్యత్ అని వ్యవహరింపబడును. ఇవి మృతిలేనివని త్రికాలా బాధ్యము లగు సత్యములని కొంద రందురు. అయితే యివి ఏ బ్రహ్మయందు లయించునో, ఆ బ్రహ్మము సత్యములకెల్ల సత్యము. ఆ బ్రహ్మముకంటె అన్యత్వరం ఉత్కృష్టం అధికం సత్యమన్నది లేనేలేదు. ఉన్నచో వేదమునందు ప్రసిద్ధమై యుండవలెను కదా! బ్రహ్మ మొక్కటే సత్యత్వవ్యపదేశ్యము. సత్ - మూర్తములైన పృథివ్యప్తేజ స్సులు - త్యత్ - అమూర్తములైన దిగాకాశకాలాదులు వీనికి, ఆశ్రితమైన శబల బ్రహ్మము (సగుణబ్రహ్మము - ఈశ్వరుడు) కంటె సత్యము నిరుపాధిక పర బ్రహ్మము.

అవతారిక :

బ్రహ్మము సత్యమున కంటే సత్యమని దృష్టాంతము చెప్పుచున్నారు.

యత్కించిద్భాత్య సత్యం వ్యవహృతివిషయే రౌప్య సర్పాంబుముఖ్యం
తద్వైసత్యాశ్రయేణేత్యయమిహనియమః సావధిర్లోకసిద్ధః
తద్వైస్యతస్యసత్యే జగదఖిలమిదం బ్రహ్మణి ప్రావిరాసీత్
మిథ్యాభూతం ప్రతీతం భవతిఖలు యతఃతచ్ఛా సత్యం భవంతి॥ 57

లోకమున వ్యవహార విషయమున శుక్తియందు రజతము, రజ్జువునందు సర్పము, మరీచికలందు జలము (అసత్యమైనవి) భాసించుట సత్యాశ్రయమువలననే జరుగుచున్నది. శుక్తికాదులే వ్యవహార సత్యము—వాటిని ఆశ్రయించుకొనియే రజ తము మొదలగు సత్యములు భాసించుచున్నవి. అస లా శుక్తికాదులు లేనిచో యీ ప్రభాససంభవమే కాదు. కనుక సత్యము నాశ్రయించియే అసత్యము భాసించునవి నియమము. లోకసిద్ధము. భ్రాంతి అధిష్ఠాన సత్యాశ్రయము. రజత సర్పాదులవలె జగత్తుకూడ మిథ్య. అవిద్యాకల్పితమైన జగత్తునకు అధిష్ఠానము సత్యముగా నున్నది బ్రహ్మము. బ్రహ్మము (అధిష్ఠాన సత్యము) ను ఆశ్రయించియే అవిద్యాకల్పితమగు జగత్తు ఆవిర్భవించుచున్నది. ఆ బ్రహ్మము పారమార్థిక సత్యము.

(తై. 3-1).

అవతారిక :

బ్రహ్మము యొక్క పూర్ణత్వమును చెప్పుచున్నారు.

యత్రాకాశావకాశః కలయతిచకలా మాత్రతాం యత్రకాలో
యత్రైవాశావసానం బృహదిహహి విరాట్పూర్వమర్వాగివాస్తే
సూత్రం యత్రవిరాసీత్ మహదపి మహతస్తద్వి పూర్ణాచ్చ
పూర్ణం సంపూర్ణాదర్ణవాదేరపి భవతి యథాపూర్ణమేకార్ణవాంభః॥ 58

ఆకాశమునకు వ్యవస్థాన మెచ్చట కలదో, కాల మెచ్చట లేశమాత్రమగునో, ఎచ్చట దిక్కులకు అవసానము కలదో త్రైలోక్యశరీరుడగు విరాట్టు ఎవరి ముందు అల్పుడో, మహత్తు గలవాని యన్నిటికంటె మహితమైన హిరణ్యగర్భతత్త్వ మెవ్వని వలన ప్రాదుర్భావము పొందునో - అపరబ్రహ్మ - (అర్ణవాదుల కంటె సప్త సముద్రముల జలము మహోత్తమమై పూర్ణమై యున్నట్లే) పూర్ణములైన ఆకాశము మొదలగువానికంటె మహత్తరమున్ను పూర్ణమున్ను అయి ప్రకాశించును.

(శతపథ బ్రా. 10-6-3-2; ఛాం. 3-14-3; కాఠ. 1-3-10,11; బృ. ఉ. 7-1-1.)

అవతారిక :

బ్రహ్మము సర్వాంతరమని చెప్పుచున్నారు.

అంతః సర్వౌషధీనాం పృథగమితరసైః గంధవీర్యైర్విపాకైః
ఏకంపాథోదపాథః పరిణమతి యథా తద్వదేవాంతరాత్మా
నానాభూత స్వభావైః వహతి వసుమతీ యేనవిశ్వం పయోదో
వర్షత్యుచ్చైః హుతాశః పచతిదహతి వాయేన సర్వాంతరోఽసౌ॥ 59

ఒకే మేఘము నుండి కురియబడిన నీరు ఓషధు లన్నిటియందు చేరి అమిత రస గంధ వీర్యములు విశేష పాకములు కలిగి వేర్వేరు రూపములతో నుండునట్లు అంతరాత్మ భిన్న భిన్న భూతములందు అంతర్యామిగా నుండి భిన్న భిన్న రూపములతో నొప్పును. అంతరాత్మ వలననే వసుమతి నానాభూతస్వభావయుక్తమై విశ్వమును వహించుచున్నది. మేఘుడు అత్యధికము వర్షింపగల్గుచున్నాడు. అగ్ని దహించుట పాకము చేయుట. కావున సర్వాంతరుడు సకలమునకు ప్రేరకుడు ఆత్మయే.

(బృ. ఉ. 5-7-3).

అవతారిక :

బ్రహ్మముయొక్క ఏకత్వమును మూలశ్రుతి సహకారిణియైన ఈశ ఉపనిషత్తుతో సంప్రదించుచున్నారు.

భూతేష్వాత్మానమాత్మన్యను గతమఖిలం భూతజాతం ప్రపశ్యేత్ప్రాయః
పాథస్తరంగాన్వయ వదథచిరం సర్వమాత్మైవ పశ్యేత్
ఏకం బ్రహ్మద్వితీయంశ్రుతి శిరసిమతం నేహనానాస్తి కించిత్
మృత్యోరాప్నోతి మృత్యుం స ఇహజగదిదంయస్తునానేవ పశ్యేత్॥ 60

జలమునందు తరంగములు, గాలిబుడగలు, నురుగుపంటివి వేర్వేరు రూపములతో పరస్పర భిన్నములుగా తోచినను, వీటియందు జలము అనుగతముగా నుండుట వలన నివి జలమురంటె భిన్నములు కావు. అట్లే అఖిల భూతములందు అనుగతముగా నున్న ఆత్మను తెలిసికొన్నచో ఆత్మ నిత్యమని భూతజాతము అసత్యమని గ్రహింపవచ్చును. నానాతరంగములవలన జలమునకు ద్వితీయత్వము లేనట్లే నానా భూతజాలములవలన ఆత్మకును ద్వితీయత్వము లేదు. ఏకత్వమే. బ్రహ్మదర్శన విషయమున నానాత్వ ప్రసక్తికి అవకాశము కొంచెము కూడ లేదు. బ్రహ్మమును అనేకముగ చూచువాడు, జగత్తు బ్రహ్మముకంటె వేరైనదని అనేకమని తలచువాడు, మృత్యువు నుండి మృత్యువునకు పోవునని (అనేక జన్మము లెత్తునని) ఉపనిషత్తు చెప్పినది.

(బృ.ఉ. 4-4-10. ఛాం. 6-7-1. ఈశ.అ.బృ.ఉ. 6-8-19.)

అవతారిక :

మరియొక దృష్టాంతముచే ముందు చెప్పిన శ్లోకభావమును దృఢీకరించుచున్నారు.

ప్రాక్పశ్చాదస్తి కుంభాద్గగనమిదమితి ప్రత్యయే సత్యపీడం
కుంభోత్పత్తావుదేతి ప్రలయముపగతే నశ్యతీత్యన్యదేశమ్
నీతేకుంభేనసాకం వ్రజతిభజతి వాతత్ప్రమాణానుకారౌ
ఇత్థం మిథ్యా ప్రతీతిః స్ఫురతి తనుభృతాం విశ్వతస్తద్వదాత్మా॥ 61

కుండ తయారగుటకు ముందు, నష్టమైన తరువాత కూడ ఆకాశ మున్నది. ఆకాశమునకు కుంభముయొక్క జన్మలయములతో సంబంధము లేదు. కుంభమువలన

ఆకాశమునకెట్టి వికారమును లేదు. అయితే యీ కుండ జనించుటతో ఘటాకాశము (కుండలోని ఆకాశము) జనించును, దాని ఆకారమే కలిగి, దానికున్న ప్రమాణమే కలిగి, దానితోపాటు కదలుచు దానితో లయించును. ఇట్లు అందరును అనుకొందురు కదా (మిథ్యాప్రతీతి) ఇది మిథ్యా ప్రతీతియే - ఇట్లే ఆత్మకూడ స్థూలసూక్ష్మ శరీరములతో జనించుచున్నదని శరీరములతోపాటు పరిణమించుచున్నదని, గమనా గమనములు చేయుచున్నది లయించుచున్నదని భావింతురు. ఇది కూడ మిథ్యాప్రతీతియే - కుండయన్న ఉపాధియొక్క ధర్మములు ఆకాశమునకు చెందనట్లే - శరీరమను ఉపాధి ధర్మములు ఆత్మకు చెందవు. ఈ యుపాధికముందు వెనుకలందు ఆత్మ కలదు. అది నిత్యము.

అవతారిక :

బ్రహ్మముయొక్క సర్వాత్మకత్వము ప్రకారాంతరముగ చెప్పుచున్నారు.

యావాన్పిండోగుడస్య స్ఫురతి మధురిమైవాస్తి సర్వోపితావాత్,
యావాన్కర్పూరపిండః పరిణమతి సదామోదఏవాత్రతావన్
విశ్వం యావద్విభాతిద్రుమనగ నగరారామచైత్యాభిరామం,
తావచ్చైతన్యమేకం ప్రవికసతియతోఽంతేతదాత్మావశేషమ్॥ 62

బెల్లము ముక్కయొక్క మాధుర్యము ఆ ముక్కయొక్క పరిమాణ మెంతో అంతేయుండి దానియందు వ్యాపించియుండును. కర్పూరఖండము పరిమాణమును బట్టియే దాని సువాసన. అట్లే వృక్ష - గిరి, పుర ఆరామ చైత్యసుందరమగు విశ్వమెంత వ్యాప్తమైయుండునో, చైతన్యమంతవరకు వ్యాప్తమైయుండును. చివరకు విశ్వము తనకు అధిష్ఠానమైన చైతన్యమునందే లయించును. అప్పుడు ఆత్మావశేషమే.

అవతారిక :

ఆత్మయొక్క సర్వాత్మకత్వమునకు మరియొక దృష్టాంతము.

వాద్యాన్నాదానుభూతిర్యదపితదపిసానూన మాఘాత గమ్యా
వాద్యాఘాత ధ్వనీనాం నపృథగనుభవఃకింతు తత్సాహ చర్యాత్।
మాయో పాదానమే తత్సహ చరిత మివ బ్రహ్మణాఽఽభాతితద్వత్
తస్మిన్ ప్రత్యక్ప్రతీతేన కిమపి విషయా భావమాప్నోతి యస్మాత్॥ 63

మృదంగము డోలు మొదలగువానినుండి వచ్చి చెవులకు అనుభవమగుచున్న ధ్వని, హస్తము, కఱ్ఱ మొదలగువాని ఆఘాతమువలననే కలుగుచున్నది. కాని యీ ఆ హతము లేక వాద్యములనుండి స్వయముగా వెలువడలేదు. వాద్యముగాని, ఆ ఘాతముగాని, ధ్వనిగాని వేరువేరుగా అనుభవమునకు రావు. వాద్య ఆఘాతముల సహచర్య జ్ఞానమువలన నిది మృదంగ ధ్వని, నిది డోలు ధ్వని - అని వాద్యాఘాత శబ్ద విశేషజ్ఞానము కలిగి ఆయానాద గత విశేషములు గ్రహణమునకు వచ్చును. అందువలననే ఏయే స్వరూప విశేషగ్రహణము లేక తెలియబడని స్వరూపములు తత్స్వరూపములని లోకనియమ మేర్పడినది. అదేరీతిగా మాయాశక్తి (ఉపాదానకారణము) వలన వెల్లడియైన నామరూప క్రియాత్మకమైన జగత్తు కూడ సచ్చిదానంద బ్రహ్మసమాశ్రయమగుచు (అస్తిభాతి ప్రియ) స్ఫురించునట్లున్నది. కనుక జగత్తు బ్రహ్మాత్మకమేగాని స్వతంత్ర ప్రతిపత్తు కలది కానేకాదు....వాద్యాఘాతాతిరిక్తనాదానుభవస్ఫూర్తి లేని విధముగా ప్రత్యగాత్మానుభవము కలిగిన తరువాత ఆత్మాతిరిక్త జగత్తుయొక్క స్ఫూర్తి లేనేలేదు.

(బృ. 2-4-7-8-9-10)

అవతారిక :

పర్యవసితసారమును చెప్పుచున్నారు.

దృష్టఃసాక్షాదిదానీమిహఖలు జగతా మీశ్వరః సంవిదాత్మా
విజ్ఞానస్థాణు రేకో గగన వదభితః సర్వభూతాంతరాత్మా।
దృష్టం బ్రహ్మాతిరిక్తం సకల మిదమసద్రూపమాభాస మాత్రం
శుద్ధం బ్రహ్మాహమస్మీత్యవిరతమధునాఽత్రైవతిష్ఠేదనీహః॥ 64

జగత్తునకు నియామకుడు, విజ్ఞానఘనుడు, జ్ఞానస్వరూపి, ఆకాశమువలె సర్వభూతాంతరాత్మయై సర్వవ్యాపకమైయున్న పరమాత్మ - ఇచ్చటనే ఇప్పుడే సాక్షాత్తుగా (అపరోక్షముగా) చూడబడెను. ఆ బ్రహ్మముకంటె అన్యముగా తోచునదియంతయు మిథ్యాకల్పితము. ఆభాసమాత్రము. నేను పరిశుద్ధమగు బ్రహ్మమునన్న స్థిరభావమున నిష్కాముడై చరించుచు సతతము జీవన్ముక్తపురుషుడు ఆత్మస్వరూప ప్రతిష్ఠితుడుగా నుండుట కావలయును.

(శతశ్లోకి 1 శ్లోకము నుండి 64 వ శ్లోకమువరకు విజ్ఞానమయ కోశ విచారము. ఇక 65 వ శ్లోకము నుండి ఆనందమయకోశ విచారము)

అవతారిక :

సుషుప్తియందు ఆనందముయొక్క (బ్రహ్మము) అభివ్యక్తి కలుగునని సుషుప్తి స్వరూపమును చెప్పుచున్నారు.

ఇంద్రేంద్రాణ్యోః ప్రకామం సురతసుఖజుషోః స్యాద్రతాంతఃసుషుప్తిః
తస్యామానంద సాంద్రం పదమతి గహనం యత్స ఆనందకోశః।
తస్మిన్నో వేద కించిన్నిరతిశయ సుఖాభ్యంతరే లీయ మానో
దుఃఖీస్యాద్బోధితః సన్నితి కుశల మతిర్బోధయేన్నైవ మంతమ్॥ 65

ఇంద్రుడు ఇంద్రపత్నియు స్వేచ్ఛగా ప్రేమపారమున సురతసౌఖ్య మనుభవించి తరువాత విశ్రాంతి పొందుదురు. ఆ విశ్రాంతికే సుషుప్తి యన్న పేరు. (ఇంద్రు డనగా దక్షిణోఒక్షి పురుషుడు, వామనేత్ర అర్ధప్రకాశకము జ్యోతి ఇంద్రాణి. జాగ్రదవస్థయందు వీనికి భ్రూమధ్యమున అవస్థానము. స్వాపకాలమున అవరోహించి హృదయాకాశమున పరస్పర తాదాత్మ్యభావమున మిథునీభావమున వినోదించుచే సురత ప్రసంగము స్వప్నావస్థ - సురతాంతము సుషుప్తి. ఈ మిథునమునకు జాగ్రదవస్థయందు వైశ్వానరమని స్వప్నమున తైజసమని సుషుప్తియందు ప్రాజ్ఞమని పేర్లు. జాగ్రత్స్వప్నములం దీ మిథునము పుత్రకళత్రాది రూపక్రీడలను సలిపి సలిపి అలసిపోయియుండు సుషుప్తియన్న విశ్రాంతి పొందును.) సుషుప్తియందు ఇంద్రియాతీతము సూక్ష్మాతి సూక్ష్మమునగు ఆనంద సాంద్ర పదము (స్థానము)నకే ఆనందమయకోశమని పేరు. అప్పుడు జీవుడు నిరతిశయ సుఖాభ్యంతరమున లీయమానుడై కొంచెముకూడ అన్యమేదియు నెరుగడు. అప్పుడు బలాత్కారముగా మేలుకొల్పినచో తన ఆనందము నష్టమైనదని బాధపడును. అందుచేతనే గాఢనిద్రయందున్న వానిని కుశలమతులు మేల్కొలుపుటకు యత్నింపరు.

"అథహైతత్పురుషః....పరివర్తతే." బృ. ఉ. 4-1-18
"అథయదా,...ఏతచ్ఛేతే" బృ. ఉ. 4-1-17, 18
మరియు బృ.ఉ. 4-2-2, 3,—4-3-14.

అవతారిక :

పైన చెప్పిన అర్థమునే మరియొక ప్రమాణముతో చెప్పుచున్నారు.

సర్వేనందంతి జీవా అధిగత యశసా గృహ్ణతా చక్షురాదీన్
అంతః సర్వోపకర్త్రా బహిరపి చ సుషుప్తౌ యథాతుల్య సంస్థాః।

ఏతేషాం కిల్బిష స్పృగ్గతర భృతికృతేయో బహిర్వృత్తిరాస్తే
త్వక్ చక్షుఃశ్రోత్రనాసారశనవశ మితోయాతి శోకంచ మోహమ్॥ 66

జాగ్రదవస్థయందు కూడ చక్షురాదీంద్రియములను అంతర్ముఖముగను, బహిర్ముఖముగను ప్రవర్తింపజేయుచు సర్వోపహారకుడగు బ్రహ్మతో తాదాత్మ్యము చెందువారు — సుషుప్తి వేళయందు వలెనే తత్తుల్యనిరతిశయానంద పరవశులై యుందురు. అట్లుగాక ఉదర నిమిత్తము బహుకృతవేషులై బహిర్ముఖులగువారు చక్షురాదింద్రియ తాదాత్మ్యమును పొంది ఇంద్రియ విషయానుభూతి వలన సంసార బద్ధులై శోక మోహములను పొందుచుందురు.

('సర్వేనందంతియశసా....వాజినాయ' ఋ 10-72-10. 'నతస్య...మహ ద్యశః' శ్వే. 4-19. 'గృహీతా - చక్షుః' బృ. 4-1-18.

అవతారిక :

పరమానంద దృష్టిలో క్షుద్రానందములు అతి తుచ్ఛములని అనుభవముతో నిరూపించుచున్నారు.

జాగ్రత్యా మంతరాత్మా విషయ సుఖకృతేఽనేక యత్నాన్ విధాస్యన్
శ్రామ్యత్సర్వేంద్రియౌఘోఽధిగత మపి సుఖం విస్మరన్యాతి నిద్రామ్
విశ్రామాయ స్వరూపేత్యతితర సులభంతేన చాతీంద్రియం హి
సుఖం సర్వోత్తమం స్యాత్పరిణతి విరసా దింద్రియోత్థాత్సుఖాచ్చ॥ 67

జాగ్రదవస్థలో జీవుడు విషయసుఖ లాభమునకై పెక్కుయత్నములు చేయుచు కష్టముల పాలగును. ఇంద్రియములను శిథిలీభూతము గావించుకొనును. అట్టి స్థితిలో విధివశమున లభించిన గృహారామాది సుఖములను కూడ విస్మరించి నిద్రపోవును. అప్రాప్త విషయ సముద్విగ్న మనస్కులకు నిద్రయే శరణము. అందువలన ఇంద్రియ విషయ సుఖముకంటె అతీంద్రియమగు సుఖము సర్వోత్తమము. శ్రేష్ఠతమము. విషయసుఖ ప్రయాసకంటె అల్పప్రయాస సాధ్యము. అంతియేగాక విషయ సుఖము క్షణభంగురము. చివరకు దుఃఖప్రదానము చేయును కూడ.

అవతారిక :

శ్రుతి దృష్టాంతముచే పై భావమునే దృఢీకరించుచున్నారు.

పక్షావభ్యాస్యపక్షీ జనయతి మరుతంతేన యాత్యుచ్చదేశం
లబ్ధ్వా వాయుం మహాంతం శ్రమమపన యతిస్వీయపక్షౌప్రసార్య

దుఃఖకల్పైః వికల్పైః విషయమను కదర్థీ కృతంచిత్తమే తత్
ఖిన్నం విశ్రామహేతోః స్వపితిచిరమహో హస్తపాదాన్ ప్రసార్య॥ 68

పక్షి తన ఱెక్కలను ఆడించి గాలిని కలుగజేసి దాని సాయమున ఆకసమున నెత్తుగా నెగిరి అచట పెనుగాలిలో తన ఱెక్కలను సాచి విశ్రాంతి తీసికొనును. ఆదే విధముగా చిత్తము దుస్సంకల్పములలో విషయ సుఖాదులపై నాసతో వికల్పములతో సతమతమయి విసిగి వేసారి బడలిపోయి ఖిన్నమై కాలు చేతులను జాపుకొని విశ్రామహేతువైన నిద్రలోనికి జారిపోవును.

బృ.ఉ. 6-3-19. తద్యథాన్ని.... స్వప్నం పశ్యతి'' బృహ.ఉ. 6-3-19. ''తం నాయతం బోధయేదిత్యాహు.''

అగ్ని రహస్య దశమఖండము (తస్మాత్ ....హీనసానీతి).

అవతారిక :

సుప్త అవస్థ పరిణామమని చెప్పుచున్నాడు.

ఆశ్లిష్యాత్మానమాత్మాన కిమపి సహసైవాంతరం వేదబాహ్యం
యద్వత్కామీ విదేశాత్సదనముపగతో గాఢ మాశ్లిష్యకాంతామ్
యాత్యస్తం తత్రలోక వ్యవహృతి రఖిలా పుణ్యపాపానుబంధః
శోకో మోహోభయం వాసమ విషమమిదం నస్మరత్యేవ కించిత్॥ 69

చిరకాల విదేశవాసము నుండి తిరిగివచ్చిన కాముకపురుషుడు తన కాంతను గాఢపరిష్వంగము చేసికొని, ఆ పరిష్వంగ సుఖపారవశ్యమున బాహ్యాభ్యంతరముల నన్నిటిని విస్మరించును. అదేవిధముగా జీవుడు లోక వ్యవహారములందు చరించి చరించి పుణ్యపాపానుబంధములతో విసిగి వేసారి వైరాగ్యమును పొంది ఆత్మ స్వరూప ప్రతిష్ఠితుడై బాహ్యాభ్యంతరములను (జాగ్రత్స్వప్న స్థూల సూక్ష్మదేహ) విస్మరించును. వానికి లోకవ్యవహారము గాని, పుణ్యపాపములు గాని, శోక మోహములు గాని సమ విషయాత్మక మగునదేది గాని, కొంచెమైనను స్మృతియం దుండదు.

బృ.ఉ. 6-3-21 'తద్వా.... వేదనాంతరమ్.'

అవతారిక :

వైలక్ష్యమును చెప్పుచున్నారు.

అల్పానల్ప ప్రపంచ ప్రలయ ఉపరతిశ్చేంద్రియాణాం సుఖాప్తిః
జీవన్ముక్తౌ సుషుప్తౌ త్రితయమపి సమంకింతు తత్రాస్తిభేదః
ప్రాక్ సంస్కారాత్ప్రసుప్తః పునరపిచ పరావృత్తిమేతి ప్రబుద్ధో
నశ్యత్సంస్కారజాతేన సకిల పునరావర్తతేయశ్చముక్తః॥ 70

సుషుప్తియందు జీవన్ముక్తస్థితియందు సమానమైనవి మూడు స్థూల సూక్ష్మ ప్రపంచ(దేహ) ప్రలయము, ఇంద్రియోపరతి. ఆత్మస్వరూప సుఖావాప్తి. అయితే భేద మున్నది. నిద్రపోయినవాడు మెలకువ వచ్చిన తరువాత పూర్వ జాగ్రద్దశయందలి సంస్కారములు మరల ప్రబుద్ధము లగుటచేత పునరావృత్తి (సంసారము)ని పొందు చున్నాడు. జీవన్ముక్తుని విషయమున సంస్కారము లన్నియు జ్ఞానాగ్ని దగ్ధములై యుండుటవలన మరల పునరావృత్తి యన్నది లేదు. సంసారము తిరిగి అనువర్తింపదు.

ఛాందోగ్యము - 'నస పునరావర్తతే' (8-15-1) బృహ. 4-1-17 'గృహీత ఏవప్రాణో గృహీతా వాక్'.

అవతారిక :

ఆత్మ సుఖత్వము నిరతిశయమని యుక్తిచేత నిరూపించుచున్నారు.

ఆనందాన్యశ్చ సర్వాననుభవతి నృపః సర్వసంపత్సమృద్ధః
తస్యానందః సఏకః సఖలు శతగుణః సన్ప్రదిష్టః పితౄణామ్।
ఆదేవ బ్రహ్మలోకం శతశతగుణితాస్తే యదంతర్గతాః స్యుః
బ్రహ్మానందఃసఏకో స్త్వథ విషయ సుఖాన్యస్య మాత్రా భవంతి॥ 71

మానవుడు పొందు పరమానందములకెల్ల పరమావధి సర్వ సంపత్సమృద్ధి గల నృపాలుడు పొందు ఆనందము (మానుషానందము) దీనికంటె నూరు రెట్లు అధికమైనది పితరుల ఆనందము. అంతకంటె నూరురెట్లధికము దేవతల ఆనందము. దేవలోకము మొదలు బ్రహ్మలోకము వరకు క్రమముగా ఆనందములు ఒకదానికంటె యొకటి అధికమగుచు తుట్టతుదకు ఏ ఆనందమున సంలీనము లగుచు అదృశ్యమగు

చున్నవో అదియే బ్రహ్మానందము. అది అద్వితీయము. విషయ సుఖానందము లన్నియు దాని యంశలు మాత్రమే.

(తై. ఆనందవల్లి-2) బృ.ఉ. (4-3-32) (6-3-32. 33).

అవతారిక :

ఋక్‌శాఖా శ్రుతివలన మరల నీ విషయమును వంపదించుచున్నారు.

యత్రానందశ్చమోదాః ప్రముద ఇతి ముదశ్చాసతే సర్వఏతే
యత్రాప్తాః సర్వకామాః స్యురఖిల విరమాత్కేవలీ భావ ఆస్తే
మాంతత్రానంద సాంద్రేకృధిచిరమమృతంసోమ పీయూషపూర్ణాం
ధారామింద్రాయదేహీత్యపినిగమగిరో భ్రూయుగాంతర్గతాయ॥ 72

సామాన్యమైన సుఖ జన్యానందములు, అభీష్టసిద్ధి జన్యమోదములు. విశేష సుఖజన్య ప్రమోదము మొదలైన సకల ప్రమోదములున్ను, సర్వానామములున్ను, ఎవనియందు స్థానము కలిగియున్నవో, మరియు దృశ్యప్రపంచ విలయానంతరము ద్వైత సందర్భములను నశింపగా నెవడు అద్వయ భావమున రాజిల్లునో, ఆతడే సాంద్రానందరూపుడగు ఆత్మ. "ఓ సోమా! నన్ను అట్టి సాంద్రానందమునందు (జీవుడనగు నన్ను) చిరకాలము నిలుపుము. భ్రూయుగ మధ్య స్థితుడగు ఇంద్రుని కొరకు పీయూషధారలను కురియుము" అని ఋక్‌శాఖ శ్రుతి నిరతిశయ సుఖ స్వరూపమగు ఆత్మను గురించి చెప్పినది.

ఋక్ (యత్రానందశ్చమోదశ్చ ముదః ప్రముద ఆసతే। కామస్యయత్రాప్తాః కామ స్తత్ర మామమృతం కృధీంద్రాయేంద్రోపరి స్రవ)

(9. 113-11).

అవతారిక :

విషయసుఖానుభవ క్షణికత్వమును చెప్పుచున్నారు.

ఆత్మాఽకంపః సుఖాత్మా స్ఫురతి తదపరాత్వన్య థైవస్ఫురంతీ
స్థైర్యం వాచంచలత్వం మనసి పరిణతింయాతి, తత్రత్యమస్మిన్
చాంచల్యం దుఃఖహేతుర్మనస ఇదమహోయావదిష్టార్థ లబ్ధి
స్తస్యాంయావస్థిరత్వం మనసి విషయజం స్యాత్సుఖంతావదేవ॥ 73

ఆత్మ నిశ్చలుడు. సుఖస్వరూపుడు (విజ్ఞానమానందం బ్రహ్మ—శ్రుతి) (సుషుప్తి అవస్థానుభవమునుబట్టి యిది స్ఫురించుచున్నది). అందులకు మాయ విపరీతమైనది విలక్షణమైనది. చంచలము, దుఃఖహేతువు. ఆత్మకు సహచరి (ఇదియు అనుభవమువలన స్ఫురించుచున్నది) ఈ రెండింటి లక్షణములు స్థైర్యము చంచలత్వము మనస్సున పరిణమించును. అందుచేతనే కోరినవస్తువు లభించనంతవరకు మనస్సునకు చంచలత్వము. చంచలత్వము దుఃఖహేతువు. ఇష్టసిద్ధి కలిగినపుడు మనస్సు చంచలత్వమును వదలి స్థైర్యమవలంభించును. ఈ స్థిరత్వమున్నంతవరకే సుఖానుభవము. చిత్తచాంచల్యము దుఃఖహేతువు. స్థిరత్వము సుఖహేతువు.

అవతారిక :

పైన చెప్పినదానికి దృష్టాంతద్వయము చూపుచున్నారు.

యద్వత్సౌఖ్యం రతాంతేనిమిషమిహ మనస్యేకతానేరసేస్యాత్
స్థైర్యంయావత్సుషుప్తౌసుఖ మనతిశయం తావదేవాథముక్తౌ
నిత్యానందః ప్రశాంతేహృదితదిహ సుఖస్థైర్యయోః సాహచర్యం
నిత్యానందస్య మాత్రావిషయ సుఖమిదం యుజ్యతేతేన వక్తుమ్॥ 74

శృంగార క్రీడయందు మనస్సు చాంచల్యము వదలి స్థైర్యమవలంభించి రసపారవశ్యమున నిమేషకాలము సుఖమనుభవించుట అనుభవములోని విషయము. అట్లే సుషుప్తికాలమున మనస్సు చెంతసేపు చాంచల్యములేక స్థైర్యముతోనుండునో అంతసేపు అనతిశయమైన సుఖనిద్ర. ముక్తుని విషయమునందు కూడ హృదయ చాంచల్యములేవందువలననే నిత్యానందస్థితి. ఆ కారణముచేత సుఖమునకు స్థైర్యమునకు సాహచర్యము అనుభవసిద్ధము. అందుచేత విషయ సుఖములు నిత్యానందముయొక్క మాత్రారూపములని చెప్పుట యుక్తమే అగుచున్నది.

ఈ శ్లోకముతో ఆనందమయకోశ ప్రకరణము ముగిసినది. ఇక జగన్మిథ్యాత్వ ప్రకరణము.

అవతారిక :

ప్రపంచ మిథ్యాత్వము స్వప్న నిదర్శనమువలన చెప్పుటచేత స్వప్న స్వరూపమును తొలుత వివరించుచున్నారు.

శ్రాంతం స్వాంతం సబాహ్యవ్యవహృతిభిరిదంతాః సమాకృష్యసర్వాః
తత్తత్సంస్కార యుక్తం హ్యుపరమతి పరావృత్త మిచ్ఛన్నిదానమ్
స్వాప్నాన్ సంస్కార జాతప్రజనిత విషయాన్ స్వాప్నదేహేఽనుభూతాన్
ప్రోజ్ఝ్యాంతః ప్రత్యగాత్మ ప్రవణమిదమగాద్భూరి విశ్రామ మస్మిన్॥ 75

స్వదార పుత్రాది పోషణ ప్రభృతి వ్యవహారములతో విసిగిపోయిన అంతః కరణము వాటన్నిటిని సమాకర్షించి తనయందు దిముడ్చుకొని బాహ్యవ్యవహార స్యక్తమై దృఢాను సంధాన ఉత్పన్న తత్తత్సంస్కారయుక్తమై స్వీయమాది కారణము ఆత్మ రూపమును ఇచ్ఛించి - బహుదేశాటనమువలన పాంథుడు విశ్రాంతికై స్వగృహ గమనము నిచ్ఛించినట్లు (అథహైతత్పురుషః....గృహీతం మనః—బృ-ఉ. 4-1-17) సకల విషయ పరాఙ్ముఖమై యెల్లపనుల విడనాడును. స్థూలదేహానుభూత బాహ్య వ్యవహారములను మాత్రమే కాదు. సూక్ష్మదేహ (స్వప్న) అనుభూతములగువానిని కూడ త్యజించి, ఆత్మాభిముఖమై, ఆత్మస్వరూప ప్రతిష్ఠితమై సమధిక విశ్రాంతి సుఖ మనుభవించును.

అవతారిక :

పూర్వపక్షమును ఉద్ఘాటించి దృఢీకరించుచున్నారు.

స్వాప్నైభోగః సుఖాదేర్భవతి ననుకృతః సాధనే మూర్ఛమానే
స్వాప్నందేహాంతరం తద్వ్యవహృతి కుశలం నవ్యముత్పద్యతేచేత్
తత్సామగ్ర్యా అభావాత్క్వత ఇదముదితం తద్విసాంకల్పికంచేత్
తత్క్వంస్వాప్నైరతాంతేవపుషి నిపాతితే దృశ్యతే శుక్రమోక్షః॥ 76

భోగసాధనమైన స్థూలదేహము జ్ఞానకర్మేంద్రియములతో సహా మూర్ఛితమై యుండ స్వప్నమున సుఖదుఃఖాది అనుభవ మెట్లు పొసగును? "స్వప్న వ్యవహార కుశలమైన నూత్న దేహమొకటి జనించును. అదియే స్వప్న సుఖదుఃఖానుభవమును పొందును" అని చెప్పుటకు వీలులేదు. ఆ స్వప్న దేహోత్పత్తికి వలయు సాధన ములు లేవుకదా! లేక స్వప్నమున సాంకల్పిక దేహమని చెప్పుటకును వీలులేదు. ఏలననగా స్వప్నమున సురతానుభవమువలన శుక్రస్రావమగుట అనుభవసిద్ధము. ఇది స్థూలదేహానుభూతమని చెప్పుటకు వీలులేదు. అప్పుడు స్థూలదేహము మూర్ఛితమై యున్నది. సురతావసాన శుక్రస్రావము (స్వప్నమున) స్థూలదేహమున కన్పడుటకు కారణమేమి?

అవతారిక :

దూషణాంతరము.

భీత్యారోదిత్యనేన ప్రవదతి హసతి శ్లాఘతేనూనమస్మాత్
స్వప్నేఽప్యంగేఽనుబంధం త్యజతిన సహసా మూర్ఛితేఽప్యంతరాత్మా
పూర్వం యేయేఽనుభూతాః తను యువతి హయవ్యాఘ్రదేశాదయోఽర్థాః
తత్తత్సంస్కారస్వరూపాన్ సృజతి పునరమూన్ శ్రిత్య సంస్కారదేహమ్॥ 77

స్వప్నమునందు కలిగిన చోర వ్యాఘ్రాదుల భీతిచేత లేచి స్థూలశరీరముతో సాట్టహాసముగా రోదించును. కించిత్తు మాటలాడును. అట్లే నవ్వును. తాను కృతార్థుడనైతినని శ్లాఘాభాషణ చేయును. ఈ పై దృష్టాంతములవలన తెలియుచున్న దేమనగా—స్వప్నకాలమున స్థూలదేహము మూర్ఛితమై యున్నప్పటికి, అంతరాత్మ స్థూలదేహముతో అనుబంధము త్యజింపలేదని. పూర్వము అనాది జాగ్రదవస్థయందు ఏ ఏ పదార్థములు (తను యువతి హయవ్యాఘ్ర దేశాదులు) తనచేత అనుభూతములయినవో తత్తద్రూప విషయములు సంస్కారరూపమున అంతఃకరణమున విలీనమై యుండును. స్థూలదేహ వాసనారూపమగు అంతఃకరణవృత్తి స్వప్నమున ప్రేరితమై పూర్వోక్త వివిధ సంస్కార రూపములను సృజించును. అంతరాత్మ సంస్కార దేహమును (లింగదేహమును) అధిష్ఠించి (ఆ లింగశరీరమున సర్వ సంస్కారములు ఉద్బుద్ధములు) తత్తద్విషయాకారముగా పరిణమించును. సంస్కార దేహము నాశ్రయించి అంతరాత్మ స్వాప్నిక సుఖదుఃఖాదుల ననుభవించునని అంగీకరింపవలయును.

''అథయత్రైనం....తదత్రావిద్యయ మన్యతే'' బృ.ఉ. 4-3-20.

అవతారిక :

శ్రుత్యర్థాను రూపప్రక్రియను నిరూపించుచున్నారు.

సంధౌజాగ్రత్సుషుప్త్యోరనుభవవిదితా స్వాప్న్యవస్థాద్వితీయా
తత్రాత్మజ్యోతిరాస్తే పురుష ఇహసమాకృష్య సర్వేంద్రియాణి
సంవేశ్య స్థూలదేహం సముచితశయనే స్వీయ భాసాఽంతరాత్మా
పశ్యన్ సంస్కారరూపా నభిమత విషయాన్ యాతికుత్రాపి తద్వత్॥ 78

జాగ్రద్దశ తొలిది. దీనికిని సుషుప్తికిని మధ్య సంధియందు పర్యాయతపసిద్ధమైన స్వప్నావస్థ కలదు. ఇది రెండవది. దీనియందు సర్వేంద్రియములను ఆత్మ ఆకర్షించుకొనును. ఈ దశయందు ఇంద్రియముల అభావమువలన విషయగ్రహణము జరిగినచో అది ఆత్మజ్యోతివలననే. స్థూలశరీరమును ప్రాప్తనిద్రాస్థలమువ విశేషింప జేసి స్వసామర్థ్యమున వాసనామయము లైన యభిమత విషయములను పెక్కింటిని దర్శించి తుదకు వెచటికో పోవును. (స్థూలసూక్ష్మదేహ సంబంధముగాని తద్గత ప్రియాప్రియ స్పర్శగాని లేక స్వస్వరూపావస్థుడై యుండును).

బృ. ఉ. 4-3-9. తస్యవా ఏతస్య....స్థానంచ....''సయత్ర....జ్యోతిర్భవతి''

అవతారిక :

కొన్ని శంకలకు సమాధానము చెప్పుచున్నారు.

రక్షక ప్రాణైః కులాయం నిజశయనగతం శ్వాసమాత్రావశేషైః
మాభూత్ తత్ప్రేత కల్పాకృతిక మితిపునః సారమేయాదిభక్ష్యమ్।
స్వప్నే స్వీయప్రభావాత్ సృజతి హయరథాన్ నిమ్నగాః పల్వలాని
క్రీడాస్థానాన్యనే కాన్యపి సుహృదబలాపుత్ర మిత్రానుకారాన్॥ 79

స్వప్న దశయందు జీవుడు స్థూలశరీరాతుడుగా నుండియు, స్థూలశరీరము స్వశయ్యపై వివశమై కళేబరముగా నుండగా దానిని నక్కలు కుక్కలు శవమనుకొని భక్షింపకుండునట్లు శ్వాసమాత్ర ప్రాణకృత్యము చేత రక్షించుకొనుచుండును. మరియు స్వసామర్థ్యముచేత అశ్వరథ నదులను సరస్సులను క్రీడాస్థానములను మిత్ర కళత్ర పుత్రానుకృతులను సృజించుకొనును. (యథాభిమతముగా)

బృ. ఉ. 4-3-12 ''ప్రాణేనరక్ష....ఏకహగ్ంసః'' నతత్రరథ....సహికర్తా''

అవతారిక :

పై విషయమునే దృఢీకరించుచున్నారు.

మాతంగ వ్యాఘ్రదస్యుద్విషదురగకపీన్ కుత్రచిత్ ప్రేయసీభిః
క్రీడన్నాస్తేహసన్ వావిహరతి కుహచిన్మృష్ట మశ్నాతిచాన్నమ్
మ్లేచ్ఛత్వం ప్రాప్తవా నస్మ్యహమితి కుహచిచ్ఛం కితః స్వీయలోకాత్
ఆస్తే వ్యాఘ్రాది భీత్యాప్రచల తికుహచిద్రోదితిగ్రస్యమానః॥ 80

పైన చెప్పినట్లే స్వప్నమున జీవుడు గజవ్యాఘ్ర చోరశత్రు సర్పాదులను సృజించుకొనును. ప్రేయసితో నొకచో క్రీడించును. సల్లాపము చేయును. విహరించును. మరియొకచో మృష్టాన్నమును కడుపార భుజించును. మరొక్కచో నా యుత్తమ జన్మపోయి మ్లేచ్ఛత్వము సంక్రమించినదని వాపోవును. ('స్వప్నే శూద్రత్వ మాపన్నః' మున్నగునవి వాసిష్ఠోక్తులు) అట్లే వ్యాఘ్రాదులవలన భయముచే పలాయనము చేయును. వ్యాఘ్రాదులచే జిక్కితినని రోదించును.

బృ-ఉ. "సయత్రాయం...సహికర్తా" 6-3-10.

బృ-ఉ. "ప్రాణేన....ఏక హంసః" 6-3-12-13.

బృ-ఉ. "స్వప్నాంత....భయాని పశ్యన్ 6-3-13.

అవతారిక :

జాగ్రదవస్థయందు దృష్టి సృష్టిపక్షము నుదహరించుచున్నారు.

యోయోదృగ్గోచరోఽర్థోభవతి సతతదాతద్గతాత్మ స్వరూపా
విజ్ఞానోత్పద్యమానః స్ఫురతినను యథాశుక్తి కాజ్ఞానహేతుః
రౌప్యాభాసోమృషైవస్ఫురతిచ కిరణాజ్ఞానతోఽంభోభుజంగో
రజ్జ్వజ్ఞానాన్నిమేషం సుఖభయ కృదతో దృష్టి సృష్టం కిలేదమ్॥ 81

ముత్తెపుచిప్పయందు యథార్థజ్ఞానము లేకపోవుటవలన రజతముగా భాసించును. అట్లే సూర్యకిరణములు ఎండమావులుగా తోచుటయు, క్షణకాలము త్రాడు సర్పముగా భ్రాంతిని కలిగించి భయహేతువగుటయు లోకమున నున్నవే. అయితే యథార్థ జ్ఞానానంతరము ముత్తెపుచిప్ప ముత్తెపుచిప్పగాను, సూర్యకిరణములు సూర్యకిరణములుగాను, త్రాడు త్రాడుగాను భాసించి - భ్రాంతులైన రజత మరుభూమి సర్పము ఉండవు. అదే విధముగా దృశ్యమానమైన జగత్తు అంతయు సర్వాత్మక బ్రహ్మరూపమని తెలియకపోవటవలన అది చరాచర జగద్రూపముగా తోచుట. సర్వాత్మక బ్రహ్మజ్ఞానానంతరము జగన్మిథ్యాత్వము తెలిసిపోవును. ఇది కూడ రజత మరీచి సర్పాదులవలె ప్రాతిభాసికమే. ఇది కేవలము దృష్టిసృష్టము. యథార్థజ్ఞానము కలుగగా లయించును.

అవతారిక :

పై విషయమునే గీతావాక్యముతో సంవదించుచున్నారు.

మాయాధ్యాసాశ్రయేణ ప్రవితతమఖిలం యన్మయాతేన మత్తా
న్యేతాన్యేతేషు నాహం యదపి హిరజతం భాతిశుక్త్యైనరౌప్యే
శుక్త్యం శక్త్యేన భూతాన్యపిమయి న వసంతీతి విశ్వాగ్ర్యనేతా
ప్రాహాస్మాద్దృశ్యజాతం సకలమపి మృషైవేంద్ర జాలోపమేయమ్॥ 82

గీతయందు విశ్వనేత పరమాత్మ యిట్లు చెప్పెను. "నా సాన్నిధ్యమాత్ర మున త్రిగుణాత్మిక యగు మాయ ప్రేరితయై అధ్యాసరూపమున జగత్తును నా యందు భాసింపజేయుచున్నది. దృశ్యమైన యీ మాయాధిష్ఠాన జగత్తు నాచే వ్యాపింపబడి యున్నది. శుక్తియందు రజతము భాసించునేగాని రజతమునందు శుక్తి భాసింపదు. అట్లే యీ జగత్తంతయు సర్వ చరాచర భూతములు కారణభూతుడనగు నా యందున్నవి. నేను వాటియందు లేను." గీత. 9-4.5.6. 10) అందుచేత చరాచరమగు నీ జగత్తంతయు ఇంద్రజాలమువలె మృషయే. (అధ్యాసోనామ స్మృతి రూపః పరత్ర పూర్వదృష్టావ భాసః). ప్రమాణదోష.... మనీషిభిః - సర్వదర్శన సార సంగ్రహము).

అవతారిక :

కర్మమీమాంసా ప్రకారము వ్యాఖ్యానించుచున్నారు.

హేతుఃకర్మైవలోకేసుఖ తదితర యోరేవ మజ్ఞోఽవిదిత్వా
మిత్రం వాశత్రురిత్థం వ్యవహరతి మృషాయాజ్ఞ వల్క్యార్తభాగౌ
యత్కర్మైవోచతుః ప్రాగ్జనక నృపగృహేచక్రతుస్తత్ప్రశంసాం
వంశోత్తంసోయదూనా మితివదతి నకోప్యత్రతిష్ఠత్యకర్మా॥ 83

కర్మలే సుఖదుఃఖ హేతువులు. స్వకృత కర్మఫలముగా సుఖదుఃఖానుభవమని తెలియక అజ్ఞులు సుఖదుఃఖ కారణములు మిత్ర శత్రువులని అసత్య వ్యవహారము చేయుదురు. మున్ను జనకమహారాజు సభ యందు యాజ్ఞవల్క్య ఆర్తభాగులన్న మహాత్ములు సుఖదుఃఖ హేతువు కర్మయే యని పెక్కు రీతుల కర్మప్రశంస చేసిరి. యాదవకుల తిలకుడైన శ్రీకృష్ణపరమాత్మయు 'సర్వ ప్రాణికోటి ప్రకృతిజన్య త్రిగుణములచేత, రాగద్వేషాదులచేత బద్ధులై అస్వాతంత్రులై కర్మలను చేయు చున్నారు. కావున నెవ్వడు నెప్పుడు గాని కర్మ చేయకుండ నుండజాలడు" అనెను. (గీ. 3-5) బృ-ఉ. 2-2-15 తౌహోత్క్రమ్య....పాపేనేతి."

అవతారిక :

కర్మలు ఈశ్వరప్రేరితములై ఫలము నిచ్చునని దృష్టాంతము.

వృక్షచ్ఛేదేకుఠారః ప్రభవతియదపి ప్రాణినోద్య స్తథాపి
ప్రాయోఽన్నంతృప్తి హేతు స్తదపినిగదితం కారణం భోక్తృయత్నః
ప్రాచీనం కర్మతద్వద్విషమ సమఫలప్రాప్తి హేతు స్తథాఽపి
స్వాతంత్ర్యం నశ్వరేఽస్మిన్నహిఖలు ఘటతేప్రేరకోఽస్యాంతరాత్మా॥84

వృక్షచ్ఛేదనమునకు గొడ్డలి సమర్థవంతమైనను ప్రాణియొక్క ఉద్యమము లేక పని చేయలేదు. అన్నము ఆకలితీర్చి తృప్తి నీయగలదుగాని తినువాని ప్రయత్నము లేక కడుపునకు పోదు. అట్లే పూర్వార్జిత కర్మలు విషమఫలమగు దుఃఖమును సమఫలమగు సుఖమును నీయగల్గినను జడములగుటచే స్వతంత్రముగా ఫలము నీయలేవు. సర్వకర్మ సాక్షి సర్వకర్మాధ్యక్షుడగు ఈశ్వరుని ప్రేరణవలన యీ కర్మలు తత్తత్ఫల ప్రాప్తిహేతువు లగుచున్నవి. (పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన'' - బృ. ఉ. 6-4-5). గీత 13-20. కార్యకారణ.... హేతురుచ్యతే.

అవతారిక :

క్షుద్రదేవతారాధనము కూడ బ్రహ్మార్పణమేనని.

స్మృత్యాలోకేషు వర్ణాశ్రమ విహితమదో నిత్యకామ్యాదికర్మ
సర్వం బ్రహ్మార్పణం స్యాదితినిగమగిరః సంగిరస్తేఽతి రమ్యామ్
యన్నాసానేత్ర జిహ్వాకరణ చరణ శిరః శ్రోత్ర సంతర్పణేన
తుష్యేదంగీవ సాక్షాత్తరు రివసకలో మూల సంతర్పణేన॥ 85

నాసానేత్ర జిహ్వాకరచరణ శిరః శ్రోత్రాది అవయవములను తృప్తిపరచినచో సాక్షాత్తు దేహమునకు తృప్తికల్గును. మూలమున జలాదులతో వృక్షమును సంతర్పితము చేసినచో వృక్షము సకలమునకు తృప్తియగును. అట్లే లోకప్రసిద్ధములై స్మృతివిహితములైన నిత్యకామ్యాదిరూప వర్ణాశ్రమ ధర్మములను సక్రమముగ చేసినచో నవియెల్ల బ్రహ్మార్పణమే యగును. అని నిత్యకామ్యాది కర్మలు స్మృతివిహితములు (నిషిద్ధ వ్యతిరేకమున పంచవిధములు) చేసినచో బ్రహ్మార్పణము లగునని శ్రుతివాక్కులు యుక్తి యుక్తముగ చెప్పినవి. ఫలాభిసంధానార్థముగ అన్యదేవతో

ద్దేశములైన కర్మలు కూడ బ్రహ్మార్పణమే. సకల దేవతాత్మకుడగు పరమేశ్వరునకే తృప్తి. (కర్మలు షడ్విధములు — [1]నిత్యములు, వీటి అకరణమువలన ప్రత్యవాయము (సంధ్యావందనాదులు) [2]కామ్యకర్మలు ఇష్టసాధనములు (జ్యోతిష్టోమాదులు), [3]నైమిత్తికములు (పుత్రజన్మాద్యనుబంధములు. ప్రాయశ్చిత్తాదులు)[4] ఉపాసనములు (శాండిల్య విద్యాదులు) ప్రతిషిద్ధములు, హింసాదులు. నిత్యముల వలన బుద్ధి శుద్ధి పరమప్రయోజనకరము. ఉపాసనవలన ఏకాగ్రత లబ్ధి - (వివిదిషంతి యజ్ఞే బృహ 6-4-22. 'తపసా కిల్బిషం హంతి' మనుస్మృతి. 12-104;

అవతారిక :

అనభిజ్ఞాని కర్మఫలమును చెప్పుచున్నాడు.

యఃప్రైత్యాత్మా నభిజ్ఞః శ్రుతి విదపితథా కర్మకృత్కర్మణోఽస్య
నాశఃస్యాదల్ప భోగాత్పునరవతరణే దుఃఖభోగో మహీయాన్
ఆత్మాభిజ్ఞస్యలిప్సోరపిభవతి మహాన్ శాశ్వతః సిద్ధిభోగో
హ్యాత్మాతస్మా దుపాస్యఖలు తదధిగమే సర్వా సౌఖ్యాన్యలిప్సోః॥ 86

వేదవేత్త వేదవిహిత సర్వకర్మానుష్ఠానపరుడైనను, ఆత్మస్వరూపము నెరుగనిచో మరణానంతరము అతని కర్మలకు స్వల్పభోగముతో నాశనము కలుగును. కర్మ భోగానంతర మతడు పొందు జన్మ కడు దుఃఖసంకులము. కాని ఆత్మ తత్త్వాభిజ్ఞుడైన కామానుష్ఠానము చేసినచో అతడు దేహము పతనమైన తరువాత శాశ్వత మహాసిద్ధి పొందును. అందరకు అందుచేత ఆత్మ ఉపాస్యుడు. నిష్కాముడైన ఆత్మవేత్తకు సర్వసౌఖ్యము అధికముగా కలుగును. (సిద్ధభోగో-అని పాఠాంతరము)

బృహ. 4-4-15 అథయోహవా....తత్త్వజనే''

అవతారిక :

సూర్య చంద్రాదులు స్వయంప్రకాశులు కారని చెప్పుతున్నారు.

సూర్యాద్యైరర్థభానం నహీభవతి పునః కేవలైర్నాత్ర చిత్రమ్
సూర్యాత్సూర్య ప్రతీతిర్న భవతి సహసానాపి చంద్రస్య చంద్రాత్
అగ్నేరగ్నేశ్చకింతు స్ఫురతి రవిముఖం చక్షుషశ్చిత్ప్రయుక్తా
దాత్మజ్యోతిస్తతోఽయం పురుష ఇహమహాదేవతానాంచ చిత్రమ్॥ 87

లోకమున సూర్యచంద్రాగ్నులు స్వయంప్రకాశములని ఘటాది విషయము లను ప్రకాశింపజేయుదురనియు ప్రతీతి కలదు. అవి స్వయంప్రకాశములు కావని తత్తదర్థములను ప్రకాశింపజేయలేవని చెప్పిన ఆశ్చర్యము లేదు. సూర్యుని ప్రతీతి సూర్యునివలననే ఆకస్మికముగా కలుగదు. అట్లే చంద్రుని ప్రతీతి, అగ్ని ప్రతీతియు వారివలన కాదు. ఈ మూడెటి ప్రతీతి స్వయంప్రకాశమానమగు ఆత్మజ్యోతి యొక్క ప్రేరణము గల చక్షురింద్రియ శక్తివలన కలుగుచున్నది. ఆత్మయే స్వయం జ్యోతి రూపుడు. చిత్రముగా ఇంద్రియ వ్యాపారమున (చక్షురాది) దేవతా మహత్తేజము రూపరసాదిక ప్రకాశము.

(చిత్రం దేవనాముదగాదనీకం....జగతస్తస్థుషశ్చ. సామ. ఆర 5-3)

అవతారిక :

ప్రాణాది కృత్యమును వివరించుచున్నారు.

ప్రాణేనాంభాంసి భూయః పిబతిపునరసావన్న మశ్నాతి తత్ర
తత్పాకం జాఠరోఽగ్నిస్త దుపహితబలో ద్రాక్ఛనైర్వాకరోతి
వ్యానః సర్వాంగ నాడీష్వ్యధనయతిరసం ప్రాణసంతర్పణార్థం
నిఃసారంపూతి గంధంత్యజతి బహిరయం దేహతోఽపానసంజ్ఞః॥ 88

తొలుత దేహి ప్రాణ వాయువువలన జలపాన అన్నభక్షణములను చేయును. అందువలన జఠరాగ్ని ఉపహితబలముతో జలాన్నములను శీఘ్రముగానో, నెమ్మదిగానో - పానముచేయును. పిమ్మట వ్యానవాయువు సకలేంద్రియ తృప్తికొరకు పరిపక్వాన్నోదక సారమును సర్వాంగనాడులకు పంచిపెట్టును. తరువాత అన్నోదకముల నిస్సార భాగపూతి గంధమును మూత్రవిష్ఠాది రూపమున అపానవాయువు దేహమునుండి వెలుపలకు త్రోయును.

అవతారిక :

ముఖ్యప్రాణ సాక్షిత్వాదులను లక్షించుచున్నారు.

వ్యాపారం దేహసంస్థః ప్రతివపురఖిలం పంచవృత్త్యాత్మకోఽసౌ
ప్రాణః సర్వేంద్రియాణా మధిపతిరనిశం సత్తయానిర్వివాదమ్
యస్యేత్థంచిద్ఘనస్య స్ఫుటమిహకురుతే సోఽస్మి సర్వస్యసాక్షీ
ప్రాణస్యప్రాణ ఏషోఽప్యఖిలితనుభృతాం చక్షుషశ్చక్షురేషః॥ 89

చిద్ఘనమైన ఏ ఆత్మయొక్క సత్తచేత. ప్రాణము సత్తావంతమై (ప్రాణాపాన వ్యానాది) పంచవృత్తి పరాయణమై, సకల శరీరములందుండి (వ్యష్టిశరీరముల ఉపాపక, సమష్టి శరీరాభిమాని హిరణ్యగర్భ శరీరమున ఉపాస్య రూపములు) సర్వేంద్రియాధిపతియై జీవభావముతో శరీర వ్యాపారముల నన్నిటిని విశ్రాంతిగా నిర్వహింప గలుగుచున్నదో - అట్టి సర్వనిర్వాహకుడను. సర్వప్రాణుల ప్రాణములకు ప్రాణమును చక్షువులకు చక్షువును, అఖిల శరీరములను నిలుపువాడను అగు సర్వవ్యాపక సర్వసాక్షి ఆత్మను నేను. (జ్ఞాన చక్షువును) బృ. ఉ. 6-4-18. ప్రాణస్య ప్రాణ మృత చక్షు శ్చక్షుః) తై -2. "కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనన్దోనస్యాత్."

అవతారిక :

పైన చెప్పిన విషయమునే మరియొక దృష్టాంతముచే దృఢీకరించుచున్నారు.

యంభాంతం చిద్ఘనైకంక్షితి జలపవనాదిత్య చంద్రాదయోయే
భాసాతస్యైవచాను ప్రవిరలగతయోభాంతి తస్మిన్ వసంతి
విద్యుత్పుంజోఽగ్నినంఘోఽప్యుడు గణవితతిర్భానయేత్క్రాంపరేశం
జ్యోతిః శాంతంహ్యనంతం కవిమజ మమరం శాశ్వతం జన్మశూన్యమ్॥

ప్రకాశించుచున్న అగ్నినిబట్టి దానియందున్న యినుపముక్క ప్రకాశించునట్లే. ప్రకాశించు ఆత్మజ్యోతినిబట్టి క్షితిజలవాయు సూర్యచంద్రాదులైన భూతగ్రహములు పరస్పర లక్షణ వృత్తులతో ప్రకాశించును, ఆ యాత్మ జ్యోతియందే వసించుచున్నవి. ఆత్మజ్యోతి యొక్కటే స్వయంప్రకాశము.

(భారూపః సత్యసంకల్పః - ఛాందో. 14-2)

సూర్యుడు మున్నగునవి ఆత్మజ్యోతిచే ప్రకాశ్యములు, అగ్నిచేత ప్రకాశింప జేయబడుచున్న ఇనుపముక్క అగ్నిని ప్రకాశింపచేయజాలని యట్లే పర ప్రకాశ్యములను విద్యుత్సమూహము, పంచాగ్నులు (గార్హపత్య ఆహవనీయ, దక్షిణ, సభ్య, అవసథ్య) నక్షత్రగణము - పరేశుడు, జ్యోతిరూపుడు, శాంతుడు, అనంతుడు. కవి, అజుడు, అమరుడు, శాశ్వతుడునగు ఆత్మ నెట్లు ప్రకాశింపజేయజాలుము?

(నతత్రసూర్యోభాతి॥ సర్వమిదంవిభాతి-ము-2. కఠ. 5-15)

అవతారిక :

భూతాత్మానుభవము జీవన్ముక్తి యని చెప్పుచున్నారు.

తద్బ్రహ్మైవాహ మస్మీత్యనుభవ ఉదితో యస్యకస్యాపిచేద్వై
పుంసః శ్రీ సద్గురూణామతులిత కరుణాపూర్ణ పీయూషదృష్ట్యా
జీవన్ముక్తః సఏవ భ్రమ విదురమనా నిర్గతేఽనాద్యుపాధౌ
నిత్యానందైకధామ ప్రవిశతి పరమం నష్టసందేహవృత్తిః॥ 91

శ్రీ సద్గురువు అతులిత కరుణాపూర్ణపీయూషదృష్టిచేత సెవరికైన తద్బ్రహ్మైవాహమస్మి అని అపరోక్ష ఆత్మజ్ఞానానుభవము కలిగి అతడు జీవన్ముక్తుడై నచో— ఆ యాత్మజ్ఞానముపలన అనాదియైన అవిద్య నశించి మోహాదులు దూరమై లౌకికులకు సహజములైన భ్రమలన్నియు నివర్తించి సందేహములు లుప్తమై సర్వదృశ్యము ఆత్మరూపముగ సాక్షాత్కరించును. చిత్తము అన్యవృత్తులు లేక బ్రహ్మాకారవృత్తి మాత్రమగును. అతడు అమనస్కుడై నిత్యానందైకమగు బ్రహ్మపదము నొందును.

"(భిద్యతేహృదయగ్రంథి....దృష్టేపరావరే-ముం 2-9) (అస్తిబ్రహ్మేతి ... చేద్వేదసంత మేనంతతోవిదుః "తై ఉ 2-6. దృశ్యతే....బుద్ధ్యా" కఠ. 3-12

అవతారిక :

జీవన్ముక్తుని స్వాత్మసుఖాను సంధానమును గురించి చెప్పుచున్నారు.

నోదేహోనేంద్రియాణిక్షరమతిచపలం నోమనో నైవబుద్ధిః
ప్రాణోనైవాహమస్మీత్యఖిల జడమిదం వస్తుజాతం కథంస్యామ్
నాహంకారోనదారా గృహసుత సుజనక్షేత్ర విత్తాదిదూరం
సాక్షీచిత్ప్రత్యగాత్మా నిఖిల జగదధిష్ఠానభూతః శివోఽహమ్॥ 92

క్షరము జడము దృశ్యమగు దేహము నేను కాను. భిన్నవ్యాపారగతులై పరప్రకాశ్యములైన ఇంద్రియములు కాను. క్షరము అతి చపలమైన మనస్సునుగాను, బుద్ధియు కాను. ఆత్మజ్యోతిప్రేరితమై పంచవృత్తిపరాయణమగు ప్రాణమును కాను, జడమైన నిఖిలవస్తుజాతమును కాను. అహంకారమును కాను, భార్యాగృహ సుత, మిత్ర బంధుజన క్షేత్రధనాదులు నాకు అతిదూరము. అఖిలసాక్షి చిన్మయుడు, సర్వ జగదధిష్ఠానభూతుడు, ప్రత్యగాత్మ స్వరూపుడు, శివుడునగు బ్రహ్మమే నేను.

(భగవత్పాదుల వారి దశశ్లోకీ చూచునది)

అవతారిక :

ప్రకారాంతరముగా మరల నదియే చెప్పుచున్నారు.

దృశ్యం యద్రూపమేతద్భవతిచ విశదం నీలపీతాద్యనేకం
సర్వస్యైతస్య దృగ్వైస్ఫురదనుభవతేలోచనంచైక రూపమ్
తద్దృశ్యం మానసందృక్ పరిణత విషయాకార ధీవృత్తయోఽపి
దృశ్యా దృగ్రూప ఏవ ప్రభురిహన తథా దృశ్యతేనైవసాక్షీ॥ 93

నీలపీతాది అనేక వర్ణములతో కూడు నీ జగత్తంతయు దృశ్యమగును. ఈ దృశ్య జగత్తుయొక్క సత్తాస్ఫూర్తి అనుభవముల నొక్క నేత్రము వలనమాత్రమే కలుగుచుండునుగాన దృశ్య జగత్తునకు దృక్కు నేత్రమే. మరల నేత్రము మనస్సుచే చూడబడునుగాన నేత్రము దృశ్యము మనస్సు దృక్కు. నిశ్చయాత్మక బుద్ధికి మరల మనస్సు దృశ్యము. బహు విషయాకారములైన బుద్ధివృత్తుల సాక్షియగు ఆత్మకు దృశ్యములు. సర్వసాక్షి సర్వప్రకాశకుడగు ఆత్మయే దృగ్రూపుడు. ఇతడు దేనిచేతను చూడబడడు. సతతము దృగ్రూపుడే - అనుభవ విషయముకాదు.

('న దృష్టే ద్రష్టారం....అన్యదార్తమ్' బృ.ఉ. 3-4-2)

అవతారిక :

స్వాత్మానుసంధానము చెప్పుచున్నారు.

రజ్జ్వజ్ఞానాద్భుజంగస్తదుపరిసహసాభాతి మన్దాంధకారే
స్వాత్మాజ్ఞానాత్తథాఽసౌభృశమసుఖమభూదాత్మనో జీవభావః
ఆప్తోక్త్యాఽహి భ్రమాంతే(ది)నచఖలు విదితా రజ్జురేకా తథాఽహం
కూటస్థోనైవ జీవో నిజగురువచసా సాక్షిభూతః శివోహమ్॥ 94

త్రాడని తెలియకపోవుటచే మసకచీకటిలో త్రాడునందు పాము భాసించినట్లు ఆత్మజ్ఞానము లేకపోవుటచేత విషయ సుఖ కర్తృత్వభోక్తృత్వరూపమగు జీవ భావము ఆత్మయందు భాసించును. ఆప్తవచనము వలన పాము అన్న భ్రాంతి పోయి రజ్జువుయొక్క యథార్థజ్ఞానము లభించును. అట్లే ఆప్తుడైన స్వగురువు బోధచే లభించు జ్ఞానము వలన అవిద్య నశించి కర్తృత్వ భోక్తృత్వములున్న

జీవుడను నేను కానని, నేను సర్వసాక్షిభూతుడనైన శివుడను అను యథార్థ జ్ఞానము కలుగును.

అవతారిక :

గురుశిష్య సంవాదరూపమున జ్యోతిర్బ్రాహ్మణ విద్యలతో సంధానము చెప్పుచున్నాము.

కింజ్యోతిస్తే వదస్వాహని రవిరిహమే చంద్రదీపాది రాత్రౌ
స్యాదేవం భానుదీపాదిక పరికలనేకింతవజ్యోతిరస్తి
చక్షుస్తన్మీలనేకింభవతి చసుతరాం ధీర్ధియః కింప్రకాశే
తత్రైవాహం తతస్త్వం తదసి పరమకం జ్యోతిరస్మి ప్రభోఽహమ్॥ 95

దివారాత్రములందు నిఖిల ప్రపంచము నీకు కన్పించునట్లు చేయునదేది? పగలు సూర్యుడు, రాత్రి చంద్రదీపాదులు. ఆ సూర్యచంద్రాదులను గన్పింపజేయున దేది? కన్ను. ఆ కన్ను మూసినపుడు వివిధ వస్తువులు దర్శింపజేయునదేది? బుద్ధి. ఆ బుద్ధిని ప్రకాశింపజేయు జ్యోతి ఏది? ఆత్మజ్యోతినైన నేనే. అట్లయిన సర్వ ప్రకాశ సమర్థమగు ఆ పరంజ్యోతివి నీవే కదా! ఓ ప్రభూ! తమ యనుగ్రహము చేత నా పరంజ్యోతిని నేనే.

(బృ.ఉ. 'ఆత్మైవాస్యజ్యోతి' 6-3-6)

(బృహదారణ్యకజ్యోతిర్బ్రాహ్మణ విద్య శ్రీభగవత్పాదులు "కింజ్యోతిస్తవ" అను ఏక శ్లోకి.)

అవతారిక :

జీవన్ముక్తుని వ్యవహారము.

కంచిత్కాలం స్థితః కౌపునరిహభజతేనైవ దేహాది సంఘం
యావత్ప్రారబ్ధభోగం కథమపిససుఖం చేష్టతేఽసంగబుద్ధ్యా
నిర్ద్వంద్వో నిత్యశుద్ధో విగలిత మమతాహంకృతిర్నిత్యతృప్తో
బ్రహ్మానందస్వరూపః స్థిరమతి రచలోనిర్గతాశేషమోహః॥ 96

జీవన్ముక్తుడైన బ్రహ్మవేత్త యథాధికారివ్యక్త పరిచ్ఛేదక కాలపర్యంతము తన కీజన్మ కారణమైన ప్రారబ్ధకర్మ క్షయమువరకు జీవయాత్ర సాగించుచు

ప్రవృత్తిపై నుండును. కాని జ్ఞాని కాబట్టి దేహేంద్రియాదులు వర్తించుచున్నప్పటికి వాటికి వశుడు గాకుండ ఆసంగబుద్ధితో చరించుచు నిత్యసుఖానుభవముతో నిత్య శుద్ధుడైన బ్రహ్మస్వరూపప్రతిష్ఠితుడై. ద్వంద్వాతీతుడై (శీతోష్ణాది, సుఖదుఃఖాది) నిత్యతృప్తుడై మమతాహంకారములు లేనివాడై స్థిరమతియై (చిత్తవృత్తులన్నియు శాంతి పొందగా) బ్రహ్మానందస్వరూపమున నిశ్చలుడై వశించిన మోహాదులతో నుండును. (జీవన్ముక్తుడు దేహధారి అయినప్పటికి బ్రహ్మానందస్వరూపుడై విల సిల్లును.

('తస్య....సంపత్స్యే' ఛాందో 6-14-2)

అవతారిక :

జ్ఞాని చేష్టలు సంసారజనకత్వాభావమని చెప్పుచున్నారు.

జీవాత్మ బ్రహ్మభేదం దలయతి సహసాయత్ ప్రకాశైకరూపం
విజ్ఞానంతచ్చబుద్ధౌ సముదిత మతులం యస్యపుంసః పవిత్రమ్
మాయాతేనైవ తస్యక్షయముపగమితా సంసృతేః కారణం యా
నష్టాసాకార్య కర్త్రీపునరపి భవితానైవ విజ్ఞానమాత్రాత్॥ 97

ప్రకాశైకరూపము పవిత్రము, అతులము నగు విజ్ఞానము బుద్ధియందుద ముదితమైనంతనే జీవాత్మ బ్రహ్మభేదమును పోగొట్టును. ఆ విజ్ఞానోదయమైనంతనే మాయయొక్క శక్తి (అఘటనఘటనాసామర్థ్యము కలది), సకల సంసారహేతువై వది క్షయము పొందును. ఆ విజ్ఞానప్రభావమువలన మాయ తిరిగి పొడచూపదు. కాబట్టి జ్ఞానికి మరల పునరావృత్తి లేదు.

('న స పునరావర్తతే'—ఛాందోగ్యము 8-15-1)

అవతారిక:

జ్ఞానికి సంసృతివి గురించి చెప్పుచున్నారు.

విశ్వం నేతి ప్రయాణాద్విగలిత జగదాకార భానస్త్యజేద్వై
పీత్వాయద్వత్ఫలాంభస్త్య జతిచ సుతరాం తత్ఫలం సారభాఘ్యమ్
సమ్యక్సచ్చిత్ ఘనైకామృత సుఖకబలాస్వాదపూర్ణోహ్యదాఽసౌ
జ్ఞాత్వానిః సారమేవం జగదఖిలమిదం స్వప్రభః శాంతచిత్తః॥ 98

పండ్లను తినువాడా ఫలములందున్న సారమును తిని మిగిలిన త్వగ్బీజాదు లెంత సౌరభమిశితములైనను నిస్సారములని అవతల పారవేయును. అదేవిధముగా వివేకవంతుడైనవాడు 'నేతి-నేతి' అను శ్రుతివాక్యములచే జగత్తు సత్యముకాదనియు మిథ్యాకల్పితమనియు గ్రహించి జగదాకార వృత్త్యనుభవమును వదలి జగదధిష్ఠాన మును తత్సారభూతమునగు పరిపూర్ణ విజ్ఞాన ఘనామృతరసమును త్రావి తృప్తితో — అంతకంటె భిన్నము, మిథ్యయు నగు నీ జగత్తు నిస్సారమని హేయమని గ్రహించి దానియందు ఉదాసీనుడై శాంతచిత్తుడై భర్జితబీజత్వేనోపరతచిత్తమున నుండును.

అవతారిక :

'భిద్యతే హృదయగ్రంథి' అను శ్రుతివాక్యానుసంధానముగా జ్ఞాని అహం కారాదులను సమన్వయింపుచున్నారు.

> క్షీయంతేచాస్య కర్మాణ్యపి ఖలు హృదయగ్రంథి రుద్భిద్యతేవై
> ఛిద్యంతే సంశయాయే జనిమృతి ఫలదాదృష్టమాత్రపరేశే
> తస్మింశ్చిన్మాత్రరూపే గుణమల రహితేతత్త్వమస్యాది లక్ష్యే
> కూటస్థే ప్రత్యగాత్మన్యఖిల విధిమనోఽగోచరే బ్రహ్మణీశే॥ 99

సర్వవేదాంతవాక్యోక్త లక్షణలక్షితుడును, చేత్యరహిత చిన్మాత్రరూపుడును, రాగద్వేషాది గుణముల రహితుడును తత్త్వమస్యాదిమహావాక్యములకు లక్ష్యభూతు డును, అఖిల విధివాక్యములకు మనస్సునకు అగోచరుడును, నిర్వికారుడును, బ్రహ్మాదులకు మాయకు నియామకుడును ప్రత్యగాత్మయు నగు బ్రహ్మయొక్క అప రోక్ష సాక్షాత్కారము కలిగినప్పుడు సంచితప్రారబ్ధక్రియమాణాఖ్యములైన కర్మ ములు క్షయించును. హృదయగ్రంథి (అంతఃకరణ చిదాత్మనోరైక్యప్రతీతి) శిథిల మగును. సకల సంశయములు నశించును. (ఈ సంశయములు జనన మరణ ఫలదములు)

> "భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః
> క్షీయంతేచాస్య కర్మాణి తస్మిన్ దృష్టేపరావరే" ము. 2-9

> "స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః" ఛాం. 7-26-2.

> "యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున
> జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా" [భగవద్గీత 4-37]

అవతారిక :

జ్ఞాన లాభముకై ఈశ్వర ప్రార్థన మావశ్యకమని చెప్పుచున్నారు.

ఆదౌమధ్యే తథాంతే జనిమృత ఫలదం కర్మమూలం విశాలం
జ్ఞాత్వా సంసారవృక్షం భ్రమమద ముదితా శోకతానేక పత్రమ్
కామక్రోధాదిశాఖం సుతపశువనితా కన్యకాపక్షి సంఘం
ఛిత్వాఽసంగాసినైనం పటుమతి రభితశ్చింతయేద్వాసుదేవమ్॥ 100

ఆదియందు, అంతమునందు ప్రతీతికాలమునందు (మధ్య) జననమరణ రూప ఫలప్రసవముల నిచ్చునట్టి సంసార మొక విశాలమైన మహావృక్షము వంటిది. దానికి కర్మమూలము వంటిది. భ్రమ (విపరీత జ్ఞానము) మద (స్వశ్రేష్ఠ జ్ఞానం) ముదితా (హర్షవృత్తి) శోక (ఖేదవృత్తి) యీ వృక్షమునకు పత్రములు. (ఇవి అనేకములు) కామ (ప్రియవిషయ ఇచ్ఛ) క్రోధ (తత్ప్రతి బంధకమున రోషవృత్తి) లోభాదులు యీ వృక్షమునకు కొమ్మలు. సుత పశు (సంపద) వనితా (స్త్రీలు) కన్యకా (కుమార్తెలు)దులు ఆ వృక్షము నాశ్రయించిన పక్షి సంఘము. కుశలమతి యైన వాడు (వివేకి) యీ సంసారవృక్షమును అసంగమను గొడ్డలితో ఛేదించి, ప్రాణేంద్రియముల ప్రకాశక దైవమగు వాసుదేవుని వాసనా నివృత్తి స్వస్వరూప ముగ నెరిగి సంతతముతో చింతన చేయవలెను.

("ఊర్ధ్వమూలోఽవాక్శాఖః....సనాతన" కఠ. 2-3-1)

(ఊర్ధ్వమూల మధశ్శాఖామశ్వత్థం ప్రాహురవ్యయమ్. భ.గీ. 15-1-4)

అవతారిక :

జీవబ్రహ్మైక్యతను చెప్పుచున్నారు.

జాతం మయ్యేవ సర్వం పునరపిమయి తత్సం స్థితం చైవ విశ్వం
సర్వం మయ్యేవయాతి ప్రవిలయమతి తద్బ్రహ్మ చైవాహమస్మి
యస్యస్మృత్యాచయజ్ఞాద్యఖిల శుభవిధౌసు ప్రయాతీహకార్యం
న్యూనం సంపూర్ణతాం వైతమహమతి ముదైవాచ్యుతం సంనతోఽస్మి॥

సమస్తమైన ద్వైతజాతమునకు నేనే (బ్రహ్మాభిన్నరూపస్థాత్మ సహిత జ్ఞానబ్రహ్మాత్మ) కారణము. అన్యమేదియు ఆధారము లేనేలేదు. ఉత్పత్తి అనంతరము ఆ సమస్త జగత్తు నా యందే (శబల బ్రహ్మాత్మ) సంస్థితము.

ఆ సమస్త జగత్తు నిద్రాప్రళయ సమయమున (సబీజముగా) నాయందే తిరోధానమును పొందును. ('యతోవా ఇమాని భూతాని జాయంతే' తై. ఉ. 3-1) అట్టి విశ్వోత్పత్తి విపత్తి సంస్థితి ఆధార నిర్దిష్టమైన బ్రహ్మను దేశకాలవస్తుకృత పరిచ్ఛేద రహితమగు వస్తువును అహంపదలక్షితమునగు కూటస్థప్రత్యగాత్మను నేనే. మరియు నెట్టి బ్రహ్మాభిన్న ప్రత్యగాత్మ స్మరణమాత్రముచేత, అశ్వమేధ, వాజపేయాది సమస్త శుభకర్మములు, (మంత్రతంత్రాది లోపము ఉన్నప్పటికీ) సంపూర్ణముగా సమాప్త ఫలప్రదములగుచున్నవో అట్టి యజ్ఞాది ఫలదాతను కేవలము బ్రహ్మాభిన్న ప్రత్యగాత్మను అచ్యుత స్వభావుని అష్టాంగభూత అష్టప్రకృతి సహితునియందు లీనమగుచున్నాను.

శ్రీ శంకర భగవత్పూజ్యపాద విరచిత శతశ్లోకి

సమాప్తము.



# దశశ్లోకి

భూమిక:

దీనికి నిర్వాణ దశకమనియు మరియొక పేరు ప్రసిద్ధముగా నున్నది. దీనికి విశ్వేశ్వర సరస్వతి శిష్యుడగు మధుసూదన సరస్వతి రచించిన 'సిద్ధాంతబిందువు' అను విపుల టీక ఉపలబ్ధమగుచున్నది. దానిపైన పరమానంద సరస్వతి శిష్యు డగు బ్రహ్మానంద సరస్వతి (గౌడ) విరచిత మగు విస్తృత టీక కూడ నున్నది.

శ్రీ శంకర భగవత్పాదులు ఉపనిషత్సిద్ధాంతమైన అద్వైతమును సామాన్యులకు అవగాహన అగుటకుగాను వేయి శ్లోకములలో, అయిదువందల శ్లోకములలో నూరు శ్లోకములలో చెప్పినట్లే—ఈ పది శ్లోకములందును సంగ్రహించిరి. ఆత్మ యొక్క నిత్యశుద్ధ బుద్ధముక్త స్వభావమును సంక్షేపముగా సామాన్యులకు బోధించుటకే దశశ్లోకి భగవత్పాదులు రచించిరి.

అనాత్మయైనదానిని (ఇదంత) ఆత్మగా భావించి సామాన్యులు దుఃఖానుభవమును పొందుచున్నారు. అట్టివారికి జ్ఞాతజ్ఞాపకత్వము వలన నిష్ప్రయోజన మగునని ఆత్మతత్త్వ ప్రతిపాదనము వ్యర్థము కావచ్చు నన్నదొక శంక.

అయితే దేహాత్మవాదులవంటి ఇదంకారాస్పదులు కూడ భిద్యాన్వయత్వముతో దేహేంద్రియ మానసముల ప్రతిభాసత్వమును కలిగినవారే. అహంకారాస్పదత్వము వలన అవివేకము వలన శుద్ధమైన ఆత్మయందు దుఃఖిత్వాద్యభిమానము కలిగినవారు. వారును శాస్త్రీయమైన బ్రహ్మాత్మైక్య జ్ఞానముతో దుఃఖాదులను నివృత్తి చేసుకొన గలరు. కాబట్టి వారికొరకై ఆత్మతత్త్వ ప్రతిపాదనము చేసినచో వ్యర్థమని భావించ నక్కరలేదు.

ఆత్మతత్త్వమునకు 'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' మొదలగు వేదాంత మహావాక్యములే ప్రమాణకము.

సామాన్యముగా అహం ప్రత్యయసిద్ధి చిదాత్మయందు - అహం ప్రత్యయ ఆలంబన విశేష నిర్ణయముగా భగవత్పాదులవా రీ శ్లోకములందు తత్త్వబోధ చేసిరి.

నభూమిర్నతోయం నతేజో న వాయుః
నఖం నేంద్రియం వా న తేషాం సమూహః।
అనైకాంతి కత్వాత్ సుషుప్త్యైకసిద్ధః
తదేకోఽవ శిష్టః శివఃకేవలోఽహమ్॥ 1

తాత్పర్యము :

నేను పృథ్వీభూతమును కాదు. జలభూతమును కాను. వాయుభూతమును కాను. ఆకాశమును కాను. ఇంద్రియమును కాను. ఇంద్రియముల సమూహమును కాదు. (అవి అనైకాంతికములన్న దోషము కలవి కావున). సుషుప్తికి నేను ఏక మాత్ర సాక్షిగా సిద్ధుడ నగుచున్నాను. నేను అద్వితీయుడను. అవశిష్టుడను. నేను కేవల శివరూపుడను.

వ్యాఖ్యానము :

అహం - నేను - అహంప్రత్యయాలంబనమును. ఏకః - అద్వితీయుడను. అవశిష్టుడను. సర్వద్వైత బాధలచేత అబాధితుడను. శివః - పరమానందబోధ రూపుడను. (మంగళస్వరూపు డగుటవలన) కేవలః - నిర్ధర్మకుడను. అద్వితీయుడ ననగా సర్వప్రమాణా బాధ్యుడనని. పరమానంధ బోధ - అహం ప్రత్యయ ఆలంబనమని - (ఇది ఔపనిషత్పక్షమే) శ్రేయో నిదానమని.

ఇందు ఉపనిషదేతరవాదముల నిరాకరణ మున్నది. తొలుత దేహాత్మవాద నిరాకరణము. (న భూమిర్నతోయం న తేజో న వాయుర్నఖమితి' - ఇచ్చట అన్నిటి యందు అహమని సంభావించుటను చెప్పి - దానిని నిరాకరించుట యున్నది. భూమి (భూతము) నేను కాను. పరంపర తాదాత్మ్య అభావము ద్రష్టవ్యము. ప్రతిపక్షుల పూర్వపక్ష వాదమునందు భూతాదులు ఆత్మయను వాదమునందు ఆ వాదము నిరాకరింపబడినను, ఇంద్రియముల సంఘము - సమష్టి ఆత్మయన్న భావమున్నది. అవయవములు ఆ వాదమునందు పంచ మత అభ్యుపగమ ప్రసంగమున, సంయోగాది సంబంధము వలన 'ఆత్మవస్తువు సంభవించుట కుదురదు. గనుక ఇంద్రియ సమష్టి వాదము చెల్లదు. ప్రత్యేక భూతవాద నిరాకరణమువలన భౌతిక దేహాత్మవాదము తిరస్కరింపబడినది.

భూత చతుష్టయ తత్త్వవాదుల మతమునందు అపరోక్షా అభావత్వముచే ఆకాశమునకు దేహానుపాదానత్వము అయినను వారి సిద్ధాంతమున భావత్వ దేహోపాదనత్వాదులు అంగీకారమే. ఆత్మప్రసక్తి సందర్భమున అది నిరాకృతము. అగ్ని వాయువు అంతముగా దేహాత్మవాదము నిరాకరింపబడినది. ఆకాశము ఆత్మ కాదని చెప్పుటలో (ఖ—శబ్దమువలన) శూన్యవాచకత్వమువలన అదియు నిరాకరింపబడినది. ఇంద్రియములు కాదు (నేంద్రియమ్) అనుటలో ఇంద్రియములు ఆత్మయనుట తిరస్కరింపబడినది. ప్రత్యేకము ఇంద్రియముల సమూహము దేహోపయుక్త ఆరోపమున (మిళితము లైన భూతములు పరిణమించిన ఇంద్రియములు) ఆత్మ యన్న వాదము కూడ నిరాసమైనది. ముందుగా భూతము లొక్కొక్కటి నిరాకరింపబడి మరల సమష్టిగా నిరాకరింపబడినవి.

భూతముల నిరాకరణమువలన భౌతికవాదుల ప్రాణమనోవాదములున్ను నిరాకృతములు. మనోనిరాకరణము వలన మనోవృత్తి క్షణికవిజ్ఞానము (దేహాతిరిక్తమగు కర్తృత్వభోక్తృత్వాది విశిష్టము) నిరాకృతము.

సిద్ధాంతము నందు జ్ఞానేచ్ఛాసుఖాదులు అంతఃకరణాశ్రయములే. కామ సంకల్పాది ప్రకృతులు 'మన ఏవ' అని శ్రుతివలన అంతఃకరణాశ్రయములే అగుచున్నవి. దేహము మొదలు కేవల భోక్తృపర్యంతము అన్నిటి యొక్క అనాత్మకత్వము స్పష్టము. హేతువు అనైకాంతికత్వము. వ్యభిచారిత్వము వినాశ శీలము.

ఆత్మ దేశకాల అపరిచ్ఛిన్నము. ఘటాది అనాత్మ వస్తువులు పరిచ్ఛిన్నములు. ధ్వంసప్రాగ భావములు. అనాత్మ జడములు. స్వభిన్నములు. ఆత్మత్వ అభావములు. ఆత్మ ఏకము. అద్వితీయము అయినప్పటికి సుఖదుఃఖాదులకు ఆశ్రయమైన అంతఃకరణలు భిన్న భిన్నములని వ్యవస్థోపపత్తి. దేహేంద్రియములు ఆత్మ కావని చెప్పుటకు భావ, అభావ ప్రతియోగిత్వము లున్నవి. ఆత్మ స్వప్రకాశ బోధరూపమైనది - అయితే అద్వైతమునందు కూడ అనాది అనిర్వచనీయ అవిద్యాకల్పన. (ఇది సిద్ధాంత రహస్యము).

ఆత్మ-బోధ రూపమనినప్పుడు సుషుప్తియందు బోధ అభావము కదా! "నాకు సుఖనిద్ర పట్టినది. గాఢమైన నిద్రలో నాకేమియు తెలియలేదు" అని నిద్ర నుండి మేలుకొనిన తరువాత చెప్పుచున్నారు కదా! కావున దీనియందు అవ్యభిచారిత ఎట్లున్నది? అన్న శంకను నిర్మూలించుటకు సమాధానము చెప్పబడినది. "సుషుప్త్యేక సిద్ధః" అని ఆత్మ సుషుప్తికాలమున సాక్షిగా నున్నదనుటకు అభ్యంతరము లేదు.

ఏమియు తెలియక మూఢునివలె నిద్రించితి ననుటలో కూడ భావాభావసాక్షిత్వ మున్నది. కనుక కాలత్రయమువందున అవ్యభిచారము.

ఆత్మయొక్క సాక్షిత్వమును, బింబప్రతిబింబ, ఆభాస, అవచ్ఛిన్న వాదము లందును నిరూపింపవచ్చును. అయితే విస్తరముగా వ్రాయవలసి యుండుటచేత - అతి గాఢమైన విషయమగుటచేత - సామాన్యులు గ్రహించుటకు సాధ్యము కాక పోవుటచేత ఆ వివరములు విస్తరించుటలేదు.

నవర్ణా నవర్ణాశ్రమాచార ధర్మాః
నమేధారణాధ్యాన యోగా దయోఽపి।
అనాత్మా శ్రయాహమ్మమా ధ్యాసహానాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ 2

తాత్పర్యము :

బ్రాహ్మణాది వర్ణములు నాకు లేవు, వర్ణములకు సంబంధించినవిగాని. బ్రహ్మ చర్యాది ఆశ్రమములకు సంబంధించినవి గాని ఆచారములు (స్నానశౌచాదులు) ధర్మ ములు (బ్రహ్మచర్య గురుసేవాదులు) నాకు లేవు. ధ్యానధారణాది యోగములు నాకు లేవు. ఆత్మతత్త్వమునకు విరుద్ధమైన అవిద్యకు ఆశ్రయమగుచున్న నా అధ్యాస—జ్ఞానము వలన తిరోధానము పొందుటచేత నేను అద్వితీయుడు, అవశిష్టుడు, అగు కేవల శివుడను నేనే.

వ్యాఖ్యానము :

వర్ణాశ్రమాచార ధర్మమన్నప్పుడు దంద్వద్వయ గర్భ తత్పురుష సమాసము వలన వర్ణముల ఆచారములు ధర్మములును, ఆశ్రమముల ఆచారములు. ధర్మములు భావించుకొనవలెను.

ధారణా—బాహ్య విషయ త్యాగమువలన మానసస్థైర్యము. ధ్యానము—పర మాత్మ చింతనము. యోగము—చిత్తవృత్తి నిరోధకము. ఆదిశబ్దమువలన శ్రవణ మననాదులు గ్రహింపబడినవి. ఈ అన్నియు జ్ఞానోత్తర కాలమున అసత్యములు కాబట్టి - ఆత్మ యివి కాదవి. అనాత్మాశ్రయాహం మమాధ్యాసహానాత్ - అనాత్మ ఆత్మ విరోధి - అవిద్య. దానికి ఉపాదాన కారణమగుటచే ఆశ్రయమైనట్లు చెప్పుట. అహంకార మమకారాదులకు మూలమైనను తత్త్వజ్ఞానమువలన నివి హరింపబడు

చున్నవి. అందుచేత తత్ప్రయుక్త వర్ణాశ్రమాది వ్యవహారము అంతయు తిరోగమించును.

న మాతాపితా వానదేవా న లోకాః
న వేదా నయజ్ఞా నతీర్థె బ్రువంతి।
సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ 3

తాత్పర్యము :

'నిద్రవేళ నాకు తల్లిలేదు. తండ్రి లేదు. దేవతలు లేరు. లోకములు లేవు. వేదము లేదు, యజ్ఞము లేదు. తీర్థములు లేవు'—అని శ్రుతివాక్యములు తెలుపుచున్నవి. సుషుప్తి కాలమున అతిశూన్యాత్మకత్వము నిరాకరింపబడుటచేత నేను అద్వితీయుడను. అవశిష్టుడను. కేవల శివస్వరూపుడను.

వ్యాఖ్యానము :

మాతా — జనకస్త్రీ - పితా జనకుడు; దేవా — ఆరాధ్యులైన ఇంద్రాది దేవతలు. లోకము అనగా దేవతా ఆరాధన ఫలము లైన స్వర్గాది లోకములు.

వేదా: — అలౌకిక హితాహిత సాధనా ప్రతిపాదకములును బ్రహ్మ ప్రతిపాదకములును - ప్రమాణ వాక్యచయము.

యజ్ఞా: — స్వర్గాది సాధనీభూత జ్యోతిష్టోమాదులు; తీర్థాః - యజ్ఞసాధనీభూతములు (కురుక్షేత్రాదిదేశములు). (ఇవి చెప్పుటచే పాపకర్మ సాధనాభూతము లైనవాటిని కూడ ఉపలక్షణముచేత చెప్పినట్లగును.)

ఈ అన్నియు దేహాభిమాన మూలకములు. అవి లేనపుడు (అభావ) స్వతస్సంబంధ అభావమువలన అవిద్యామానములని భావము.

సుషుప్తి ప్రకృతిని గురించి శ్రుతిపాఠ మిట్లు చెప్పినది.

"అత్రపితా అపితా భవతి మాతా అమాతా దేవా అదేవా వేదా అవేదా యజ్ఞా అయజ్ఞాస్తేనో అస్తేనో భవతి. భ్రూణహాఽభ్రూణహా చండాలో అచండాలః పౌల్కసో అపౌల్కసోసః శ్రమణో అశ్రమణః తాపసో అతాపసోఽనన్వాగతం పుణ్యేన అనన్వాగతం పాపేన తీర్ణో హితదా సర్వాన్ శోకాన్ హృదయస్య భవతి."

ఇట్లు అభిమాన అభావమున సర్వానర్థముల నివృత్తి.

సర్వవ్యవహారము అభావమే కనుక శూన్యతయే. కావున అతిశూన్యకత్వము నిరాకరింపబడుచున్నది. 'నిరస్తాతి శూన్యకత్వాత్' (ఇతి) ఇచ్చట భావప్రధాన నిర్దేశము.

సుషుప్తిసాధకత్వమున పునరుత్థాన మున్నందువలన

"అవి నాశీ వా అరే అయమాత్మా అనుచ్ఛిత్తి ధర్మా" "మాత్రా సంసర్గ స్త్వస్య భవతి" "యద్వైతన్న పశ్యతి పశ్యన్వై తన్నపశ్యతి। న హి ద్రష్టుర్దృష్టే ర్విపరి లోపో విద్యతే అవినాశిత్వాత్ న తు తద్ద్వితీయ మస్తి తతోఽన్య ద్విభక్తం యత్పశ్యేత్"—ఇత్యాది శ్రుతిపాఠములు ఆత్మచైతన్యమునకు సుషుప్తి కాలమున శూన్యత చెప్పుటలేదు. స్థూణానిఖనన న్యాయమువలన కూడ అతి శూన్యకత్వము నిరాకరింపబడుచున్నది.

లేక

అతీతం అద్వితీయం యద్బ్రహ్మ తదాత్మకత్వమువలన కూడ నిరాకృతమే.

"యదా వై పురుషః స్వపితి నామ సతాసోమ్య తదా సంపన్నో భవతి" "తద్యథా ప్రియయాస్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేదనాంతరే" అని శ్రుతి.

కావున జగత్కారణీభూత సర్వజ్ఞ సర్వశక్తి పరిపూర్ణ ఆనందబోధ రూపమున బ్రహ్మ సహ ఏకత్వమువలన అసంసారియైన జీవుడని సిద్ధము.

ఇంతవరకు చెప్పిన మూడు శ్లోకములందును పూర్వపక్షవాది విప్రతిపత్తి నిరాకరణ పూర్వకముగా 'త్వం' (తత్త్వం అసి) పదార్థము నిర్ధారింపబడినది. 'తత్' పదార్థ నిర్ధారణీయము. అది ఉపనిషత్పక్షమున పరిశేషముగా నిర్ణయించుచున్నారు.

న సాంఖ్యం న శైవం న తత్ పాంచరాత్రం
న జైనం న మీమాంసకా దేర్మతం వా।
విశిష్టాను భూత్యా విశుద్ధాత్మకత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ 4

తాత్పర్యము :

సాంఖ్యము, శైవము, పాంచరాత్రము, జైనము, మీమాంస మొదలగు మతములు బ్రహ్మమును ప్రతిపాదింపకుండుట వలన (తత్త్వమసి అను మహావాక్యగత

తత్ పదార్థమును) అవి సహేతుకములు కావు. విరుద్ధాత్మకత్వహేతు విశిష్టమగుట వలన - నేను అద్వితీయుడను. అవశిష్టుడను. కేవలము శివుడను.

వ్యాఖ్యానము:

అపి శబ్దము వలన చెప్పబడినది కొంత యున్నది.

అచేతనము జగదుపాదాన కారణము కాదు. "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అని ఈక్షణపూర్వకముగా సృష్టిని శ్రుతులు చెప్పినవి. 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' అని జీవాత్మత్వవ్యపదేశము. 'యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" అని ఏకవిజ్ఞానికి సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ వలన, 'ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి' అని అభేదమును స్పష్ట స్పష్టముగా శ్రుతి ఉపదేశించుట వలన, 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశసం భూతః' అనియు శ్రుతి పలుకుట వలనను - అచేతనము జగత్కారణముగా విచిత్ర రచనా సమర్థమనుట చెల్లదు కావున ప్రధాన మహావాదులు అప్రమాణికము లగుటవలన సాంఖ్యమతము సాధువు కాదు.

(సాంఖ్యమతమున జీవబ్రహ్మల ఐక్యత చెప్పబడుటలేదు. ఆ మతమువారు 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్' మొదలగు శ్రుతి వాక్యములందు ప్రతిపాదింపబడిన జగత్కారణము ప్రధానము అచేతనమని సాంఖ్యుల మతము).

పాశుపతం పాంచరాత్రికం జైనం మొదలగు మతములు శ్రుతివాక్యబాధితము లగుట వలన అయుక్తములు.

(పాశుపత మతమున జగత్కారణము చైతన్యమైనప్పటికి, అది జీవునకు భిన్నమైనది. అది ఉపాస్యమని పాశుపతులు.)

భగవంతుడైన వాసుదేవుడు ఈశ్వరుడని ఆయన జగత్కారణుడని - ఆయన నుండి సంకర్షణాఖ్యుడైన జీవుడు ఉత్పత్తి అయినాడని వాని నుండి ప్రద్యుమ్నుడను మనస్సు అతని నుండి అహంకారమను అనిరుద్ధుడు ఉత్పన్నమయ్యెనని. జీవుని కార్యత్వము వలన అతడు బ్రహ్మము కాడు. జీవుడు వాసుదేవుని కంటె అత్యంత భిన్నుడు. ఇది పాంచరాత్రికుల మతము.

పరిణామమున నిత్యసర్వజ్ఞులు భిన్నాభిన్నమని జైనమతము. త్రిదండుల మతమున్ను. బ్రహ్మము సర్వజ్ఞత్వాది ఉపేతమని, (అమ్నాయము క్రియార్థ

పరత్వమగుటచేత తాత్పర్య అభావ మగుటచేత) కాదని (వాగ్దేవ్యాదివత్ సర్వజ్ఞత్వ దృష్ట్యా) జగత్కారణము పరమాణ్వాది జీవుడుగా గాని ఉపాస్యమని మీమాంసకులు.

నిత్యజ్ఞానాదిమాన్ ఈశ్వరుడు సర్వజ్ఞుడు పృథివ్యాదికార్య లింగానుమితుడున్నాడని, అతడు జీవునకు భిన్నుడని తార్కికులు. క్షణికుడు సర్వజ్ఞుడని సౌగతులు.

క్లేశకర్మ విపాకాశయ అపరామృష్ట నిత్యజ్ఞాన రూపుడు ప్రధానాంశసత్త్వ గుణప్రతిఫలితత్వము వలన సర్వజ్ఞుడు సంసారి పురుష విలక్షణుడు అని పాతంజలులు (యోగదర్శనము). ఔపనిషదమైన మతమున బ్రహ్మ అద్వితీయ పరమానందుడు. జీవుని యొక్క వాస్తవ స్వరూపము. మాయచేత సర్వజ్ఞత్వాది విశిష్టం జగత్కారణము (ఉపాదాన నిమిత్తములు) మీమాంసక మతముకూడ అయుక్తమే. విధివిశేషత్వము వలన శ్రుతి బ్రహ్మప్రతిపాదన చేయుట లేదనుటచేత. విధివిశేషత్వము సిద్ధించుట లేదు కాబట్టి - అర్థవాదాధికరణ న్యాయముచే విధిశేషత్వము సిద్ధించదు. వైషమ్యము చేత వలన. మీమాంసక మతమునందు బ్రహ్మము స్వతఏవ ప్రామాణ్యమన్నది అంగీకారము కాదు. "తత్త్వమసి", "అహం బ్రహ్మాస్మి", "అయమాత్మా బ్రహ్మ" "సత్యజ్ఞాన మనంత బ్రహ్మ" వంటి శ్రుతివాక్యములు తార్కికులకు తలనొప్పి. "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" "నేహనానాస్తి కించన" వంటి శ్రుతివాక్యములు కూడ తార్కికులకు బాధాకరములే. భిన్నాభిన్నత్వం క్షణికత్వం 'ఆకాశవత్ సర్వగతశ్చ' "నిత్యః" మొదలగు శ్రుతివాక్యములు కూడ బాధాకరములే. 'విశుద్ధాత్మకత్వాత్' — దీనివలన సర్వేతర మతములు నిరాకృతములు. నిర్వికల్పాద్వితీయ చైతన్య రూపత్వ మని అర్థము.

విశిష్టానుభూతి: విశిష్ట = సవికల్పకానుభూతి వ్యావృత్త — తత్త్వమస్యాది మహావాక్య జన్య అఖండ అనుభూతి. సర్వ వ్యాపకం. అద్వితీయం పరమానంద బోధరూపం అయినది బ్రహ్మమని సిద్ధము.

న చోర్ధ్వం న చాధో న చాంతర్న బాహ్యం
న మధ్యం నతిర్యఙ్ న పూర్వం పరాదిక్।
వియద్వ్యాపకత్వా దఖండైక రూపః
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ 5

తాత్పర్యము :

ఉపరి, అధోభాగము, లోపల, వెలుపల, తిర్యక్కు, తూర్పు, పడమర, అను దేశభేదములు నాకు లేవు. ఆకాశమునంతటిని వ్యాపించి యున్నది నేనే. కావున నేను అఖండ ఏకాకృతిని అద్వితీయుడను. పరిశుద్ధుడను. కేవల శివుడను.

వ్యాఖ్యానము :

వియద్వ్యాపకత్వం = "ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః" అని శ్రుతి - ఆకాశము నంతటిని వ్యాపించియున్నదని "జ్యాయానాకాశాత్" "మహతో మహీయాన్" అని శ్రుతి.

సకల దేహవ్యాపి చైతన్యోప లబ్ధి వలన జీవుడుకూడా (మహత్త్వ ఉపాధి ధర్మాధ్యాసము వలన ఆరాగ్రమాత్రత్వాభిధానముచేత) సర్వవ్యాప్తి కలిగినట్లే.

"బుద్ధేర్గుణేనాత్మ గుణేన చైవ హ్యారాగ్రమాత్రో హ్యవరోఽపి దృష్టః" అని శ్రుతి. బ్రహ్మముయొక్క సూక్ష్మత్వాభిప్రాయముచే అణుత్వవ్యపదేశము.

"స ఏషోఽణిమా" "అణోరణీయాన్" అని బ్రహ్మమునకు అణుత్వము చెప్పు శ్రుతి.

"అంగుష్ఠమాత్ర పురుషః" "ఆరాగ్ర మాత్రోహ్యవరోఽపి దృష్టః" అను శ్రుతులవలన బ్రహ్మమునకు అణుత్వ ఆపాదకము అగుటవలన సర్వవ్యాపకత్వము శంకించ నక్కరలేదని పై శ్లోక భావము.

"బ్రహ్మైవేద మమృతం పురస్తాత్ బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ అధశ్చోర్ధ్వం చ మమృతం బ్రహ్మైవేద విశ్వమిదం వరిష్ఠం" "తదేతద్బ్రహ్మ పూర్వమన పరమనంతర మబాహ్యమ్" అని శ్రుతులవలన బ్రహ్మము నిర్విశేషమేనని ప్రతిపాదనము.

న శుక్లం న కృష్ణం న రక్తం న పీతం
న కుబ్జం న పీనం న హ్రస్వం న దీర్ఘమ్।
అరూపం తథాజ్యోతి రాకార కత్వాత్
తదేకోఽవశిష్టః శివః కేవలోహమ్॥ 6

తాత్పర్యము :

బ్రహ్మమును, తత్పదార్థ వాచ్యమునగు నాకు శుక్ల కృష్ణ రక్త పీత వర్ణములు లేదు. అణుత్వముగాని మహత్త్వముగాని, దీర్ఘ హ్రస్వములవంటి పరిమాణములు గాని

లేవు. అరూపకము. సర్వజ్యోతి రూపములకు ఆవరకము. అట్టి తా నొక్కటియై మిగులుచున్నదో ఆ అద్వితీయమగు కేవలమైన శివుడను నేను.

వ్యాఖ్యానము :

జగత్తునకు కారణమై ఉపాదాన ఉపాదానోపాదేయములకు (విచిత్ర జగత్తుతో) అభిన్నమే బ్రహ్మము కావచ్చునని దుఃఖరూపముగా, దానికి అభిన్నుడగు జీవుడు పరమపురుషార్థప్రాప్తి విషయమున శంకలు రావచ్చునని బ్రహ్మము స్వప్రకాశ పరమానంద రూపముగలది గుటచే నిఖిల జగద్భ్రమాధిష్ఠానమై కారణత్వ వ్యపదేశమైనదే కాని సర్వసంబంధ అభావమున్నదని అనర్థలేశము కూడ లేదని యీ శ్లోకముచేత చెప్పిరి.

కుబ్జం=అణుత్వము. పీనం=మహత్త్వము; అణుత్వ మహత్త్వ హ్రస్వత్వ దీర్ఘత్వములన్న చతుర్విధ పరిమాణ నిర్విశేషము కావున ద్రవ్యత్వ ప్రతిషేధము.

రూప్యత అనగా రూపము ప్రమేయము. అప్రమేయత అరూపము.

ద్రవ్య గుణకర్మాది పదార్థములవలె బ్రహ్మము కాదని.

శ్రుతి "అస్థూలం అనణ్వహ్రస్వమ దీర్ఘమలోహితమ్" అని బ్రహ్మమును చెప్పినది.

"అశబ్దమ స్పర్శమ రూపమవ్యయమ్ తథాఽరసం నిత్యమగంధవచ్చయత్" అని సర్వానర్థశూన్యము బ్రహ్మమని - జీవుడు పరమాత్మ స్వరూపమని ప్రతిపాదన.

జ్యోతిరాకారకత్వాత్ = స్వప్రకాశ జ్ఞానరూపత్వమువలన, అప్రమేయత్వము వలన ఘటాదులవలె జడత్వము లేకుండుటవలన ప్రమేయత్వము లేదని "ఏతదప్రమేయం ధ్రువమ్" ఇత్యాది శ్రుతుల భావమునే స్పష్టపరచుట.

న శాస్తా న శాస్త్రం న శిష్యో న శిక్షా
నచ త్వం న చాహం న చాయం ప్రపంచః।
స్వరూపావ బోధో వికల్పాసహిష్ణుః
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ 7

తాత్పర్యము :

గురువనుట గాని శిష్యుడనుటగాని శాస్త్రము గాని, శిక్షించుటగాని లేవు. అనగా ఉపదేశ కర్తృకరణ కర్మక్రియలు లేవు. నీవు లేవు. నేను లేను. శ్రోతృ వక్తృ

త్వములున్ను లేవు. ప్రపంచమే లేదు. బ్రహ్మస్వరూప జ్ఞాన మీ వికల్పములను సహింపదు. కాబట్టి నేను అద్వితీయ అన్నిటికిని మిగిలిన కేవల శివస్వరూపుడను.

వ్యాఖ్యానము :

శాస్తా = ఉపదేశము చేయు గురువు. శాస్త్ర = ఉపదేశకరణము. శిష్యం = ఉపదేశకర్మ. శిక్షా = ఉపదేశక్రియా: (త్వాం శ్రోతా - అహంవక్తా)

పరమార్థదృష్టిలో దేహేంద్రియాదిరసర్వమైన ప్రపంచము — (సర్వప్రమాణ సన్నిధాపితము) లేదనియే తాత్పర్యముగా సంభావింపవలెను.

స్వరూపావబోధో వికల్పాసహిష్ణుః — అవిద్యావిస్మృతిరాత్మా అనాత్మ వేది తము అయిన వికల్పము వలన ఫలమేమి? స్వరూప బోధవలన విజ్ఞానఫల మనుభూతి యగును. అది వికల్పవీయము కాజాలకుండుటెట్లు? సర్వద్వైతోప మర్దనమువలన వికల్పములను సహింపదు. శ్రుతియు నిది చెప్పినది.

"ననిరోధో న చోత్పత్తిః న బద్ధో నచసాధకః
న ముముక్షుః న వైముక్త ఇత్యేషా పరమార్థతా"

"బ్రహ్మైవా ఇదమగ్ర ఆసీత్తదాత్మాన మేవావైదహం బ్రహ్మేస్మీతి తస్మాత్త త్సర్వమభవత్' ఇట్లు పూర్వమునకూడ జీవుడు బ్రహ్మస్వరూపమే. జ్ఞానము వలన బ్రహ్మభావ దర్శనము. సర్వము ద్వైత నివారకము.

న జాగ్రన్న మే స్వప్నకోవా సుషుప్తిః
న విశ్వోన వాతైజసః ప్రాజ్ఞకోవా।
అవిద్యాత్మకత్వా త్త్రయాణాం తురీయః
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ 8

తాత్పర్యము :

జాగ్రత్స్వప్నసుషుప్తులు నాకు లేవు. నేను విశ్వుడను కాను. తైజసుడను కాను. ప్రాజ్ఞుడను కాను. అవిద్యాకల్పితమైన యీ త్రయమునకు అతీతుడవగు తురీయుడను. అద్వితీయ పరిశిష్ట శివుడనగు కేవలుడను.

వ్యాఖ్యానము :

స్వప్రకాశ చైతన్య రూపత్వముచేత సర్వదా భాసమానుడగు ఆత్మకు జాగ్ర త్స్వప్న సుషుప్తి అవస్థ లెట్లు? భ్రాంతి యనవలెనా? వ్యవస్థలని వచింపబడుచున్నది

కదా? అంతా స్వప్నమందుమా? లక్షణతచే యీ మూడవస్థలును స్వప్నత్వమువలె అవిద్యాకృత విశేష సంభవములు. సదసద్విలక్షణత్వము వలన సవిశేషత్వముచేత వ్యవస్థోపపత్తి. పరమార్థమునందు యీ వ్యవస్థలు లేవు.

ఈ శ్లోకమునందు లయక్రమముగా పౌర్వాపర్యవ్యపదేశము.

ఉపనిషణ్మతమున పదార్థములు రెండు. దృక్, దృశ్యము. ఇతర వాదము లందు వాదులు కల్పించుకొన్న పదార్థము లన్నియు ఈ రెండింటి యందు అంతర్భాగములే.

అందు దృక్పదార్థము ఆత్మ పారమార్థికము, ఏకము. ఔపాధిక భేదమువలన త్రివిధము.

ఈశ్వర, జీవ, సాక్షులు. ఇందు కారణీభూత అజ్ఞానోపాధి ఈశ్వరుడు. అంతఃకరణ తత్సంస్కారావచ్ఛిన్న అజ్ఞానోపహితుడు జీవుడు. మరియు నొక సంకేతముగా అవిద్యా ప్రతిబింబము ఈశ్వరుడు. బింబ చైతన్యం సాక్షి. బింబేశ్వరపక్షమున బింబ ప్రతిబింబ ముఖానుగత ముఖస్వరూపమువలె జీవుడు ఈశ్వరానుగతుడు. సర్వానుగత చైతన్యమును సాక్షి యందురు. వార్తికకారుల మతమున ఈశ్వరుడే సాక్షి. ద్వైవిధ్యమే ఈశ్వర జీవభేదముచేత దృశ్యము. ఆ విధమున ఈశ్వరుడు త్రివిధము. స్వోపాధిభూత అవిద్యాగుణత్రయ భేదముచేత విష్ణుబ్రహ్మరుద్ర భేదములు. కారణీభూత సత్త్వగుణావచ్ఛిన్నతచే విష్ణువు. కారణీభూత రజ ఉపహితుడై బ్రహ్మ. స్రష్ట. మహాభూత కారణత్వమున హిరణ్యగర్భుడు - బ్రహ్మమగునా? స్థూలభూత స్రష్టృత్వమువలన బ్రహ్మ యనుటయు కలదు.

కారణీభూత తమ ఉపహితము రుద్రస్వహితం. కావున అంతయు నొక్కటే. చతుర్భుజ చతుర్ముఖ. పంచముఖాదులు. పురుషాకారులు.

శ్రీ భారతీ భవానీ మొదలగువారు స్త్రీ ఆకారులు. మత్స్యకూర్మాది అనంతావతారములు లీలావిర్భావములు. భక్తానుగ్రహార్థములు.

చిన్మయా ద్వితీయస్య నిష్కళస్యా శరీరిణః
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా॥

జీవుడు కూడ త్రివిధము (స్వోపాధి అవాంతర భేదమువలన) విశ్వతైజస ప్రాజ్ఞులు. అవిద్యాంతఃకరణ స్థూలశరీరావచ్ఛిన్నత్వముచే జాగ్రదవస్థాభిమాని విశ్వుడు. స్థూలశరీరాభిమాన రహిత ఉపాధిద్వయోపహితుడు. స్వప్నాభిమాని తైజసుడు. శరీ

రాంతఃకరణోపాధిద్వయ రహితుడు అంతఃకరణ సంస్కారావచ్ఛిన్న అవిద్యా మాత్రోపహిత సుషుప్త్యభిమాని ప్రాజ్ఞుడు.

వీరికి స్వతంత్ర ఉపాధిభేద అభావము. అయినను అవాంతర ఉపాధిభేదాది కత్వమువలన అవాంతర భేదము వ్యవహితము.

సాక్షి సర్వానుసంధాన సర్వానుగత తురీయాఖ్య ఏకవిధమే. సాక్షికి ఉపాధి భేదమున్నను అసలు భేదము లేదు. ఉపాధు లతనికి ఏకరూప మగుటవలన.

అవిద్యా తద్వ్యాప్య తత్కార్యాత్మకము ప్రపంచము దృశ్యపదార్థము. అది అపారమార్థికము. అయినను వ్యవహారిక సత్త్వాభ్యుపగమత్వము కావున స్వాప్నిక పదార్థము వంటిదని నిరూపణము వ్యర్థము.

అవ్యాకృత మూర్తామూర్త భేదములచేత ఉపాసనము త్రివిధములు —

సాభాసావిద్యా మూర్తామూర్త ప్రపంచ బీజశక్తి రూపము కలదై. తదజన్యత్వ మున్నప్పటికీ, దాని వివృత్తి వలన వివర్తమానత్వము వలన తద్వ్యాప్య చైతన్య తత్సంబంధ జీవేశ్వర విభాగము అభావయే. సహానాదిత్వాదివ్యాకృతమని చెప్పుట. ఇచట అవ్యాకృత పదార్థము ఈశ్వరోపాధి. స్వయంజడమయ్యు అజడముగా చిదా భాసముతో జ్వలితా. పూర్వాపూర్వ సంస్కార జీవకర్మ ప్రయుక్తము. శబ్దస్పర్శరూప రసగంధాత్మకస్య ఆకాశ వాయుతేజో జల పృథివ్యాది పంచభూతముల ప్రభ వించునది.

ఇందు పూర్వపూర్వ భూతభావాపన్నత అవిద్య ఉత్తరోత్తరం ప్రతికారణ త్వము. పూర్వపూర్వ భూతగుణములు ఉత్తరోత్తర భూతములందు అనుప్రవేశములు. అవిద్య వలన అంధకారము కూడ భావరూపమే. ఆవరణాత్మయే. చక్షుష్జ్ఞానవిరోధి ఆలోకనమువలన మహావిద్యుదాదివలె ఆవిర్భవించును. తిరోభావము పొందును. ఇది సిద్ధాంతము.

దేహోపాదనత్వ అభావము శ్రుతులు సృష్టిప్రక్రియా విషయమున దీనికి అవి రోధమే. దిక్కాలముల విషయమున ఆకాశమే దిగ్వ్యవహార జనకత్వ సంబంధము కలది. "దిశః శ్రోత్రమ్" అని శ్రుతి. కాలము కూడ అవిద్యాహేతువే. సర్వాధార త్వము వలన పంచమహాభూత అమూర్తములు సూక్ష్మములు అపంచీకృతములు కారణైక్యత వలన సత్త్వరజస్తమో గుణాత్మకములు. సత్త్వాంశప్రధానత్వమువలన జ్ఞానక్రియాశక్త్యాత్మక మొకటి - స్వచ్ఛద్రవ్యము - చిత్రరూపమువలె మిళితమై ప్రభ వించును. అది జ్ఞానక్రియాప్రధానాంశమైన అంతఃకరణము. దానివి బుద్ధి మనస్సు

అని చెప్పుట. క్రియాశక్తి ప్రధానాంశము ప్రాణము. అది ప్రాణ అపానవ్యాన ఉదానసమానములని అయిదు విధములు.

ఏక మేకైక భూతముల నుండి జ్ఞాన క్రియా శక్తి భేదమువలన ప్రత్యేక మింద్రియ ద్వయము జనించును. ఆకాశము నుండి శ్రోత్రవాక్కులు. వాయువు నుండి త్వక్కుపాణి. తేజస్సు నుండి చక్షువులు పాదము. పృథివి నుండి ఘ్రాణ ఉపస్థులు. (ఇచ్చట కొంత భేదాభిప్రాయ మున్నది. తేజసీ వాక్ - పాదస్తు నాభస - అని. ఇది బలమైన అభిప్రాయము కాదు).

శబ్ద వ్యంజక ఇంద్రియత్వమువలన శ్రోత్రమువలెనే వచస్సు - ఆకాశత్వము. పాద చికిత్సవలన చక్షువులు, స్వాస్థ్యదర్శనము వలన చక్షువువలె పాదము లును తైజసత్వములు. ఈ ఇంద్రియములకు అధిష్ఠాన దేవతలు జ్ఞానక్రియాశక్తి ప్రధానులు. దివగ్నివాతేంద్రులు. ఆదిత్య వరుణ మిత్రులు. అశ్విప్రజాపతులు. శబ్ద స్పర్శ రూప రస గంధగ్రాహకములు శ్రోత్ర త్వక్ చక్షూరసన ఘ్రాణములు పంచ జ్ఞానేంద్రియములు. వచనా దానగతి విసర్గానంద జనకములు వాక్పాణి పాదపాయు ఉపస్థలు పంచకర్మేంద్రియములు. ఇవి సప్తదశకము కలిసి జ్ఞానశక్తి ప్రాధాన్యము వలన లింగశరీరము. హిరణ్యగర్భము. క్రియాశక్తి ప్రాధాన్యము వలన సూత్రమని చెప్పుట. ఆవి అమూర్తి పదార్థములు. కార్యత్వాద్వ్యష్టములు పమష్టిగా జీవోపాధి కలవే - అందు భూతములు భోగాయతనము శరీరము. భోగ్యం విషయము (అంతరేణ) ఇవి భోగమును జనింపచేయుటకు శక్తి కలవి కావు. జీవకర్మ ప్రయుక్తత్వమువలన స్థౌల్యములు పంచీకృతము లగును. అందు ప్రత్యేకముగా పంచభూతములు ద్విధా విభాజ్య మగును. అందొక భాగము మరల నాలుగు భాగము లగును. ఆ నాలుగు భాగములు స్వభాగము విహాయేతరభూత చతుష్టయార్థ భాగము ప్రవిశమై స్వఅర్థ భాగమునకు ఇతరము అగు అష్టమ భాగమున పంచీకరణమువలన మేళనము అయి నప్పటికి ఆధిక్యమువలన ఆకాశాది శబ్దప్రయోగము. "త్రివృతంత్రివృత మేకైకాం కరవాణి" అని శ్రుతి. "త్రివృత్కుర్వత్ ఉపదేశాత్" అని బ్రహ్మసూత్రము. మూడింటియొక్క ప్రతీతివలననే త్రివృత్కరణమువలె కొందరి మతము.

అయితే ఆ మతము వియదాధికరణన్యాయమువలన నిరాకరింపబడినది. తైత్తిరీయకమున "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ సంభూతః। ఆకాశాద్వాయుః అని శ్రుతిపాఠము. ఛాందోగ్యమున (మూడిటి) తేజోవత్‌నానావిధసృష్టి శ్రవణమై వప్పటికి ద్వయముయొక్క రూపసంహారము. తేజస్సు ప్రాథ్య పదార్థధర్మాపేక్షచే

ఆకాశవాయు పదార్థముల బలీయత్వముకారణము. ఒకదానిని గురించిన విజ్ఞానమువలన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞవలన ఛాందోగ్యమున అచేతన ఆకాశవాయువుల బ్రహ్మకార్యత్వ అవశ్యవాచ్యత్వము హేతువుగా పంచభూతములే మేళనము. అవయుత్యానువాదము వలన త్రివృత్కారణోపపత్తి త్రివృతకల్పనచేత వాక్యభేద ప్రసంగము. "త్రివృత్కుర్వత ఉపదేశాత్" అన్న సూత్రమును బట్టి పంచీకరణము బాధితమగుచున్న దన్నది విడుచుట మంచిది. మేళన ప్రతీతివలననే శరీరాదులయందు పంచభూతముల. "పంచీకృత పంచమహాభూతాని" అని భాష్యకారుల వచనము.

పంచీకృత పంచమహాభూతముల మూర్తాఖ్యముల మిళితములై యేకమై ఇంద్రియాదుల కధిష్ఠానమై భోగాయతనమును ఉత్పత్తి చేయుచున్నవి. దానినే శరీర మనుట. అందు సత్త్వప్రధానము దేవశరీరము. రజఃప్రధానము మనుష్య శరీరము. తమఃప్రధానం తిర్యగాదిస్థావరాంత శరీరము. శరీరము పాంచభౌతిక మయ్యు చిత్రరూపమువలె కొంచెమును భూతములయొక్క న్యూనాధిక భావమును విరోధించదు.

విషయ మిట్లుండగా పంచీకృతైకైకభూతజన్యాశ్చతుర్దశ భువనాఖ్యముల ఊర్ధ్వ మధ్య అధోభాగముతో సత్త్వరజస్తమోంశ ప్రధానముల. ఇది యంతయు బ్రహ్మాండాఖ్యము విరాజిల్లు మూర్తము ఇది ఔపనిషదమైన సృష్టిక్రమము. దీని విపరీతము లయక్రమము. మూర్తం పంచీకృత పంచమహాభూత తత్కార్యాత్మకం విరాట్టు అని పేరు గల పృథివ్యాద్యేకైక భూతలయమున అమూర్తం అపంచీకృత పంచభూతాత్మకం హిరణ్యగర్భాఖ్యం స్వకారణమున లభించును. ఇది దైనందిన ప్రలయము, అమూర్తమైన అవ్యాకృతి పరమేశ్వరోపాధి కలది. అవ్యాకృతము అనాది యగుటచే కారణ అభావము వలన లయముకాదు. స్వకారణమునందు సూక్ష్మరూపముతో అవస్థ యందు లయమని దాని లక్షణము. ఇది ప్రాకృత ప్రళయము. బ్రహ్మజ్ఞానము వలన ఆత్యంతిక ప్రళయము. అది కారణక్రమేణ, కారణోచ్ఛేదమునే కార్యచ్ఛేదము. సర్వసృష్టి ప్రళయాదికము స్వప్నసృష్టి ప్రళయమువలె అపారమార్థికము. వాసనాదార్ఢ్యమువలన వ్యవహారక్షమము. మాయికత్వమున తుచ్ఛ ప్రసంగము కాదు. (యథాచైతత్తథా వ్యక్తమాకారే)

ఇట్లు జాగరణాది వ్యవస్థాస్థితి. ఇంద్రియవృత్తికాలీన అర్థోపలబ్ధి జాగరణము అందు విరాడాఖ్యభూతము, భోగ్యము ప్రత్యక్షాది ప్రమాణ షట్కేన వ్యవహ్రియమాణత్వ ద్వ్యావహారికం. విశ్వుడన్న పేరుతో జీవుడయి అనుభవము. దేహేంద్రి

యాదులందు ప్రవేశించి వ్యాపనమువలన విశ్వుడని చెప్పుట: 'విశప్రవేశవి' 'విష్ణ్వాప్తౌ' అని హేతువు.

విశ్వుడయ్యు అమూర్తుము అవ్యాకృతము. అనుమానాది ప్రమాణములచే అనుభూయతము. అయినను వ్యవహారికము సర్వము విశ్వుడనియే నియమము. స్థూలశరీరోపాధ్యభిమాని. దానికి అవస్థాంతర వ్యాపకత్వము లేదు.

శుక్తి రజతాది జ్ఞానానామ ప్రామాణికమగుటచే తద్విషయము అవ్యవహారికము. ఇంద్రియ వ్యాపారకాలీనత్వమువలన జాగరణత్వోపవత్తి - జ్ఞానోత్పత్త్యాదిప్రక్రియ. జాగ్రద్భోగ జనక కర్మక్షయమున స్వప్నభోగ జనకకర్మోదయమున నిద్రాఖ్య తామసవృత్తిచేత స్థూలదేహాభిమాని దూరీకృత మగుట. సర్వేంద్రియముల దేవతానుగ్రహ అభావముతో నిర్వ్యాపారములై లీనములగుట. విశ్వుడును లీనమయ్యేననుట. అట్లు స్వప్నావస్థ అప్పుడు అంతఃకరణ గతవాసనా నిమిత్త ఇంద్రియ వృత్తి అభావకాలీన అర్థోపలంభము స్వప్నము. అప్పుడు మనస్సే గజతురగాది అర్థాకారమున వివర్తించును. అవిద్యావృత్తిచేత జ్ఞాయత్వము అని కొందరి మతము. అవిద్యయే శుక్తిరజతాదులవలె స్వప్నార్థకారమున పరిణమించును. జ్ఞాయతత్వమగును అవిద్యావృత్త్యైత్యన్యమున. ఇందే అభిప్రాయము సముచితము? అవిద్యయే సర్వత్ర అర్థాధ్యాస జ్ఞానాధ్యాస ఉపాదానత్వమువలన (క్లుప్తమై) మనోగతవాసనల నిమిత్తత్వమున) క్వచిత్ మనఃపరిణామత్వవ్యపదేశత్వ మగును. అందుచేత మనస్సు దృశ్యఆకార పరిణామానభ్యుగమమున ద్రష్టుత్వ సంభావమువలన ఆత్మయందు స్వయంజ్యోతిష్ట్వసిద్ధి అని తోచవచ్చును. అదికాదు. బహిరింద్రియ జన్యవృత్తి అభావమువలన మనస్సునకు అగ్రాహకత్వము. దాని సహకారముతోనే దాని గ్రాహకత్వనియమ మగుటవలన సవృత్తికాంతఃకరణావచ్ఛిన్నచేతనే చైతన్యముయొక్క ప్రమాతృత్వానియమమునుబట్టి తదంతఃకరణసత్త్వము కూడ ప్రమాతృభావమే.

స్వప్న అధ్యాసకు అధిష్ఠాన మేది? మనో ఉపచ్ఛిన్నం జీవచైతన్యం - ఒకటి. మరియు మూలాజ్ఞాన అవచ్ఛిన్నం బ్రహ్మచైతన్యము - ఇందేది శ్రేయము? మత భేదముచేత నీ రెండును. అయితే జాగ్రద్బోధమువలన స్వప్నభ్రమ నివృత్తి అభ్యుపగమాది అధిష్ఠాన జ్ఞానమువలె. భ్రమనివృత్తి వలన బ్రహ్మచైతన్యము అధిష్ఠానత్వముచే సంసార దశయందును తజ్ఞానాభావము వలన జ్ఞానమే సర్వద్వైతనివృత్తి. జాగ్రద్బోధాత్స్వప్న నివృత్తి. 'సహికర్తా' అని జీవకర్తృత్వమును చెప్పు శ్రుతి. ఆకాశాది ప్రపంచమువలె సర్వసాధారణ్యాపత్తినిబట్టి మూలాజ్ఞానావచ్ఛిన్నం యీ

సందర్భమున అధిష్ఠానము కాదు. జీవచైతన్యముయొక్క అనావృతత్వము వలన సర్వదా భాసమానత్వము కావున దానికి అధిష్ఠానత్వ మెట్లు? ఇది సత్యము. అయితే స్వప్నాధ్యాస అనుకూల వ్యావహారిక సంఘాత భావ విరోధ్యవస్థాజ్ఞాన అభ్యుప గమమువలన శయ్య యందు పరుండుట శయ్యాంతరమున అభావమువలె భావ సామగ్రి అభావము తుల్యమే.

'మనుష్యుడను' ఇత్యాది వ్యావహారిక సంఘాత జ్ఞానముయొక్క ప్రమాణ జన్యత్వమువలన అజ్ఞాన నివర్తకత యెట్లు? అవస్థాంతర అన్వయానుపపత్తిచేత దాని కల్పనమువలన సుషుప్తియు కూడ స్వప్నబాధ కజ్ఞానము అర్థాపత్తియమగును. అది అనిష్టము. జాగ్రత్స్వాపత్తి సాధ్యము. స్వప్నావస్థాజ్ఞానము అంతఃకరణలయ సహితము సుషుప్తిరూపత్వము వలన దాని బాధలేదు. జాగరణమున స్వప్న అభావిత్వ అనుభవ ముతో అహమన్న జ్ఞానముయొక్క ప్రమాణాజన్యత్వము కూడ యథార్థమగుటచే శరీరాదిజ్ఞానము యొక్క ప్రమాణజన్యత్వము వలన అవస్థాజ్ఞాన విరోధిత్వము అను భవసిద్ధము. విశేషజ్ఞానం ప్రమాణజన్యవృత్తియందు నివర్తించదు.

సాక్షికి అవిద్యా నివర్తకత్వ అభావము. అజ్ఞాన సాధకత్వము చేతను ధర్మి గ్రాహక మానసిద్ధిచే కించిదపిజ్ఞతలేదు. యావత్ జ్ఞానము తావత్ అజ్ఞానము అభ్యుప గమముచే శుక్తి జ్ఞానము వలెనే వ్యావహారిక సంఘాత జ్ఞానమువలన అజ్ఞాన నివృత్తి మరల ఎప్పుడు రజత భ్రమవలె స్వప్నాధ్యాసానుపపత్తి అనికాదు. జీవచైతన్యమే అధిష్ఠానమను పక్షమున దోషము లేదు. మరల బ్రహ్మజ్ఞానము వలననే అజ్ఞాన నివృత్తి అభ్యుపగమనమైనట్లే రజ్జువునందు దండభ్రమ సర్పభ్రమతిరోధానమువలె అధిష్ఠాన జ్ఞానాభావము కూడ జాగ్రద్భ్రమణ స్వప్న భ్రమతిరోభావ ఉపపత్తి. బ్రహ్మచైతన్యమే స్వప్నాధ్యాస అధిష్ఠానమన్న పక్షమునందును దోషములేదు. ప్రతి జీవము స్వప్నాధ్యాసాసాధారణ్యమున మనోగత వాసనలు అసాధారణ్యమే. మనోవచ్ఛిన్నం బ్రహ్మచైతన్యమే అధిష్ఠానము. ఈ పక్షమునందు కూడ అవస్థా జ్ఞానముయొక్క అవరకత్వ అంగీకారము వలన అనుపపత్తి లేదు. అందుచేత శాస్త్రములలం దచ్చటచ్చట నిట్లే వ్యపదేశము.

మనోవచ్ఛిన్న చైతన్యముయొక్క అధిష్ఠానము అగుట యందు గజము మొదలగు అహంకారసామానాధికరణ్యము వలన గజప్రతీతి కలుగుచున్నది. శుక్తి యందిది రజతమన్న (భ్రాంతి) ప్రతిపత్తు సామానాధికరణము వలన. అది స్వాభ్యముగా గజము కాదు. బ్రహ్మచైతన్యము అధిష్ఠానమన్న పక్షమున కూడ

గజమన్న ఆకార ప్రతీతి ద్వయముగా అది గజమగుట కాదు. అయినను ఇదంకారా స్పదీభూత బాహ్యార్థ అభావము సమానత్వమనుట చెల్లుచు. మొదటి పక్షమున అహం కారముయొక్క శుక్తివలె అధిష్ఠానా వచ్ఛేదకత్వము వలన శుక్తి రజతమువలె అహంగజము అనుట భ్రమాకార ప్రసంగము కాదు. నే నిది అన్న జ్ఞానముయొక్క ఇది శుక్తి అన్న అవగాహనయే భ్రమవిరోధిత్వము. ఈ అంశము కూడ భ్రమ విరోధముననే అట్టి భానాభ్యుపగమము. స్వప్నమునందు గజము ఇత్యాకారమువలె అది ఆకారమనుటయు కల్పితమే. ఉభయాకార బాధవలన అధిష్ఠాన భూతచైతన్య అబాధమనుట శూన్యవాద ప్రసంగమనరాదు. జాగ్రదవస్థయందైనను శుక్తేదంకార విలక్షణమే రజతేదంకారము. "అధ్యస్తమేవహిపరిస్ఫురతి భ్రమేషు" అను న్యాయము వలన శుక్తి ఇదమంశ భాసమాన పక్షమునందైనను ఇదం అంశసత్యత్వ మధ్యస్తమున ప్రయోజకము అధిష్ఠాన సత్వత్వమే. అధిష్ఠానం అజ్ఞాతము. శుక్తి చైతన్యమువలె ఇచట సాక్షిచైతన్యము విద్యమానము అని ఉపపాదితము. రెండు పక్షముల యందును అనుపపత్తిలేదు.

స్వాప్నికపదార్థభోక్తా తైజసుడు. పిత్తాఖ్యతేజః ప్రధానకత్వము వలన. ఆదిత్యాది జ్యోతిరంతరములందును భాసకత్వ మిదే. జాగ్రత్స్వప్నభోగద్వయమున శ్రాంత జీవుని తదుభయ కారణ కర్మక్షయము వలన జ్ఞానశక్త్యావచ్ఛిన్నము వలన సవాసనయగు అంతఃకరణయొక్క కారణాత్మనాఽవస్థచే విశ్రామస్థానం సుషుప్తి అవస్థా. దీనికి కారణమాత్రోపలబ్ధి అవేదిషము కాదు.

జాగ్రత్స్వప్న భోగ్యపదార్థ జ్ఞాన అభావమున్నప్పటికి సాక్ష్యాకారము సుఖా కార మవస్థాజ్ఞాన ఆకారం అవిద్యవలన వృత్తిత్రయ అభ్యుపేయము. అహంకార అభావము వలన విశిష్టవృత్తి యగుటకాదు. సుషుప్తి అభావప్రసంగము. వృత్తిరూప ఉపలభ్యా అభావము కాదు. ప్రళయమున అతివ్యాప్తి. అచట తత్కల్పనాబీజ అభావము. 'సుఖమహమస్వాప్సమ్ నకించిదవేదిషమ్' (నేను సుఖనిద్రపోయితిని. ఏమియు తెలియలేదు) అని నిద్ర మేల్కొన్న తరువాత పరామర్శ. అనుభవమే పరామర్శానుపపత్తి. అంతఃకరణోపరాగకాలీన అనుభవజన్యత్వము అభావము. దాని ఉల్లేఖాభావము కాదు. ఇది స్మరణత్వానుపపత్తి. లింగాభావమువలన ఆశ్రయా సిద్ధ్యా అనుమానము కూడ సంభవముకాదు. అహంకారముయొక్క ఉత్థానసమయము అనుభవమగును. సుషుప్తియందు లీనమగుటచేత ఆ సమయమున అనమభూతి. స్మరణానుపపత్తి ముఖప్రతిబింబాశ్రయ దర్పణమున జపాకుసుమమాలవలె అధ్యాసవ మున రక్తముఖమువలె ప్రతీతి కలుగునట్లు అహంకారాశ్రయ సాక్షిచైతన్యమున

స్మరణాశ్రయత్వముచేత నాకు సుఖనిద్రయన్నది పామావాధికరణప్రతీతి. వేమ సుఖించితినన్న వానివలె ఆశ్రయత్వముకాదు. స్మృతిపంశయవిపర్యయముల సాక్షిచైతన్య ఆశ్రయత్వ నియమము వలన అహంకారముయొక్క ప్రమాణజన్య జ్ఞానాశ్రయత్వ నియమమును బట్టియు. తత్కార్యతావచ్ఛేదము వలన ప్రమాతృత్వము. అప్రమాత్ర అవచ్ఛేదమున అవిద్యవలన కారణత్వము. ఆ తత్వవాక్యాది జన్యపరోక్షవిభ్రమ అవిద్యావృత్తియే అభ్యుపగమమని వేదాంత విభలమట. అంతఃకరణవృత్తి జనక సామగ్రి సంభవమున్న ప్రమాతృ అభావ అవరోధముచే అంతఃకరణ సామర్థ్యము వలన నామముల బ్రహ్మాధ్యాస ఇచ్ఛాధీనము వలన భ్రమప్రమావిలక్షణా మనోవృత్తియే. కామాదులవలె, చోదనాజన్యత్వము వలన మానసక్రియయే. అది జ్ఞానము కాదు. అది మనోవృత్తిత్వము అని తర్క వ్యాఖ్యానము. వ్యాప్యారోపముతో వ్యాపక ప్రసంజనాత్మకము తర్కస్వేచ్ఛాధీనత వలన భ్రమ ప్రమావిలక్షణత్వమని. మనన నిది ధ్యాసన సహితమైన శ్రవణాఖ్య వేదాంత వాక్య విచారమున "శ్రోతవ్యోమంతవ్యోనిదిధ్యాసితవ్యః" అను విధుల ఉపపద్యములు. అది చతుర్విధ అన్వయ వ్యతిరేకాది తర్కరూపత్వము వలన దృగ్దృశ్యాన్వయ వ్యతిరేకము. సాక్షిసాక్ష్య అన్వయ వ్యతిరేకము. ఆగమాపాయితదవధ్యన్వయ వ్యతిరేకము. దుఃఖి పరమ ప్రేమాస్పద అన్వయ వ్యతిరేకము. అనువృత్తవ్యావృత్తాన్వయ వ్యతిరేకము (మొత్తము అయిదు). ఇది అంతయు వేదాంత అనుకూల తర్కమున చతుర్లక్షణీ మీమాంసా ప్రతిపాదితముల ఉపలక్షణమని అభియుక్తులు. సుషుప్త్యవస్థయందును ఆనందభోగము. తద్భోక్తో సుషుప్తి అభిమానీ ప్రాజ్ఞుడు. అది ప్రకర్షణ జ్ఞాతమగును. విశేషావచ్ఛేదా భావము వలన ప్రకృష్టజ్ఞాతము. అంతఃకరణము యొక్క లయము నందు తత్సంస్కారము వలననే అవచ్ఛేదము జీవభావ ప్రసంగము కాదు. సర్వజ్ఞాపత్తియు కాదు. ఈశాభేద ప్రతిపాదనము శరీరేంద్రియాద్యభిమాన రహితత్వముచే ఉపచారమగుట వలన దాని సంస్కారము నిమిత్త కారణము. సాక్ష్యాశ్రితకార్యోపాదానకోటావ ప్రవేశమున కాదు. ఆ భేదము సాక్షిభేదమే — జాగరణమున అంతఃకరణముయొక్క ప్రమాత్రాశ్రిత కార్యోపాదాన కోటిని ప్రవేశముచే ఆ భేదము ప్రమాతృ భేదమే, సాక్షియే అధికోపాధి విశిష్టమై ప్రమాతృత్వము కాదు. ప్రతిసంధానానుపపత్తి.

"మాతృమాన ప్రభేదేఽపి ప్రతిదేహం నభిద్యతే ।
సాక్షీ బాహ్యార్థవద్యస్మాత్స ఆత్మేత్యుచ్యతే తతః॥

వ్యభిచారోమిథోయద్వత్ ప్రమాత్రాదేః స్వసాక్షికః।
సర్వమాత్రాద్య భావార్థ సాక్షిత్వాన్న తథాఽఽత్మనః॥

ఇట్లు వార్త్తికకారులు వ్యవహారదశయందు కూడ సాక్షిభేదమును నిరాకరించుటచే సుషుప్తియందు తద్భేదకల్పన అనుచితమే. దుఃఖమహామస్వాప్సమని యొక పరామర్శ. స్వప్నమునందు దుఃఖానుభవమున్నది. అందువలన దుఃఖసామగ్రీ విరహము వలన తదభావము కాదు. ఆత్మత్వారోపత్వము వలన సుఖమునకు నిత్యత్వము. శయ్యాదులయొక్క అసమీచీనత్వము వలన దుఃఖమని ఉపచారత్వము వలన దుఃఖమహామస్వాప్సమని ప్రత్యయోపపత్తి. లేక అవస్థాత్రయమున త్రైవిధ్య మంగీకృతమగుటచే సుషుప్తియందు దుఃఖముపపద్యము. అందుచేత — ప్రమాజ్ఞానం జాగ్రజ్జాగ్రత్, శుక్తి రజతాది విభ్రమ జాగ్రత్స్వప్నము ఆశ్రమాదుల స్తబ్ధభావము జాగ్రత్సుషుప్తి. అట్లే స్వప్నమున మంత్రప్రాప్తి స్వప్నజాగ్రత్; స్వప్నమునందు స్వప్నముకంటినను బుద్ధి స్వప్నస్వప్నము.

జాగ్రద్దశయందు చెప్పుటకు వలనుపడని స్వప్నావస్థ యేది అనుభవమగునో అది స్వప్న సుషుప్తి. సుషుప్తియందు కూడ సాత్త్వికీయ సుఖాకారవృత్తి సుషుప్తి జాగ్రత్. తదనంతరం సుఖమహామ స్వాప్సమన్న పరామర్శ రజసీవృత్తి సుషుప్తి స్వప్న. తదనంతరము దుఃఖ మహామమస్వాప్సమన్నపరామర్శోపపత్తి తామసీ వృత్తి సుషుప్తి సుషుప్తి. తదనంతరం గాఢం మూఢోఽహ మస్వాప్సమని పరామర్శ. అధ్యాత్మ విశ్వుడు. అధి భూతం విరాట్టు అధిదైవం విష్ణువు; అధ్యాత్మంజాగ్రత్. అధిదైవం పాలనం, అధిభూతం సత్త్వగుణము; అధ్యాత్ముడు తైజసుడు. అధి భూతం హిరణ్యగర్భ అధిదైవం బ్రహ్మ ఆధ్యాత్మం స్వప్న అధిదైవం సృష్టి. అధిభూతం రజోగుణము.

ఇట అధ్యాత్మం ప్రాజ్ఞుడు అధిభూత మవ్యాకృతము. అధి దైవము రుద్రుడు. ఆధ్యాత్మం సుషుప్తి. అధిదైవం ప్రళయము. తమోగుణము అధిభూతము. ఇది అధ్యాత్మాధి భూత అధిదైవముల ఏకత్వమువలన ప్రణవావయత్రయ సహితుల ఉపహితుల ఐక్యోపాసనచేత హిరణ్యగర్భలోక ప్రాప్తి అంతఃకరణ శుద్ధి ద్వారా క్రమముక్తి. పర్వోపాది నిరాకరణము వలన సాక్షిచైతన్యమాత్ర జ్ఞానము వలన మోక్షమనుట. అవస్థాత్రయ సహితులైన ముువ్వురు విశ్వతైజస ప్రాజ్ఞులు అవిద్యాత్మకత్వమున దృశ్యమగుటచేత మిథ్యాత్వముతో అనుపహితులు. కేవల సాక్షీ

తురీయాఖ్యుడను 'అహం' నేను అని అర్థము. ఇది వ్యవహారమున పర్వ వ్యవస్థోపపత్తి. పరమార్థమున ఈ అవస్థల అభావమునందును అనుపపత్తి కాదు.

అపివ్యాపకత్వాద్ధి తత్త్వప్రయోగాత్
స్వతస్సిద్ధభావా దనన్యాశ్రయత్వాత్।
జగత్తుచ్ఛమే తత్సమస్తం తదన్యత్
తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్॥ 9

(జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థా సహితులైన విశ్వతైజసప్రాజ్ఞులన్నూ మిథ్య యగుటవలన తత్సాక్షియు మిథ్యాత్వమేనన్న శంకరావచ్చునని సమాధానముగా విశేషాభిదానమున సాక్షిసత్యమని యీ శ్లోకము.)

తాత్పర్యం :

సాక్షి వ్యాపకత్వము కలిగియుండుట వలనను, తత్త్వప్రయోగమగుటవలనను, స్వయంసిద్ధమగుట వలనను, ఇతరమును దేనిని ఆశ్రయించినది కాకుండుట వలనను సాక్షి సత్యమే. ఇతరమైన జగత్తు అంతయు తుచ్ఛమే. అది మిథ్య. నేను అద్వితీయ అవశిష్ట కేవల శివుడను.

వ్యాఖ్యానము:

సాక్షియొక్క ప్రకృతి (న దృష్టేర్ద్రష్టారం పశ్యేః) 'అతోఽన్యదార్తమ్' అను శ్రుతి పాఠము వలన సాక్షికంటె అన్యమైన సాక్ష్యము సర్వ జగత్తు తుచ్ఛము. సాక్షితుచ్ఛము కాదు. బాధావధిత్వము వలన భ్రమాధిష్ఠానమగుట వలన జ్ఞాతత్వము వలన. తద్బాధగ్రాహక అభావము వలన (అద్యముక్త సముచ్చయ అర్థోపశబ్దము) పరిచ్ఛిన్నతుచ్ఛత్వములు లేవి దగుట వలన (అథయదల్పం తన్మర్త్యమ్) సమవ్యాప్తత్వతో పరిచ్ఛిన్నత్వ నివృత్తి కలిగినదై తుచ్ఛత్వ నివృత్తి కలిగినదై పై శ్లోకమునందు చెప్పబడిన "అపివ్యాపకత్వాదితి."

'సర్వం ఖల్విదం బ్రహ్మ' (శ్రుతి) అని సర్వాత్మకత్వ ఉపదేశము వలన, దేశకాల అపరిచ్ఛిన్నత్వ ఆకాశాదులు దేశకాలపరిచ్ఛిన్నత్వములైనను ఆపేక్షిక మహత్వముతో వ్యాపకత్వ ఉపచారముతో మన్నవి.

సర్వవ్యాపకత్వమునను, నిత్యత్వము వలనను ఆత్మ దుఃఖనివృత్తి రూపము కాదు. సుఖరూపమును కాదు. సుఖము అనిత్యము కాబట్టి, విశ్వాత్మకు రూపములేదు కావున. ఆత్మస్వరూపము మోక్షార్థ రూపమని ఆశంకించుకొని సమాధానము — "హితత్వప్రయోగితి"

హితత్వం — పురుషార్థత్వమ్. "తదేతత్ప్రేయః — పుత్రాత్ప్రియో విత్తా త్ప్రేయోఽన్యస్మాత్సర్వస్మాదంతరతరం యదయమాత్మా" "యోవై భూమా తత్సుఖం" ఏష ఏవ పరమ ఆనందః విజ్ఞాన మానందం బ్రహ్మ" మొదలగు శ్రుతి పాఠములు ఆత్మయొక్క పరమానంద రూపత్వము ఉపదేశించుచున్నవి. ఆత్మ నిత్య మైనను లోకమునందు కర్మజన్యత త్తదంతఃకరణ వృత్తి వ్యంగ్యతతో తదుత్పత్తి వినాశోపచారము.

అజ్ఞాన వ్యవహితము కూడ జ్ఞాన అప్రాప్తమని జ్ఞానమాత్రముచేత అవిద్యా నివృత్తి ప్రాప్తియని. ఆ ఉద్దేశముతో ముముక్షు ప్రవృత్తి ఉపపత్తి.

ప్రపంచము అధ్యస్తమై దుఃఖరూప అధిష్ఠానమగుట దానియొక్క అభావమే దుఃఖ అభావ రూపత్వము. అది పురుషార్థతా. మోక్షము సుఖమనుట యిట్లే సంపద్యము. ఆత్మకు రూపము లేనందున దేహేంద్రియాది అభావము.

వ్యంజకా భావమునందు కూడ తత్వం వేదనాభ్యుపగమము వలన సంసార దశయందును అట్లే ప్రసంగము.

ద్వితీయము లేనందువలన అపురూపార్థతచేత జ్ఞాయమానమనుట కూడ పురు షార్థత్వముచేతనే శర్కరా తద్భోజినమువలె వైష్ణవమ్మన్యుల ఉద్గారము — అని స్వతస్సిద్ధ భావాదితి. స్వప్రకాశ జ్ఞానరూపమని అర్థము.

సంసార దశయందు అవిద్యావృత స్వరూపముతో ఆత్మాపరమానంద రూప ముతో ప్రథితము కాదు. తత్త్వవిద్యవలన అవిద్యానివృత్తి కాగా స్వప్రకాశముతో స్వయముగా పరమానందము ప్రకాశించును. ఇచట వ్యంజకాపేక్ష లేదు. సుఖము యొక్క స్వప్రకాశ జ్ఞాన రూపత్వ మున్నప్పటికి అది ఆత్మరూపము కాదు. జ్ఞానము యొక్క ధాత్వర్థ రూపముచే క్రియాత్వమువలన సాశ్రయత్వమగుటచే తెలిసికొంటి నన్న ప్రతీతిచే జ్ఞానము నే నన్న ప్రతీతి కలుగుట లేదు. కావున అద్వైత వాద మెట్లు అన్న శంకకు సమాధానముగా—అనన్యాశ్రయత్వాదితి.

"యత్సాక్షాదపరోక్షా ద్బ్రహ్మ" "అయమాత్మా సర్వాంతరః" "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "విజ్ఞాన మానందం బ్రహ్మ" మొదలగు శ్రుతిపాఠముల చేత ఆత్మ స్వప్రకాశ జ్ఞానానంద రూపమని స్పష్టము.

అంతఃకరణాది ఉపాధి తాదాత్మ్య ధ్యాసనచే తద్వృత్తి జ్ఞానాధ్యాసనమువలన తెలిసికొంటినన్న భావము తదాశ్రయత్వ ప్రతీతి. ధాత్వర్థం. ఉత్పత్తి వినాశత్వం అంతఃకరణ వృత్తివంటివే. జ్ఞప్తిరూప ముఖ్యజ్ఞానముయొక్క సర్వాధిష్ఠానత్వము వలన అన్యాశ్రయత్వ అభావము కావున ద్వైతాపత్తి లేదు.

జ్ఞాన సుఖాత్మక ఆత్మా సత్యం. భిన్నం సర్వం జగత్తు అసత్యము.

న చైకం తదన్యద్ద్వితీయం కృతస్స్యాత్
నవా కేవలత్వం నచాఽకేవలత్వమ్।
నశూన్యం నచాఽశూన్య మద్వైత కత్వాత్
కథం సర్వవేదాంతసిద్ధం బ్రవీమి॥ 10

(సర్వము జగత్తు తుచ్ఛమగుటచేత నిషేధముచే ఆత్మకు తత్త్వ ప్రతిపత్తికాదు. (శుందేటి కొమ్మును నిషేధించుటవలన క్వచిత్ ప్రమితం క్వచిన్నిషిద్ధ్యము అన్న న్యాయమువలన), నిషేధమువలన అనుపపత్తి వలన జగత్తు యొక్క తుచ్ఛత్వము స్పష్టమగుట కాదు. ఈ భావమును చెప్పుట కీ శ్లోకము).

తాత్పర్యము :

ఆత్మ అద్వైత మగుటవలన, ఏకమన్న సంఖ్యచే విస్పష్టమగుట కాదు. కాబట్టి తద్భిన్నమగు ద్వితీయ మే విధముగా వచ్చును? ఆత్మకు ఏకత్వముగాని అనే కత్వముగాని లేనేలేవు. శూన్యము కాదు. అశూన్యమును కాదు. కాబట్టి సర్వ ఉప నిషత్ సిద్ధమగు దానిని గూర్చి వాక్కుతో నెట్లు చెప్పుదును?

వ్యాఖ్యానము :

ఏకత్వ సంఖ్యాయోగి ఏకమ్. తదపేక్ష బుద్ధి జన్య ద్విత్వసంఖ్యాయోగి ద్వితీయమ్. ఏకమునకే అభావమగునప్పుడు ద్వితీయమున కెట్లు ఉత్పత్తి? ద్వితీయం తృతీయాదులకు ఉపలక్షణము. "ఏకమేవా ద్వితీయమ్" అను శ్రుతివలన ఏకత్వము ప్రతిపాద్యము. — అందుచే "నవా కేవలత్వ మితి." కేవలత్వమే ఏకత్వము. అది అవిద్యవలన.

శ్రుతివలన ఏకత్వము ప్రతిపాదింపబడకపోయినచో ప్రత్యక్షాది ప్రమాణ వశముచే అనేకత్వమే. అట్లనుకొనవలదని 'న చా కేవలత్వ మితి'. అకేవలత్వమ్ - అనేకత్వమ్. "నేహ నానాస్తి కించన" "ఏకమేవా ద్వితీయమ్" "అథాత ఆదేశో నేతి నేతి" మొదలగు శ్రుతివాక్యములు.

సర్వప్రతిషేధమువలన శూన్యమే అగునని భావింపరాదని 'నశూన్యమితి'. "అసన్నేవ సభవతి। అసద్బ్రహ్మేతి వేదచేత్। అస్తిబ్రహ్మేతిచేద్వేద। సంతమేన తతో విదుః" అని "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "సదేవ సోమ్యేదమగ్రమా సీత్" అవి మొదలిడి "ఏతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి"

మొదలగు శ్రుతులు సత్యత్వప్రతిపాదన చేయుచున్నవి. (సర్వము భ్రమాధిష్ఠాన మగుటవలన సర్వబాధావధిత్వమగుటవలనను) అందువలన 'సత్యత్వజ్ఞానత్వాది ధర్మవత్' అనియు అగుట. కావున నచాఽశూన్యమితి॥'

ఏక మద్వితీయమన్న పదద్వయమువలన సర్వభేదప్రతిషేధకారణమున ధర్మ ధార్మి భావాది భేదప్రతిషేధము. అన్నిటికి హేతువు 'అద్వైతకత్వాదితి'. ద్విధా అని ద్వితీయము. అభావము ద్వైతము. వార్తికమం దిట్లున్నది.

''ద్విధేతం ద్వితమిత్యాహుః తద్భావోద్వైతముచ్యతే'' ।

ద్విధాభావ మెచ్చట నున్నచో అచ్చట ద్వైతమని అక్షరార్థము. ద్వైతము స్ఫురింపదు.

''సలిలం ఏకోద్రష్టా ద్వైతః'' అని శ్రుతి.

ప్రతియోగి జ్ఞానము చేతనే లాఘవమున అభావవృద్ధి అన్న కారణముచే ద్వైతము నిర్వచనీయమని అంగీకరింపబడుటచేతను ప్రత్యక్షాదివేద్యత్వము నిషేధింపబడుట దీని అర్థము. ఏతాదృశ ఆత్మ అంగుళి నిర్దేశముతో ప్రతిపాదింపజాలమని చెప్పుటకు ''కథం బ్రవీమితి'' —

ఎట్లు చెప్పగలను? - అని ఆక్షేపణలో వాగవిషయత్వమును సూచించుట. ''అవచనేనైవ ప్రోవాచ''. 'యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ' 'నవిజ్ఞాతే ర్విజ్ఞాతారం విజానీయాత్'' మొదలుగా శ్రుతులు. వాగవిషయమునందు వేదాంతములు ప్రమాణము లెట్లగుననగా - అవిషయమైనను ఆత్మను తదాకారవృత్తి మాత్రేణ తదవిద్యా నివర్తకత్వమని చెప్పుటకు — సర్వవేదాంతసిద్ధమితి' — అట్లే శ్రుతి —

''యస్యామతం తస్యమతం మతంయస్య న వేదసః॥
అవిజ్ఞాతం విజ్ఞానతాం విజ్ఞాత మవిజ్ఞానతామ్॥
యన్మనసాన మనుతే యేనాహుర్మనోమతమ్॥
తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం యదిద ముపాసతే॥''

ఇత్యాది శ్రుతివాక్యములు ఆత్మ వాగవిషయమని చెప్పుటకు ఆధారముగా కన్పించుచున్నవి. అందుచేతనే వేదాంతవాక్యజన్య అఖండాకార వృత్తిచే అవిద్యానివృత్తి యని తత్కల్పిత సకల అనర్థ నివృత్తియని పరమానందరూపకృతకృత్యసంభవమని సిద్ధము.

దశశ్లోకీ సంపూర్ణము.



# శుద్ధపత్రికా

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 2 | 27 | సహధావం | సమాధావం |
| 6 | 1 | తదాస్మి | తదస్మి |
| 6 | 7 | ఏకశ్లోక | ఏకశ్లోకి |
| 7 | 3 | భగవత్వాదా | భగవత్పాదా |
| 12 | 13 | కాకవిష్ఠాయుం | కాకవిష్ఠాయాం |
| 15 | 15 | మేప్వాత్కృదా | మేపాత్కృదా |
| 18 | 1 | అకుభవింప | అనుభవింప |
| 25 | 13 | దేహలా | దేహో |
| 28 | 22 | ఆత్మ | ఆత్మా |
| 33 | 11 | రేదు | లేదు |
| 35 | 19 | భవాద్యశ్చైః | భవాదృశ్చైః |
| 36 | 1 | స్త్రితః | స్థితః |
| 40 | 15 | ద్వయాదవః | ద్వయాదవ్యః |
| 40 | 15 | పురుష్య | పురుష |
| 48 | 3 | ఆదం | అరం |
| 50 | 2 | చాణ్యపి | చాణ్వపి |
| 50 | 13 | భత్ | భవత్ |
| 55 | 8 | కల్పించు | కప్పించు |
| 59 | 16 | అభాతి | అఖాతి |
| 60 | 23 | మత్తిక | మృత్తిక |
| 69 | 25 | ఖిల్విదం | ఖల్విదం |
| 60 | 4 | సాముగా | పాముగా |
| 64 | 6 | వివర్వాపో | వివర్యాపో |
| 75 | 22 | పాందుటకు | పొందుటకు |
| 80 | 4 | శబ్దేనా | శబ్దేన |
| 80 | 4 | నిరిష్టోహః | నిరిష్టోహ్య |
| 81 | 19 | నోచోన్నైవ | నోచేన్నైవ |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 87 | 9 | పృథైవ | పృథైవ |
| 87 | 14 | తైవై | తేపై |
| 88 | 21 | తాయాత | తాయాతా |
| 88 | 21 | కార్యతే | కార్యతా |
| 89 | 21 | దృష్టాంతేవ | దృష్టాంతేన |
| 94 | 11 | షట్టించు | పట్టించు |
| 95 | 19 | వాసోఽ_స్తి | వాసోఽ_స్తి |
| 96 | 11 | అపరోక్షానుభూ | అపరోక్షానుభూతి |
| 103 | 23 | అద్వైతద్వైత | అద్వైతద్వైత |
| 104 | 23 | పరమాత్మకు | పరమాత్మను |
| 105 | 16 | అగామి | ఆగామి |
| 111 | 26 | ప్రాణమునకు | దేహ |
| 113 | 14 | నసాక్షే | నసాక్షీ |
| 117 | 10 | విద్యత్ | విద్యతే |
| 118 | 2 | బ్రహ్మయు | బ్రహ్మము |
| 120 | 7 | ఉపేక్ష్యో | ఉపేక్ష్యో |
| 121 | 13 | దశమత్య | దశమత్వ |
| 122 | 28 | అ_స్తే | ఆ_స్తే |
| 124 | 5 | బ్రహ్మయొక్క | ఈ సర్వము బ్రహ్మయొక్క |
| 125 | 8 | ఒధిష్ఠావ | ఒధిష్ఠాన |
| 137 | 24 | in real | is real |
| 147 | 4 | అభాస | ఆభాస |
| 151 | 3 | షాత్మా | ష్వాత్మా |
| 152 | 10 | దృశ్యములు | దృశ్యములు |
| 152 | 22 | జ్యకులే | జ్యమలే |
| 162 | 22 | అవిద్యాకం | అవిద్యకం |
| 171 | 18 | దిప్యతి | దీప్యతి |
| 173 | 9 | అవిర్భవే | ఆవిర్భవే |
| 175 | 5 | దానికి | దానిని |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 176 | 27 | సర్వభూవి | సర్వభూతాని |
| 177 | 10 | దేది | వేది |
| 178 | 22 | కుద్యాయాం | కుర్యాయాం |
| 179 | 3 | ఆత్మమరాముడై | ఆత్మారాముడై |
| 179 | 13 | వచ్ఛశ్యదంతరే | వత్స్వస్థఃస్వాన్తరే |
| 185 | 24 | బ్రహ్మము | బ్రహ్మము |
| 186 | 17 | వాలేఖి | వాఖిలే |
| 188 | 3 | భావ్వతే | భావ్యతే |
| 188 | 7 | మైవవో | మైవదో |
| 190 | 6 | ఆవ్పించి | కప్పించి |
| 197 | 10 | మిధ్యాత్య | మిథ్యాత్వ |
| 197 | 12 | ఆద్యా | ఆద్యా |
| 199 | 2 | కుద్వం | కుర్వం |
| 199 | 2 | యావదాయుః | యావదాయుః |
| 200 | 22 | యవతి | యువతి |
| 200 | 25 | మపాసిత | ముపాసిత |
| 203 | 11 | ఆత్మాం | ఆత్మాం |
| 203 | 21 | భావవ | భావవ |
| 206 | 7 | విర్మోరకః | విర్మోకతః |
| 210 | 24 | జగదుదలయ | జగదుదయ |
| 214 | 16 | అప్రతర్క్య | అప్రతర్క్య |
| 221 | 20 | త్ఫురతి | స్ఫురతి |
| 223 | 10 | విధ్యాత్మము | మిథ్యాత్వము |
| 234 | 6 | అవ్యత్వరం | అవ్యతరం |
| 235 | 4 | మర్యాగివాప్తే | మర్వాగివాప్తే |
| 235 | 5 | ప్తద్వి | ప్తద్ధి |
| 235 | 6 | వాంఛః | వాంభః |
| 238 | 19 | బ్రహ్మేత్తిరిక్తం | బ్రహ్మేతిరిక్తం |
| 239 | 4 | ఇంద్రేద్రాణో | ఇంద్రేన్ద్రాణో |

| పుట | పంక్తి | ఉన్నవి | ఉండవలసినవి |
|---|---|---|---|
| 239 | 7 | మంతమ్ | మ స్తమ్ |
| 243 | 7 | అ ప్తే | అ ప్తే |
| 242 | 18 | అనందా | ఆనందా |
| 242 | 20 | ఆదేవ | ఆదేవ |
| 244 | 17 | చెంత | ఎంత |
| 245 | 16 | నను కృతః. | వనుకుతః |
| 245 | 17 | ముత్వద్యతే | ముత్పద్యతే |
| 252 | 27 | వ్యభిలిత | వ్యభిలత |
| 253 | 14 | వంహో | సంహో |
| 253 | 23 | ములను | ములగు |
| 255 | 20 | అప్తోక్త్యా | అప్తోక్త్యా |
| 856 | 5 | చున్నాచు | చున్నారు |
| 256 | 13 | వర్వ | సర్వ |
| 257 | 15 | బుద్ధియందున | బుద్ధియుదుస |
| 257 | 23 | ప్రయోగా | ప్రమాణా |
| 257 | 24 | పీత్మా | పీత్వా |
| 259 | 25 | కూవస్థాత్మ | కూటస్థాత్మ |
| 265 | 5 | శూన్యాత్మక | శూన్యాత్మక |
| 267 | 4 | బడినది | బడనిది |
| 268 | 1 | వాగ్దేన్వా | వాగ్దేవా |
| 275 | 24 | అపార | అపర |
| 277 | 10 | అఛా | అచ్ఛా |
| 278 | 30 | ముప | లవ |
| 279 | 19 | సుమ స్తి | సుమ స్తి |
| 279 | 24 | కాచు | కాదు |
| 280 | 27 | తైజక | తైజస |
| 283 | 26 | పంతయేన | సంతమేవ |
| 283 | 28 | ఏతదాత్మ్యే | ఏతదాత్మ్యే |

